# దువ్వూరి రామిరెడ్డి రచనలు – ఒక పరిశీలన

## [ కావ్యములు : ఖండకావ్యములు ]

బెనారస్ హిందూయూనివర్సిటీవారి డాక్టరేట్
పట్టమును పొందిన సిద్ధాంత వ్యాసము


డా॥ ముప్పాళ్ళ వేంకట శివ ప్రసాదరావు
ఎమ్ ఏ, పిహెచ్ డి,
ఆంధ్రోపన్యాసకులు
పి. ఆర్ ప్రభుత్వకళాశాల
కాకినాడ - 1.

"A Study of the Complete works of Duvvuri Rami Reddy
with special reference to
His Kavyas and Khanda Kavyas'

By

Dr Muppalla Venkata Siva Prasada Rao

First Published.

May 1985

Copies

1,000 (One Thousand only)

Price Rs 75/-



For Copies

Smt. Muppalla Sujatha Kumari
C/o Dr M V S Prasada Rao
Lecturer in Telugu
P R Govt College
KAKINADA - 1

Printers

SRIPATHI PRESS
Kakinada - 1

Dr. B. V. Suryanarayana
M. A (Telugu, Sanskrit, Hindi) Ph D ,
Professor & Head
Department of Telugu
Banaras Hindu University

Dated 16-4-85
Varanasi-221005
U P

# ఆశీస్సు

రైతుకుటుంబాలలో పుట్టి పైరుపచ్చల పరిధిలో పల్లెజీవితాన్ని గడుపుతూ ప్రతిదినం ఒక పర్వదినంగా బ్రతికిన స్వర్గీయ దువ్వూరి రామిరెడ్డిగారి కావ్యాల, ఖండకావ్యాల సమగ్ర సహృదయ సమీక్షగా ఈ సద్గ్రంథాన్ని వెలయించినవాడు వర్ధిష్ణువు డా॥ ముప్పాళ్ళ వేంకట శివ ప్రసాదరావు

విశ్వసాహిత్యంలో ముఖ్యంగా తెలుగు సాహిత్యంలో ఒక కమ్మని కర్షక కవిగా రామిరెడ్డికి శాశ్వతమైన స్థానాన్ని కల్పించిన జీవన పరిస్థితుల్లో మూడు పాళ్ళు అతని రచనల్నిగూర్చిన ఈవిమర్శగ్రంధాన్ని వెలయించిన చిరంజీవి ప్రసాదరావుకీ ఈశ్వర ప్రసాదంగా సమకూడి ఉన్నాయన్న సంగతిని అతని ఇంటిపేరూ సొంతపేరూ సమర్థిస్తూ ఉండడం సంతోషదాయకమైన విషయం పైరు పచ్చల పద్యాలా॰ అవి పచ్చల పతకాలా॰ అంటే ఏదీ కాదనడానికి ఏమాత్రం వీలుకాని కవిత్వం రామిరెడ్డిగారిది అట్టి కవితకూ, కవితాత్మకూ తాదాత్మ్యంతోడి సన్నిహితత్వాన్ని సహజంగా సమకూర్చుకొన్న సౌభాగ్యానికి నోచుకున్నవాడు ప్రసాదరావు

కావ్యాలూ, ఖండకావ్యాలే కాక వ్యాసాలూ, నాటకశతకాదులూ రచించినా దువ్వూరి ప్రధానంగా కవిగా వ్యాసరచయితగా గణనీయమైన ఖ్యాతిని ఆర్జించినాడు అతడు పరమభావుక పట్టభద్రుడు చక్కని చిక్కని విలువలుగల ఆలోచనల వెల్లువ లను గంగా ప్రవాహానికి అతని హృదయం హిమగిరి గహ్వరం లాంటిది 'కవి' అనే శీర్షికతో ఆయన వ్రాసిన వ్యాసం అతని భావుకత ఎంత సాంద్రమైందో తెలుసుకోడానికి చక్కని మచ్చుతునక వ్యాసాలనే పర్వత

సానువుల్నే మేఘాలవలె ఆవరించగల అతని భావుకత అతని కావ్య ఖండ కావ్యాలనే రససింధువుల్ని ఇంకా ఎంతగా ఆవరించి ఉంటుందో ఊహించడం సులభమే కదా !

ఇతర రచనల్ని ఇత్యాదుల్లో మాత్రం స్పృశించి విడిచి ప్రస్తుత గ్రంథ కర్త రామిరెడ్డి రచించిన కావ్యాలనూ ఖండ కావ్యాలనూ సునిశితం సుస్పష్టం అయిన ధోరణిలో ఈ గ్రంథంలో పరామర్శించడం గమనించదగ్గ విషయం సామాజికాలు, నైతికాలు కర్షక జీవన సంబద్ధాలు వైజ్ఞానికాలు ఇత్యాదిగా గల విభాగాలుగా విడమరచి ప్రసాదరావు రామిరెడ్డిగారి కావ్యాల్ని విమర్శించినాడు ఇతివృత్తం ఎన్నిక, వర్ణనలు అలంకారచిత్రణ, శైలి మొదలైన అంశాల సహృదయ సమీక్షతోబాటు రామిరెడ్డిగారికిగల కర్షక సామ్రాజ్య సింహపీఠికపై అధిష్ఠించే అధికారాన్నికూడా యుక్తియుక్తంగా నిరూపించడం ఈ గ్రంథంలో చెప్పుకోదగిన గొప్ప విషయం

త్రాసు ముల్లుతో తలపడగల నిష్పాక్షికతతోనూ, విమర్శకాగ్రేసరులు 'సాధు సాధు' అనజాలిన సహృదయతతోనూ చిరంజీవి ప్రసాదరావు ఇంకా ఎన్నో సద్గ్రంథాలు రచించి తెలుగుభాషకు గణనీయమైన సెవ చేస్తాడని ఆశిస్తూ, ఆప్యాయంగా ఆశీర్వదిస్తూ -

బి వి సూర్యనారాయణ

# కృతజ్ఞతలు

నాలో కలిగిన పరిశోధనాభిలాష రూపుదిద్దుకొనుటకు అవకాశము గల్పించుటయేగాక వెన్నుతట్టి సమస్త సహాయసహకారములందించి సిద్ధాంత వ్యాసము రెండు సంవత్సరములకాలములోనే పూర్తిచేయుటకు అనువైన వాతావరణము గల్పించిన, ప్రచురణసందర్భమున కోరిన వెంటనే ఆశీస్సు లందించిన సహృదయులు ఆచార్య బయ్యా వేంకట సూర్యనారాయణగారికి —

మాతృహృదయముతో సమాదరించి పరిశోధనకాలములో తగిన సలహాల నిచ్చి ప్రోత్సహించిన శ్రీమతి బయ్యా రత్నావళిగారికి —

నేనెవరో అప్పటికి తెలియకపోయినను అడిగినవెంటనే దువ్వూరివారి కొన్ని పుస్తకములను, పరిశోధనకు అవసరమైన కొంత సమాచారమును అందించి నన్ను ముందుకునడిపించిన ఆత్మీయులు శ్రీ కె వి రమణారెడ్డిగారికి —

నా సిద్ధాంత వ్యాసమును పరీక్షించి పిహెచ్ డి పట్టమున కర్హమైనదిగా నిర్ణయించిన న్యాయనిర్ణేతలు ఆచార్య కె వి ఆర్ నరసింహంగారు (ఆంధ్ర విశ్వవిద్యాలయము), మరియు ఆచార్య కేతవరపు రామకోటిశాస్త్రి (కాకతీయవిశ్వ విద్యాలయము) గార్లకు —

అముద్రిత గ్రంథములను ముద్రించుటకు రచయితలకు అందజేయు ఆర్థిక సహాయ పథకముక్రింద నాకు రూ 5000/- లు మంజూరుజేసిన ఆంధ్రప్రదేశ్ సాంస్కృతిక వ్యవహారముల శాఖవారికి —

గ్రంథముద్రణ సమయమున చేదోడు వాదోడుగా నిలచిన మిత్రులు శ్రీ సిహెచ్ సాంబశివరావు మరియు శ్రీ ఎమ్ వేంకటేశ్వరరావుగార్లకు —

సకాలములో మిక్కిలి రమణీయముగా ముద్రించి ఇచ్చిన శ్రీపత్రిప్రెస్ అధిపతి మరియు మిత్రులునగు శ్రీ టి గణేశ్వరరావుగారికి —

నన్ను ఈకార్యనిర్వహణలో ఆశీర్వదించిన నా పితామహులు, జ్ఞాని శ్రీ ముప్పాళ్ళ సీతారామయ్యగారికి మాతామహి మందపాటి అన్నపూర్ణమ్మ గారికి —

నేనే పనిచేయుదునన్నను ఎన్నడును అడ్డుచెప్పక నాపై విశ్వాస ముంచి ప్రోత్సహించిన మా తండ్రిగారు స్వర్గీయ ముప్పాళ్ళ లక్ష్మీనారాయణ గారికి మాతృశ్రీ శేషగిరమ్మగారికి —

పరిశోధనకాలములో ఉచితరీతిని సహకరించి ముందుకు నడిపించిన నా సహధర్మచారిణి ముప్పాళ్ళ సుజాత కుమారికి —

కాకినాడ, నా హృదయపూర్వక కృతజ్ఞతలు

20-5-85 ముప్పాళ్ళ వేంకట శివ ప్రసాదరావు

# విషయ సూచిక

## ప్రథమాధ్యాయము



## ద్వితీయాధ్యాయము



## తృతీయాధ్యాయము

## చతుర్థాధ్యాయము



## పంచమాధ్యాయము

## షష్ఠాధ్యాయము

# ప్రథమాధ్యాయము

# నవ్యాంధ్ర సాహిత్యము – దువ్వూరి

## ప్రవేశిక :-

సాహిత్యము సంఘమునకు ప్రతిబింబము వంటిది. ఒకనాటి సాంఘిక పరిస్థితులను తెలిసికొనవలెనన్న ఆనాటి సాహిత్యాధ్యయనము చేయవలయును సంఘముయొక్క క్రమపరిణామమును తెలిసికొనవలెనన్న ఆయా కాలములలో వెలువడిన సాహిత్యము నంతయు పరిశీలింపవలయును

ఆంధ్రసాహిత్యమును సులభముగా అధ్యయనము చేయుటకు అనువుగా ఆంధ్ర చరిత్రకారులు పలువిధములుగా యుగవిభజన మొనర్చిరి అందు ముఖ్యముగా రాజవంశములనుబట్టి కావ్య ప్రక్రియలనుబట్టి, ఇతరులకు మార్గదర్శకులైన మహాకవులనుబట్టి యుగములను విభజించుట జరిగినది వీని అన్నింటిలోను కావ్యప్రక్రియలనుబట్టి గావించిన యుగవిభజనము సమంజసముగానున్నట్లు తోచుచున్నది ఆవిధముగా విభజించినచో నిప్పటివరకు వెలువడిన సాహిత్యము నంతయు ప్రాఙ్నన్నయయుగము, అనువాదయుగము, కావ్యయుగము, ప్రబంధ యుగము, దక్షిణాంధ్రయుగము, ఆధునికయుగము అని విభజింపవచ్చును

ఇప్పటివరకు వెలువడిన సాహిత్యము నంతయు స్థూలముగా ప్రాచీన సాహిత్యము, ఆధునిక సాహిత్యము అని విభజింపవచ్చును ఈ రెండు వర్గములును వస్తువు, శైలి, భాష మున్నగు విషయములలో భిన్నభిన్న తత్త్వములను కలిగియున్నవి ఆధునిక యుగమందు వెలువడిన నవ్యాంధ్ర సాహిత్యము పాశ్చాత్య వాఙ్మయ ప్రభావమువలన శాఖోపశాఖలుగా విస్తరిల్లినది అట్లు పరిఢవిల్లిన నవ్యాంధ్రసాహిత్యమునకు ముందున్న సాహిత్యమునుగూర్చి మొదటగా తెలిసికొనవలసియున్నది అప్పుడుగాని మనము ఆధునికయుగమునందలి పరిణతిని చక్కగా అవగాహన చేసికొనజాలము

## ii వీరేశలింగము - పూర్వ సాహిత్యము .-

క్రీ శ 1799లో టిప్పుసుల్తాను చనిపోగానే కడప, కర్నూలు, అనంతపురము, బళ్ళారి ప్రాంతములు నైజాము నవాబునకు సంక్రమించగా నతడు

వానిని క్రీ. శ 1800లో ఆంగ్లేయులకు దత్తమండలము అనుపేర కట్టబెట్టెను దానితో క్రీ శ 1800 నాటికి ఆంధ్రదేశమున ఆంగ్లేయుల పరిపాలన స్థిరమైనదని చెప్పవచ్చును పరిపాలకులు, పరిపాలితుల దేశభాషలు నేర్చినగాని పరిపాలన సక్రమముగ జరుప వీలుగాదు అందువలన ఆంగ్లేయులు దేశభాషలను తెలుగు నేర్చుకొనవలసిన అవసరము వచ్చినది అందుకొరకు వారు దేశభాషలు నేర్చుకొనుట కనువుగా చెన్నపట్టణమునందు సెంటు జార్జికోటలో ఒక కళాశాల స్థాపింపబడెను ఆ కళాశాలలో ఉదయగిరి వేంకటనారాయణగారు ప్రధాన ఆంగ్లోపాధ్యాయులుగాను, వేదం పట్టాభిరామశాస్త్రిగారు ప్రధాన ఆంధ్రోపాధ్యాయులు గాను నియుక్తులైరి ఈ పండితుల సహకారముతో పలువురు ఆంగ్లేయులు మన భాష నభ్యసించుటయేగాక, నూతనవిద్యాభ్యాసమున కనువైన పుస్తకములను వ్రాయుటలో ఈ పండితులకునుగూడ ఆంగ్లేయుల నుండి కొంత శిక్షణ లభించినది

దేశభాషలు నేర్చిన పాశ్చాత్యులను రెండు తెగలుగా విభజింపవచ్చును (1) క్రైస్తవమతవ్యాప్తికై దేశభాషలు నేర్చినవారు (2) ఉద్యోగధర్మము ననుసరించి దేశభాషలు నేర్చుకొని అందు విశేషముగ కృషి చేసినవారు ఏది ఏమైనప్పటికిని తెలుగుభాషపై రెండవతెగవారి సేవ విశేషముగా లభించినదని చెప్పవచ్చును తెలుగుభాషా సాహిత్యములకు కృషిచేసినవారిలో మెకంజీ కాంబెల్, సి పి బ్రౌన్, ప్లాట్, ప్రిపెట్ మున్నగువారు ముఖ్యులు

పరిపాలనచేయువా రెవరైనను వారి వేషభాషలు, ఆచారవ్యవహారములు, సంస్కృతి మున్నగునవి పాలితులపై ప్రభావము చూపుట సహజము వీరేశలింగముగారు గ్రంథరచన కుపక్రమించు కాలమునకు ఆంగ్లేయ సాహిత్యసంస్కృతుల ప్రభావము భారతీయు లందరితోబాటు తెలుగువారిపై బాగ బలముగా నుండెను

అంతకుపూర్వము సాహిత్యమునందు పురాణములు, శతకములు, ప్రబంధములు, యక్షగానములు, ద్విపదకావ్యములు మున్నగునవి లెక్కకు మిక్కిలిగా రచింపబడినవి దక్షిణాంధ్రయుగమున కొన్ని వచనకావ్యములు వెలసినను అవి పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరార్థములోగాని వెలుగులోనికి రాలేదు

19వ శతాబ్దాంతమునకు ఆంధ్రప్రబంధ కవిత్వస్థితి చదువరులకు విసుగు పుట్టించినది ప్రథమ ప్రబంధకవులు అల్లసానిపెద్దనాదులు తమ కవిత్వమునకు

ఏదో ఒక విశిష్టగుణ మలవరించి హృదయాకర్షకముగ రచనలు గావించినారు పెద్దన్నగారు శృంగారప్రధానమైన ప్రబంధమును రచించినను ధర్మబోధ మాత్రము విడువలెదు కాని క్రమముగా పెద్దన రామరాజభూషణులనాటి అభి రుచి దిగజారిపోయి శృంగారమునకు కామమునకు తేడా లేకుండ పోయినది కామ, శృంగారప్రేరకములైన ప్రబంధములే లెక్కకు మిక్కిలిగా వ్యాపించ నాగినవి ప్రాచీనసాహిత్యసంప్రదాయముల నాకళింపు జేసికొని క్రొత్త పుంతన పయనించి రచనలుచేయు రచయితలు కరువైరి

వసుచరిత్ర' ప్రబంధకవిత్వములో తలమానికముగ పరిగణింపబడిన గ్రంధ మగుటచేత దాని అనుసరణములగు పిల్లవసుచరిత్రలు విజృంభింప సాగి నవి ప్రబంధకవిత్వములో రానురాను క్షీణదశ ప్రారంభమైనది శృంగారము పేరుతో అంగాంగ వర్ణనలు పాండిత్యము పేరుతో చిత్ర బంధకవిత్వములు చిలువలు పలువలుగా వ్యాపించసాగినవి

ఆంధ్రసాహిత్యరంగమున ఏ యుగమునను ఉద్భవించని క్షుద్రశృంగార కావ్యములు, బూతుకావ్యములు ఉద్భవించినవి రాయల అనంతరకవుల ప్రతిభా దారిద్ర్యముచేత ఉద్భవించిన ప్రబంధము ఒక్కటి చదివినయెడల తక్కినవి చదువ నవసరములెదు ఇంచుమించుగా అదే ఎత్తుగడ అవే సన్నివేశములు అదే కధాశరీరము అదె నిర్వహణము అవే వర్ణనలు, అవే పాత్రలు ఈ సందర్భమున-

"పాత్రము లన్నియు నొక్క తీరుం దాల్చిన బొమ్మలు అలంకారశాస్త్ర ప్రకారము చెక్కబడినవి ఆయా కావ్యములలోని పాత్రములు నిర్జీవముల యట్టుండుటతో బోయిన నెంతో పుణ్యము అన్నికావ్యముల యందలి పాత్రలును ఒండొంటి ననుకరించునట్టి ప్రతిబింబములు పేరు, ఊరు మాత్రము మార్చి యుందురు' 1

అని పల్కిన కట్టమంచివారి వాక్యములు స్మరణీయములు వీరేశలింగము గారు సాహిత్యరంగప్రవెశము చేయబోవువరకును ఆంధ్రసాహిత్యముయొక్క స్థితి ఇదియే

ప్రధమ దశయందు వెనుకటి కవులచే ప్రభావితులై పంతులుగారు కూడ ఆనాటి కవులందరివలెనే శతకములు చిత్ర గర్భ బంధకవిత్వములతో రచ నలు ఆరంభించిరి తన నాట సామాజికస్థితిని ఒకవంక, తెలుగుసాహిత్యస్థితిని

ఇంకొకవంక కనులార గాంచిన కందుకూరివారు ఆయా అంశములను పాత గ్రంథ నుండి మరలించి క్రొత్త గ్రంథ పట్టించినారు. ఇటు తెలుగు ప్రజాజీవితమునకును తెలుగుసాహిత్యమునకును ఆధునికయుగారంభము [illegible] మైనది.

పందొమ్మిదవ శతాబ్ది ఉత్తరకాలమున పాశ్చాత్యవిజ్ఞానమును ప్రజలలో వెదజల్లి భావవిప్లవము తెచ్చుటకై ఎందరో కృషి సలిపిరి. ఆ కృషి ఫలితముగనే వీరేశలింగము వంటివారు సాహిత్యరంగమున విజృంభించిరి. మన సాహిత్యమున ప్రక్రియావైవిధ్యము తక్కువగ నుండుటచే ఆంగ్లసాహిత్యములోని వివిధ ప్రక్రియలు మన రచయితల నాకర్షించినవి. ఆ నాటికి ఆంగ్లసాహిత్యములో నున్న శాఖలన్నింటిని ఇంచుమించుగా తెలుగులోనికి తెచ్చినవారు కందుకూరి వీరేశలింగముగారు. అందువలన నవ్యాంధ్రసాహిత్య సృష్టికర్త పంతులు గారని నిస్సంశయముగా చెప్పవచ్చును. దానినే యిట్లంటి [1] తారాపదభట్టాచార్యుల వారు-

'పూర్వయుగములో నన్నయ ఎలా ఆంధ్రభారతానికి మూలకందమై నాడో, వీరేశలింగముపంతులుగారు నవ్యాంధ్ర సాహిత్యానికి మూలపురుషుడై నాడు "2 అని చెప్పియున్నారు.

రచనలద్వారా అందింపబడిన అంశములలోను లక్ష్య అంశములను అనువైన భాష శైలిలోను ఆశించినట్టి గల సిద్ధ ప్రయోజనములోను వాని సాహిత్యాకృతులలోను నూతనత్వమును కల్పించుటచేతనే వీరేశలింగము ఆధునిక యుగకర్త కాగలిగినారు.

## 111 నవ్యసాహిత్యము - తీరుతెన్నులు -

ఆంగ్లసాహితీసంస్కారముచే సంస్కారయుతులైన ప్రభావముచే దేశీయులు గావించిన తెలుగు సాహిత్యసృష్టియే నవ్యాంధ్రసాహిత్యము. భావకవిత్వము, అభినవాంధ్రసాహిత్యము,3 ఆధునిక కవిత్వము, నాయకవిత్వము, లిరికల్ పొయిట్రీ అను పేర్లతో పిలువబడు సాహిత్యశాఖలు కొన్ని ఆధునికకవితకు పర్యాయపదములు కొన్ని దానియందు అంతర్భాగములు అగుచున్నవి. పై పర్యాయపదములను పరిశీలించినయెడల నవ్యాంధ్రసాహిత్యమను పదము సమంజసముగా నున్నట్లు గన్పట్టుచున్నది. విమర్శకులు నవ్యాంధ్రసాహిత్యమునకును భావకవిత్వమునకును ఒకప్పుడు అభేదమును పాటించిరి. నవ్యాంధ్రసాహిత్య

ములో ఆంగ్లసాహిత్యప్రభావమున భావకవిత్వోద్యమము ప్రప్రథమముగా నుద్భ
వించి దాదాపు మూడు దశాబ్దులపాటు అప్రతిహతమైన తన ప్రభావముచే ఆంధ్ర
దేశమును ఉర్రూతలూగించుటయే దానికి కారణము తొలిదశలోని అభ్యుదయ
కవులు నవ్యాతినవ్యకవులని మన మనుకొనుచున్నవారిలో కొందరును కూడ
భావకవిత్వప్రభావమునకు లొనైనవారే అందులో రచనలు గావించినవారే

నవ్యాంధ్రసాహిత్య మన నెట్టిదో ముందుగా మనము తెలిసికొనవలసి
యున్నది విశ్వనాథ సత్యనారాయణగారు నవ్యసాహిత్యమును నిర్వచించుచు—

"సాహిత్యమంటే ఒక జాతిసంస్కారం మన జాతి పూర్వం వక గొప్ప
సంస్కారదశను పొందింది సృష్టిక్రమంలో, సృష్ట్యాదినుండి కాలనిర్ణయంలో,
భిన్నరాజచరిత్ర నిర్ణయంలో సంఘధర్మనీతులలో ఆర్థిక రాజకీయాలలో, సార
స్వత పథాలలో వక విశిష్టమైన సంస్కారంతోగూడిన సిద్ధాంతాలమీద మన జాతి
నడిచింది ఇవ్వాళ ఆంగ్లేయులు మన్ని ఆక్రమించటంచేత ఆ మహాసంస్కారం
మీద అభిమానం పోయింది పాశ్చాత్యదేశీయుల సంస్కారముమీద అభిమానం
ప్రబలింది ఏతదభిమానపురస్కృతములైన భాషాతత్త్వం, చరిత్ర నిర్మాణం,
సృష్ట్యాది కాలనిర్ణయం సంఘ ధర్మాలు విశ్వాసాలు వీటిని ఏగ్రంథం పరామ
ర్శిస్తుందో అదంతా నవ్యసాహిత్యం" 4 అని చెప్పియున్నారు

పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు కూడ నవ్యసాహిత్యమును నిర్వచిం
చిరి వారి అభిప్రాయము ప్రకారము ఆంగ్ల విద్యాపరనమువలనను, ఆంగ్లే
యులు మనలను పరిపాలించుటచేత వారి ఆచారవ్యవహారాదులు మనపై ప్రభా
వము నెరపుటవలనను ఆంధ్రజాతికి కొంత మేలు కొంత కీడు కలిగినది
దానిని ప్రతిబింబింపజేయునది నవ్యసాహిత్యము 5

కురుగంటివారు నవ్యసాహిత్యమునుగూర్చి వివరించుచు పాశ్చాత్యభాషా
సంస్కృతుల యందు 'అభిమానముతో వ్రాసే వీరేశలింగముపంతులు మొద
లైనవారి వ్రాతలు, మన సంప్రదాయాన్ని విమర్శించి దానిలోఉన్న నిగ్గునుమాపే
వ్రాతలూకూడ నవ్యసాహిత్యములో చేరును" 6 అని వివరించి యున్నారు

మొత్తము మీద ఆంగ్లేయుల భాషాసంస్కృతుల ప్రభావముచే దేశీయుల
చిత్తవృత్తులలో కలిగిన మార్పు లేక భావవిప్లవమువలన జనించిన సాహిత్యమే
నవ్యాంధ్రసాహిత్యమని చెప్పవచ్చును

ఇక నవ్యాంధ్ర సాహిత్యస్వరూప స్వభావములను గూర్చి స్థూలముగా పరిశీలింపవలసి యున్నది

ఆనాడు సుఖాభిలాషి ప్రబంధములను కావ్యములను గంటల తరబడి చదువు ఓపిక, తీరిక కొరవడినవి ఈ పరిస్థితిలో స్వల్పకాలములో ఆనందానందమును గూర్చు కవిత్వము కావలసివచ్చినది ఆంగ్లసాహిత్యము నందలి ప్రక్రియావైవిధ్యము మన రచయితల నాకర్షించినది ఫలితముగా నవ్యాంధ్ర సాహిత్యములో ఖండకావ్యము కథానిక నాటిక మున్నగునవి ఆవిర్భవించినవి "ఖండకావ్యము మహాకావ్యముయొక్కయు కథానిక కథయొక్కయు ఏకాంకిక నాటకముయొక్క సూక్ష్మరూపాలు" 7 ఈ నూతన ప్రక్రియలందు ముఖ్యముగా సాధన చేసినవారు సాహితీసమితి సభ్యులు [illegible] శాఖ, గ్రంథాలయ సర్వస్వము మున్నగు పత్రికలు వానిని ప్రచురించెడివి సాహితీసమితి సభాపతి తల్లావఝల శివశంకరశాస్త్రిగారు సభ్యులు చేసిన రచనలను సరిదిద్ది ప్రోత్సహించుచుండెడివారు

పాశ్చాత్య విజ్ఞానఫలితముగా ఆవిర్భవించిన నవ్యసాహిత్య ప్రక్రియలలో ప్రథమగణ్యమైనది ఖండకావ్యము కవి తన అభిప్రాయములను వ్యక్తముచేయుటకు రెండు పద్ధతులు గలవు ఒకటి వస్త్వాశ్రయరీతి రెండవది ఆత్మాశ్రయరీతి నవ్యసాహిత్యప్రాదుర్భావమునకు పూర్వమున్న కవిత్వములో ఎక్కువభాగము వస్త్వాశ్రయరీతికి చెందినది ఈ మార్గమున కవి తన అభిప్రాయములను నాయికానాయకుల ద్వారా వెల్లడించును

నవ్యాంధ్రసాహిత్యమున ఆత్మాశ్రయరీతికి ప్రాధాన్యము లభించినది ఇందు కవి తన స్వానుభవములైన సన్నివేశములను మాత్రమే కవితావస్తువు మొనరించును

Hudson ఆత్మాశ్రయకవిత్వము (Subjective Poetry) ను గూర్చి "There is the poetry in which the poet goes down into himself and finds his inspiration and his subjects in his own experiences, thoughts and feelings ' 8 అని వివరించెను

ఈవిధమైన కవిత్వములో కథాపూరణప్రయత్నము, అనవసరవర్ణనలను ప్రవేశపెట్టుట మున్నగువాని అవసర ముండదు ఈ రీతిలో గురజాడ రాయప్రోలు కృష్ణశాస్త్రి మున్నగువారు ప్రసిద్ధులు

ప్రాచీన కవులలో 'కేవల కల్పనాకథలు కృత్రిమరత్నము' లను ఒక ఈసడింపు భావము కలదు అందుచేత ఆనాటి కవు లందరును ప్రసిద్ధమైన ఇతివృత్తమునో మిశ్రమమైన ఇతివృత్తమునో స్వీకరించి కవిత్వము రచియించిరి కథానాయకుడు ధీరోదాత్త, ధీరోద్ధత ధీరశాంత ధీరలలితులలో నొకడు కావలయును అనగా శూద్రులు తప్ప మిగిలిన వర్ణమువారికి కావ్యనాయకు లగుటకు అర్హత లభించినది కాని నవ్యాంధ్రసాహిత్యము కావ్యనాయకులకు గుణము ప్రధానము గాని కులమతాదులు కావని ఎలుగెత్తి చాటినది కాపువారు పడవ నడపువారు గొల్లవారు, కన్నెమారెతలు బిచ్చగాండ్రు మున్నగువారి జీవితములను ఇతివృత్తముగా తీసికొని కవిత్వము వెలయించి 'కాదేదీ కవిత కనర్హము' అని నవ్యకవులు నిరూపించిరి

ప్రబంధయుగములో స్త్రీని నఖ శిఖ పర్యంతము వర్ణించినగాని కవులకు తృప్తి కలుగలేదు కన్యాంగవర్ణనలవిషయములో మన ప్రాచీనకవులు తమ పాండిత్యమును ఒకరికంటె మరియొకరు మిన్నగా ప్రదర్శించిరి నవ్యకవిత్వములో అంగాంగవర్ణనము చాలవరకు వదలివేయబడినది బాహ్యసౌందర్యమునకన్న ఆంతరసౌందర్యమునకే నవ్యులు ప్రాధాన్య మిచ్చిరి తాము భావించిన లేక వినిన భావమును ప్రకటించుటకే వారు తమ ధీశక్తిని అధికముగా వెచ్చించిరిగాని అనవసరపు వర్ణనలకు తావీయలేదు ఇది నవ్యులు ప్రదర్శించిన వస్తు నవ్యత

నవ్యాంధ్రసాహిత్యములో కవిత్వమునకు అవసరమైన వస్తు, భావ, రచనలలో భావమునకు అగ్రాసనాధిపత్యము లభించినది ప్రాచీన కవిత్వములోని పురాణములు వస్తుప్రధానములు ప్రబంధములు వర్ణనాప్రధానములు ప్రాచీనులు కృత్రిమమైన ఊహాశక్తికి ప్రథమస్థానము నిచ్చి భావనాశక్తిని ప్రదర్శించినవారు కారు నవ్యకవు లట్లుగాక భావనాబలము నెక్కువగా ప్రదర్శించి రచనలు గావించిరి ప్రాచీన కవిసమయములను పరిహరించి క్రొత్త కవిసమయములను సృష్టించుకొనిరి ఊహించినదానికన్న భావించిన విషయమునకే అధిక ప్రాధాన్య మిచ్చిరి నవ్యకవులు ఈవిధముగా తాము భావించి అనుభవించిన విషయమునకే ప్రాధాన్య మిచ్చి రచనలు గావించిరి ఇది నవీనకాలములో భావవిషయములో గలిగిన నవ్యత

ప్రబంధకవుల రచనలలో చిత్ర, గర్భ, బంధ కవిత్వములు, శ్లేషలు మితిమీరిపోయినవి సమాసముల ఆర్భాటము పదవిన్యాసము, యమకానుప్రాసముల కూర్పు తత్సమపద బాహుళ్యము మున్నగువాని కధిక ప్రాధాన్యము లభించినది పద్యములు చదువునపుడు శ్రవణానందదాయకములుగా నుండునే గాని భావము మాత్రము పండితులకు దక్క సామాన్యులకు అందుబాటని రీతిలో నున్నది

నవ్యకవితలో కళాపక్షము కంటె భావపక్షముచే పైచేయి కావున నవ్యకవులు దీర్ఘసమాసములను తత్సమపదబాహుళ్యమును పరిహరించి సులభ శైలిలో రచనలు గావించిరి మారుమూలపదములను ప్రాచీనులు ప్రాసయతుల కొరకై ఉపయోగించు కొన్ని పడికట్టు పదములను తిరస్కరించి సమకాలీన సమాజములో జనవ్యవహారములో నున్న పదములకు పట్టము గట్టిరి చెలామణికి ఆదరణము కల్పించిరి నవ్యకవిత్వమునకు ముఖ్యలక్షణము సులభశైలి, సరళమగు భాష. ఇది రచనవిషయములో నవ్యులు సాధించిన నవ్యత

ప్రాచీనకవిత్వమున మనకు అంతగా కనుపించని ప్రక్రియావైవిధ్యము నవ్యాంధ్రకవిత్వమున గోచరించును ఆంగ్లకాల్పనిక కవిత్వ ప్రభావము వలన నవ్యకవిత్వములో 1 ప్రకృతికవిత్వము (Nature poetry), 2 ప్రణయకవిత్వము (Love poetry), 3 స్మృతి కవిత్వము (Elegiac poetry), 4 దేశభక్తి కవిత్వము (Patriotic poetry), 5 భక్తి కవిత్వము (Devotional poetry) మున్నగు అనేక ప్రక్రియలు వెలసినవి

ఇంతవరకు నవ్యసాహిత్యము - దాని లక్షణములు, నవ్యులు పద్య, భావ రచనలలో సాధించిన నవ్యతనుగూర్చి పరిశీలించుట జరిగినది చివరగా కొందరు నవ్యసాహిత్యమార్గానుయాయులు-వారి కృషినిగూర్చి స్థూలముగా పరిశీలన గావింపవలసి యున్నది

## IV నవ్యసాహిత్యమార్గానుయాయులు - వారి కృషి :-

ఆధునికాంధ్ర సాహిత్యము ప్రక్రియా వైవిధ్యము గలిగి విస్తృతమై యుండ ఒక్కొక్క ప్రక్రియయందు కొందరు కృషిచేసి వికాస, విస్తరణములు గలిగించిరి

వీరేశలింగముగారు ఆంధ్రవాఙ్మయమున అంతవరకు ద్రొక్కని క్రొత్త దారులు ద్రొక్కి ఆధునికాంధ్రవాఙ్మయమునకు మార్గదర్శి అనిపించుకొనిరి కట్టమంచి రామలింగారెడ్డిగారు పంతులుగారి వైశిష్ట్యమును గూర్చి వ్రాయుచు నిట్లనిరి

'In literature he commenced by writing in the pandit style and ended as the finest and grandest exponent of a clear, simple prose, instinct with beauty and reason He commenced by writing Prabandhas bristling with 'Slesha Chitrakavita and the entire gamut of ugly artificialities and ended as the creator of the Telugu Novel, the Telugu Social Satire, the Telugu Drama, especially of the social type, and of science and scientific biography and autobiography in Telugu Veeresalingam reflected the new age because he was one of its potent makers" 9

పై వాక్యములలో పంతులుగారు ప్రతిభతో ఆంధ్రజాతిజీవితమునందును, ఆంధ్రసాహిత్యమునందును ఎట్టి నూతన స్ఫూర్తిని ప్రవేశపెట్టినారో స్పష్టమగు చున్నది చిన్నయసూరి 'నీతిచంద్రిక' అను ఆద్యంత వచనగ్రంధమును మొదటగా రచించి స్వతంత్రమగు వచనవాఙ్మయమునకు (తెలుగు గద్యకావ్యమునకు) బీజావాపము గావించిరి 10 వీరేశలింగముగారు గద్యరంగమున త్రొక్కిన త్రోవలలో నవల, జీవితచరిత్ర, స్వీయచరిత్ర, వ్యాసము, విమర్శ, శాస్త్రము మున్నగునవి ముఖ్యములు వీరు మొదట 'సంధి విగ్రహము' అను చిన్నయ సూరి పద్ధతిలోనే వ్రాసినప్పటికిని తరువాత భాష శైలి విషయమున తమ అభిప్రాయములను మార్చుకొని విషయప్రధానములు విజ్ఞానప్రదములు సర్వజన సుబోధకములు నగు సులభరచనలు గావించి 'గద్యతిక్కన' అను బిరుదమును పొందియుండిరి

పంతులుగారి కృషివలన ఆంధ్రసాహిత్యమునకు ముఖ్యముగా భాషాసౌలభ్యము, వివిధ సారస్వత వ్యాప్తి, పరభాషావాఙ్మయానువాదానుసరణములు మున్నగు మేళ్ళు కలిగినవి

వీరేశలింగముగారు గద్యమున భాషాసౌలభ్యకల్పనకు ప్రయత్నముచేయగా తిరుపతి వేంకటకవులు అటువంటి యత్నమునే పద్యరంగమున కావించి యున్నారు వీరు కవితాసరస్వతిని ఇంటింటికి పంచియిచ్చిన ఘనులు పద్యమును

కృతకభాషనుండి విడివడజేసి, భాషావ్యాకరణసంప్రదాయము లను బంధములకు లోనుగాక, కవితను వ్యావహారికభాషకు అతిసన్నిహితముగా తీసికొనివచ్చినవారు తిరుపతివేంకటకవులు వీరు రచించిన ప్రతి పద్యము 'వాక్యం రసాత్మకం కావ్యం' అను రీతిలో నున్నది

కట్టమంచి రామలింగారెడ్డిగారి 'ముసలమ్మ మరణము' నవ్యకావ్యమైనను తరువాతి కవులపై అంతగా ప్రభావము నెరపలేకపోయినది వీరు రచించిన 'కవిత్వ తత్త్వవిచారము' మాత్రము విమర్శనరంగమందు నూతనయుగమునకు నాంది పలికినది కావున ఈయనను నవ్యాంధ్రసాహిత్యవిమర్శన చరిత్రలో యుగపురుషునిగా అభివర్ణింపవచ్చును

గురజాడ అప్పారావుగారు కందుకూరివారి సంఘసంస్కరణమును, గిడుగు వారి భాషాసంస్కరణమును సమన్వయించి రచనలు గావించిన వ్యక్తి వారు రచించిన 'కన్యాశుల్కము' వ్యావహారికభాషకు పట్టముగట్టిన తొలి రచన సమాజములోని అన్నివర్గముల ప్రజల కష్ట, సుఖములను వ్యావహారికభాషలో రసపుష్టికి భంగముకలుగకుండ వ్యక్తమొనర్చిన ప్రథమనాటకము 'కన్యాశుల్కము' ఈ నాటకముద్వారా వారు వ్యావహారికభాషకుకూడ కావ్యరచనోపయుక్తతకు అర్హత, స్థోమత కలదని నిరూపించిరి

గురజాడవారు చేసిన మరియొక అద్భుతప్రయోగము 'ముత్యాలసరము' లను మాత్రాచ్ఛందస్సును సృష్టించుట ఈ సందర్భమున 'ముత్యాలసరముల' గూర్చి D V Sreeramachandra Murthy గారి అభిప్రాయములు గమనింపదగినవి

"Gurazada's 'Mutyalasaralu' is a corner - stone in Modern Telugu Poetry, for it blends the classic and the Romantic harmoniously by embodying the grand and noble and by discarding the traditional, though the work has no place among the Kavyas" 11

మాత్రాచ్ఛందములకు, గేయరచనలకు తరువాతికాలమున విరివిగా ప్రచారాదరణములు లభించుటకు గురజాడవారి ప్రయత్నము చక్కని ప్రేరణము సమకూర్చినది

రాయప్రోలు సుబ్బారావుగారు విద్వత్కుటుంబమునకు చెందిన వ్యక్తి అవధానము చేయుట, ఆశుకవిత్వము చెప్పుటయందు నేర్పు గలవారు వీరు

'గోల్డ్‌స్మిత్' రచించిన 'హెర్మిట్' చదివి దాని సౌందర్యమునకు ముగ్ధులై తెలుగులో 'లలిత' అనుపేర ఖండకావ్యముగా రచించిరి రాయప్రోలువారు వ్రాసిన తరువాతి నవ్యకావ్యము లన్నింటికిని బీజము 'లలిత' లోనే ఉన్నది తదుపరి వీరు అనుమతి' 'కష్టకమల', 'తృణకంకణము', 'స్నేహలతాదేవి' మున్నగు ఖండకావ్యములను కూడ రచించిరి ఆంగ్లకవితాసంపర్కమువలన ప్రభావితులగుటచే సుబ్బారావుగారి భావములలో కలిగిన నూతనత్వమే వారు రచించిన కావ్యములకు నవ్యత నాపాదించినది ఆంగ్లకవులగు వర్డ్సువర్తు, షెల్లీ, కీట్సు, టెన్నిసన్ మున్నగువారి కావ్యములలోని వైశిష్ట్యమును గ్రహించి ఆ పద్ధతిని నవ్యాంధ్రసాహిత్యములో ప్రవేశపెట్టి గొప్ప ఉపకారము చేసిరి

రాయిప్రోలువారు వ్యావహారికభాషను తమ రచనలలో ప్రవేశపెట్టకపోయి నప్పటికిని వారి కావ్యములు సౌందర్యముతోబాటు భాషాసౌలభ్యము గలిగి యుండును నూతన కవిసమయములను సృష్టించిరి సంభోగమే పరమావధిగా గల శృంగారమునకు పవిత్రత కలిగించి 'అమలినశృంగారసిద్ధాంతము'ను ప్రతిపాదించినారు ముఖ్యముగా వీరి కావ్యములందలి నవ్యతను గుర్తించవలెనన్న ఆంగ్ల సాహిత్యపరిచయము విమర్శనాజ్ఞానము కొంతవరకు అవసరము ఏది ఏమైనను ఖండకావ్యరచనద్వారా పదుగురు పాఠకులను, రచయితలను ప్రభావితులనుజేసి ప్రేరణ కల్పించినవారిలో ఆద్యులు రాయప్రోలు సుబ్బారావుగారు

గురజాడవారి గీతికానిర్మాణము రాయప్రోలువారి ఖండకావ్యనిర్మాణము రెండును క్రొత్త ప్రక్రియలే వీరి ననుసరించి రచనలుగావించినవారు పెక్కురు గలరు

అప్పారావు, సుబ్బారావుగారల మార్గానుయాయులలో రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ, అబ్బూరి రామకృష్ణారావు, పింగళి కాటూర్లు, అడవి బాపిరాజు, కవికొండల వేంకటరావు దువ్వూరి రామిరెడ్డి, వేంకటపార్వతీశ్వరకవులు, బసవరాజు అప్పారావు, నండూరి సుబ్బారావు మున్నగువారలు ముఖ్యులు

నవ్యాంధ్రసాహిత్య ప్రథమమార్గానుయాయులలో ఒక ప్రముఖవ్యక్తిగా దువ్వూరి రామిరెడ్డిగారిని మనము అభివర్ణింపవచ్చును

"అభినవాంధ్రకవితారసాలశాఖ నధిరోహించి మధురగానముచేసిన కవిపుంస్కోకిలము దువ్వూరి రామిరెడ్డి" 12 అను మధునాపంతుల సత్యనారాయణగారి మాటలు కవికోకిల విషయములో సార్థకములు వీరు సంప్రదాయమును సంపూర్ణముగా కాలరాచి, ప్రాచీన కవితారీతులపై విరుచుకుపడి రచనలు గావించి నవ్యసాహిత్య

మార్గానుయాయులమని చెప్పుకొనువారివంటివారు కారు సంప్రదాయమును కాల మాన పరిస్థితుల కనుగుణముగా మలచి నవ్యతను ప్రదర్శించిన నవ్యకవి దువ్వూరివారు ఆంధ్ర, ఆంగ్ల, సంస్కృత, పారశీకభాషలలోని సంప్రదాయము లను క్షుణ్ణముగా నెరిగినవారు

దువ్వూరివారు ప్రకృత్యుపాసకులు వారి నివాసము ఒక చిన్న కుగ్రామము అందువలన వారి జీవితమునందును, సాహిత్యమునందును గ్రామీణవాతావరణము ప్రతిబింబించుచుండును. ఆగర్భశ్రీమంతులు అయినను నిరాడంబర జీవితమును చవిచూచినవారు ఆంగ్ల, సంస్కృతవాఙ్మయములలోని మేలి తెరగుల నలవరచు కొనిరి తేటతెల్లనిమాటలతో వెంటనే మనస్సునకు హత్తుకొనువిధముగా చెప్ప గల నేర్పు వారి శైలిలోనున్నది అందుకే ఆయన ప్రజాకవి. రామిరెడ్డిగారి కవి తలో ఉక్తిచమత్కృతితోబాటు చిత్తశుద్ధి, వ్యక్తిత్వము, శైలి మిళితమైయున్నవి అందువలననే వారి కావ్యములు ఇప్పటికిని మనచేత ఆదరింపబడుచున్నవి.

రెడ్డిగారిని ఆంధ్రదేశము కర్షకకవిగా గుర్తించి కీర్తించినది ఆంగ్లసాహి త్యములోని **Pastoralism** అను ప్రకృతికవిత్వమును తెనుగున వెలయించిరి కథాకావ్యములు వ్రాయుటలో దువ్వూరి చేయి తిరిగినవారు

వీరు ఇరువదవయేటనే తమ వంశములో జరిగిన వృత్తాంతమునుగ్రహించి 'నలజారమ్మ' అను నవ్యకవిత్వలక్షణములుగల కావ్యమును రచించిరి

'కృషీవలుడు' కావ్యమున ఇతివృత్తమునందు నవ్యతను ప్రదర్శించి కృషికి సహాయకారులగువారి నందరిని ఇంచుమించుగా పేరుపేరున వర్ణించినారు వీరు నలజారమ్మ, కడపటివీడ్కోలు, వనకుమారి మున్నగు కథాకావ్యములు, జల దాంగన, కవి-రవి మున్నగు శాస్త్రకావ్యములు, గులాబితోట, పండ్లతోట మున్నగు నీతికావ్యములు మరియు అనేక ఖండకృతులను రచియించిరి

రెడ్డిగారి ఖండికలలో చాలభాగము నవ్యకవిత్వ ముఖ్యలక్షణమైన ఆత్మా శ్రయ కవితారీతికి చెందియున్నవి

ఈవిధముగా కథా, శాస్త్ర, నీతికావ్యములు, అనేక ఖండకృతులు, సార స్వత వ్యాసములు, నాటకములు మున్నగునవి సులభశైలిలో రచించి కవికోకిల ఆధునికయుగమున తనదైన ఒక ప్రత్యేకస్థానమును ఏర్పరచుకొని ప్రజాకవిగా మన్నన లందిరి. వారి కవితాసౌందర్యమును పరిశీలించుటకుముందు వారి జీవిత విశేషములను స్మరించుట కొంతవరకు అవసరము

# ద్వితీయాధ్యాయము

# దువ్వూరి జీవిత విశేషములు

## 1 బాల్యము -

శ్రీ దువ్వూరి రామిరెడ్డిగారు 1895 వ సంవత్సరము నవంబరు తొమ్మిదవ తేది, శనివారము ఉదయము ఆరున్నర గంటల సమయమున నెల్లూరు జిల్లాలోని గూడూరునందు జన్మించిరి వీరి తలిదండ్రులు లక్ష్మీదేవమ్మ, సుబ్బారెడ్డిగారలు, తల్లి లక్ష్మీదేవమ్మ ఒక వంశమునకు ఆదిపురుషులై, నలజారమ్మవంటి పుణ్య చరితకు జన్మనిచ్చిన పెరుమారెడ్డివారి ఆడపడుచు పెరుమారెడ్డి, పెంచలురెడ్డి మహమ్మదు గవాన్ అను తురక నవాబుకు ఇజారుదారుగ నుండెడివారు రామి రెడ్డి పితామహులు రామస్వామిరెడ్డి మంచి పేరుప్రతిష్ఠలు సంపాదించి గ్రామ పెద్దరికమును సంపాదించుటయేగాక చక్కని కర్షకుడు కూడ సుబ్బారెడ్డి దంప తులకు జన్మించిన ముగ్గురు సంతానములో రెడ్డిగారు జ్యేష్ఠుడు గారాబు చెల్లెలు రుక్మిణమ్మ మూడవది వీరిరువురి మధ్య తమ్ముడు బాలకృష్ణారెడ్డి గలడు వీరి చిన్నతనములోనే తండ్రి సుబ్బారెడ్డిగారు పరమపదించిరి ఇంటి పెత్తనము, ఆస్తిపై పెత్తనము తల్లిగారికి చిక్కినవి ఆమె తమ పిల్లలకు చెల్లెలుఆస్తి లభిం చునను ఉద్దేశ్యముతో అమితధనమును వైష్ణవస్వాముల సేవకు, తీర్థయాత్రాదిక ములు చేయుటకు ఖర్చుపెట్టెడిది ఆస్తి కరగిపోజొచ్చినది ఈవిధముగా తల్లి చూపుచున్న వైష్ణవమతాభిమానము బాల్యమున రామిరెడ్డిపై అమిత ప్రభావము జూపుటయేగాక వారి ప్రథమరచనలలో ఒకటైన 'కర్షకవిలాసము' నాటకములో ప్రతిబింబించినది

రెడ్డిగారి బాల్యములో ఒక విచిత్రసంఘటన జరిగినది ఒకానొక వైష్ణవ మతాచార్యులవారు గూడూరుకు విచ్చేసి భక్తులను పరవశులను జేయుచున్నారు ఇది వినిన రెడ్డిగారు తమ్ముడు బాలకృష్ణారెడ్డితో కూడి చీకటితో నిద్రలేచి చెరు వులో శిరఃస్నానము చేసి తడిబట్టలతో వైష్ణవస్వాముల సముఖమునకువెళ్ళి దర్శ నము చేసికొని ముద్రాంకితులైనారు ఈ సంగతి తల్లికి తెలిసి ఆచారిగారి ఎదుట భక్తితో చెంపలువేసికొని చేయవలసిన గౌరవములు చేసినది ఈ సంఘ

టన వలన రామిరెడ్డిపై వైష్ణవమతము ఏవిధమైన ప్రభావము నెరపినదో మన కవగత మగుచున్నది

ఆయన జన్మించినది గూడూరులోనైనను అల్లతో విభేదముల కారణముగా పెమ్మారెడ్డిపాలెములోని పినతల్లి ఇంటికి చేరినారు వారే ఒకచోట "నాకు ఒక కుగ్రామం నివాసం ఇప్పటివరకు నా జీవితమంతా ఆ గ్రామములోనే కొనసాగి పోయింది ఆ పరిసరాల ప్రభావంవల్లనో యేమో నా జీవితంలోను, కవిత్వం లోను గ్రామీణత్వం పరిస్ఫుటంగా అంకితమై ఉంటుంది " 1 అని తమ కవిత్వ ములో గ్రామీణత్వము ప్రతిఫలించుటకు గల కారణము చెప్పుకొని యున్నారు.

## 11 విద్యాభ్యాసము :-

రెడ్డిగారు గూడూరులోని వీధిబడిలోను, పెమ్మారెడ్డిపాలెములో పితయ్య గారి వీధిబడిలోను అక్షరాభ్యాసము నుండి ఐదవతరగతి వరకు చదివినారు తరు వాత నెల్లూరులోని హార్ట్సుదొరపట్టి ఎనిమిదవతరగతి వరకు చదువుకొని ఆ సంవ త్సరము పరీక్షలో ఉత్తీర్ణులు కాలేకపోయినారు తల్లి సాధింపులకు భయపడి కష్ట పడి చదివి మరువత్సరమే పరీక్షలో నెగ్గినారు ఇంతలో తండ్రి సుబ్బారెడ్డిగారు పరలోకగతు లగుటతో పరిస్థితులు మారి రెడ్డిగారు ఉన్నతపాఠశాల విద్యకు స్వస్తి చెప్పవలసివచ్చినది

తమ స్వీయచరిత్రను గూర్చి శివశంకరశాస్త్రిగారికి వ్రాసిన లేఖలో "పాఠ శాలలో నేను నేర్చిన విద్య చాల కొద్ది. గృహవిద్యాలయ శిక్షితుడనుట యొప్పు గును **(A product of my home University)** " 2 అని యున్నారు దీనిని బట్టి రెడ్డిగారి విద్యార్హత ఎనిమిదవ తరగతి అయినప్పటికిని స్వయంకృషితో కష్టపడి పాండిత్యమును సంపాదించిరని తెలియుచున్నది

## iii కొన్ని ప్రముఖ సంఘటనలు :-

రెడ్డిగారు తమ పందొమ్మిదవ యేట ఘటిల్లిన ఒక చిన్న సంఘటనవలన కవిగా మారినట్లు 'నా తొలిరచన' అను వ్యాసములో చెప్పుకొనియున్నారు

దువ్వూరివారు ఒకసారి గ్రంథాలయములో చదువుకొనుచున్నసమయమున ఒక శతావధాని వచ్చి కవిత్వము పూర్వజన్మసంస్కారమువలన సిద్ధించుననియు, చదివినయెడల పండితుడు కావచ్చును గాని కవి యగుట దుర్లభ మనియు చెప్ప సాగెను ఆ సందర్భమున దువ్వూరివారు అవధానిగారికి, తమకు జరిగిన సంభా

షణకు సమాధానముగ ఒక ఉత్పలమాల పద్యపాదమును రచించి వారి ముందుం చిరి శాస్త్రిగారు వారి బుద్ధికుశలతను గమనించి కవిత్వరచనకు ప్రోత్సహించిరి''3

అవధానులుగారి ప్రోత్సాహక వాక్యములు రామిరెడ్డిగారిలో బాల్యము నుండియు వ్యక్తావ్యక్తముగా నున్న కవితాశక్తిని 4 వెలికుబికి వచ్చునట్లు గావిం చినవి

రచనా వ్యాసంగమున కుపక్రమించు నాటికి దుప్పూరివారికి తెలుగు సాహి త్యముతో ఎటువంటి పరిచయము లేదు 5 మరి కవిత్వము వ్రాయుట మాటలా • ఆ రోజులలో వారికి ఛందస్సనేది ఒకటున్నదని, అది పద్యరచన కవసరమని తెలియునుగాని, అది యేరూపములో నుండునో, దానికి సంబంధించిన పుస్తకము లేవియో కూడ వారికి తెలియదు 6

తరువాత క్రమముగా ఛందోలంకారములను గూర్చి నేర్చుకొనుచున్న సమయమున అప్పకవీయము నందలి అప్పకవి జెప్పిన కొన్ని అభిప్రాయములు అతనిని ప్రభావితము జేసినవి 7

సాహసముచేసి కవిత్వరచన కుపక్రమించి కొన్ని పద్యములు వ్రాసి గూడూరులోని ఒక పండితుని యోగ్యతాపత్రమునకు చేయిఛాపగా ఆతడు నిర్దాక్షి ణ్యముగా తిరస్కరించెను అవమానముతోబాటు పంతము రెండింతలైనది దేవ భాషయగు సంస్కృతమును నేర్చుకొనుటకు ఒక యూనురునివద్దకు వెళ్ళగా వర్ణ పిశాచము అడ్డుగా నిలచుటచే ఆ ప్రయత్నము సఫలీకృతము కాలేదు నెల్లూరులో మరియొక పండితునివద్దకు వెళ్ళగా వారు కూర్చొనుమని గౌరవింపకపోగా కాగిత ముల కట్టను విసరికొట్టినారు 8

ఈవిధమైన మానావమానముల కోర్చి చివరకు

"_____ మత్సరులు గాంచి హసించెదరంచు, భావముల్
రసములు గూడవంచును జిరంబుగవేచిన నేమివచ్చు, నా
పొసగిన కైతయుం జితికిపోవును బాండితి దిబ్బ గుంటలోన్" 9 అని

తెగించి కవితారచన కుద్యమించినారు జీవితములో తగిలిన ఇట్టి ఎదురుదెబ్బలను రామిరెడ్డి అవసానదశవరకును మరచిపోలేదు

'పండితప్రతిజ్ఞ' —అను ఖండికలో అన్యాపదేశముగా ఛాందసత్వమును పరిహసించినారు 'కర్షకవిలాసము' నాటకములో లంబోదరశాస్త్రిని సృష్టించి

ప్రౌఢకవి, ప్రౌఢసరస్వతి, వాదిమత్తేభకంఠీరవ, కుకవికుంఠాల గండభేరుండ మున్నగు బిరుదులు తగిలించి పండితులమని విఱ్ఱవీగువారిని అపహసించినారు

అదృష్టవశాత్తు రామిరెడ్డిగారికి నెల్లూరులో పండితులైన పర్వా సుబ్రహ్మణ్య శాస్త్రిగారి అండదండలు లభించినవి రెడ్డిగారు 1905 లోనే శాస్త్రిగారి పద్దకు వెళ్ళిరి. అప్పటికే నలజారమ్మకావ్యము వ్రాసియుండిరి రెండు, మూడు పద్యములు చదువగనే రచయితపట్ల శాస్త్రిగారికి అపూర్వ ప్రేమాభిమానములు గలిగినవి శాస్త్రిగారిని రెడ్డిగారి "మౌక్తికముల జోలు నక్కరములు, అతి ప్రసన్నమైన ప్రాక్కవులశైలి, క్రొత్తయూహలు" 10 ఆకర్షించినవి

వేదము వేంకటరాయశాస్త్రిగారు కూడ రెడ్డిగారి ప్రథమ ముద్రితకావ్యములైన వనకుమారి, జలదాంగనలను పరిశీలించినమీదట వారి కవితాప్రతిభను మెచ్చుకొనినారు

దువ్వూరివారు ప్రప్రథమమున ఏ పండితులనుండి విమర్శలు వచ్చునని భయపడినారో, ఆ పండితుల మెప్పులనే తరువాతికాలములో పొందగలిగినారనుట నిస్సంశయము

## iv సాంసారిక జీవిత విశేషములు :-

క్రీ. శ 1915 వ సంవత్సరాంతమున రామిరెడ్డిగారిలో కవితావిర్భావము జరిగినది. అదే సంవత్సరము పాపిరెడ్డిపాలెములోని దేవళ్ళ బలరామిరెడ్డిగారి కుమార్తె శేషమ్మతో రెడ్డిగారికి గూడూరులో వివాహము జరిగినది దువ్వూరి స్వయముగా "నాకు మాత్రము పందొమ్మిదిసంవత్సరముల ప్రాయముల కాంతా, కవిత ఒక్కతూరిగ చేరినవి" 11 అని చెప్పుకొనినారు.

దురదృష్టవశాత్తు వారి వైవాహికజీవితమున పది సంవత్సరములు నిండకమునుపే భార్య శేషమ్మ ఆడుబిడ్డను ప్రసవించి జ్వరముతో బాధపడి ప్రశాంత నిలయమునకు చేరుకొనినది ఇరువది దినములు విషజ్వరముచే పీడింపబడి కుమార్తె కుముదమ్మయు మరువత్సరమే పరలోకగతురాలయ్యెను అంతకు ముందే బాల్యములో సంభవించిన చిన్నారిచెల్లెలు రుక్మిణమ్మమరణము కూడ రామిరెడ్డిగారిని దుఃఖసాగరములో ముంచినది పై మూడు సంఘటనల ప్రభావము వలన వారి లేఖిని నుండి స్మృతికవిత్వము పెల్లుబికినది తమ ప్రథమకావ్యమైన 'నలజారమ్మ'ను రుక్మిణమ్మ కంకిత మిచ్చినారు

భార్యావియోగముచే కుందుచున్న రామిరెడ్డిగారిలో మనః పరివర్తనము కలుగజేయుటకు ద్వితీయ వివాహము తప్పనిసరి యైనది వారి ద్వితీయ వివాహము 12 నెల్లూరు మూలపేటలోని వేణుగోపాలస్వామి ఆలయములో అన్నపూర్ణమ్మతో జరిగినది రెడ్డిగారి జీవితములో ద్వితీయాధ్యాయము ప్రారంభమైనది

ఆ పుణ్యదంపతులకు వేణుగోపాలరెడ్డి జనార్ధనరెడ్డి అను పుత్రు లుదయించిరి సాహిత్యవ్యవసాయములో నిమగ్నులై యుండగా 1945వ సంవత్సరములో రెడ్డిగారికి పక్షవాతము వచ్చినది చివరకు 11-9-1947 అర్ధరాత్రి 12 గంటలకు Congestive failure జరిగి కీర్తి కాయులైరి

## V రచనా ప్రవృత్తికి సంబంధించిన కొన్ని విశేషములు -

"1915 వ సంవత్సరాంతమున నాయందు కవిత్వ మంకురించినది 1916 మొదలు 1917 వరకు నా కవితాభ్యాసకాలము ఈ యొకసంవత్సరములోపల వ్రాయుటయు, చదువుటయు చాల తీవ్రముగ కొనసాగినది ' 13 అని దువ్వూరి వారే చెప్పుకొనియున్నారు ఆసమయములోనే రసికజనానందము, స్వప్నాశ్లేషము, అహల్యానురాగము, శ్రీకృష్ణుని రాయబారము అను ప్రబంధములను కొన్ని ఖండకావ్యములను రచించిరి ఇవి అన్నియును ప్రారంభదశలో వ్రాయబడినవి కావున ప్రకటించుటకు అర్హములుగావని భావించి మూటగట్టి మూలబెట్టిరి 1927 నవంబరులో వీచిన పెనుఊఫానుగాలికి కిటికీలుఎగిరి, ప్రక్కనున్న పుస్తకముల బీరువా వానజల్లుకు తడిసి లోపలికి నీరు ప్రవేశించగా మూటగట్టిన వ్రాతప్రతులన్నియు నానిపోయెను అప్పుడు వానిపై ప్రీతి హెచ్చి శిథిలముకాగా మిగిలిన కావ్యములను, ఖండకావ్యములను ప్రథమకవిత్వమనుపేర ఖండకావ్యసంపుటమున ముద్రింపింపజేసిరి ఈ కావ్యఖండములను పరిశీలించి చదివినచో రామిరెడ్డిగారి కవిత్వపరిణామమును తెలిసికొనుట సుకరమగును

దువ్వూరివారు తమ వంశవృత్తమైన నలజారమ్మకధను ఆధారముగా దీసికొని 'నలజారమ్మ' అను కథాకావ్యమును రచించిరి బాల్యమునందే తల్లి గాఢవైష్ణవమతాభిమానము రెడ్డిగారిపై చెరుగని ముద్రవేసినది ఆ కారణముగా 'కర్షకవిలాస' నాటకములో కధానాయకుడు రామచంద్రారెడ్డికి భక్తిపరురాలైన అవ్వను సృష్టించి ఆ పాత్రద్వారా తల్లి మతాభినివేశమును ఎగతాళి చేసినారు

జాతీయోద్యమస్ఫూర్తిచేతను స్వాతంత్ర్యకాంక్షచేతను దాస్యమునుపై విరోధముచేత ప్రేరితులైన రెడ్డిగారు 'స్వాతంత్ర్యరవము'ను 1917 లోనే రచించిరి. కాంగ్రెసు ఉద్యమప్రచారకులు ఈ పద్యములను పాడి ప్రజలను ఉత్సాహపరచుచుండెడివారు.

1917వ సంవత్సరమున నెల్లూరులో జరిగిన ఆంధ్రమహాసభలో, సభాధ్యక్షులైన కట్టమంచి రామలింగారెడ్డిగారిచే ఒక సువర్ణ ఘంటకము రామిరెడ్డిగారికి బహూకరింపబడినది.

1918వ సంవత్సరములో విజయనగరమహారాజాస్థానములో జరిగిన కావ్య రచనా స్పర్ధలో 'వనకుమారి'కి ప్రథమస్థానము లభించినది. అందుకై ప్రత్యేకముగ ఏర్పాటుచేయబడిన రాజదర్బారునందు బంగారు పతకమును బహూకరించిరి

1919 లో కృషీవలుడు, 1920లో జలదాంగన, 1921లో సీతాపహరణము (నాటకము), 1922-'23లో యువకస్వప్నము, కడపటి వీడ్కోలు మున్నగు వానిని రచించిరి. ఈవిధముగ 1916వ సంవత్సరమున ప్రారంభమైన కావ్య నిర్మాణదశ ఏడేళ్ళవరకు సాగినది. ఈమధ్యకాలములో ప్రతి సంవత్సరమునందును రెడ్డిగారేదోఒక కావ్యమును వెలువరించగలిగిరి. రెడ్డిగారే స్వయముగా "వానా కాలమున, అందు ముఖ్యముగ కలుష్వదీయ కాలమున నా కవితాఋతువు. ఇది వరకు వ్రాసిన గ్రంథము లన్నియు కలుష్వదీయకాలమున వ్రాసినవే" 14 అని వారి డైరీలలో వ్రాసియుండిరి

దుప్పూరివారికి 1924లో వానాకాలమున గొప్ప కావ్య మేదియు వ్రాయుటకు ప్రేరణ కలుగలేదు ఆ కారణముగా కవిత తమ్ము పరిత్యజించినదని అనుమాన పడిరి. ఆ మనోవేదనయే 'కవి సంశయావస్థ' అను ఖండకావ్యముగ వెలికి వచ్చినది. వారు "నే ననేకపర్యాయములు, అప్రయత్నముగను, అవలీలగను నను దరిసిన కవిత్వ మటులె విడియుండుతూడ హెచ్చరిక సేయక వదలిపోవు నేమోనని భయపడుచుండును" 15 అని శివశంకరశాస్త్రిగారికి వ్రాసిన లేఖలో తమ అనుమానమును వ్యక్తముచేసి యున్నారు.

తరువాత 1924లో 'మీరాబాయి' (కుంభరాణా), 1925లో 'మాధవ విజయము' నాటకములను రచించిరి స్వీయరచనలకే అనువాదములైన వారి 'The Voice of the Reed' ఎంత ప్రచారముపొందినదో డా॥ కజిన్సుగారు రామిరెడ్డి గారికి చెప్పిన మాటలనుబట్టి తెలియుచున్నది

"Rami Reddy I have got an interesting news for you I delivered a lecture on the Indian poetic renaissance in which I quoted two of your poems in London and it was reported in some of the papers An American professor who was travelling in Egypt wrote to me that either I should send a copy of your book or I should give your address and made me understand that he was feeling miserable for want of a copy of the 'Reed' Don't you think it is wonderful that an Irishman should deliver a Lecture in London on Indian Vernacular Poetry and an American travelling in Egypt near the Pyramids should feel miserable for want of a copy of your book '16

భారతదేశమందును, ఇంగ్లండునందును అమెరికాయందును పత్రికలు 'The Voice of the Reed' ను ప్రశంసించినవి డాక్టర్ జేమ్సు హెచ్ కజిన్సుగారు జపాను, అమెరికా, ఇంగ్లండుదేశములలో అనేక కేంద్రములందు రెడ్డిగారి ఇంగ్లీషుపద్యములు చదివి వినిపించిరి అవి ప్రశంసాపాత్రములైనవి కూడను

కలకత్తానగరమునుండి వెలువడు 'ఫార్వర్డు' అను పత్రిక "మన రవీంద్రునిలోను, హరీంద్రనాధునిలోను, సరోజినిలోను, యువకుడైన రామిరెడ్డిలోను ప్రజ్వరిల్లుచున్న మహాకాంతి దేశాంతరములకు కూడ వ్యాపించి, అంతర్గతమై యున్న యుత్తమ కవిత్వమును వెలువరింపగల్గుచున్నది " 17 అని వ్యాఖ్యానించినది

1916-'17లో ఉమరుఖయాము రుబాయతును అనువదించుటకు పూనుకొని 'పానశాల' అను పేర వెలయించిరి

16-11-1929లో ఆంధ్రమహాసభ, బెజవాడవారు రెడ్డిగారికి 'కవికోకిల' బిరుదము నొసంగినట్లు కృష్ణాపత్రిక ప్రచురించినది

1934లో గులాబితోట, 1935లో కాంగ్రెస్‌వాలా (ఏకాంకిక), 1940-1944లో పండ్లతోట, పలితకేశము, కవి-రవి మున్నగు కావ్యములను రచించిరి ఇంతవరకు వారి రచనాప్రవృత్తికి సంబంధించిన విశేషములగూర్చి ప్రస్తావించుట జరిగినది ఇక వారియందలి ఇతర కళావిశేషములనుగూడ పరిశీలింపవలసి యున్నది

## VI ఇతర విశేషములు -

"నా వృత్తి వ్యవసాయము ఇష్టవిషయములు విజ్ఞానశాస్త్రములును, మెకానికల్ ఇంజనీరింగ్‌యును కవిత్వరచన కుపక్రమించుటకు ముందు కొన్నినాళ్ళు నేను చిత్రలేఖనమును, మృత్తివిగ్రహనిర్మాణమును చేయుచుంటిని " 18 అని ఇష్టవిషయములగూర్చి రెడ్డిగారు తెలిపియున్నారు

రామిరెడ్డిగారు బాల్యములో పాఠశాలకు వెళ్ళు రోజులలోనే గుర్రంపుతోక కుచ్చు వెంట్రుకలతో కుంచెను తయారుచేసినారు ఆ వయసులోనే వారిలో చిత్రకళ స్పష్టరూపమును పొందుచున్నదనుటకు నిదర్శనము బొమ్మలుతయారుచేయుట కూడ రామిరెడ్డిగారి వ్యసనములలో మరొకటి

పాఠశాల ప్రధానోపాధ్యాయులైన హార్విబొర కుమారుడు తెచ్చిన కెమేరా చూచి రెడ్డిగారు దానిని తయారుజేయ మనసుపడిరి పినతల్లి పంపిన డబ్బుతో వార్డుదొర అంగటిలో కెమేరావిడిభాగములను కొని వానిని జోడించి కెమెరావంటి వస్తువును నిర్మించినారు ఫోటోలు కూడ తీసినారు దీనిని విన్న హార్విదొర ఆశ్చర్యచకితులైరి తరువాతి రోజులలో ఛాయాచిత్రగ్రహణ విషయములో రెడ్డిగారు ఎంతయో ఉత్సాహము జూపినారు భారతదేశములో కెమేరాఫ్యాక్టరిని నిర్మించవలెనని ఉవ్విళ్ళూరినారు విదేశములనుండి రేడియో విడిభాగములను తెప్పించి రేడియోసెట్టునుకూడ నిర్మించి పనిచేయించినారు

దువ్వూరికి వశీకరణవిద్య కూడ తెలియును తమ్ముడు బాలకృష్ణారెడ్డిమీద ప్రయోగముచేసి అతని వ్యక్తమనస్సును నిద్రలోనికి పంపి మరొక ఊరిలోని తమ బంధువులు ఏ రంగు చీర కట్టుకొన్నది, ఏ కూర వండుకొనినది కూడ చెప్పించెడివారు

రెడ్డిగారు జ్యోతిశ్శాస్త్రములో నిష్ణాతులు నాడీజ్యోతిషముమీద నమ్మకము ఎక్కువ తమ మరణసమయమునుగూర్చి ముందుగనే గుణించుకొని మరణము తప్పదని నిర్ణయించుకొనినారు

- 1936లో 'సతీతులసి' చలనచిత్రమునకు సాహిత్యరచనను, 1937-'38లో 'చిత్రనళీయము' చలనచిత్రమునకు సాహిత్యరచన మరియు దర్శకత్వమును, 1939లో 'వేంకటేశ్వరమాహాత్మ్యము' చలనచిత్రమునకు సాహిత్య కల్పన (పద్యములు), 1939-'42లో 'పార్వతీకల్యాణం', 'సీతారామజననం' అను చలన

చిత్రములకు సాహిత్యకల్పన (పద్యములు) గావించిరి దీనినిబట్టి వారికి చలన చిత్రరంగములో ఎంతటిప్రవేశముగలదో తెలియుచున్నది

ఇట్లు గ్రంథ రచన, చలనచిత్ర దర్శకత్వము, సినేరియో కల్పనలు మున్నగువానిద్వారా తాము ఆర్జించిన ధనమును విజ్ఞానశాస్త్రసంబంధి రచనలకు బహుమతు లిచ్చుటకుగాను ఏర్పాటుచేయ సంకల్పించిరి

ఈవిధముగా రామిరెడ్డిగారు ఒక్క కవితావిషయములోనేగాక తదితర కళలయందును విజ్ఞానశాస్త్రమునందును నైపుణ్యము, మక్కువ ప్రదర్శించి, తమ బహుముఖప్రతిభను ఆంధ్రదేశమున వెదజల్లి కవికోకిలగా చిరస్మరణీయు లైరి

# తృతీయాధ్యాయము

# దువ్వూరి కావ్యరచనలు

## కావ్య నిర్వచనము -

కావ్యము, కవిత్వము అను రెండు పదములును ఆధునికదృష్టిలో పర్యాయపదములు నిశితముగా పరిశీలించినచో వాని అర్థములలో కొంత భేద మున్నట్లు తెలియగలదు మన లాక్షణికుల దృష్టిలో కావ్యపరిధిలోనికి వచ్చు సాహితీప్రక్రియలు అనగా దృశ్య శ్రవ్య కావ్యములు, పద్య గద్య, చంపూ కావ్యములు మున్నగునవి వచ్చును మన ఆలంకారికులు కావ్యమను పేర నిర్వ చించిన సాహిత్యప్రక్రియను పాశ్చాత్యులు 'Poetry' అను పేర నిర్వచించిరి కాని వారిదృష్టిలో poetry, poets అను పదములు పద్యకావ్యములకు, పద్య కావ్యరచయితలకు మాత్రమే పరిమితమైనవి ఆంగ్ల విమర్శకులు కొందరు poetry ఛందోబద్ధమై యుండవలెననియు మరికొందరు ఛందోవిరహితముగా కూడ నుండవచ్చుననియు అభిప్రాయపడిరి ఆంగ్లసాహిత్యములో దృశ్యకావ్య కర్తలను Dramatists అనియు, నవలారచయితలను Novelists అనియు వ్యవహరించు చున్నారు

సాధారణముగ కవిత్వ మనుటతోడనే మనకు ఛందోబద్ధమగు రచనయే స్ఫురించును కవిత్వమనునది ఛందోవిరహితముగాకూడ నుండవచ్చును నిఘం టువులు వైద్యశాస్త్రములు మున్నగునవి ఛందోబద్ధములై యున్నను, వానియందు కవిత్వము పొడచూపుటలేదు కాని ఛందోవిరహితములైన 'కాదంబరి' మున్నగు వానియందు కవిత్వస్ఫూర్తి కలుగుచునె ఉన్నది

కావ్యనిర్వచనవిషయములో కొందరు ప్రాచ్య, పాశ్చాత్యవిమర్శకుల అభి ప్రాయములను పరిశీలింపవలసి యున్నది

మమ్మటుడు తన 'కావ్యప్రకాశము'న 'దోషరహితములు, గుణసహిత ములు నైన శబ్దార్థములు కావ్యము అవి క్వాచిత్కముగ అలంకారవిరహితము లైనను కావచ్చును ' 1 అని వివరించెను ఈ నిర్వచనమునకు అవ్యాప్తిదోషము పట్టినదని విశ్వనాథుడు తన సాహిత్యదర్పణమున 'రసాత్మకమైన వాక్యము కావ్యము' 2 అని నిర్వచించెను జగన్నాథుడు పై నిర్వచనమును సహితము

అంగీకరింపక 'రమణీయార్థ ప్రతిపాదకమైన శబ్దము కావ్యము' 3 అని రామణీయకమునకు ప్రాధాన్య మిచ్చుటవలన కవితారంగము విశాలమైనది పూర్వ లాక్షణికుల కావ్యనిర్వచనములందలి అవ్యాప్త్యతివ్యాప్తి దోషములను పరిహరించుటచే దీనినే ప్రామాణికమైనదిగా తలంపవచ్చును

రామ్ బిహారి శుక్లా తన 'కావ్యప్రదీప్' లో "సుందర్ ప్రభావశాలీ, హృదయస్పర్శీ ఔర్ ఆకర్షక్ ఉక్తియా హీ 'కవితా' కహలా సక్తీహై" 4 అని కవితానిర్వచనము గావించెను ఇది జగన్నాథుని నిర్వచనముతో సరిపోలుచున్నది

కార్ లైల్ అను ఆంగ్లవిమర్శకుడు 'శ్రవణపేయము, మధురమునైన అర్థమును కవిత్వ మందుము' 5 అని పండితరాయల నిర్వచనముతో నించుమించు సమానమైన నిర్వచనమును గావించెను

మొత్తముమీద మన ఆలంకారికుల నిర్వచనములనుబట్టి పరిశీలించినచో సాహిత్యాంతర్గతమైన ఏ శాఖయైనను కావ్యమే యగును

నవ్యాంధ్రసాహిత్యములో నూత్న ప్రక్రియలకు పునాదులు వేసినవారు ఆంగ్లభాషయందు పండితులైన ఆంధ్రకవులె యనుట నిస్సంశయము వీరిలో కొందరు ఛందస్సు, వ్యాకరణము మున్నగువానిలో ప్రాచీన సంప్రదాయమునే పాటించుచు, వస్తు భావములలో నూతనత్వమును ప్రదర్శించిరి మరికొందరు ఛందోవ్యాకరణాది నియమములనుకూడ అంతగా పాటింపక సరిక్రొత్త మార్గమున రచనలు గావించిరి పైన పేర్కొనిన రెండు తెగలయందును మొదటివారు ప్రాచీన నవీన పండితుల ఆదరాభిమానములకు పాత్రులుకాగా, రెండవ తెగకు చెందినవారు ప్రాచీనుల నంతగా మెప్పింపలేకపోయిరి ప్రాచీన సంప్రదాయమును పాటించుచునే వస్తు, భావ, రూపాదులలో నూతనత్వమును ప్రదర్శించిన వారిలో కవికోకిల ముఖ్యులు

ఆంగ్లసాహిత్యములో కాల్పనిక కవులు చిన్న చిన్న సన్నివేశములను గ్రహించి కథాఖండికలను, దీర్ఘమైన కథలను గ్రహించి కథా కావ్యములను రచించిరి వారి ననుసరించిన ఆధునికాంధ్రకవులును కాల్పనిక ప్రక్రియలను గ్రహించి కథాకావ్యాదులను రచించిరి వీని యందలి ఇతివృత్తములు పాశ్చాత్య కథల ననుసరించియు, దేశీయ కథావస్తువుల ననుసరించియు కల్పింపబడినవి ఈవిధమైన రచనలు గావించిన తెలుగుకవులలో దువ్వూరి రామిరెడ్డిగారు ఒకరు.

వీరు రచించిన కావ్యములను i సాంఘికములు, ii నీతిబోధాత్మకములు, iii కృష్యాది గ్రామ జీవనాధారములు iv శాస్త్రాధారములు, v ఇతరములు అను విధముగా విభజించి పరిశీలింతును ఇందు ముఖ్యముగా వారు రచించిన శ్రవ్యకావ్యములనే గ్రహించితిని దృశ్యకావ్యములను ఇతర రచనలను అధ్యాయములో పరిశీలింతును

## (1) సాంఘికములు

సాంఘికములైన ఇతివృత్తములను, ఆచార వ్యవహారాదులను రమణీయముగా వర్ణించు కావ్యములను సాంఘిక కావ్యములని చెప్పవచ్చును ఈ విషయములో శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి అభిప్రాయము స్మరింపదగినది

"అచ్చపు సాంఘికకథ సంఘజీవితమునకుఁ బ్రతిబింబమై పరలోక సంచారమును వదలిపెట్టినదై, తత్సంఘీయులతో సన్నిహితబాంధవము కలదియై యున్నపుడే దాని సాంఘికస్వభావము సార్థక మగును " 6

ఇట్టి సాంఘికేతివృత్తముగల కావ్యములు ఆధునికయుగముననే వెలసినవని చెప్పవచ్చును ఈ సాంఘికేతివృత్తము సమాజముయొక్క పరిస్థితిని సుస్పష్టముగా, సశక్తముగా ఎదుట పెట్టుటకును, తద్వారా ఒక ప్రేరణను కలిగించి వ్యక్తిని సన్మార్గవర్తనునిగా చేయుటకును మేలైన సాధనము

దువ్వూరి రామిరెడ్డిగారి కావ్యరచనలలో నలజారమ్మ, యువకస్వప్నము, కడపటి వీడ్కోలు లను సాంఘికకావ్యములుగా పేర్కొనవచ్చును

## (a) నలజారమ్మ

### రచనా కాలాదులు :

దువ్వూరివారు దీనిని 1917 లోనే రచించిరి ఇదియే వారి ప్రథమ కథాకావ్యము 1916-1917 సంవత్సరములు వారి కవితాభ్యాస కాలములు ఆ సమయములోనే దీనిని రచించిరన్నమాట

సామాన్యముగ గీతికావ్యరచనలో చేయితిరిగిన తరువాత కథాకావ్యరచన కుపక్రమించిన కవికి తన దృక్పథమునుండి లోకమును అలోకనముచేయగల నేర్పుతోబాటు ఇతరుల దృక్పథములనుండి కూడ చూడగల నేర్పు తేలికగా అలవడును కాని దువ్వూరివారు పై నియమమునకు విరుద్ధముగా నడచుకొనిరి గీతికావ్యరచన చేయ ప్రారంభించినప్పుడే కథాకావ్యరచనకు కూడ పూనుకొనిరి

అందుచేతనే వారి కావ్యములలో మొదటిదైన 'నలజారమ్మ'లో కొంతవరకు భావముల అపరిపక్వత, వర్ణనావైశాల్యము పాత్రల గుణ, రూపచిత్రణము లలో కొంత అస్పష్టత కనిపించుచున్నవని చెప్పక తప్పదు

రెడ్డిగారు కూడ రామలింగారెడ్డిగారివలెనే తాను ఈ కావ్యమును వ్రాయు టలో గల ఉద్దేశ్యమును చెప్పికొనియున్నారు ఆ పద్యము ఏలనో ముద్రిత ప్రతులందు కానవచ్చుట లేదు

"ధర దువ్వూరి సువంశసంజనితుడై, ధర్మాత్ముడై, సత్కృపా
పరుడై శ్రీహరిభక్తుడై తగిన సుబ్బారెడ్డి పుత్రుండ మ
త్పరమాప్తుల్ నను రామరెడ్డియనుచు న్వాకొందు రిక్కావ్యమేన్
సరసోక్తుల్ గులుక రచించితి సతీ సంఘోపయుక్తంబుగన్"

(20-5-1917 లిఖిత ప్రతి)

అని తాను ఈ కావ్యమును స్త్రీలకు ఉపయోగపడునట్లుగా రచించితి నని వచించి యున్నారు దువ్వూరివారు ఈ కావ్యమును గద్య, పద్య మిశ్రితమైన చంపూ పద్ధతిని రచించిరి

## కథాసంగ్రహము ·

సింహపురీమండలమునందలి గ్రామములలో తలమానికమైన గూడూరు సిరిసంపదలతో తులతూగుచు వర్ధిల్లుచుండెను ఆ పురమందు లక్ష్మీదేవికి నిల యములును, అతిథులకు కల్పవృక్షములును అయిన కాపుల కాపురములు అనేక ములు గలవు ఆ కాపుమేటులలో పెద్దలనాటి ధనముగలవాడును, కష్టజీవియు నైన వెంకటరెడ్డి మంచి పేరుప్రఖ్యాతులు గలవాడు చదువులేకుండినను సమయ స్ఫూర్తికి మాత్రము ఆతనియందు కొదువ లేదు సంఘమునందు గొప్ప పలుకు బడిని గలిగియుండుటయెగాక వ్యవసాయమునందలి మెలకువలను చెప్పగలిగిన దిట్టకూడ

వానికి పెరుమారెడ్డి సువంశమందు జన్మించి, శృంగారపుదీవి యను నట్లొప్పు 'నలజారమ్మ' అను కన్యతో వివాహమైనది ఆమె దైవభక్తి గలిగి పతియే దైవమని భావించు స్వభావము గలది ఇంటికి భిక్షకొరకై ఎవరైనను వచ్చినయెడల లేదనక కలిగినదానిలో కొలది ఇచ్చి పంపుచుండెడిది వారిరువురి దాంపత్యము ఆదర్శప్రాయ మైనట్టిది

ఇట్లు వారు కాపురము చేయుచుండగా ఒక్కనాడామెకు సంతహీనయైన సతికి భోగభాగ్యము లున్నను అవి చంద్రుడులేని రాత్రివంటి వసు తలపు గలిగి దుఃఖాక్రాంతయై యుండెను. పొలమంతయు తిరిగి బడలికతో హాలికుడు ఇంటికి వచ్చి, భార్యనుజూచి, ఆమె చింతకుగల కారణమునడిగి తెలిసికొని మనకోరికలు తీరకుండునా వృద్ధులము కాముగదా! ఓపిమి వహింపుమని చెప్పి ఓదార్చెను

కొంతకాలమునకు దైవయోగముచేత నలజారమ్మ గర్భవతి యయ్యెను. ఒకరోజు ఆ కాంత భర్తకు అన్నము బెట్టి, వెన్నెలయందు పండుకొనుటకు గాను మంచము బయట వైచెను. భర్త భుజించివచ్చి జొన్నచేలను పందులు, దున్నలు మున్నగునవి పాడుచేయుచున్నవనియు, ఆ విధానము నేటి రేయి జూచి తెల్లవారు జామున తిరిగి వత్తుననియు పల్కెను అంత నా సతీమణి సంచవిస్మయముచే తనకు కోర్కె గలిగెననియు, తిరిగి వచ్చునపుడు పది కంకులు తెమ్మనియు భర్తను కోరెను అత డట్లేయని తలయూపి పొలమున కరిగెను

ఆనాటి రేయియే నలజారమ్మకు ఎడనెడ నొప్పులు కన్పించుటచే అది ప్రసవ వేదన యని తలచి తల్లిని పిలువ నంపగా ఆమెయు మంత్రసానిని తోడ్కొని వచ్చెను

ఇది ఇట్లుండ వెంకటరెడ్డి రేయి జొన్న పాడుచేయుచున్న దున్నలను, పందులను త్రోలుటచే అలసి, నిద్రపోయి, లేచి నిదురమత్తున తన చేననుకొని మాదిగవాని చేనిలో జొన్నకంకులు కోసెను ఈ సంగతిని ఆ చేని యజమాని యైన మాదిగవాడు చేని ప్రక్కనున్న మాలపిల్లలవలన తెలిసికొని ఇజారుదారు డును, నలజారమ్మ తండ్రియునైన పెంచలురెడ్డికి ఫిర్యాదు చేసెను రెడ్డివర్యుడు మరల ఇటువంటి కష్టములు కలుగకుండ నొనర్తునని చెప్పి అతనిని ఓదార్చి పంపెను

పెంచలురెడ్డికి ఏమిచేయుటకును దోచక నలజారమ్మను సమీపించి, ఆమె భర్త చేసిన తప్పిదము తెలుపక ధర్మసందేహము నడిగి తీర్చుకొన దలచెను ఇంతలో పల్లెత ఒకతె వచ్చి నలజారమ్మకు పుత్రికజనించినదని చెప్పగా వెళ్ళి పురిటిలోనున్న శిశువును జూచెను. తదుపరి దొంగతనముచేయుట నీచకృత్యమని, శాస్త్రవిరుద్ధమని తెలిసియు దానిని చేయువానికి ఎట్టిశిక్షను విధించిన ఆర్యులకు సమ్మత మగునో తెలుపవలసినదిగా పుత్రికను కోరెను. ఆమెయు యవనుల న్యాయముప్రకారము చౌర్యము చేసినవానికి కొరతయే తగినశిక్ష యని సమా

ధానము జెప్పెను అంతియేగాక ధర్మపరిరక్షణలో తనవారు, పరవారు అను భేదము తగదనియును ఆమె విన్నవించును

తదనంతరము భర్త చేసిన తప్పిదమును నలజారమ్మ తెలిసికొనును ఆమె తండ్రియైన పెంచలురెడ్డి 'బుద్ధి తెలిసి చౌర్యము చేసినవాడు శిక్ష కర్హుడు తెలియక పొరపాటున చేసిన వాని తప్పు తప్పుగా నెంచదగదు' అని పల్కి అల్లుని కొరతనుండి తప్పింప ప్రయత్నించును కాని నలజారమ్మ 'వెలుగునిప్పులను చూడక త్రొక్కినయెడల పదములు కాలక యుండునా' ధర్మమార్గమునుండి మనమే తొలగిన నింద గల్గునుగదా' అని తండ్రితో బల్కి, భర్తతో 'పెంచలు రెడ్డి తనయను జూచి నిజ ధర్మమార్గమును తప్పెనని అపకీర్తి రానివిధముగా వర్తించు'మని ప్రబోధము చేసినది

చివరకు భర్తను కొరత వేయగా నలజారమ్మయు బాలెంతస్నానమాడి తండ్రిని అగ్నిగుండము పేర్పించవలసినదిగా కోరెను అత డట్లే గావింప ఆమెయు తలిదండ్రులకు మ్రొక్కి, దేవదేవుని ప్రార్థనము చేసి, చిరునవ్వుతో అగ్నిప్రవేశము చేసినది పంచభూతాత్మకమైన ఆమె శరీరము ప్రకృతిలో లీనమై, పూతమై పరిఢవిల్లినది కథ విషాదాంతమైనది

## మూలకథ

ఈ కథ గూడూరులో జరిగినది పూర్వము దీనికి కుములూరు అను పేరు ఉండెడిదట నలజారమ్మ తండ్రి ఊరికి పెద్ద ఆ కాలములో పరిపాలకులైన తురుష్క ప్రభువులు శిష్టవనువులు, న్యాయపాలనము మున్నగువిధులుగల ఇజారా దారుడి పదవిని గూడూరులో పెంచలురెడ్డికి ఒప్పగించిరి పెంచలురెడ్డి ధర్మ నిర్వహణములో తన, మన భేదము లెరుగని పెద్దమనిషి

నలజారమ్మ గర్భవతిగానుండగా నామెభర్త పొరపాటున ఒక మాదిగ వాని జొన్నచేను తమదేనని చీకటిలో పొరబడి కంకులు కోసికొని భార్య కోరిన కోరికను తీర్చదలచెను కాని ఆ చేనుయజమాని మాదిగవాడు దొంగతనమును గూర్చి పెంచలురెడ్డికి ఫిర్యాదుచేసెను మహమ్మదీయ చట్టముప్రకారము దొంగ తనము చేసినవారికి చేతులు నరుకుటగాని, చంపుటగాని తగిన శిక్ష అల్లుడైనను వెంకటరెడ్డికి ఆ శిక్ష తప్పలేదు అందుచేత నలజారమ్మ ముత్తైదువగనే చనిపోవ దలచుకొని అగ్నిప్రవేశము జేసినది

ఈనాటికిగూడ ఆమె పేరం గూడూరులో ఒక గుడి కలదు ఆ గుడి ఉన్న వీధి కూడ నలజారమ్మ పేరనే వాడుకలో నున్నది ఇప్పుడు గుడి నిలిచియున్న 'గమళ్ళపాలెము' ఆనాడు ఊరికి పొలిమేర ఈనాటికిగూడ నలజారమ్మగుడిలో కైంకర్యము జరుగుచునే యున్నది

## నవ్యత :

'మంగళాదీని, మంగళమధ్యాని, మంగళాంతానికావ్యాని ప్రథంతే' అను నది మన ప్రాచీనకవుల దృఢాభిప్రాయము కాని దీనికి భిన్నముగా దువ్వూరి వారు తమ రచనను మరణాంతముగా జేసిరి ఆధునికయుగములో దృశ్యకావ్యము లందు మరణాంతములను ధర్మవరము రామకృష్ణమాచార్యులవారు ప్రవేశపెట్టగా, శ్రవ్యకావ్యములలో అట్టి ప్రయోగమునే కట్టమంచివారు చేసిరి కట్టమంచివారి ననుసరించిన దువ్వూరివారుకూడ తమ కావ్యమును కష్టాంతముగా జేసిరి

ప్రబంధకవులవలె మహారాజులనుగాక, సామాన్యజనులను వీరు కావ్య ములో పాత్రలనుగా గ్రహించిరి. ఇందు కొన్ని ఆంగ్లకావ్యములలోవలె శూద్ర వంశమున జన్మించిన 'నలజారమ్మ'కు కథానాయికస్థానము కల్పింపబడినది. సామాన్యకుటుంబములోని స్త్రీకి ప్రాధాన్యమిచ్చి రచించుట యనునది ఒక నవ్యత 'నలజారమ్మ' కావ్యము కరుణరసప్రతిపాదకముగా స్త్రీపాత్ర ప్రాధాన్యముతో రచింపబడినది

సాంఘికేతివృత్తమును గ్రహించి రచన గావించుట మరియొక నవ్యత దువ్వూరివారు తమ వంశవృత్తమును ఎట్టి మార్పులు చేయకయే యథాతథముగ రచించిరి ఇందు సంఘములోని పాత్రలే నాయికానాయకులు ఈ కావ్యము మనకు ఇహపరములలో దంపతులు సహవాసులను నీతిని ఉపదేశించుచున్నది

## ప్రాచీనత :

ప్రబంధ రచనావైఖరులనుండి నవ్యకవులు స్వాతంత్రించి ఆంగ్లకథా కావ్యధోరణులను చేపట్టినమాట నిజమే కాని అనాటికి నవ్యత నెంతగ నలవరచు కొన్నను, దువ్వూరివారు పాతధోరణులపై మమకారము విడనాడలేదనుటకు ఈ రచనను సాక్ష్యముగా చెప్పవచ్చును కావ్యప్రారంభమున ప్రాచీనసంప్రదాయాను సారము పురవర్ణన, దేవాలయవర్ణన, పురమందలి బ్రాహ్మణ, వైశ్య, శూద్రుల వర్ణన, తటాక వర్ణన, పల్లెటూరి మిటారుల వర్ణన కావించిన తదుపరి కథానాయ

కుని రంగప్రవేశము చేయించినారు కాని ఏ కారణముననో క్షత్రియజాతివర్ణనము మాత్రము చేయలేదు

ఈ కావ్యము ప్రాచీన సంప్రదాయానుసారముగనే 'శ్రీ'తో ప్రారంభించ బడినది.

ఛందోవిషయమున కూడ ఎట్టి నవ్యతను ప్రదర్శింపకయే సంప్రదాయానుసారముగనే నడిచినారు

## నలజారమ్మ రచనకు ముసలమ్మ మరణము ప్రోద్బలకమా ?

నలజారమ్మ రచనకు ముసలమ్మ మరణము ప్రోద్బలక మనియు, అది చదివినతరువాతనే దుప్పూరివారు తమ వంశవృత్తమైన నలజారమ్మకథను 'నలజారమ్మ' అను కావ్యముగా వ్రాయవలెనని నిశ్చయించుకొని యుండవచ్చునని మన మూహింపవచ్చును

ఈ విషయములో కొందరి ప్రముఖుల అభిప్రాయములను పరిశీలించుట ఉచితము శ్రీ కె వి రమణారెడ్డిగారు "దానిని (ప్రబంధ సంప్రదాయమును) కట్టమంచి రామలింగారెడ్డిగారు ఎంత నిరసించినా వారి ముసలమ్మమరణము'లో ఆ వాసన పూర్తిగా వైదొలగలేదు ఆ కావ్యమే దుప్పూరి రామిరెడ్డిగారిని ప్రథమ కథాకావ్యరచనకు ఎగదోసింది " 7 అని తమ అభిప్రాయము వ్యక్తీకరించిరి

వారే మరొకచోట "రామిరెడ్డి వ్రాసిన 'నలజారమ్మ' ముసలమ్మను పోలి వుండేందుకే పూనుకొంది కాని, స్వతంత్రించలేదు ఈ పోలికలైనా పైపైనే గాని లోపలికి చొరబారలేదు"8 అని తెల్పియున్నారు

మరువూరి కోదండరామిరెడ్డిగారు నలజారమ్మను గూర్చి వ్రాయుచు "స్వగ్రామం గూడూరులో కాపుఇల్లాలు నలజారమ్మ అగ్నిప్రవేశం స్వకులాభిమానంతో వ్రాసినా, నీతికి ధర్మానికి ఆత్మాహుతి చేసిన ఒక పేరంటాలు శీలాన్ని ఉత్తేజకంగా వర్ణించినాడు కట్టమంచి రామలింగారెడ్డి ముసలమ్మ మరణం' ఇంకొక రెడ్డిపడుచు ఊరి చెరువుకట్టను కాపాడను చేసిన ప్రాణత్యాగ కథ దాని పలుకుబడియే ఈ 'నలజారమ్మ' అనవచ్చు" 9 అని తమ అభిప్రాయమును దెల్పిరి

శ్రీ జి వి సుబ్రహ్మణ్యముగారు కట్టమంచివారి మార్గము ననుసరించి రచనలు చేసినవారిలో రాయప్రోలు సుబ్బారావు, దుప్పూరి రామిరెడ్డి ప్రభృతులు

ప్రముఖులని తలంచిరి వారే మరియొకచోట "దువ్వూరి రామిరెడ్డిగారి 'నలజారమ్మ' ముసలమ్మ కనుగుచెల్లెలా యను భ్రాంతి గొల్పించును ఆమె నీట మునిగినది ఈమె చితికెక్కినది." 10 అని ముసలమ్మ పాత్రకు, నలజారమ్మ పాత్రకు సారూప్యమును వ్యక్తీకరించిరి

పై వారి అభిప్రాయములను పరిశీలించినచో 'ముసలమ్మ మరణము' 'నలజారమ్మ'కు ప్రోద్బలక మనియు, దాని పలుకుబడియే నలజారమ్మ అనియు చెప్పవచ్చును

## నలజారమ్మపై ముసలమ్మ ప్రభావము :

ఇరువురు కవులును కథను శ్రీతోనే ప్రారంభించిరి మొదటి పద్యమున కట్టమంచివారు 'బుక్కరాయ సముద్రము'ను పల్లెను వర్ణించగా, దువ్వూరివారు తమ కథాస్థానమైన గూడూరును వర్ణించిరి కట్టమంచివారు పల్లెను

"శ్రీ లాలిత వసుధా నా
రీ లలిత లలాట తిలక రీతిని ధన ధా
న్యాలి బొలుచు నొక పల్లియ
చాలంగా బుక్కరాయ సంద్రంబనగన్" 11 అని వర్ణించిరి

దీని ననుసరించి దువ్వూరివారు

"శ్రీ సింహపురీమండల
కాసారమరాళ మనగ గాంతిల్లి రమా
వాసంబయి సతతంబును
వాసిగ్గూడూరు మిగుల వర్ధిలుచుండున్" 12 అని గూడూరును వర్ణించిరి.

ఈ రెండు పద్యములను పరిశీలించినచో ముసలమ్మ మరణమును దువ్వూరివారు ఎంతవర కనుసరించినదియు తెలియగలదు

అదేవిధముగా కట్టమంచివారు బుక్కరాయసముద్రములోని ఒక సరస్సును వర్ణించగా, దాని ననుసరించి దువ్వూరివారు గూడూరులోని ఒక సరస్సును వర్ణించిరి

"చలదుత్తుంగ మహోగ్రభంగ పటలీ సంఘట్టనారావము
జ్జ్వల కూలాగ్ర నటత్తరంగరవ మంచన్మధ్య భాగ్భూమి భృ

తుక్కుల సంపాతి మహోర్మికా నికర నిర్ఘోషంబునుం, గూడగా
నలరున్ ఘోరసరస్సు దిగ్విదళన వ్యాపార పారీణమై' 13

ఇది కట్టమంచివారి వర్ణన

"ప్రోలికి దక్షిణంపు దిశఁ బుష్కర పుష్కలమై ప్రకంపనాం
దోళిత వీచికానికర తుందిలమై, కలహంస చక్రమీ
నాలయమై, విశుద్ధసలిలాశయమై తనరుం తటాకము
త్రాల తటావృతంబునయి తగ్గకనీరు నిదాఘ కాలమేన్" 14

ఇది దువ్వూరివారి తటాక వర్ణన

ఈ రెండింటిని ఏది కథ కెంతవరకు అవసరము అను ఉద్దేశ్యముతో పరిశీలించినచో దువ్వూరివారి తటాక వర్ణన అనవసర మనిపించును ఏలననగా కట్టమంచివారు వర్ణించిన సరస్సు బుక్కరాయ సముద్రమునకు కేవలము అలంకారము మాత్రమే కాదు అది కథతో సంబంధమును కలిగియున్నది మరియు చివరకు ముసలమ్మ గ్రామప్రజల రక్షణార్థము తన్ను తాను ఆ సరస్సునకే అర్పించుకొనినది కావున ఆ వర్ణన ఆ కథకు అవసరము

దువ్వూరివారుకూడ సరస్సును రమణీయముగా వర్ణించిరి కాని నలజారమ్మ కథకు, ఈ తటాకవర్ణనమునకు ఎట్టిసంబంధములేదు దీనినిబట్టి దువ్వూరివారు కేవలము కట్టమంచివారి ననుసరించుటకు మాత్రమే ప్రయత్నించిరిగాని, కథకు అది ఎంతవరకు ఉపయోగపడునో ఆలోచించ లేదనియు అనిపించు చున్నది

దువ్వూరివారే తరువాతికాలములో "రమణీయ వస్తువులు తమంతట తామే వర్ణనాయోగ్యములయ్యును, అవి మానవచర్యలకు భిత్తికయయి కావ్యవర్ణనములో మిశ్రితమైనప్పుడు మరింత సుందరముగా నుండును" 15 అని చెప్పిరి

ఈ అభిప్రాయమునకు పై వర్ణనము భిన్నముగా నున్నట్లు దోచుచున్నది అనగా ఈ మర్మమును అప్పటికి స్ఫురణకు రానీయనంతగా ముసలమ్మ మరణము యొక్క ప్రభావము వీరిపై పడినదని అనుకొన్నచో పొరపాటు కాదేమో.

కట్టమంచివారు ముసలమ్మ జలప్రవేశమును, దువ్వూరివారు నలజారమ్మ అగ్నిప్రవేశమును వర్ణించిరి ఇద్దరును సీసపద్యములనే ఉపయోగించిరి

సీ॥ "కన్నెజ్జవాజీన ఖర కరోదయకాల
మల్లన మ్రింగు జాబిల్లి యనంగ

జ్వలదగ్ని శిఖలపై నెఱనప్పుతో బోపు
ధాత్రీ మహాదేవి తనయ యనగ
గెందామరల బారు సుందరమగు లీల
నల్లనల్లన జొచ్చునంచ యనగ
గాల మహాస్వర్ణకారకుం డగ్నిలో
గరగించు బంగారు కణిక యనగ

గీ॥ ప్రళయకాలానల ప్రభా భాసురోగ్ర
రంగ దుత్తుంగ భంగ సంఘాతములకు
గలకనొందక దరహాస మలర, మంద
మందగతిబోయి, చొచ్చె నమ్మగువ సీట" 16 (కట్టమంచి)

సీ॥"సాంధ్యరాగచ్ఛటా సంఛాదితా స్తాద్రి
కటక సంచర దభ్ర ఖండమనగ
జలజరాగ పరాగ కలితోర్మిమాలికా
దోలికా చంచన్మరాళ మనగ
బల్లవితాశోక పాదపాశ్రయి నవ
ప్రసవ భారానతవల్లి యనగ
గైరిక సిందూర కలిత పూర్వాచల
పీఠస్థ పూర్ణేందు బింబ మనగ

గీ॥ సతి రహించెను గుండాన జటుల వహ్ని
శిఖలు నల్గడ వ్యాపించి చిటపటోగ్ర
శబ్ద భీమంబులై ధూమచయము ప్రేక్ష
ప్రేక్షకావళి గుండెలు పెటిలి పోవ" 17 (దుష్పారి)

ముసలమ్మ జలప్రవేశము జేసి మరణించినది నలజారమ్మ అగ్నిప్రవేశము జేసి మరణించినది ఇరువురు రచయితలును తమ తమ కావ్యములను శోకాంతములుగనే రచించిరి.

ఈవిధముగా పరిశీలించినచో "నలజారమ్మ ముసలమ్మకు నకలని వేరే చెప్పనక్కరలేదు" 18 అను రమణారెడ్డిగారి వాక్యములు సార్థక మనిపించును.

## కావ్యగత విశేషాంశములు

**పాత్ర చిత్రణ** - దువ్వూరివారు నలజారమ్మపాత్రను పతివ్రతా శిరోమణిగా, యాచకుల పాలిటి కల్పతరువుగా చిత్రించినారు

"ఇంటికి నమ్మ, భిక్షమని యెవ్వరువచ్చిన బొమ్మ పొమ్మ నీ
వంటిరు చాలమంది యని వాదులు నల్పక వడ్లొ, బియ్యమో
వంటకమో తగుంగొలది వచ్చిన యర్థుల కిచ్చి పంపు వా
ల్గంటి ప్రమోదచిత్తయయి, కల్గిన దిద్దియె యంచుఁ జెప్పుచున్" 19

ఈ పద్యమువలన నలజారమ్మ మనఃప్రవృత్తి ఎంత దయార్ద్రమైనదో తెలియుటయే గాక, ఆమె ప్రవర్తన ఎంత సున్నితమైనదో కూడ తెలియుచున్నది

**కర్షకజీవన చిత్రణము** - ప్రముఖ కర్షక కవిగా ఆంధ్రులచే మన్నన లందిన దువ్వూరి రామిరెడ్డిగారు ఈ కావ్యమున కూడ తమ కర్షక పక్షపాతమును వదలిపెట్టలేదు

"

పైరు పచ్చలు చూడ బసులను గాపాడ
మడవలు గట్టంగ మడులు దున్న
నెండ వాన లనాక యుద్దండలీల
బ్రొద్దు వొడిచిన దాదిగా బ్రొద్దు గ్రుంకు
వఱకు బొలముల గష్టించి వచ్చుచుందు
రప్పురంబున యువకులౌ హాలికవరులు" 20 అని గూడూరునందలి

హాలికులను వర్ణించినారు తాను కర్షకుడు గనుక కన్నులార గాంచిన దానిని యథాతథముగ చిత్రించినారు

భూమిమీద నున్న కర్షకుని జీవనమును వర్ణించుటతోనే తృప్తిపడక కర్షక జీవితమును ఆకాశములోనికి కూడ చేరవేసినారు

"అభ్ర కేదారమున జంద్రుడనెడు గోప
బాలకుం డుడుగణమను పసిని మేపు
చుండు సోయగ మత్తఱినొప్పె, నటుల
గాక చిహ్నమన్ గొంగడి గలుగుబెట్లు" 21 అని ఆకాశమును కేదా

రముతోను, చంద్రుని గోపబాలకునితోను, నక్షత్రములను పుష్పలతోను పోల్చి నారు దువ్వూరివారి కర్షక పక్షపాతమును నిరూపించుటకు ఈ ఉదాహరణము ఒక మచ్చుతునక.

**సాంఘిక జీవన చిత్రణము :-** ఈ కావ్యమున ఆనాటి సాంఘిక జీవనము ప్రతిఫలించుచున్నది. వాయురోగము వచ్చినవారికి పసుపుచేత నుదుట కాల్చు ఆచారము ఆ రోజులలో నున్నట్లున్నది. అందుచేతనే నాయకుని వర్ణించుచు అట్లు కాల్చగా నుదుట ఏర్పడిన మచ్చ శివుని మూడవనేత్ర మునునట్లు ప్రకాశించుచున్న దనినారు " 22

ఆ రోజులలో కన్నుల కొనలకు, చేతులకు పచ్చలు పొడిపించుకొను ఆచారము కలదు నాయికను వర్ణించుచు కన్నులకు పచ్చలు పొడుచుటవలన కన్నుదమ్ములు మరింత పెద్దవిగా కనుపించుచు అందముగా నున్నవనియు, బాహువులకు వేయబడిన పచ్చపొడుపు పూపుతీగెలు ఆమె చేతులకు ఆభరణముల వలె నున్నవనియు తెలిపి యున్నారు." 23

మణిబంధములకు జిలుగునీలాల గాజులు వేసికొనెడివారు. అంతియేగాక ఆనాడు

"నల్లబూసల పేరులో నాణెమైన
గిన్నెబొట్టు, కడాని పంకీలు, మట్టె
లంచు కమ్మలు, ముక్కర " 24 మొదలగునవికూడ ఆభరణములుగా వాడెడివారని తెలియుచున్నది

**నీత్యుపదేశము :-** సార్వజనీనము, సార్వకాలికములైన నీతులను పెంచలురెడ్డిద్వారా మనకు ఉపదేశించినారు.

"సుతుడైనను, హితుడైనను,
సతియైనను, నల్లుడైన సదమల ధర్మ
వ్యతిరేకత వర్తించిన
మతిమంతులు వారి పొత్తు మానుదురు ధరన్" 25

ఇందే మరియొక ధర్మరహస్యము కూడ చెప్పబడినది-

"గొప్పవారికైన జొప్పడు బొరపాటు
ఇదియె తప్పుగాగ నెంచదగదు

బుద్ధి తెలిసి యెవడు పొనరుచు జౌర్యంబు
నట్టివాడ శిక్ష కర్హుడిలన." 26

బుద్ధితెలిసి తప్పు చేయువాడు శిక్షార్హుడని ఇందు వక్కాణింపబడినది

తరువాతి కాలములో దువ్వూరివారు రచించిన 'కృషీవలుడు', 'జలదాంగన' మున్నగు కావ్యములకు బీజములు నలజారమ్మ'లో మనకు కనిపించును 'ఆలమందల గదలించి'న హాలికులే 'కృషీవలుడు'లో కనిపించెదరు 'కన్నె పయ్యెర కల్లగదలుచు దోగాడు జలదబాల' కాలక్రమమున జలదాంగనగా రూపు దిద్దుకొనినది

పై విషయములను గుర్తించిన దర్భా సుబ్రహ్మణ్యశర్మగారు "ఇందు (నలజారమ్మ) రెడ్డిగారి శైలి పాకమునకు రాకపోయినను, మనః ప్రవృత్తుల పరిశీలనము చేయు శక్తి పరిమితముగానే యున్నను, కవి గతాను గతికుడు గాడనుటకు ఈ చిఱుత కృతిలోనే కావలసినంత సాక్ష్య మున్నది" **27** అని తమ అమూల్యాభిప్రాయమును వ్యక్తీకరించిరి

## (b) యువక స్వప్నము

### రచనా కాలాదులు

దీనిని దువ్వూరివారు 1922_'23 సంవత్సరములలో రచించిరి ఇందు అప్రస్తుత ప్రశంసాలంకారము వాడబడినది ప్రతి పద్యమునందును అప్రస్తుత వస్తువర్ణనముచే ప్రస్తుతవస్తువు ద్యోతకము కాకపోయినప్పటికిని కావ్యమును ఆమూలాగ్రముగ పరిశీలించినయెడల ఈ అలంకారమే మనకు గోచరించును అప్రస్తుత ప్రశంసాలంకారము '1 కార్యము ప్రస్తుతమైనపుడు దాని కారణమును వర్ణించుట 2 కారణము ప్రస్తుతమైనపుడు కార్యమును వర్ణించుట 3 సామాన్యము ప్రస్తుతమైనపుడు దానిని వర్ణింపక దాని విశేషమును వర్ణించుట 4 విశేషము ప్రస్తుతమైనపుడు సామాన్యమును వర్ణించుట 5 ప్రస్తుతము వర్ణింపవలసియుండగా దానిని వర్ణింపక దానికి తుల్యమైన అనగా సారూప్యము గల వస్తువును వర్ణించుట' అని ఐదు విధములు ఈ కావ్యమున అప్రస్తుత ప్రశంసాలంకారభేదములలోని ఐదవపద్ధతి యైన సామాన్య నిబంధనాప్రస్తుత ప్రశంస అనుసరించబడినది పాశ్చాత్యులు ఈ అలంకారమునే '**Allegory**' అని వ్యవహరింతురు

ఇందు ఆంగ్లేయుల పాలనలోని భారతదేశదాస్యావస్థ మరియు ప్రజల మైన మన కర్తవ్యము గూడ పరోక్ష పద్ధతిలో చిత్రింపబడినవి అందువలననే రమణారెడ్డిగారు "యువకస్వప్నము కావ్యానికి ఉన్న బలమంతా ఆద్యంతాలూ శక్తివంతంగా నిర్వహించిన పరోక్షపద్ధతిలోనే వుంది" 28 అని తమ అభి ప్రాయమును వ్యక్తీకరించిరి ఇది యువకునిస్వప్నముతో ప్రారంభ మగును వాస్తవమును స్వప్నముగాను, స్వప్నమును వాస్తవముగాను చిత్రించుట అను రెండు పద్ధతులలోను ఈ కావ్యమున రెండపద్ధతి అవలంబించబడినది ఇది ఒక ప్రయోగము

కథాసంగ్రహము :

సముద్రతీరమున తల్లినెడబాసిన యువకు డొకడు సంచరించుచున్నాడు. ఇంతలో సాంధ్యారుణకాంతి, సందె చీకటి, చంద్రకాంతి వరుసగా నొకదాని స్థానమును మరొకటి ఆక్రమించినవి ఆ సమయమున సముద్రతరంగముల హోరు తప్ప మరి యే శబ్దము వినిపించుటలేదు.

ఇంతలో సముద్రమున కడు దూరమున నక్షత్రమో యనునట్లు ఒకకాంతి కనుపించినది అది రాను రాను తెల్లనైన పక్షిరూపముగా కన్పించినది ఇంక కొంతసేపటికి అంభోదమువలె కనుపించినది దగ్గరకురాగా నది ఒకఓడ ఆ ఓడలో రత్నములుపొదగబడిన సింహపీఠికమీద శంపాలతికాంగి ఒకర్తుక కూర్చుండి వీణను మీటుచుండెను ఆ గానమునకు తారకలు కరుగగా, ఉల్కలు ఉద్వేగముతో రాలుచున్నవి ఇక మనుష్యులమాట వేరే చెప్పవలసిన పనిలేదు.

యువకుడు పరవశుడై హృదయమున భక్తిభావము కలుగగా ఆమెకు చేతులు రెండు జోడించి ఒకప్రక్కన నిలుచుండెను ఆ లతాంగి ప్రక్కన వికృతాకారము గల మనుజశల్యపంజర మొకటి గలదు. దాని వీపున పచ్చి నెత్తుట దడిసిన పట్టువలువ క్రింద జీరాడ వ్రేలుచుండెను చేతనున్న దండమును అది ఎటు త్రిప్పునో, అటు పురముల విప్లవాగ్నిశిఖ పుట్టి దహించును. ఆ చితా భస్మమునుండి నవ ప్రాణాంకురములు జనియించును వీణవాయించుచున్న ఆ స్త్రీ పాదములవద్ద భగ్నదండములు, సింహాసనములు, కిరీటములు, తరతరములనాటి నృపాలకత్వగర్వఖగరిమ పడియున్నవి ఇవి కాలక్రమములో జరిగిన అనేక విధ్వంసనముల చిహ్నము లన్నమాట

ఆ తేజస్విని దయతో యువకుని చేరబిల్చి ఇంత గంభీరనిశీథిలో సముద్ర తీరమున తిరుగుటకుగల కారణమును ప్రశ్నించెను ఆతడును మనస్సును కలత పెట్టు శోకభరమంతయు ఆమెకు విన్నవించుకొనిన తదుపరి ఆమె ఏ దేవతా వనితయో తెలిసికొన గోరెను ఆమె తాను ధర్మమునణచి దుర్జనత్వము పెరిగి నపుడు దానిని రూపుమాపుటకై జన్మమెత్తు ప్రతీకారశక్తిననియు, జనాళి నిద్ర మేల్కొలుపుటకై వీణియ మీటుచుందుననియు పల్కెను మరియు ఆమెకు సహ కారియైన ఆ శల్యమూర్తి నిర్జిద్రశక్తియనియు, అత డెచ్చోట కాలూనునో ఆ స్థలము అభినవోజ్జీవనాంశుల అందగించుననియు తెల్పినది

ఆ యువకునికి కర్తవ్యమును బోధించి మాతృసంయోగమును కలుగ జేయుటయే వారి ప్రస్తుత ఆశయము కావున ఆ ముగ్ధుని తమ ఓడపైనెక్కించు కొని ఒకద్వీపమును చేరబోయిరి అందు కనకమణిప్రభాసితమైన ఒకహర్మ్యము గలదు దానిలోనికి ఎవరును వెళ్ళలేనిరీతి ములుకంచెలు ఉండి వేటకుక్కలు కావలా యున్నవి కుక్కలను మోసగించి లోపలకు పోవలయును ఎట్లో మేడ లోనికి చేరినారు అచ్చట ఒక పట్టుతివాచిమీద కూలబడి ఒడలెరుగని నిద్రలో నున్న స్త్రీ గనుపించినది ఈ స్థితిలోనున్న ఆమె యువకుడు తాను కోల్పోయిన తల్లియని ప్రతీకారశక్తి జెప్పినది

ప్రతీకారశక్తి వీణాతంత్రుల మీటగా ఒడలెరుగని నిద్రలోనున్న స్త్రీ కొంతసేపటికి కనులు విప్పి చూచి పునరుజ్జీవన చిహ్నములతో మేల్కొనినది యువకుడు తల్లిని 'నిన్ను దపింపజేయ హీనమ్మగు నిట్టి శిక్షణ మొనర్చిన వారె వరో వచింపుము'ని కోరెను

కిష్కింధనుండి వచ్చిన వానరులు భయభక్తులు నటించి, నందనవనము వంటి ఉద్యానవనములో ఘాతుకమృగములు చొరబడకుండ కట్టుదిట్టములు చేయుదుమని ఆశగొలిపి చోటు చేసికొనిరి కాపలాదారులుగ వచ్చిన వానరులు ఒక్క పండ్లను మెక్కుటయేగాక ఆకులు పూవులు, పిందెలు, కాయలు తరిగి వనమునకు హేయమైన రూపమును గల్పించిరి అట్లుచేసిన వానరులను మంద లించినందులకు వారు కపటముతో నిజాశయమును కప్పిపెట్టి, పూదోటబొలము నందు హేమహర్మ్యములో ఇష్టమైన రత్నభూషలు దాల్చి రాణివై మమ్మేలుదువు రమ్మని ఆశ జూపించిరి ఆశ దొడ్డది గాన అంగీకరించగా, శిరమున మంచు కొండంత బరువైన కిరీటము, కరములకు శృంఖలములవంటి వలయములను

కాళ్ళకు సంకెళ్ళవంటి బంగరు అందెలు బలవంతముగా తొడిగినారు. తదుపరి కట్టివేసి పై కెగ్రబాకి చనుబాలను ఆపైన రక్తమును కూడ చవిగొనుచుండ మూలములు తెగి ధరాస్థలముపై వ్రాలెడు వృక్షము వగిది నేను కూలబడితిని అంత మైమరచిపోతిని విచారవము విన్నతదుపరి మరల లోకము తెలిసినది ఇట్లు ఆమె తనకు జరిగిన అవమానములనుగూర్చి తెలిపినది ప్రతీకారంశక్తి ఓదార్చినది

ఇంతలో పక్షుల కిలకిలారావములతో అరుణారుణకాంతి రాగా యువకుడు నిద్రనుండి లేచినాడు ఇది అంతయు యువకుని స్వప్నములో జరిగిన కథ

## స్వప్నప్రయాణము - యువక స్వప్నము ·

యువకస్వప్నము వెలువడిన దశాబ్దములోనే 'స్వప్నప్రయాణము' కూడ వెలువడినది ఈ రెండింటికిని పోలికలు గలవు దీనిని రచించిన దెవరో తెలి యదు 'జమీన్ రైతు' వ్యవస్థాపకులైన నెల్లూరి వేంకట్రామానాయుడుగారు 'స్వప్నప్రయాణ' ప్రకాశకులు సంవత్సరమేదియో అంత స్పష్టముగా తెలియుటు. కాబట్టి దేనికేది అనుకరణమో తెలిసికొనుట కొంచ కష్టము ఆనాటికే లబ్ధ ప్రతిష్ఠుడైన రామిరెడ్డిగారిని 'స్వప్నప్రయాణ' కృతికర్త సమూనాగా పెట్టుకొని వ్రాసి యుండవచ్చును

కథానాయకుడైన యువకుని నిద్రావస్థలో నీ కావ్యములు రెండును ప్రారంభమగుచున్నవి ఒన్న ఇంటనే మెత్తటి పాన్పున విశ్రమించి స్వప్నప్రయా ణికుడైన యువకుడు కల గనును యువకస్వప్నములో ఓడ నెక్కివచ్చిన దేవికి బదులు, స్వప్నప్రయాణములో స్యందనాసీనయైన దేవి సాక్షాత్కరించి యువకుని వెంట దీసికొనిపోవును రామిరెడ్డిగారి 'స్వాతంత్ర్యరథము' అను ఖండకావ్య ములో ప్రసక్తురాలైన దేవికి ఈ దేవికి చాల పోలికలు గలవు ఒక కరమున రక్తమొలుకు పునుకను ధరించి, అవ్వలి కరమున అమృతకలశము పూనిన దేవి యువకుని కన్నతల్లి భారతమాతకు సంకేతము

రాజ్యలక్ష్మి వివాహమునకు తరలిపోవుచున్న అన్నలను కలిసికొనుటకు ఆవిడ వెంట మిన్నంటిపోయిన యువకుడు మార్గమధ్యములో పుణ్యలోకమునకు ప్రతీకయైన దృశ్యసంపుటిని జూచి ఆశ్చర్యపోవును అచ్చట లోకమాన్య బాల గంగాధరతిలక్ దివ్యమూర్తియై భగవద్గీతాభాష్యమును వెలువరించుచుండును

మన యువకునికి కూడ ఆయన కర్తవ్యోపదేశమును చేయును ఆంధ్రరత్న దుగ్గిరాల గోపాలకృష్ణయ్యమూర్తి కూడ మరొకవ్యక్తి వర్ణనములో కానుపించును

యువకుడు భూమికి దిగివచ్చినతరువాత తపసి (గాంధీజి) తత్త్వోపదేశమును చేయుటను గాంచును దూరదేశములనుండి వచ్చిన ఒక ప్రయాణికునికి భారతదేశచరిత్రను, ముఖ్యముగా ఆంగ్లేయుల రాజ్యాధికార చరిత్రను కోతికథ నెపమున వర్ణించుటను యువకుడు వినును దువ్వూరి రామిరెడ్డిగారు ఈ కోతుల కథ విషయములోకూడ స్వప్నప్రయాణ గ్రంథకర్తకు మార్గదర్శియని ఊహింపవచ్చును కాగా రామిరెడ్డిగారు కొన్ని సూక్ష్మాంశములను విడిచిపెట్టగా, ఈ గ్రంథకర్త వానినే ఎన్నుకొనిరి కాని రామిరెడ్డిగారిలో ఉన్న తత్త్వప్రకర్ష ఈ రచయితలో లేదు అయినను ఇది ఒక మంచికావ్యముగా పరిగణింపవచ్చును

## కావ్యగత విశేషాంశములు

**ఆంగ్లేయుల రాజ్యస్థాపన** ఆంగ్లేయులు వ్యాపారనిమిత్తము వచ్చి క్రమముగా అది రాజ్యదాహముగ పరిణమించ భారతదేశమునే వశపరచుకొని రాజ్యపాలనము గావింపజొచ్చిరి సూదిగా వచ్చి దబ్బనమైనారు వారి పాలనములో మనకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కరువై పోవుటయేగాక వారి క్రింద బానిసబ్రతుకు బ్రతకవలసి వచ్చినది దీని నంతయును దువ్వూరివారు కోతి దుండగముల నెపమున వర్ణించినారు

కిష్కింధవాసులమని, ఉద్యానవనమున ఘాతుక మృగములు లేకుండ చేయుదుమని పల్కి వానరులు మొదట కాపలాదారులుగా ప్రవేశించిరి తదుపరి ఉద్యానవనమును పాడుచేసినందులకు మందలించగా రాణివిగా మమ్మేలుదువు రమ్మని పల్కి, కపటోద్దేశముతో ఒక మేడలోనికి తీసికొనిపోయి కట్టివేసి చనుబాలను, ఆపైన రక్తమును కూడ త్రాగివేసినారు మొసలినోటిలోపడిన కరిరాజువలె ఆమె (యువకుని తల్లి) బంగరు సంకెళ్ళ నుండి తప్పించుకొనలేక పోయినది ఇది అంతయు ఆంగ్లేయులగూర్చి వ్యంగ్యముగా జెప్పిన కథ

ఇందు బంగారు మేడలోని ఖైదీలో భారతమాత దైన్యమును, వానరులలో ఆంగ్లేయులను, ఉద్యానవనములో భారత భూతల దౌర్భాగ్యమును మనకు ప్రత్యక్షమగుచున్నవి ఆంగ్లేయుల ప్రవృత్తిని వానరుల నెపముతో

"కప్పు యెలుగు పాములు బూజు గప్పియున్న
బావులును, మేకతోల్పులుల్ వానరములు" 29 అని వర్ణించి గోముఖ వ్యాఘ్రములు, పయోముఖ విషకుంభములు ఆంగ్లేయులని చెప్పుటకు అప్రస్తుతమైన వానరులను వర్ణించిరి

భారతదేశ దౌర్భాగ్యము యువకుడు ప్రతీకాంతి నిర్ణిద్ర శక్తి ముప్వురును ఓడలో ప్రయాణించి ఒక దీవిని చేరిరి ఆ దీవి ఈ క్రింది విధముగ నున్నది

"భూతల స్వర్గమట్టుల బూర్వమందు
గాంతిలిన దీవి గన నేడు వంత గొలుపు
బుప్వ లాకులు రాలిన పూలచెట్లు
జలములేక విశీర్ణమై చచ్చు నకట" 30 ఇందు భారతదేశ పూర్వౌన్నత్యము ప్రస్తుత దౌర్భాగ్యము వ్యంగ్యముగా వర్ణింపబడినవి ఆ కాలములో లలిత కళలకు గూడ సరియైన ఆదరణ లభించలేదనియు కమ్మని కావ్యగానము చేయు కవికోకిలలకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు కరువైనవనియు తెల్పుటకుగాను

"లతలు పులకింప దోట పొలాల మేను
మఱచి పాడిన కోయిల లురుల జిక్కె
భావభేదక శోకరావంబు దక్క
మధురభావంబు వినరాదు మానవులను" 31 అని వ్యంగ్యముగా బలికిరి అమృతదుగ్ధమును పితికిన ఆవు పొదుగు నేడు నెత్తురుపాలను కురిపించుచున్నదనియు, నిర్మలాంబులుపారిన నిర్ఝరిణులు అశ్రుశీకర కళ్ళలలై ప్రవహించుచున్నవనియు భారతమాత దాస్యస్థితిని చిత్రించిరి

సర్వమానవ సమానత్వము ప్రపంచశాంతికి దేశ స్వాతంత్ర్యములు ముఖ్యములు కావున ప్రతి జాతి స్వాతంత్ర్యమును సంపాదించుకొనవలసినదే మొదట తన సంఘములోని దురాచారములను, అసమానతలను రూపుమాపుకొనలేని దేశము స్వాతంత్ర్యమును సంపాదించుకొనుట కష్టము కావున సర్వమానవ సమానత్వము కావలెను

"పాలకత్వచక్రం బొకవంక, వేఱు
ప్రక్క నాచారచక్రంబు ప్రజల నెపుడు

గానుగను త్రిప్పినటుల గదిపిరాచు
మానవత్వ స్వభావమే మఱపురాగ" 32 అని విదేశపాలనకు తోడు ఆచారచక్ర మున్నదన్న బాధను రెడ్డిగారు వ్యక్తముచేసిరి సంఘములోని దురాచారములు బహుముఖములుగా వ్యాపించినవి స్వాతంత్ర్యమును కోరువానికి నిలువ నొక అంగుళమైన చోటులేదు అట్టి పరిస్థితులలో సంఘమును సంస్కరింపవలసిన ఆవశ్యకత ఎంతగలదో కవిగారు తెలియబరచుచున్నారు

**ఇతర విశేషములు** - ప్రతీకారశక్తి ఎక్కివచ్చిన ఓడ పడమటి నుండి తూర్పునకు వచ్చినట్లు కవిగారు చెప్పియున్నారు దీనికి శ్రీ కె వి రమణా రెడ్డిగారు "స్వేచ్ఛాసమత్వాలను గురించి పాశ్చాత్యసీమలో మొదలైన పటుతర భావజాలం ప్రాచ్యదేశాలను ప్రభావితం చేసినట్లు చెప్పబూని ఈ క్లుప్తసంకేతం వాడి వుంటాడు" 33 అని ఎంతయో చక్కని అభిప్రాయమును వ్యక్తపరచిరి

రామిరెడ్డిగారు తమ అభిప్రాయములను యువకునిద్వారా పలికించి నాటి ప్రపంచ పరిస్థితులను

"బలయుతమైన జాతి యిల బాలనసేయు, నధర్మమయ్యు భూ
తల పతి ముద్రవడ్డ నది ధర్మమయౌను, ప్రజాళిసౌఖ్యముం
దలపక యాత్మ భోగపరతం జరియించు వసుంధరాపతుల్
ఎలువురు లోకకంటకులు పాలనసేయగ శాంతి గల్గునే' 34 అని వ్యాఖ్యానించి తమ ఆవేదనను వ్యక్తము చేసినారు ఈ సందర్భములో రెడ్డిగారు దేశాభిమానిగా, సంఘ తాత్త్వికులుగా మనకు కనిపించెదరు

చివరకు స్వాతంత్ర్యము వచ్చుట తథ్యమని తెలియజేయుటకుగాను యువకుని ద్వారా తల్లి శృంఖలముల విడిపింపజేసినారు

స్వాతంత్ర్యసముపార్జనకు సమస్త భారతజాతి తరతమభేదములు మాని ముందుకు రావలసినదిగా వారు ప్రబోధించినారు

## (c) కడపటి వీడ్కోలు

**రచనా కాలాదులు** -

దీనిని దువ్వూరివారు 1922లోనే రచించిరి కాని ప్రథమ ముద్రణమును మాత్రము 1924లో పొందినది ఈ కావ్యము దువ్వూరివారి రచనలలోనే తల

మానికమని చెప్పవచ్చును రెడ్డిగారు దీనిని 'The last farewell' అనుపేర ఆంగ్లములోనికి అనువదించుటనుబట్టి వారికి ఈ కావ్యముపై గల అభిమానము తేటతెల్లమగుచున్నది 'కడపటి వీడ్కోలు'ను గూర్చి చర్ల సుబ్రహ్మణ్యశర్మ గారి అభిప్రాయములను పరిశీలించినచో ఈ కావ్యముయొక్క వైశిష్ట్యము మనకు తెలియగలదు

"ఇది వ్రాయునాటికిఁ గవియొక్క శైలి చక్కని పరిపాకమునకు వచ్చుటయే గాక మనస్తత్వ పరిశీలన శక్తియును ఋహనీయ వికాసమును గాంచినది ఏ హేతువు చేతనేని కృతులన్నియు నష్టములై పోయినను, ఈ నూటయేబది పద్యముల కృతి యొక్కటియే రామిరెడ్డి కవి యశస్సుం దిరము సేయఁ జాలియున్నది" 35 దీనినిబట్టి దువ్వూరివారి రచనలలో నీకావ్యమునకు గల స్థానము వైశిష్ట్యము తెలియుచున్నది కవిత్వ రచనలో బాగుగా చేయి తిరిగినతరువాత రచించిన కావ్యమగుటచేత ఇతివృత్త గ్రహణమునందును, నిర్వహణమునందును తమ ప్రత్యేకతను జూపియుండిరి రాయప్రోలు సుబ్బారావుగారి తరువాత వస్వాశ్రయ రీతిలో ప్రణయకవిత్వమును రచించిన కొందరిలోను దువ్వూరి వారొకరు అట్టి రచనలలో 'కడపటి వీడ్కోలు' ఒక ఉత్తమమైన రచన అని చెప్పవచ్చును

## కథాసంగ్రహము -

అది ఒక మునిపల్లె ఉషశ్శోభ లాకాశము నావరించినవి మునికన్యలు వాగునీళ్ళలో స్నానమాడి తడియారని చీరెలతో బుంగలను సందిట బెట్టుకొని ఆశ్రమములకు తిరిగి వచ్చుచుండిరి శారద యను ఋషికన్య తాను తెచ్చిన బుంగను కరడులమీద నుంచి జలక్రీడ లాడ మొదలిడెను ఆటలలో మునిగి బారెడు ప్రొద్దెక్కినదియు ఆమె గమనించలేదు ఇంటికి పోదలచి బుంగను చూడగా అది గాలికి తేలుచు వాగు మధ్యమునకు పోయి ఉండెను దాని తెచ్చుటకై తామర తూడులను ఆలంబముగా చేసికొని లోతునకు పోగా, తూడులు మోపున కాగక యూడి రాగా ఆమె విరుచుకొని వాగుమధ్యలో పడెను

ఆ స్థితిలో సమిధల నేరు కొనుటకు వచ్చి తరుణి వినోదములెల్ల చెట్టు చాటునుండి చూచుచున్న గౌతము డను ఋషికుమారుడు ఆమెను రక్షింపదలచి నీటిలో దూకి వెంట్రుకలను పట్టుకొని తేల లాగుచు మెల్లగా ఇసుక గట్టునకు చేర్చినాడు

గౌతముడును శారదయును బాల్యసఖులు చిరకాల ప్రవాసానంతరము వారిరువురును ఈ రూపముగా కలుసుకొనిరి శారదలో అణగారిన తీయని వలపులు గౌతముని చూడగనే మొలకెత్తినవి తదుపరి ఆమెతండ్రి వచ్చి వారిరువురిని తమ ఆశ్రమమునకు గొనిపోవును తమ కూతును కాపాడిన కారణముగా శారద తల్లిదండ్రు లాతని నెంతయో గౌరవించి ఆతిధ్య మొసగిరి

గౌతమునికి ఇరువది నాలుగు వత్సరములు శారదకు పదునెనిమిది సంవత్సరముల వయస్సు శారదా గౌతములు తరచు ఋష్యాశ్రమములో కలసికొనుచుండిరి గౌతముని శారదయు శారదను గౌతముడును ఒక్క దినమైనను విడువలేనంత స్థితికి వారి వలపు ఎదిగినది

ఆ రోజు వసంత చైత్రపూర్ణిమ తాపసస్త్రీలు వసంతార్చనలు సలుపు ప్రయత్నములం దుండిరి శారదయు ముందుగా గౌతముని తమ గృహమునకు రావించి వసంతార్చనకు సిద్ధమగుచుండెను తోటి నెచ్చెలులు 'సౌందర్యమీయమ్మ పెట్టిన భిక్షంబని' పొగడునంతగా అలంకరించుకొనినది

తరువాత వారు మావిగున్న, అశోకము, మాధవీలతానికుంజములను పూజించి ఒండొరులపై పువ్వుచెండులు, వసంతములు, పుప్పొడులు చల్లుకొన సాగిరి ఈ విధముగా వారు ఆటపాటలతో కాలక్షేపము చేయుచుండ తారక లుదయించినవి తోడి తాపస స్త్రీలు ఒండొరుల పిలచికొనుచు ఆశ్రమముల కేగిరి

శారదాగౌతములు తాము చిన్ననాడు ఆటలాడుకొనిన వాక తటమునుచేరి, అచ్చట వంతెనవలె వాగుపైకి వంగియున్న మావికొమ్మపై నెక్కి కూర్చుండ నదియు ఉయ్యేలవలె జీవ్వటలాడుచుండెను ఆ సమయమున శారద తన హృద్గతమైన వలపును వెల్లడించినది ఋషికుమారుడు చకితుడైనాడు పైగా సౌందర్య పూజనమే పుణ్యమతులకు తగినదనియు, తనది విశ్వప్రేమ యనియు, తన కామెపై పవిత్రమైన ప్రేమ మాత్రమే కలదుగాని కామముమాత్రము కాదనియు తెల్పి, ఆమె ప్రెమను నిరాకరించును

అప్పుడామె భగ్న మనోరథయై కడపటి వీడుకో లిమ్మని కొమ్మపయి నుండి మెల్లగా లేచి నిలబడగా, తపసిపుత్రుడును లేచి 'సుఖంబు లొందుమీ యన వరతంబు ప్రాణసఖి' అని దీవించెను అంత శారద కాలబంధనములవంటి తన బాహువులతో మిత్రుని కంఠమును బిగించినది గౌతముడు బంధనమునుండి

విడిపించుకొన ప్రయత్నించినాడు కాని కాలసర్పములవలె పెనగియున్న ఆ చేతులను విడదీయుట గౌతమునికి సాధ్యము కాలేదు

చివరకు కాళ్ళు జారినవా లేక ఆ కన్నె పడుచు కౌగిటిలో బిగించి కాపెరె నని సఖుని ఈడ్చెనోగాని వారు జలగ వాగులో బడిరి

"ఎంత పుణ్యంబు చేసెనో యీ స్రవంతి

ప్రేమవాంఛల రెంటి జీర్ణించుకొనగ" 36 అన్న కవిగారి వాక్యములతో ఈ కావ్యము విషాదాంతముగ ముగిసినది

## ఇతర ప్రభావములు

ఈ కావ్యముపై రాయప్రోలువారి ప్రభావము కొంతవరకు గలదు కష్ట కమల యందలి కథకును, ఇందలి కథకును కొన్ని పోలికలు గలవు

**పాత్రలలో పోలిక** - రాయప్రోలువారి 'కష్టకమల' లోని కమలకును, దువ్వూరివారి గౌతమునికిని భావములలో కొన్ని పోలికలు గలవు కమలా కుమారులు చిన్నప్పటినుండియు స్నేహము కలిగియుండిరి కుమారుడు చదువు కొరకు నగరమున కేగెను అచ్చట అతని ఊహలు మారినవి స్నేహభావము కామభావముగా మారినది తన వలపును తెలుపుచు లేఖను వ్రాసినాడు స్నేహితుడు తనను వివాహము చేసికొను మనగా కమల కృశించి పోయినది

అట్లే 'కడపటివీడ్కోలు' లో గౌతమ, శారదలు చిన్నప్పటి నుండియు స్నేహభావముతో కలసి మెలసి యుండిరి మధ్యలో కొంతకాలము గౌతముడు ప్రవాసమున కేగును మరల వారు ఎనిమిది సంవత్సరముల తరువాత కలిసి కొందురు శారదలో వివాహ వాంఛలు రేకెత్తును వివాహము చేసికొమ్మని గౌతముని అడుగగా అతడు నిశ్చేష్టుడై వివాహమాడ నిరాకరించును ఇందు దువ్వూరివారి గౌతముడును, రాయప్రోలువారి కమలయు వివాహముమాట ఎత్తగనే వ్యాకులమనస్కులై పోవుదురు కమల కళవళ పడుటకు ఆమె ముగ్ధత్వము కారణము కాగా, గౌతముడు వివాహము తిరస్కరించుటకు అతని విచిత్ర మనస్తత్వము కారణము

**సన్నివేశములందలి పోలికలు** - శారదా గౌతములు వసంతచైత్ర పూర్ణిమరోజున వంతెన వరెనున్న మావికొమ్మపై కూర్చుండి సరససల్లాపములు జరుపుచుండ, అది విషమించి ఇరువురును వాగులో బడి మరణింతురు రాయ

ప్రోలువారి కష్టకమలయందు ఆశ్వయుజ కృష్ణ ద్వితీయనాడు కమల ఉయా లూగుచు ఆన జడ తనకు మృత్యుపాశముకాగా మరణించినది

అదేరోజున శారద గోరింటాకు పెట్టుకొనగా ఆమె పాణితలములు గోళులు ఎఱుపెక్కి అందముగా నున్నవని చెప్పబడినది అట్లే కమల గూడా

"రాత్రి భోజనాల్ సలిపి గోరింటరసము
పాణితలముల కై సేసి పవ్వళించె" 37 ను

కమలా శారదలు ఇద్దరును ప్రాజదుపులవారి బిడ్డలే కమలది ఒక చిన్న పల్లె అదియును మునిపల్లెను బోలినది శారదది మున్యాశ్రమము జన్మ నివా సాదికములలోను వారిరువురు సమానులే ఇట్లు సన్నివేశములందు కొన్ని పోలి కలు గలవు

**అమలిన శృంగార సిద్ధాంతము** - ఇందు రాయప్రోలువారు తృణకంకణములో ప్రతిపాదించిన అమలిన శృంగార సిద్ధాంతము ప్రతిపాదింప బడినది

తృణకంకణములో నాయిక వివాహిత నాయకుడు ఆమెను వలచి విరక్తుడై యున్నవాడు నాయిక, నాయకునికి అమలిన శృంగార మహత్త్వమును గూర్చి వివరించి అతనిని శాంతింపజేయును

మరి 'కడపటి వీడ్కోలు'లో నాయికానాయకులు ఇరువురును అవివాహి తులె ఇందు నాయిక కామభావము గలది నాయకుడైన గౌతముడు లైంగిక సంబంధమైన వాంఛ లేక స్నేహభావమునే వాంఛించినవాడు వీరిరువురి సంభా షణములో 'అమలిన శృంగార సిద్ధాంతము' ప్రతిపాదింపబడినది

"యౌవనమని కామమని సవ్యాధ్వమనుచు
నేమేమొ వంచించితి వింతసేపు
ఇంద్రధనువు చిరంబని యెంచినావె?
చాలుచాలు సంసారవాసనలు సకియ" 38 అని గౌతముడు యౌవనము, కామము మున్నగునవి ఇంద్రధనుస్సువలె క్షణికమైనవని తెలిపియున్నాడు దీనిని బట్టి శాశ్వతముగా నుండునదేది యనగా అమలిన శృంగారమని అన్యాపదేశముగా మనకు తెలియుచున్నది

## కావ్యగత విశేషాంశములు -

**నాయిక సూచన** - దుప్పూరివారు ఈ కావ్య ప్రారంభములోని మొదటి రెండు పద్యములలో కథావాతావరణమును నాయికా నాయకులను ఎంతయో నేర్పుతో సూచించినారు

"అమర పట్టణ మణిమయిద్వారములను
దెఱవ బిరలక్ష్మి పెండ్లికూతురు విధాన
సిగ్గు చిగురెంప వొంగి చూచెడిని యనగ
నావరించె నుషస్స్వర్ణ లంబరమున" 39

ఇందు యౌవనవతియైన కథానాయికయొక్క ముగ్ధహృదయములో మొలకలు పెండ్లికోరికను సూచించినారు నాయికానాయకుల మరణమునకు బీజము ఈ పెండ్లికోరిక నాయిక ముగ్ధహృదయమునందు జనించుటయే మొదటి పద్యము లోనే ఇంతటి గంభీరమైన సూచనను జేసియున్నారు

**నాయక సూచన** - కథానాయకుడు గౌతముడును నాయిక శారద యును బాల్యము నుండియు స్నేహితులు తరువాత వారు విడిపోయిరి మరల ఎనిమిది సంవత్సరముల తరువాత కలిసికొనబోవుచున్నారు ఈ ఎనిమిది సంవత్స రములలో గౌతముడు ఎదగకుండునా? ఒక్క వయస్సులోనే కాదు, అతని భావ ములలో కూడ మెరుగుదల కన్పించుట సహజము అతడు గుర్తింపలేనంతగా ఎదిగిపోయినాడు

"ఆకసపు భిత్తి నదికిన యట్టు లెదిగి
వాగు గట్టుల నీడలు వారు వెదురు
బొదలు తరుణారుణాంశుల బొదలుచుండె
జీవకళ లుట్టిపడియెడి చిత్రముల" 40

ఇందు వెదురుపొదలు ఆకసపు భిత్తినదికినయట్లు లెదిగి వాగు గట్టుల నీడలు వారుచున్నవట నాయకుని మెరుగుదలను వెదురుద్వారా ధ్వనింపజేసినారు అంతియేగాక అతడు బాలుడు కాడు, ఇప్పుడు తరుణుడు అని తెలియజేయుటకు గాను 'తరుణ' అను పదము నుపయోగించినారు

**సౌందర్య తత్త్వము** - ఇందు అందమును చూచి ఆనందించ వలెనేకాని అనుభవింపవలెనను కోరిక యుండుట ఉచితము కాదని తెలుపబడి

నది శారద చెంగలువలను కొన్నిటిని తెగ్రదెంపి తీసికొనివచ్చి గౌతమున కీయ బోవగా నతడు ఆమెను రామణీయకమును భగ్నము చేసితివనియు, దర్శనీయ వస్తువులు నయనానుభావ్యములేగాని స్వకమ్మలు గాదనియు వివరించును

"రమ్యరూపముగన్న కారణమువలన
నిట్టి శిక్ష సువస్తువుల కేల సకియ ?
సరళ సౌందర్య మాత్మ నాశకమయేని
మాఱదే శ్మశాన మటు నీ మధుర ప్రకృతి" 41 అన్న గౌతముని వాక్య ములలో సౌందర్యతత్త్వ మిమిడియున్నది

**విశ్వప్రేమ** - శారద తన్ను వివాహమాడవలసినదిగా కోరగా గౌత ముడు తన విశ్వప్రేమను వ్యక్తపరచును ఆ సందర్భమున-

"విశ్వమెల్ల తనదిగ భావించు ప్రేమ
గలుగ, నేకాశ్రితంబైన కామమేల
చిన్ననాటి యజ్ఞానంపు జిన్నెలెల్ల
మఱచిపొమ్మ, ప్రేమింతు నిన్నిరత మతివ" 42 అని ఏకాశ్రితమైన కామమును నిరాకరించినాడు అంతియెగాక రమ్య ప్రకృతులైన రసార్ద్రికల విపంచీ రహస్య తంత్రులను మీటు ముద్దు సెలయేరు, ముగ్ధమగు ఆటవిక గాన ముల చేయు కోకిలలు, చిత్రకిమ్మీర వర్ణరంజితములైన జలదశకలము లలరారు సంధ్యలు మున్నగువానిని ప్రేమించి, చూచి ఆనందమొందుదునుగాని వాని నెపుడు కామింపననియు పల్కును దీనివలన గౌతముని విశ్వప్రేమతత్త్వము ఎటు వంటిదో మనకు తెలియుచున్నది మరికొందరు గౌతముడే రామిరెడ్డి యని భావించుచున్నారు అట్లయిన ఇది దువ్వూరివారి విశ్వప్రేమకు తార్కాణమగును

షెల్లీ కవితాతత్త్వమార్గమున ఏకమునకన్న అనేకమే అనుభవానంద సిద్ధికి ఎక్కువ ఉపకరించును ఈ సిద్ధాంతమే ఇందు గౌతముని పాత్రద్వారా నిరూపింపబడినది

రవీంద్రుని దృష్టిలో సహజముగా పురుషుడు బంధవిముక్తివైపునకు, స్త్రీ బంధానురక్తివైపునకు ఎక్కువగా మొగ్గుచూపుదురు ఇందు గౌతముడు బంధ విముక్తిని కాంక్షించగా శారద వివాహబంధము నభిమానించినది ఈ చిత్త వృత్తుల విలక్షణత్వమే శారదా గౌతముల మరణమునకు దారి తీసినది

మొత్తముమీద కొంతవరకు రాయప్రోలువారి పాత్రలు, సన్నివేశములు మున్నగువాని ప్రభావమున్నను ప్రణయకావ్యములలో మంచి పేరుప్రఖ్యాతులను కడపటివీడ్కోలు సంపాదించుకొనినది అందుచేతనే దువ్వూరివారి ఇతర కావ్యములు నశించిపోయినను ఈ ఒక్క కృతి మాత్రమే వారిపేరు స్థిరము చేయజాలియుండును- అని దర్భా సుబ్రహ్మణ్యశర్మగారు 43 వ అభిప్రాయమును వెలువరించిరి

## (ii) నీతి బోధాత్మకములు

నీతులను ప్రధానముగ బోధించు కావ్యములను నీతి బోధాత్మకములు అనవచ్చును ముందుగా కథలను చెప్పి తద్వారా నీతులను ఉపదేశించుటవలన అవి సామాన్య మానవుని సహితము ఆకర్షింపగలుగును అందువలన అతడు ఏది మంచి ఏది చెడు అను విషయమును నిర్ధారించుకొని ఆయా నీతులను సాధ్యమైనంతవరకు ఆచరణలో పెట్టుటకు ప్రయత్నించును అనగా నీతిబోధాత్మకములైన కావ్యములు సంఘమునందలి మానవులను సన్మార్గవర్తనులుగా చేయుటకు ఉపకరించునన్నమాట

చిన్నపిల్లలకు మనము కేవలము నీతులను చెప్పినచో అవి వారి మనస్సులలో నాటుకొనవు ముందు ఒక కథను జెప్పి తద్వారా దానియందలి నీతిని ఉపదేశించినచో పిల్లల హృదయములందు నాటుకొనిపోయి, అవి వారి భవిష్యత్తునకు పునాదులు కాగలవు కావున నీతికథలయొక్క ప్రాముఖ్యము సమాజమున కెంతయేనియు గలదని చెప్పవచ్చును

పారశీభాషలో సాదీమహాకవి నీతుల నుపదేశించు కొన్నివందల కథలు గల కావ్యములను వ్రాసిరి అవి గులిస్తాన్, బోస్తాన్ అనునవి ఇవి దాదాపు ప్రపంచమందలి అన్నిభాషలలోనికి అనువదింపబడినవి ఈ నీతుల ప్రాధాన్యమును గుర్తించిన దువ్వూరివారు కూడ వానిని గులాబితోట, పండ్లతోట అను పేర్లతో యథాతథముగా ననువదించి తెలుగుప్రజల కెంతయో మేలు గావించిరి ఇందలి కథలు ముఖ్యముగా ఆనాటి ఇరాన్ నందలి ప్రజల జీవితాదులకు సంబంధించినవే అయినను నీతులు మాత్రము సార్వజనీనములు, సార్వకాలికములునైనట్టివి

## (a) గులాబి తోట

### రచనా విశేషములు :-

ఈ కావ్యము దువ్వూరివారిచే 1933 లో ప్రారంభించబడి 1934 లో పూర్తి గావింపబడినది పారసీక సాహిత్యములో ప్రముఖుడగు సాదీమహాకవి రచించిన 'గులిస్తాన్'నకు ఇది అనువాదము దీనిని రెడ్డిగారు గద్యపద్యాత్మకముగ రచించిరి ఇందలి పద్యములు కూడ వచనమువలెనే సుబోధకములుగ నుండును మొదట మధురమైన వచనముతో ప్రారంభించి అందమైన ఒక చిన్నకథను చెప్పి మనకు అపురూపమైన ఆనందమును కల్గింపజేయును వెంటనే అవ్యవధానముగ ఒక పద్యమును జెప్పి దానిద్వారా పైన జెప్పిన కథయందలి అంతరార్థమును బహిర్గతము గావించును అటువంటి చిన్నకథలు ఈ గ్రంధమున లెక్కకు మిక్కిలిగా నున్నవి

పారసీకభాషలోని భావప్రశస్తిని తెలుగుచదువరు లెల్లరు తెలిసికొనుటకు వీలుగా సాదీమహాకవి కావ్యమును దువ్వూరివారు తెలుగు జేసినారు రామిరెడ్డిగారే "గులిస్తానులోని కొన్ని సందేహములను తీర్చుకొనుటకును, సంప్రదాయసిద్ధమైన ఉచ్చారణము నలవరచుకొనుటకును, నేనా సాహెబు (హబిబుల్లాసాహెబు) గారి యొద్దకు పోవుచుంటిని' 44 అని తమ డైరీలలో తెలిపియున్నారు దీనిని బట్టి దువ్వూరివారు పారసిని బాగుగా నభ్యసించినతదుపరి సాదీగారి కావ్యములను యధాతధముగ తెలుగుచేయుటకు సంకల్పించిరనియు ఏపైన సందేహములు వచ్చినయెడల హబిబుల్లాసాహెబుగారిద్వారా తీర్చుకొని ఈ రచనను గావించిరనియు తెలియుచున్నది

'గులాబితోట'యందు ఎనిమిది అధ్యాయములు గలవు ఇవి స్వర్గమునకుగల అష్టద్వారములకును సంజ్ఞలు ఇందలి కథలు గులాబిపుష్పముల వంటివి ఇవి దయామయుడగు భగవంతునకు సంజ్ఞలు సాదీయే-

గ్రంధ రచనాపద్ధతి అధ్యాయాలంకరణ విన్యాసక్రమము, సంగ్రహ వచోబంధము చక్కగ నాలోచించి శోభావంతమైన యీ 'గులాబితోట' అష్టద్వారయుతమైన స్వర్గమును బోలునట్లు అష్టాధ్యాయిగా నొనర్చితిని పరితలకు విసుగువేసటలు కలుగకుండునట్లు గ్రంధమును సంక్షేపించితిని " 45 అని చెప్పుకొనియున్నారు.

ప్రపంచ పర్యటన వలన ప్రాప్తించిన అనుభవముతో సాదీమహాకవి సామాన్యమైన సంఘటనలతో, శాశ్వతమైన జీవిత సత్యములను చిన్నచిన్న కథల ద్వారా చిత్రించి గద్యపద్యములలో గులస్తాన్ అను కమనీయ రచనను చేసి యున్నారు అట్టి 'గులిస్తాన్' గ్రంథము కవికోకిలదృష్టికి తగిలి, వారిచే తెలుగు లోనికి 'గులాబితోట' అనుపేర అనూదితమగుట మన ఆంధ్రుల అదృష్టముగా భావింపవచ్చును

## గ్రంధ రచనా హేతువు -

సాదీ తన మిత్రునితో కలిసి వసంతకాలమురో ఉద్యానవనములో విహ రించుటకై బయటికి వెడలెను ఎర్రని గులాబీలు విరబూచి కలకలలాడుచుండెను తోటయందు మిత్రునితో ఆ రేయి గడుపవలసివచ్చినది తరు లతలు అల్లిబిల్లిగ అల్లుకొనియుండుటచేత ఆ ప్రాంతము చూచుటకు మనోహరముగ నున్నది ప్రొద్దుపొడుపున ఇంటికి పోదలచిన తన మిత్రుడు పన్నీరు పూవులను ఇతర కుసుమములను కోసికొనగా అతనితో సాదీ 'తోటలోని గులాబీలు ఎంతకాల ముండునో నీ వెరుగుదువు పూలతోట యదను గూడ నమ్మరాదు ఎటులెనది నశ్వరమైన దానిపై మనసుపెట్టుట యుచితముగాదని పండితులు జెప్పుదురు" 46 అని పల్కెను అంత మిత్రుడు గత్యంతరమేమని ప్రశ్నించెను అంత సాదీ "చూచువారికిని దగ్గరనున్నవారికిని సంతోషము కలిగించు గులాబితోట' యను గ్రంధమును నేను రచింపగలను ఆ గులాబితోటయాకులు శరన్మారుత నిరంకు శత్వమునకు పాల్పడవు కాలచక్రపరిభ్రమణము ఆ యుద్యానవన వసంతశోభను శరత్కోపమునకు గురిచేసి మార్చలేదు" 47 అని పల్కెను

తత్కారణముగ 'గులాబితోట (గులిస్తాన్)' అను గ్రంథమును పారసీక భాషలో రచించెను ఈ గ్రంథమును ఎన్నటికి నాశనములేని విధముగా రచించు చున్నట్లు ఆతని మాటలవలన తెలియుచున్నది దీని రచనకు సాదీ తన జీవిత మున ఎక్కువభాగమును వెచ్చించిరి

## అధ్యాయ విభజనము ఇందు

| | |
|---|---|
| ప్రథమాధ్యాయమున | పాదుషాల ప్రవర్తనమునకు |
| ద్వితీయాధ్యాయమున | దరివేసుల శీలమునకు, |
| తృతీయాధ్యాయమున | సంతృప్తికి, |

| | |
|---|---|
| చతుర్థాధ్యాయమున | మౌనమువలని లాభములకు, |
| పంచమాధ్యాయమున | ప్రేమ యౌవనములకు |
| షష్ఠాధ్యాయమున | వార్ధక్య దౌర్బల్యమునకు |
| సప్తమాధ్యాయమున | విద్యాప్రయోజనములకు, |
| అష్టమాధ్యాయమున | సాంఘికధర్మ, నిర్వర్తన విధులకు |

సంబంధించిన నీతులు కథలపూర్వకముగ వివరింపబడినవి

## ప్రథమాధ్యాయము -

1 తాను చెప్పినట్లు తప్పక వర్తించు నృపుని కెవ్వడేని మంచిమాటదప్ప మరి యేమిచెప్పిన కీడు తెచ్చును అఘము వచ్చును 2 కాయ ముండగనే లోకోపకారములు చేయుట మంచిది 3 తెలివిగల బక్కవాడొక తెలివిలేని స్థూల కాయుని కంటె మేలు 4 శిక్షణమున దుష్టచిత్తుడు సజ్జనుండు కాడు 5 ధన వంతుల ధనము, గౌరవము యశము ఎప్పుడు తగ్గునా అని ఎదురుచూచు మంద భాగ్యుడు తీరని కోరికతో నిరీక్షించుచుండును 6 జన విరుద్ధముగా నేలు మనుజ విభుడు తన ప్రభుత్వపు మూలబంధమును తానే త్రవ్వుకొనును 7 వ్యాధి గ్రస్తుడు కాకపూర్వము శరీరారోగ్యము విలువ ఎవ్వరికిని తెలియదు 8 బ్రతుకు జ్ఞానసంపాదనమునందు గడుప మేలగును 9 నినుగని భీతిచెందు మనుజుని చూచి భీతిలుము 10 ఒరుల యాపద కెదగరగని వాడు మనుజుడు కాడు 11 జనుల బాధించుటకంటె చావు మేలు 12 ఎవని జాగర్యకంటె నిద్ర మేల గునో అట్టి దుష్టుని జీవితము నశించుట మేలు 13 ఎచట తియ్యని సెలలూరునో అచట మనుజ, పశు పక్షి, కీటకములు జేరును 14 యుద్ధభటులకు జీతమును, ఎత్తెమును సరిగా నియనియెడల వారు మఱియొకచోటి కేగుదురు 15 మహితుల నామము మలినముచేయు కుమతిని పెద్దలు పండితుడని పేర్కొనరు ఈ విధ ముగా నలుబదియొక్క నీతులు కథలపూర్వకముగా నీ అధ్యాయమున వివరింప బడినవి

## ద్వితీయాధ్యాయము -

1 చెడ్డవాడు ఇతరుల తప్పులు నీవద్ద చెప్పునట్లుగనే, నీ తప్పులు కూడ ఇతరులవద్ద చెప్పును 2 వ్యర్థ గర్వావగుంఠనముచేత వాది తాను తనకన్న అన్యమును దలపలేడు 3 బాహ్య ప్రవర్తనము కంటె చిత్తనైర్మల్యము

ముఖ్యము 4 జ్ఞాని స్వవిధి వర్తిల ఇహపరాతీతపదవి నొందును 5 భావములు శ్రోతలకు బోధపడకయున్న వక్త శక్తి లోపంబని చెప్పవచ్చును 6 ఎడద నొవ్వని దాసుడు ఏ అభుము నలిపెనో అన్న చింతయే మదిని కలచును 7 కష్ట సంప్రాప్తికి మనము కలతచెంది బలము ధైర్యము విడుచుట పాడిగాదు 8 దైవభక్తుడవై కొలువదలచినయెడల దైవమును దప్ప వేరొకని తలపరాదు 9 యాచకులకు ఉన్నదానిలో లెదనక ఇమ్ము 10 తేనెవాతెరవువుబోణి తియ్య బలుకు రాగయుతమైనను, కాకున్నను రమ్యమగును మున్నగు విధములుగా దరి జేసుల శీలమునకు సంబంధించిన ఈ అధ్యాయమున నలుబదియేడు నీతులు కథల పూర్వకముగ వివరింపబడినవి

## తృతీయాధ్యాయము -

1 ఓర్పులేక జ్ఞానము లేదు 2 ప్రజల కష్టపెట్టు బల మీయనందులకు దేవదేవుని ఋణము తీర్పలెము 3 ఆయురారోగ్యములు భోజ్యమందు గలవు 4 తిండిపోతు తినుటకే బ్రలుకును, ప్రాజ్ఞుడు బ్రతుకంగ ప్రార్థింప దినును 5 కొలదిపాటిగ తినువాడు కొండంత కష్టములనైనను సులువుగా గడచిపోవును 6 ఆకలెత్త రొట్టె అమృతమగును 7 కటికవాని వసూలు నిక్కచ్చి కంటె ఆమిషపుటాస మరణించుట శుభమగును 8 సంతసము వెలిబుచ్చెడు సంసుచేరి చేదు సొరకాయ తినుట మేలు 9 పాడు యాచనకంటె పస్తుండుట మేలు 10 ఏడ్పుమొగమువానిని ఏమియు అర్థించకు 11 ఎంత ఆదాయమున్నను అధమునొద్ద చేయి చాపకుము 12 తిన మెలుకులెని పెడకు గెనుసుదుంప తృప్తి కలిగించును 13 మంచిమాటల ఫలము లభించకున్న బలిమికార్యము సాధింపవలసివచ్చును ఈ విధముగా సంతృప్తికిచెందిన ఈ అధ్యాయములో ఇరు వది ఎనిమిది నీతులు కథలతో చెప్పబడినవి

## చతుర్థాధ్యాయము -

1 ఎప్పుడును వైరుధ్య కలుషితదృష్టి జూడ ఒప్పులును కొండంత తప్పు లట్లు దోచును 2 వచింపదలచినదానిని ప్రమాణీకరించి తగ జెప్పవలెను 3 ఇరువురు ప్రాజ్ఞు లెప్పుడును కలహింపరు, 4 మధురమైనను, విశ్వాసపాత్ర మైనను పునరుక్త భాషణము ప్రమద మొసగదు 5 తెలిసినంతమాత్రమున ప్రాజ్ఞుడు పరుషతోడ నెట్టి వార్తలనైన పలుకడు 6 ఇంట నేమైనదియు ఎరుగ

లేనివారు గగన గుప్తము నెట్లు కనిపెట్టగలరు 7 ఎవడైన తన తప్పు లెరిగించు దాక తన తప్పు నొప్పని అజ్ఞుడు తలచును ఈవిధముగా మౌనమువలని లాభములను ఈ అధ్యాయమున పదునాలుగు నీతులు కధలరూపముగా చెప్పబడినవి

## పంచమాధ్యాయము -

ప్రభువునకు ఇష్టుడైన ఎవడైనను తప్పులొనరించినయెడల అవి యన్నియును ఒప్పు లగును 2 దాసి ప్రేయసి యయ్యేనేని చెనటి యజమాని చెంపకు చేటు మూడును 3 ప్రణయభూపాలు డెచ్చోట పదములిడునో అట్టిచోట భక్తి భుజములకు పట్టులేదు 4 ఒప్పొక్కటి యుండి డెబ్బది తప్పులున్నను ఒప్పొక్కటి తప్ప సఖుడు మరెద్దియు చూడడు 5 ఆరోగ్యవంతుడై అలరు మానవుడు వ్రణబాధ తత్త్వమును భావింపలేడు 6 తప్పు చేయనివాడు ధరలోనలేడు ఒరుల తప్పుల చూపి పరిహసింపకుము- అను విధముగా ప్రేమ యౌవనములకు సంబంధించిన ఈ అధ్యాయమున ఇరువది నీతులు కధాపూర్వకముగ వివరింపబడినవి

## షష్ఠాధ్యాయము -

1 ఉలుకు దిన్న కొయ్యటు దేహ ముదుటు దక్క మందు మాకులు, మంత్రములు ఎందుకెక్కు 2 పాటలాధర ముద్దునోట వెలువడిన ఉల్లివాసనయైనను ఒప్పిద మగును 3 తరుణి బలమును గోరును నీ ధనము గాదు- అను విధముగా ఈ అధ్యాయమున ఎనిమిది నీతులు కధలతో చెప్పబడినవి

## సప్తమాధ్యాయము -

1 సహజబుద్ధి శక్తిసంపద యున్నయెడల శిక్షణంబున మేలు చెందవచ్చును 2 బ్రతుకు సుఖముగ బుచ్చినవాడు పరుల కటికి రాపిడికి ఓర్చుట కష్టము 3 పసితనమున సద్వృత్తి పట్టుబడినయెడల పెద్దతనమున భాగ్యము వీడకుండును 4 నాన్న దయకన్న గురువు దండనము మేలు 5 తుచ్ఛ భోగుడు, అదృష్టమత్తుడు లేమిడిదినముల ఇక్కటులను ఎప్పుడును తలఁడు 6 స్వాతి చినుకులు పలుచోట్ల బడినను శుక్తిగర్భమునందె ముత్య మావిర్భవించును 7 బంధుమిత్రుల నమ్మని పామరుడు పండితుల స్నేహదృష్టికి బాహ్యుడగును 8 గర్భవతియైన గృహిణి ముష్కరులు, దుష్టులునైన పుత్రుల ప్రసవించునంతకంటె పాముల గాంచుట మిక్కిలి మేలగును 9 సరియని నీ బుద్ధి

స్ఫురియించుదాక ఎట్టిమాటలైనను మాటలాడకుము 10 జ్ఞానసంపన్నుడు ముఖ్యము లగు కార్యములను కొరగానివానిచెత ఎపనిపెట్టడు ఇత్యాదిగా విద్యాప్రయోజన ము లను ఈ అధ్యాయమున ఇరువది నీతులు కథారూపముగ చెప్పబడినవి

## అష్టమాధ్యాయము -

1 జీవితంమెల్లను ధనరాశి చేర్చి కూర్చి తాను కుడువక ఇతరులకు దాన మిడక చచ్చిన హీనునిగూర్చి దేవదేవుని ప్రార్థింపపలదు 2 శాస్త్రజ్ఞానము పరాధివృద్ధికొర కేర్పడినదిగాని లౌకిక విషయివాంఛ లనుభవింపజేయుటకుగాదు 3 రాజ్యము వివెకసంపన్నులగు పండితుల మూలమున శోభించును 4 చెడ్డవారిని కరుణించుట, మంచివారిని శిక్షించినట్లగును 5 విరోధులతో చెలిమి పాటించు వాడు స్నేహితులను కష్టముల పాలు జేయును 6 అన్ని ఉపాయములు వ్యర్థ మైనపుడు మాత్రమే ఖడ్గమును చేబూనుట న్యాయమగును 7 బలహీనుడైనను శత్రువుపై దయ జూపకుము 8 విరోధి సిపాయిలలో అన్యోన్యవిభేదములు పుట్టె నని తెలిసినయెడల నీవు నిర్విచారముగ నుండుము 9 వృద్ధురాలైన వెలయాలు తన వృత్తినిగురించి పశ్చాత్తాప పడును 10 ఉండి అనుభవించలెనివారును తెలిసి యాచరింపలెనివారును మరణించినలటువాల వారితోడ దుఃఖమును గొంపోవుదురు ఈవిధముగా సాంఘిక ధర్మ నిర్వర్తన విధులను ఈ అధ్యాయములో సూటయదు నొకండు నీతులు తెలుపబడినవి

ఇట్లు ఈ కావ్యమున జీవితమునందలి అన్ని కోణములకు సంబంధించిన నీతులు కథలపూర్వకముగ వివరింపబడినవి

## (b) పండ్లతోట

### రచనా విశేషములు :-

ఇది 1940-'44 మధ్యకాలములో రచింపబడినది పారశీభాషలో సాదీ మహాకవి రచించిన 'బోస్తాన్' నకు ఇది తెలుగు అనువాదము మూలములో పది అధ్యాయములతో నుండగా చతుర్థాధ్యాయమున కొంతవరకు మాత్రమె దుప్పూరి వారిచేత అనువదింపబడినది వారు ఎంత త్వరత్వరగా పూర్తి చేయదలచి నప్పటికిని పూర్తి కాకమునుపె మృత్యుదేవత వరించినది రెడ్డిగారు 'పండ్లతోట'ను ద్విపదమాలికగా రచించిరి

"కరమున కండచక్కెర లేదు గాని
అంతకన్నను తీయనైన కావ్యంబు
గలదు, సామాన్యమౌ కలకండ గాదు
జ్ఞానవంతులు పుస్తకంబుల పుటల
పదిలంబు చేసిన భావసంపత్తి" 48 అని సాదీ మహాకవియే ఈ కావ్యమును కండచక్కెరకంటె ఎక్కువ తీయనైన కావ్యముగా వర్ణించిరి అంతటి మాధుర్యము కలదగుటచేతనే దుప్వారివారు బోస్తాన్'ను అనువదింపదలచిరి కాని ఆంధ్రుల దురదృష్టవశమున పూర్తి చేయకమునుపే వారు యశఃకాయులైరి

మూలములో మొదటి అధ్యాయమున న్యాయము, అభిప్రాయనిర్ణయము, ప్రజాదరణము రెండవదానియందు అనుగ్రహలబ్ధి మూడవదానియందు ప్రేమ నాలుగవదానిలో వినయము ఐదవదానిలో తుష్టి ఆరవదానియందు తృప్తిపరులైన ధన్యుల వర్ణనము ఏడవదానిలో విద్యా శిక్షణము ఎనిమిదవదానిలో సౌఖ్యమారోగ్యమిచ్చు సర్వేశునకు కృతజ్ఞత తెలిపికొనుట, తొమ్మిదవదానిలో సరిత్రోవ పట్టుట పశ్చాత్తాపపడుట పదవదానిలో ప్రార్థనమునుగూర్చి పరిగణించుట, గ్రంథోపసంహార కథనమును గలవు

ఈ పది అధ్యాయములును మానవునకు దశ శిక్షాద్వారములు ఈ విషయమును సాదీయే

"నృప సౌధమౌ దీని నిర్మించునపుడు
ఘటియించితి దశ శిక్షా ద్వారములను" 49 అని చెప్పుకొని యున్నారు

ఈ బొస్తాన్ (పండ్లతోట) రచనలో అనుసరింపబడిన శిల్పము గులిస్తాన్ (గులాబితోట) రచనతో పోల్చి చూచినయెడల అంత విశిష్టమైనదిగా కానుపించదు అయినను ఈ గ్రంథము ఉత్తమగ్రంథముగా రాణించుటకు అవసరమైన విషయసంపదను కలిగియున్నది సాదీ తనకు గల మహత్తరమైన అనన్యసామాన్యమైన లౌకికజ్ఞానము సమస్తమును ఈ కావ్యమాధారముగ పాఠకులకు అందించినారు

## ప్రథమాధ్యాయము -

1 చిరుతపులిపై స్వారి చేయు మహాత్ముడు సాదీ 2 నౌషీరవాను హుర్మ్మజునకు నీతిచెప్పుట 3 ఖుస్రు షీరూయాకు నీతి చెప్పుట 4 దొంగల

మధ్య చిక్కిన వణిజుడు 5 ఖుర్రూ షాపూరుల కథ 6 నరపశులు ముందు వెనుక లాలోచించుట, దండనమున ఆలసించుట, 7 జంషీదు శాసనము 8 రాజు, మందకాపరి 9 రాజు ప్రజల మొర వినుట 10 బిచ్చగాని పలుకులు 11 కరవు కాలమున రత్నాంగుళీయక మమ్మి ప్రజల పోషించిన రాజు 12 తక్లాప్రభువున కొక పుణ్యాత్ముడొసగిన హితోపదేశము 13 రూము సుల్తాను ఒక పండితునితో తన స్థితిని జెప్పుట 14 జనకంటకుడు సన్న్యాసి యనుగ్రహము వేడుట 15 స్వార్థపరుడైన వర్తకుడు 16 కీర్తి సంపాదించిన యన్న ధనము సంపాదించిన తమ్ముడు 17 కొమ్మనెక్కి దాని మొదలు నరకు మూర్ఖుడు 18 బావిలో పడిన జనకంటకుడు 19 హుజ్జాజు యూసపును ధిక్కరించిన సజ్జనుడు 20 కుమారునకు తండ్రి హితబోధ 21 నాయకుని నిర్ణిద్రల 22 నారికురుపుతో బాధపడు సుల్తాను 23 రాజ్యసంపదల చంచలత్వము 24 తండ్రి మరణము, కుమారుని పట్టాభిషేకము 25 బలాత్కార పాలనము నిందలపాలు మున్నగు ఉప విభాగములతో న్యాయము, అభిప్రాయము, ప్రభుత్వనిర్వహణము ఈ అధ్యాయమున వివరింపబడినవి

## ద్వితీయాధ్యాయము -

1 అనుగ్రహము, 2 అనాథబాలురపై కనికరము 3 సత్కార్య ఫలము 4 పైగంబరుల స్వభావ మర్యాదలు 5 ఉత్తమాధమ విభేదములేక దయ చూపుట 6 పుణ్యాత్ముడు, వంచకుడు 7 పిసినిగొట్టు తండ్రి, త్యాగశీలుడైన కుమారుడు 8 మక్కా యాత్రికుని భక్తి 9 ధనములేని త్యాగి 10 దైవసృష్టిలోని ప్రాణికోటులపై దయ జూపుట 11 కలిమిలేముల మార్పు దరిద్రుడైన ధనికుడు, ధనికుడైన దరిబేసి 12 పిల్లి బూతదయ 13 ఔదార్య ఫలితము 14 కారుణ్యము వలన హృదయమును బంది చేయుట 15 కాలుసేతులు లేని నక్క దరిబేసి 16 లోభియైన దరిబేసి 17 హాతీము త్యాగమును తుర్కీ సుల్తాను పరీక్షించుట 18 హాతీముతాయిని 'యమను' పాదుషా పరీక్షించుట 19 హాతీముతాయి చక్కెరమూటను దానమిచ్చుట 20. పాదుషాల క్షమ 21 పుణ్యాత్ముడైన దరిబేసి, నీచుడైన భాగ్యవంతుడు 22 పుణ్యాత్ముల నన్వేషించుట 23 బిడారులో పుత్రుని వెదకిన తండ్రి 24 ఒంటెల శాలలో ఊడిపడిన రత్నము 25 పిసినారి తండ్రి, దూబరదిండి కొడుకు

26 చిన్నదానమునకు పెద్ద యుపకారము 27 మంచి పనికి మించిన ఫలము దండనీతియందు రాజులకు హితవు 28 అపాత్రులకు సహాయము చేయుట కీడు తెచ్చును 29 బ్రహ్మని ముందుదృష్టి మున్నగు విధములుగా దైవనీతి, ప్రజాదరపాలనము ఈ అధ్యాయమున చెప్పబడినవి

## తృతీయాధ్యాయము -

1 ప్రేమ 2 లౌకిక దైవిక ప్రేమలు 3 బిచ్చగాని పుత్రుడు రాచ పుత్రుని ప్రేమించుట 4 త్యాగశీలమైన ప్రేమ 5 ప్రేమబద్ధుల వృత్తము 6 ప్రేయసుని నిరాకరించిన సమర్థండు యువతి 7 ప్రేమతత్పరుల బలి దానము మరణమును అదృష్టమని ఎంచుట 8 ఫకీరుల యోర్పు, పట్టుదల 9 యదార్థభక్తుడు దౌర్జన్యమువలన వెనుతిరుగడు 10 కుమారునకు తండ్రి నీతిబోధ 11 ఎవని వియోగము దుస్సహమో వాని దౌర్జన్యము నోర్చుకొనుము 12 స్నేహితుని దర్శనము వ్యాధి బాధకంటె మేలని తలంచుట 13 తెలివిపై వలపు ప్రభుత్వము 14 ప్రేయసి దృష్టిలో ప్రియుని యోగ్యత 15 లైలాపైని మజ్నూను ప్రేమ 16 అయాజుపైని సుల్తానుమహమ్మదు ప్రీతి 17 దృశ్య ప్రపంచముయొక్క అస్థిరత 18 పల్లెటూరి బాలుని లోకజ్ఞాన శూన్యత 19 మిణు గురు పురుగు 20 అతబల్ సాదు బిన్ జంగీని దీవించిన ఫకీరు 21 పుణ్యాత్ముడైన ప్రేయసుడు 22 పుణ్యాత్ముల ఆనందము 23 వేణుగాన మొనరించిన కుమారుడు 24 మైనపువత్తి దీపముపై మిడుత వలపు 25 మైనపువత్తి దీపము నకును మిడుతకును జరిగిన సంభాషణము- ఇత్యాదులు ప్రేమ అను ఈ తృతీయాధ్యాయమునందు చెప్పబడినవి

## చతుర్ధాధ్యాయము -

1 నమ్రత 2 అణకువవలన ఔన్నత్యము 3 దైవభక్తులు తమ్ము తాము నిచముగ నెంచుకొనుట 4 సుల్తాన్ బాయ జీద్ బుస్తామి నమ్రత 5 గర్వముయొక్క అంత్యము 6 ఏసుక్రీస్తువు - పాపి 7 పండితుడైన దర వేసి - గర్వితుడైన ఖాజి అనునవి చతుర్థాధ్యాయమున గలవు ఈ చతుర్థాధ్యాయము కొంతవరకు మాత్రమే అనువదింపబడినది

## (11) కృష్యాది గ్రామ జీవనాధారములు (*Pastorals*)

### Pastoral Poetry నిర్వచనము

Pastoral అనగా of shepherds and country life 50 అని అర్థము

యూరోపియన్ సాహిత్యములో రెండువేల సంవత్సరముల కాలమున్న పాస్టొరల్ అలెగ్జాండ్రియన్ పిరియడ్‌తో మన దేశములోనికి వచ్చినది

"The pastoral imitates rural life, usually the life of an imaginary golden age in which the loves of shepherds and shepherdesses play a prominent part" 51

ఈ నిర్వచనము ప్రకారము pastoral అనునది గొల్లవారియొక్క సంబంధించిన గ్రామీణ జీవన చిత్రణముగా చెప్పుకొనవచ్చును

కాని pastoral రీతికి పితామహుడైన Theocrites కృషీవల గీతాదులను గురించి వ్రాసెను

"He (Theocrites) presented real peasants chatting, telling tales, singing, and making love" 52

అంతియేగాక Wordsworth 'Michael' అను కావ్యములో కాపుల జీవితమును కథావస్తువుగా చేసికొని వారి కష్టసుఖములను చిత్రించిరి పల్లియుల పలుకులె గాక వారి భాషయును యోగ్యమైనదే యని నిరూపించిరి

పాస్టొరల్ కావ్యములకు గొప్ప ప్రతిష్ఠను సూర్చిన వర్జిల్ మహాకవి ఒకప్పుడు కృషీవలుడు దివ్యసౌఖ్యమున ఓలలాడినట్లు ఒక సువర్ణయుగమును కల్పించినాడు ఈ పైమూడు కారణములను దృష్టిలో నుంచుకొనినచో కృషీవలులకు సంబంధించినది ఏదియైనను ఇంచుమించుగా Pastoral Poetry లోనికి చేరవలయును

"It must be admitted however, the term has been and still is used to designate any treatment of rural life" 53

దీనినిబట్టి గ్రామీణ జీవనమును చిత్రించిన కావ్యము లేవియైనను Pastoral Poetry కావలయును

పాశ్చాత్యదేశములలోని గ్రామీణవృత్తులలో గొఱ్ఱెల కాపరికము ముఖ్యమైనది కాని మనదేశము వ్యావసాయికదేశ మగుటచేత గ్రామీణవృత్తులలో కృషి

ప్రధానమైనది కొందరు Pastoral poetry ని కృషిక కవిత్వమనియు 54, మరికొందరు గోపకావ్యములనియు 55 అర్థములు చెప్పిరి సమిష్టిమీద ఆలోచించినచో కృష్యాది గ్రామజీవన చిత్రణ కావ్యము లన్నియు Pastoral poetry క్రిందకు వచ్చునని విస్తృతార్థమును చెప్పుకొనుట సమంజసమేమో అనిపించుచున్నది అప్పుడు కర్షక కవిత్వము గోప కవిత్వము మున్నగునవి Pastoral poetry లో అంతర్భూత మగును

పైన జెప్పుకొనిన విస్తృతమైన నిర్వచనము ప్రకారము దువ్వూరివారి వనకుమారి కృషీవలుడు కావ్యములు నిస్సందేహముగ కృష్యాది గ్రామజీవనాధారములలో జేరును

కృషీవలుడు' కావ్యమునకు ఉపోద్ఘాతమును వ్రాయుచు ఆంగ్లభాషా నిష్ణాతులైన శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు "పాశ్చాత్య భాషలలో 'పాస్టొరల్స్' నాబడు పశుపాల్యాది గ్రామాంతర వృత్తుల వారి అకృత్రిమ జీవిత స్వభావాదుల వర్ణించు కావ్యము లనేకము లున్నవి" 56 అని పల్కి కృషీవలుడు' కావ్యమును pastoral poetry కి చెందిన దానినిగా భావించిరి ఇది యెంతయు సమంజసముగా నున్నది

## (a) వ న కు మా రి

### రచనా కాలాదులు -

దీని రచనా కాలము 1918 అది విజయనగర సింహాసనముమీద విజయరామ గజపతి ఉన్న సమయము ప్రభువు నొద్ద గురజాడ అప్పారావుగారికి బదులు ఎనమండ్ర నారాయణమూర్తి మిక్కిలి చనువు గలిగియుండిరి గ్రాంధిక ఆంధ్రభాషకు మరల రాజాస్థానములో గట్టి పట్టుగొమ్మ లభించినది

ఈ ఎనమండ్ర నారాయణమూర్తి విజయరామగజపతి కలసి గ్రాంథిక భాషా పునరుజ్జీవనమునకు పూనుకొనినవారైనప్పటికిని, నవ్యకావ్య సృష్టులనుకూడ బహుమతులద్వార ప్రోత్సహించ దలచుకొనిరి

సదస్సుకు సాహితీవేత్తలు సరస కవీశ్వరులు, పండితులు వేంచేసి యుండిరి విజయరామగజపతి బహుమతి ప్రదాత ఆంధ్ర కావ్యపరీక్షలో 'వనకుమారి'కి ప్రథమస్థానము లభించినది, నాలుగువందల రూప్యములు బహుమతిగా లభించినవి దానితో దువ్వూరి కీర్తి తెలుగునేల నాలుగువైపుల వ్యాపించినది

వికీర్ణకేశుడు ఉజ్జ్వల రుధిరాంక చేలుడు కటిబంధ నివిష్ట నిశాతఖడ్గుడు నగు ఒక యువకుడు కనుపించెను

వనిత చూచిన వీరుడు వనములందు తాను దారి తప్పి గొఱ్ఱెలకూయి విని గొల్లలు కాపురముండుచోటని దలచి వచ్చుచుండగా వనకుమారి కనబడినది ఆమె నిశిథిలో అట్లు గొఱ్ఱెల తోలుకొనిపోవు కారణ మెరుగదలచి అతి డచ్చట నిల బడి యుండెను వనకుమారి అతని నవ్యమూర్తినిగాంచి ఆశ్చర్యపడి మూర్ఛి లెను అంత యువకుడు ఆమెను జేరి పరిచర్య చేయగా కొంతసేపటికి తెప్ప రిల్లుకొని తన స్థితిని గూర్చి ప్రశ్నించినది గొఱ్ఱెల నింత నిశిథియందు తోలుకొని పొవుటకు గల కారణమును గూర్చి యువకు డామెను ప్రశ్నించెను ఆమెయు గొఱ్ఱె కదుపులు పోయినది మొదలు చివరి వరకు జరిగిన వృత్తాంతమును వివ రించెను వనకుమారి జనకుని కన్నను అన్యమైన మనుజరూపమును గాంచి యెరుగని కారణమున యువకుని జూచి ఆశ్చర్యపడెను చివరకు యువకుడు కృపాణపాణియై ముందు నడచుచుండ, వనకుమారి వెనుక గొఱ్ఱెలను తోలు కొనుచు రాగా వారు కుటీరమువైపు నడచిరి

వనకుమారితండ్రి కుమార్తె ఎంతకును ఇల్లుజేరని కారణమున వెదకుచు బయలుదేరి వచ్చుచుండగా ఒక శల్యమృగము డొక్కలో పొడిచి నేల కూల్చి నది విరుడు వృద్ధుని భుజములమీది కెత్తుకొని ఇల్లు చేర్చినాడు ఆ రేయి వృద్ధ రాజు రాజకుమారునికి వనకుమారి సమీపమున లెనప్పుడు తన కథను వినిపిం చెను ఇంద్రసేన మౌద్గల్యుడను శత్రురాజుతో తన మంత్రి కుట్రపన్ని స్వామి ద్రోహము చేయ తలపెట్టినాడనియు తన భటులు ఎంత పోరాడినను ఫలితము లెనందువలన హితుల సలహాపై అడవులకు వచ్చి నివాసముంటిననియు దెల్పెను రాజకుమారునకు తన తండ్రి దుష్కృత్యము తెలియవచ్చినది చివరకు వృద్ధుడు మరణించగా పుత్రునివలె దహనసంస్కారాదులనుపూర్తి చేసి మరణమన నేమియో తెలియని వనకుమారికి అనివార్యములైన ప్రకృతిధర్మములను గూర్చి వివరించి నాడు

తన బోయలను కలసికొని చికటివేళకు తిరిగి వచ్చెదనని వనకుమారితో పల్కి అరణ్యములోనికి వెళ్ళిన రాకుమారు డెంతకును తిరిగి రాలేదు వన కుమారి మనస్సులో మొదటిసారిగా భయము ప్రవేశించినది ఒంటరిగా నుండలేక యువకుని వెదకుటకై అడవిలో తిరుగజొచ్చినది మతి చెదరిపోయినది

ఇది యిట్లుండ మాయలకోతిని వెంకి వారు కయ్యంబకపోగా యువకుడు తిరిగివచ్చుచు తప్పుమార్గము పట్టి దుర్గమ వనములో తలెయి గడపినాడు తిరిగి తిరిగి చివరకు పుష్పశయ్యమీద సమాధిలోనున్న వనియున్న వనకుమారిని జూచి ఆమెకు పరిచర్యజేసి గాయమును మరపించినాడు తన అంగ్రదికి వనకుమారి అంగ్రదికి గల సంబంధమును తెలిపినాడు తన రాజ్యమునకు తనను వచ్చి పెండ్లికొమ్మని పలికినాడు వనకుమారికి కన్నులల్లారి వాడతెరపోయినను ఆమె ఎంతైన మాటు తైనను చూడవలెనన్న కోరిక జనియించినది మీ జనకుడు ఇచ్చిన పచ్చని విశాల ధరావలయమును నేను పాలన చేసెద్దును నిన్ను మహారాజ్ఞిగ సత్కరింతు మని యువకుడు కోరగా ఆమె మౌనము వహించినది పిదపవారు కాంతార ప్రాంతముల విడిచి ఇరువురును పురికి చేరిరి కథ సుఖాంతమైనది

## వనకుమారి రచనలో మార్పులు, చేర్పులు -

వరియాణములో పెంచిన్నట్లుగనే రచయితమె కథాంశములలో కూడ కొన్ని మార్పులను, చేర్పులను రామె గావించియున్నారు

వ్రాతప్రతిలో వీరుడు నాయిలను వెదుకుటకనిపోయి ఎంతవరకును తిరిగి రాకపోగా వనకుమారి వానిని వెదకుచు పోయినది సద్రాహాంములు వాని కాలు నడపిన కడవెల్ల తిరిగి తోపిల్లి పడిపోయినది ఇట్టి స్థితిలో ప్రియుని చూచిన వీరుడు ఆమెను బాహుబంధమున బట్టుకొనినాడు కళ్ళు తెంచి చూచినది దేహము మృదువుగా కంపించినది జీవకళ తొలగిపోయినది ప్రియుని కౌగిలిలోనే మర ణించినది కథ మరణాంతమైనది

కాని దీనిని ముద్రిత ప్రతులలో మార్చి వనకుమారిని బ్రతికించి చివరకు వారిరువురిని రాజ్యమునకు జేర్చి కథను సుఖాంతముగా చేసినారు విజయనగరం ఆస్థాన పండిత పరీక్షకుల మెప్పుకొరకు, బహుమానముకొరకు రామిరెడ్డిగారిచేత దర్భా సుబ్రహ్మణ్యశర్మగారు ఈ మార్పు చెయించిరంట [57] ఇది ఒక ముఖ్య మైన మార్పు

వ్రాతప్రతికి ముద్రిత ప్రతికి మరికొన్ని అంశములలో భేద ఘటములు కన్పించుచున్నవి

"ప్రకృతి విచిత్ర లాలిక నిరంజన సౌంఖ్య సుపక్వయుక్తి దీ
పకమగు నక్షకుల్యమున వారిధ రాపల్ల మూధంబులన్

సకల లతానికుంజములు సస్యములన్ దయమాన పక్షులన్
ప్రకట మనోజ్ఞమౌ ఫణితి వ్రాసెనొనా నవరాజ శోభలెన్" (వ్రాతప్రతి)
సంధ్యాకాలమునందలి దృశ్యములను ఎంతయో మనోహరముగ వర్ణించిరి కాని ఇందు సస్యముల ప్రసక్తి అనుచితముగా కనుపించుచున్నది ఈ అరణ్యము నర సంచారము లేనట్టిది నరసంచారము లేనిచోట సస్యము లెచ్చటనుండి వచ్చును? మరి సస్యము లున్నచో నిర్జనారణ్యము కాజాలదు కావున ముద్రితప్రతిలో కొంత మార్పుచేసి ఔచిత్యమును పాటించినారు

'సమయపు మోలికం ప్రకృతి సాంధ్య సువర్ణము గూర్చి యద్భుత
క్రమమున వలాహకావృత ధరాధరశృంగములన్ నికుంజపుం
జములను శాద్వలంబుల ప్రసన్నఝురంబుల ఖేచరంబులన్
రమ దొలకన్ లిఖించెనన రాజిలు నయ్యపరాశ యయ్యెడన్" 58

ఈ పద్యమున సస్యము అనునది తొలగించి 'ప్రసన్న ఝురంబుల' ప్రవేశపెట్టి పూర్వాపర వైరుధ్యము లేకుండ చేసినారు

వ్రాతప్రతిలో దుప్పూరివారు తత్త్వప్రియులు గనుక చావు, ప్రేమ, సుఖము, దుఃఖము మొదలగు విషయములపై పెద్దపెద్ద వ్యాఖ్యానములు చేసియున్నారు ముద్రిత ప్రతులలో కొన్నిటిని తగ్గించుటయు, మరికొన్నిటిని తీసివేయుటయు జరిగినది

ఉదా — ముద్రిత ప్రతులలో లేని స్వర్గవర్ణనము వ్రాతప్రతిలో కన్పించుచున్నది

అచ్చుప్రతులలో ముఖ్యముగా తృతీయ సంస్కరణములో చాల చేర్పులు కలవు వనకుమారి మౌగ్ధ్యమునకు, వేషవైచిత్ర్యమునకు సంబంధించిన పద్యములు క్రొత్తగా వ్రాసినవే

ఉదా — గట్టుకు చేరి వనకుమారి పుట్టము కట్టుకొను సమయమున క్రొంబొగలావరింప నడుమ వెలుగొందు హోమాగ్నినాల్కవోలె' నున్నదట తలవెంట్రుకల చిక్కు తీసికొని తడి యార్చుకొనుచున్న చంద్రముఖి గాలి వాలుకు ఎదురుగా నుండుటచే 'రాహువు కబళించు చంద్రబింబంబు వెన్నాడు సరణి దోచు' మున్నగునవన్నియు క్రొత్తగా వ్రాసియున్నారు

వృద్ధరాజు చనిపోవుటకుముందు వీరునికి తమ దయనీయచరిత్రను వినిపించును ఇందు మొదట రాజ్యభ్రష్టత మాత్రమే ప్రస్తావితమైనది తృతీయ

సంస్కరణములో అట్టి రాజు లేకపోయినందుకు ప్రజలు సంతోషము చెందినట్లుగా చెప్పియున్నారు దీనివలన రాజు ఎంతటి ప్రజాకంటకుడో ఎంత దుష్టహృదయుడో తెలియుచున్నది

పై మార్పులలో కావ్యప్రసిద్ధికి అంతగా ఉపకరించని లేదా భంజకములగు నీరసములైన కొన్ని వర్ణనలను తొలగించుటయు కావ్యమునకు జిగి బిగిని చేకూర్చు కొన్ని కల్పనలు చేయుటయు గమనింపదగినది కావ్యరచనా పరిణతి ఇందు స్పష్టము కాగలదు

## ఆంగ్లకావ్యానుసరణములు -

టెన్నిసన్ రచనతో పోలిక టెన్నిసన్ తన Oenone (ఈనోని) లో

"Methinks, I must be fair, for yesterday
When I past by, a wild and wanton pard
Eyed like an evening star with playful tail
Crouched fawning in the weeds" 60 అని వ్రాయుచున్నారు దీనియందలి భావమునకు దువ్వూరివారి వనకుమారి యందలి ఈ క్రింది పద్యమునకు పోలికలు కనబడుచున్నవి

"లలిత రసార్ద్ర పేశలప లాలితమైన కురంగకాంత కో
మల కిసలంబులన్ మేసవయాని చెవుల్ వెడ నిక్కపెట్టి క
న్నుల ప్రణయావలోకములు నూల్కొనగన్ మెడయెత్తి యుల్లసం
గతికి చరించు మార్గమును గాంచుచునుండె విముగ్ధచిత్తయై' 61

మిల్టన్ రచనతో పోలిక మిల్టన్ ఇల్పెన్సరోసో (Ilpenseroso) అను ఖండికలో ' And looks commercing with the skies
Thy rapt soul sitting in thine eyes" 62 అని వ్రాసియున్నారు దీనికిని వనకుమారియందలి ఈ క్రింది పద్యమునకును కొన్ని పోలికలు భావములో కన్పట్టుచున్నవి

" చూ
పులను నభోంతరాళమున బూర్ణపుటైక్యము సల్పి భావ ని
శ్చలత వహించి యుండ గడసంజ విలాసము లంకురింపగన్. 63

**షేక్స్పియరు రచనలతో పోలికలు** - వనకుమారిలో కథాస్థానము అరణ్యము ఈ అరణ్యమునకు షేక్స్పియరు రచించిన 'As you like it' లోని 'The forest of Arden' నకు కొన్ని పోలికలు గలవు వనకుమారి కథ సమస్తము అరణ్యములోనే జరిగినది As you like it లోని ప్రధానకథ ఆర్డెన్ వనములోనే జరిగినది అందుచేత రెండింటిలోను అరణ్య మనునది ప్రధాన పాత్రయే వనకుమారిలోని అరణ్యము నిర్జనమగుటచేత వనకుమారి మౌగ్ధ్యమునకు, అజ్ఞానమునకు కారణమైనది తల్లిలేని వనకుమారికి ఆటపాటలను నేర్పినది 'As you like it' లోని అరణ్యముకూడ మనోవ్యాకులతలకు ఓదార్పు మనోమాలిన్యమునకు విరుగుడు చేకూర్పగలట్టిది

' Hath not old custom made the life more sweet
Than that of painted pomp ? Are not these woods
More free from peril than the envious court ?

.. ... .. ... .

And this our life exempt from public haunt,
Finds tongues in trees, books in the running brooks,
Sermons in stones, and good in every thing'' 64 అని

ఆర్డెన్ అరణ్యమును డ్యూక్ వర్ణించిరి

అట్లే The Tempest' నాటకమునందలి కొన్ని పాత్రలకును, వనకుమారి యందలి కొన్ని పాత్రలకును పోలికలు కనుపించుచున్నవి

**ప్రోస్పెరో - వృద్ధరాజు** - ఏంటోనియో నేపిల్స్ రాజైన అలోంసో తో చేయి కలిపి కుట్రపన్నిన ఫలితముగా ప్రోస్పెరో రాజ్యమును విడిచి ఒక చిన్న ద్వీపములో కాపురముండవలసి వచ్చినది

ఇంద్రసేన మౌద్గల్యుడను శత్రురాజుతో తన మంత్రి చేయి కలిపి కుట్రపన్నిన ఫలితముగా వృద్ధరాజు రాజ్యమునువిడిచి అరణ్యములో కాపురముండవలసి వచ్చినది

ఇరువురును ప్రవాస జీవితమును గడుపుచున్నవారే ప్రోస్పెరో మిరాండా కొరకు జీవించగా, వృద్ధరాజు వనకుమారి కొరకు జీవించినాడు

**మిరాండా - వనకుమారి** .- మిరాండా 'Tempest' లో కథానాయిక కాగా, వనకుమారి 'వనకుమారి' లో కథానాయిక

"She had never seen one of her own sex, but had lived among the rocks and woods on enchanted Island" 65 ఇది మిరాండాను గూర్చి బేకర్‌గారు చెప్పిన అభిప్రాయము వనకుమారికి తండ్రి తోడిదే లోకము తండ్రిని దప్ప ఇతర మానవులను చూచియెఱుగదు ఆమె కూడ చెట్లు, చేమలు, పక్షులు రాళ్ళమధ్య అరణ్యములో కాలము గడపినది

వీరిరువురును మాయ మంత్రము తెలియని శిశుస్వభావము గలవారు వినయము, కారుణ్యము కలిగిన మధుర హృదయులు

**ఫెర్డినెండ్ - వీరుడు** - వీరియిరువురకును కొన్ని పోలికలు గలవు ఫెర్డినెండ్ తమ సోదరి వివాహమున కేగి తిరిగివచ్చుచు ప్రోస్పరో మంత్రశక్తిచే తాము నివసించు చిన్నద్వీపమునకు కొని రాబడినాడు అచ్చట మిరాండా, ఫెర్డినెండ్‌లు ఒకరినొకరు ప్రేమించుకొనిరి తదుపరి వారి వివాహము జరుగును అనగా ఆమె తండ్రి పోగొట్టుకొన్న రాజ్యమునకు మిరాండా అధినేత్రిణికాగా ఫెర్డినెండ్ రాజు అయినాడు

వీరుడు వేటకు వచ్చి అరణ్యములో త్రోవతప్పి తిరుగుచు వనకుమారిని చూచినాడు తదుపరి ఆమె తండ్రిద్వారా వారి వృత్తాంతమును వినినాడు తన తండ్రి చేసిన తప్పు తెలిసికొని, ఆమెను ప్రేమించి రాజ్యమునకు తోడ్కొని పోయి యువరాణిని గావించినాడు అనగా ఆమె తండ్రి రాజ్యమును ఆమెకే అప్పగించినాడన్నమాట

వీరిరువురును కథానాయకులు

మొత్తముమీద షేక్స్పియరు రచనలలోని కొన్ని పోలికలు ఈ వన కుమారియందు కనుపించుచున్నవి అంతమాత్రముచేతనే దుప్పూరివారు షేక్స్పియరు భావమునే అనుసరించిరనుట సమంజసము కాదు

## కావ్యగత విశేషాంశములు -

**పాత్రచిత్రణ** - వనకుమారి పాత్రను దుప్పూరివారు ఎంతయో సుందరముగ చిత్రించినారు తండ్రిని దప్ప మరొక మానవుని చూచి ఎఱుగని దయనీయ చరిత లోకమనగా నేమియో తెలియదు జనన మరణము లున్నవనిన విషయము కూడ తెలియదు ప్రణయ మనునది ఎట్లుండునో అంతకన్నను తెలియదు వారి నివాసము నిర్జనారణ్య మగుటచేత వనకుమారికి వీనిని గూర్చిన విషయము లేవి

యును తెలియలేదు కరమున దోటి, మొలకట్టున పిల్లనగ్రోవి, క్రొమ్ముడిలో విరిపొరలు అందగింప అడవిలో తిరుగుచు వన్యఫలాళి మెసవి ఆకలి శమింప జేసికొను స్వభావము కలది అంతియేగాక సిగ్గెగ్గులు నాగరికములు తెలియవు గొఱ్ఱెలు, పిట్టలు లేళ్ళు, వేణువు, తండ్రి ఆమెకు సహచరులు విశాలమైన అడవి ఉన్నత సానువులు, సెలయేళ్ళు, మబ్బులు మున్నగు సంకుచిత పరిధి మాత్రమే ఆమెకు తెలియును

అండ్రిని దప్ప ఇతరులను ఎఱుగకుండుటచే యువకుని చూడగనే ఆమెకు ఆశ్చర్యము కలిగినది

'ఫాలతలమున ముడుతలు పడుటలేమి
దీనభావమ్ము మోమున నూనుకొనమి
వెండ్రుకలు పండి నొసటిపై వ్రేలలేమి
నెసగు నాకృతి భేదమ్ము లిరువురందు' 66 అని వారిరువురిలో ఆకృతి భేదమును గాంచినది కాని వయో భేదమును చూచినది కాదు

వృద్ధరాజు మరణింప 'శాంతిని గనుటకై మాంద్యమున నిదురించు చున్నాడు నివు నిద్రపొమ్ము' అని యువకుడు పల్క ఆమె నిద్రించినది

"అని యిటు తరుణుండు పల్కిన
మనము శంకింప కాయిమాయిక శయనిం
చెను, వక్రీకృత తనులత
కెనయగుటకు జంద్రరేఖ యెంత తపించెన్" 67 దీనివలన ఆమె ఎంతటి అమాయకురాలో తెలియుచున్నది దువ్వూరివారి పాత్రలలో ఒక ప్రత్యేక స్థానము వనకుమారికి గలదు ఆమె మౌగ్ధ్యమునకు తగినట్లుగా, ఆమెకు సంబంధించిన ఉపమానము లన్నియును ఇంచుమించుగా వనసంబంధులే 68

**ప్రాబంధిక ధోరణి :-** వనకుమారి నవ్యకావ్యమైనను ఇందుకూడ కొంత వరకు ప్రాబంధిక ధోరణి కనుపించుచున్నది

"సకల జీవులకును వేడ్క సలుపు కొఱకు
నవని డోలిక, చదలు చందువకు యామి
నీ రమణి గట్టు రసగుండ్లబారు లనగ
దారకావళి యుదయించె దరళకాంతి" 69 ఇందు చుక్కలు రసగుండ్లుగా, భూమి ఉయ్యేలగా, మిన్ను చందువగా పోల్చబడినవి ఇది ప్రబంధధోరణియే

"విరహిణీప్రాణ సామగ్రి మరుడు వేగ
వేదనాద్వీపమును జేర్పు వేడ్కఁకొఁటకు
నీలగగనాబ్ధి జలద కల్లోలములను
బాల శశియాన పోతంబు పరిధవిల్లె" 70 ఇందు విరహిణుల ప్రాణము లను వేదనాద్వీపమునకు గగనసాగరముమీదుగా కొనిపోవు ఎడపగా చంద్రుని వర్ణించుట యనునది ప్రాచీన ధోరణియె గాని క్రొత్తదేమియును కాదు

**ఉపమాన ప్రయోగ వైచిత్రి** - వనకుమారి జలకములాడి గట్టునకు జేరి పట్టము గట్టుకొనుచుండగా ఆమె-

"క్రొంబొగ లావరింప
నడుమ వెలుగొందు హోమాగ్ని నాల్కఁబోలె" 71 ఉన్నదట ఈ ఉప మానములను ప్రాచీనులు ఉపయోగించినప్పటికిని ఇంతటి వైచిత్రిని ప్రదర్శించ లేదు ఆమె కట్టుకొను పట్టము క్రొంబొగలావరించినట్లుగ నున్నదనియు, దాని మధ్యనున్న ఆమె హోమాగ్ని నాల్కఁవోలె నున్నదనియు ఉపమించినారు

అట్లే కన్యకయొక్క కుంతలాగ్రములనుండి తొలకు వర్షాంబు బిందువు లను-

"అసిత సూత్రముల గూర్చ బసలు గుల్కు
మంచిముత్యాల సరములు మదికివచ్చు" 72 అని వర్ణించినారు ఇచ్చట నల్లని వెంట్రుకలు నల్లని దారములతోను, వానినుండికారు తెల్లని నీటి బిందువులు మంచిముత్యములతోను ఉపమించుట యనునది ప్రయోగ వైచిత్రి

**కాలమహత్త్వము** - కాలముయొక్క మహత్త్వమును గాంచుట అశక్యము, ఒకానొకప్పుడు కార్యములు అప్రయత్నములుగ ఫలించును మరొకప్పుడు ప్రయత్నము చేసినను ఫలించవు కొన్నిమారులు సంపదలు లీలగా లయించు కొని పోవును దరిద్రత అవలీలగా తొలగిపోవును ఈవిధముగా కాలమనెడి జలధిలో సమస్తమును అస్వతంత్రమ్మై మునుగుచు, తేలుచు ఉండును

"కష్టజీవితు కన్నీటి కాల్వకైన
గాలచక్రము నిలువదు కనికరమున

ధారుణీపాల పాలన దండమునకు
వెఱచి యాగదు త్రుటియైన విరతి గొనదు' 73

కాలసాగర కల్లోల కాండలో ప్రాణులు చలించుచున్న తృణకణముల వంటివారు స్థిరత లేదు రాజ్యములు, సంఘములు, నాగరికతలు మున్నగున వన్నియు ఈ న్యాయము ననుసరించియే భ్రమించుచుండును

స్వప్న మహత్త్వము - దువ్వూరివారు స్వప్నమునుగూర్చి వ్రాసిన పద్యములు మరపురానివి మానవులకు మరణసౌఖ్యమును రుచిచూపుటకై బ్రహ్మ స్వప్నమును సృష్టించెను అట్లుకాకయున్నయెడల తృషావిలమైన ఈ లోకమునకు ఒక నిముషమైనను విశ్రాంతి లభించెడిది కాదు శోకసంతాపమున ఆత్మ సొమ్మసిల్లు కష్టజీవికి నిశ్చింత గలుగజేయుటకై నిశలయందు స్వర్గ నిశ్వాస మోహనపవనమువలె నిద్దుర వీచుచుండును

"నిదు సంస్పర్శనంబుల నిఖిలజగతి
యేక జీవసమాధిగా నెసగుచుండు
గగనమం దుల్లసిల్లు నక్షత్రగణము
పైని వెదజల్లు పువ్వుల పగిది దోచు" 74

ఒక్కకాలములో దప్ప మరణమునకును, నిద్రకును ఏమాత్రము అంతరము లేదు స్వర్గసుఖము, నిరయ సంసర్గ బాధ స్వప్నగర్భమున సంభవించును స్వప్నము స్వర్గ మర్త్యముల సంసర్గ సూత్రము

ఇట్లు దువ్వూరివారు స్వప్నమునుగూర్చి వ్రాసిన పద్యపంచకము, అదే విషయములో కీట్సు వ్రాసిన పద్యములతో తులతూగ గలట్టివి

ప్రకృతి తత్త్వము - నశించుట యనునది ప్రతి వస్తువునకును సహజము లతలకు పూయు పూవులు వృంతమును వీడి రాలిపోవుచునే యుండును ప్రాచి గనిన ముద్దులబిడ్డ సూర్యుడు అపర సాంధ్యరాగపు చితిలోన సమసిపోవుచునే యుండును పూవు ఎందిరులు క్రొత్త వాసనల ప్రసరింపజేయుచుండ, గున్న లేమావి నీడల కూడి చైత్రకాంతుని పరిణయమాడు వాసంతలక్ష్మి శరజ్జరాగమున అంతమొందును అవి యివి అననేల, అంతరాళములో సంచరించు అర్కుడు మొదలు సమస్త నక్షత్రములును కాలానుస్మృతిని మూలపదార్థమం దైక్యమై పోవును

"జలధి తరగలు పుట్టుచు నణసిపోయి
మరల జనియించు నోజ నోహారిణనయున
ప్రకృతి మార్పుల జెందుచు నుండుగాని
వ్యయము నుత్పత్తి లేదు మూలాంశమందు 75 కావున భూమిలో పుట్టి చచ్చుటలన్నవి ప్రాక్తన కర్మ ఫలములు ఇది ప్రకృతి తత్త్వము

**స్త్రీల విశిష్టత** - రాత్రులందు చీకటిని పారద్రోలుటకై చందమామ గున్న పొదరిండ్ల వలపించుటకై కొమరు పూవులు సృష్టింపబడినవి అట్లే పురుషుల జీవితములను ప్రకాశింపజేయుటకై బ్రహ్మ స్త్రీలను సృజించెను అంగనాజన సహాయతలు లేకపోయినచో మనుజు డేమయిపోవునో గదా! ఎద్దానియును మాని దుర్జనుడై క్రూరమృగమువలె అహోరాత్రములు ప్రాంపర్తనమె వృత్తిగా గలిగి కర్కశాత్ముడై నిందను పొందును

"ప్రేమకు జన్మస్థానము
లై మెలతలు కటికవాని యాత్మనునైనం
గోమల కరుణాంకూర
స్తోమము మొలిపింపగలరు శుభదృష్టులచేన్" 76

ఇది స్త్రీజనులయొక్క గొప్పదనము వారు లేకుండిన లోకమే అంధకారముగా మారిపోవును

**ప్రణయ తత్త్వము** :- బాల్య మంతరింపగా ప్రణయమోహనమైన యౌవనము వెంటనే అవతరించును కొమ్మ పట్టుతరి దుప్పికొదమకు క్రొత్త సంచలనము కలుగునట్లే యౌవనారంభమున క్రొత్త క్రొత్త కోరికలు జనియించును

"పూల కారురాక బుప్పించెను మల్లిక
తుమ్మెదలకు దావి దూతియయ్యె
ప్రకృతిసిద్ధమైన ప్రణయమార్గంబిది
తప్పికొనగ నెవరితరము సకియ" 77 ప్రణయమార్గము ప్రకృతిసిద్ధమైనది దానినుండి తప్పించుకొనుటకు ఎవరికిని శక్యముగాదు

ఈ కావ్యమున నిట్లెన్నియో విశేషాంశముల నెత్తి చూపవచ్చును

## (b) కృషీవలుడు

### రచనా విశేషములు -

ఈ కావ్యము 1919 వ సంవత్సరములో రచింపబడినది ఆంధ్ర కర్షక వాఙ్మయమున దీనికి ఉన్నతస్థానము కలదు నగర జీవనము పారిశ్రామికవ్యవస్థ ప్రారంభదశలో నున్నపుడు రచించిన కావ్యమిది గ్రామములమీద నగరముల ప్రభావము ప్రారంభమైన తొలిరోజులలో బాల్యయౌవనములను ఒక కుగ్రామములో ప్రశాంతముగా గడపిన దువ్వూరి హృదయము ఏవిధముగా స్పందించినది ఈ కృషీవలుడు' కావ్యము తెలియజేయును కృషీవలుడు రచించునాటికి దువ్వూరివారి జీవితములోను, కవిత్వములోను గ్రామీణత్వము పరిస్ఫుటముగా నంకితమై యుండినది అందుచేతనే కావ్యము మొత్తమును పరిశీలించినచో ఒక విలాపధ్వని (Elegiac note) వినిపించును ఈ కావ్యములో దువ్వూరివారు కర్షకులకు నైతిక కర్తవ్యోపదేశము చేయుటయేగాక వారి జీవితములోని కష్ట సుఖములను వివరించి లోపముల నెత్తిచూపి పరిష్కారమార్గములనుకూడ చూపించిరి

'కృషీవలుడు' కావ్యమును గూర్చి ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు "Who else is better fitted to give expression to the dumb sorrows of the farmers life than Mr Duvvuri Rami Reddy, the son of a farmer" 78 అని తమ అభిప్రాయమును వ్యక్తీకరించిరి కర్షకునియొక్క మూగబాధలను దువ్వూరికంటె మిన్నగా వ్యక్తముచేయగలవా రరుదని నిస్సంకోచముగా జెప్పవచ్చును

### కృషీవల సాహిత్యము - కృషీవలుడు -

వృత్తిని గురించి మన సాహిత్యములో ఒక కావ్యము రచించుట అధునాతనము కృషీవల సాహిత్యమునందు కృషీవల జీవితమును ప్రధానాంశముగ గ్రహించి రచించిన తెలుగు గ్రంధములలో దువ్వూరివారు రచించిన 'కృషీవలుడు' మొదటిది మరియు అగ్రగణ్యమైనది తదుపరి కృషీవల దైనందిన జీవితమును చిత్రించిన అనేక గ్రంధములు వెలువడినవి

'కర్షకుడు' అను గ్రంధములో కొప్పరపు దుర్గాప్రసాదరావుగారు రైతు కుటుంబ దయనీయ స్థితిని వివరించిరి ఈ కావ్యమందలి రైతుసంసారము నిరుపేదయైనది వారికి సొంతభూమి లేదు ఎవరి పొలముసో కవులుకు తీసికొని

మిగిల్చికొని బ్రతికెడి సంసారము ఋణముల బాధలు భూస్వామి ఎక్కువ ఇమ్మనుట పండినను పండకపోయినను కౌలుసొమ్ము ఇచ్చుట మున్నగు రైతు సాధకబాధకములను వర్ణించిరి

కొండవీటి వెంకయ్యగారి 'కర్షకా' అను గ్రంథములో వారు కర్షకుని ఔన్నత్యమును వర్ణించిరి 'రైతుగీతాలు' అను గ్రంథములో పెద్దిబోయిన ప్రసాదరావుగారు రైతుసోదరులను మేల్కొలుపుటకై ప్రయత్నించిరి భారత దేశపు రైతు అష్టకష్టముల పాల్పడుచు, అధః పతనావస్థలో నుండుటకు గల కారణములను అహోరాత్రులు కష్టించినను అన్నమునకు నోచుకొనలేక ఆకలి మంటలతో అలమటించుటకు గల కారణములను వర్ణించి, రైతులను ఆర్థిక సముద్రములో పడద్రోసినవారెవ్వరో అన్వేషింపవలసినదిగా రైతులకు వారు హిత బోధ చేయుచున్నారు

కాపుబిడ్డ' అను గ్రంథములో శ్రీ గంగుల శాయిరెడ్డిగారు స్వచ్ఛమైన తెలంగాణారైతు జీవితమును సుందరముగా చిత్రించిరి ఈవిధముగా దువ్వూరి వారి తరువాత అనేకులు కర్షకవృత్తినిగూర్చి కావ్యములు వ్రాసిరి కాని వీటన్నింటి లోను తలమానికమైనది, కర్షకకవిగా దువ్వూరివారికి ఆంధ్రదేశమున ఉన్నత మైన స్థానము కల్పించినది వారి 'కృషీవలుడు'

పులిజాల హనుమంతరాయకవిగారు 'కాపుబిడ్డ'కు తమ అమూల్యాభి ప్రాయము వ్రాయుచు "పాశ్చాత్య సంపర్కధోరణిని 'కృషీవలుడు' అను కావ్యము శ్రీ కవికోకిల దువ్వూరి రామిరెడ్డిగారిచే లభించినది" 79 అని వ్రాసి యుండిరి

కాని దువ్వూరివారు పాశ్చాత్య సాహిత్య సంపర్క ప్రభావముచే వ్రాసి నను గ్రహించిన విషయము మాత్రము దేశీయమైనదే

రైతు దేశమునకు వెన్నెముక అటువంటి రైతు జీవితమును ప్రధానాంశ ముగా గ్రహించి 'కృషీవలుడు' కావ్యమును దువ్వూరి రచించిరి ఆ రోజులలో ఎవరును చేయ సాహసింపని పనిని తాను చేయ తలపెట్టినాడు ఈ వస్తు నవ్య తను తలంచి లోకము తనను కర్షక పక్షపాతి'గా తలంచునని ఊహించెను

"అన్నా ! హాలిక నీదు జీవితము నెయ్యంబార వర్ణింప మే
కొన్నన్ నిర్ఝర సారవేగమున వాక్పూరంబు మాధుర్య సం

పన్నంబై ప్రవహించుగాని ఇతరుల్ భగ్నాశులై ఈర్ష్యతో
నన్నుం గర్షకపక్షపాతి యని నిందావాక్యముల్ పల్కరే' 80

తాను తలచిన విధముగా కర్షకపక్షపాతిగా గాక 'కర్షకకవి'గా ఆంధ్ర దేశమున మన్నన లందినాడు తాను కర్షకుడు ప్రతి దినము తా నుదయము నుండి నాయంత్రము వరకు చూచుచున్నది కృషీవలుని దైనందిన కార్యక్రమము అందువలన కృషీవలుని గూర్చి అతని దైనందిన జీవితమును గూర్చి ఎంతయో సహజముగా చిత్రించుటయేగాక వారికి కర్తవ్యబోధ కూడ చేసి యున్నారు

## కావ్యగత విశేషాంశములు -

**గ్రామీణ జీవన చిత్రణము** - ఇందు గ్రామీణ జీవనము చక్కగా చిత్రింపబడినది ప్రొద్దుపొడుపు సమయమున నీటికొరకు సరస్సుల కేగు కాపు నెరజాణల నూపుర మంజులార్భటులు ప్రభాతమను శిశువు నేర్చెడి ముద్దుల మాటలో యన్నట్లున్నవట ఇందు ఆలమందలను ఉదయమే బీళ్ళకు మేతకొరకై త్రోలుట పాలకొరకై గొంతురాయ తెగయావుదూడ పలుపును లాగికొనుచు 'అంభా అంభా' యని అరచుట పొదుగు నిండుగా పాల్చేపి గుదులు త్రెంపి దూడకొరకై తరిపిపెయ్య దొడ్డిగోడ దాటుట కడుపు నిండుగ అన్నము, పెరుగు తిని గిడ్డగముల తమ్మిగుఱ్ఱడు దొడ్డి వెడలించి దూడలను అమ్మలకు పరుగులిడ నీయక కట్టుట, ఉదయమేలేచి కాంతలు పెరుగు చిలుకుట వేకువనేలేచి వైకుంఠ వాకిళులను ఇంటి ముంగిట రచించి పూలతోడ గొబ్బిముద్దలు నిలిపి కుంకుమలు చల్లుట పొలముల కేగు పల్లెతలు పుత్తడిగాజులు ఘల్లుమని శబ్దముచేయుచుండగ చిటికెలు వేయుచు కృషీవలుని కన్గొని ఏలపాటలు పాడుట మున్నగునవి ఎంతయో సుందరముగా చిత్రింపబడినవి

"మన పని జేసికొన్న నవమానమె ? ప్రొచిపనుల్పొనర్చుచున్
వనిత యతిప్రయాసమున బర్వులిడం గనుగోవె · కావడిం
గొని ఎరసీజలంబులను గోపముసేయక తెచ్చియిచ్చి కాం
తను బరితోషపెట్టుము వృథా చనవెప్పుడు నట్టి నాయముల్" 81

అని కర్షకునకు వనితకు సహాయము చెయవలసినదిగా కవిగారు హితబోధ చేయు చున్నారు ఈవిధముగా నీ కావ్యమున గ్రామమునందలి ప్రజల చెష్టలు ఎంతయో నిసర్గరమణీయముగా వర్ణింపబడినవి

**ప్రకృతి చిత్రణము** - కృషీవలుడు కావ్యమున వర్ణింపబడిన ప్రకృతి యంతయు పొలములకు సంబంధించినదే పొలముగట్టుల గనిమలపై నారె గూళ్ళు అల్లుకొనియుండగా, వానిపై మంచుకాలమున మంచు పడి చూచుటకు అందముగా నుండును ఈ దృశ్యమును మనము చూచినను అంతలి సౌందర్య మును గమనింపము కాని దువ్వూరి—

"గనిమల తుంగకున్ గచికకాడల కల్లిన సాలెగూళ్ళ స
న్నని పటికంపు మంచుపడి నాణెపు ముత్తెసరాల పోలికం
గనుగొన రమ్యమయ్యె రవికాంతుల దేలుచు, నిట్టి భావమో
హనపు నిసర్గశిల్పముల హోరికి త్రొక్కక దాటి పొమ్మిక కన్" 82

అని మనోజ్ఞముగ వర్ణించిరి

గాలికి కదులుచున్న వరిచేలు సాగరతరంగములవలె నున్నవట తెల్లని కొంగలు రెక్కలల్లార్చుచు నురుగువలె నున్నవట కేదారముల మధ్యనుండు చెట్లు గాలికి కదలుచు ఓడలవలె నున్నవట ఈవిధముగ సస్యములతో నున్న భూమి సాగరమువలె చూచుటకు నేత్రానందమును గూర్చుచున్నదట

"కుసుమలతావళీ వలితకుంజములుం, గిసలప్రకాండముల్
పసరులు గ్రక్కు వృక్షముల బాలతృణంబుల జేలగట్లు సొం
పెసగ సమస్త రత్నముల నేరిచి గూర్చిన డాలరిళ్ళలన్
వసుధ కమర్చెరో కృషికవర్య లనన్ వరిమళ్ళు శోభిలున్" 83

ప్రకృతి చిత్రణకు ఇది ఒక మచ్చుతునక

మరకత చూర్ణవర్ణములతో అలంకరింపబడిన నవశాలిభూమియొక్క అందమును జూచినచో వైదిక దినములలో భరతక్షమాధురంధరయగు సస్యలక్ష్మి దయ తప్పక నేటికి కూడ ఆర్యధాత్రిణీభరణ కుతూహలస్ఫురణతో భాసిల్లు చున్నదో యన నొప్పుచున్నదట ఇట్లు ఈ కావ్యమున నెన్నియైనను ప్రకృతి చిత్రణలను జూపింపవచ్చును ఇందలి వర్ణన లన్నియు వరిమళ్ళ, ఆ పరిసరము లకు సంబంధించియే యున్నవి

**కృషి - దేశసౌభాగ్యము** - వ్యవసాయము సర్వవృత్తులలోకెల్ల ముఖ్యమైనది అందునను ముఖ్యముగా మనది కృషి ప్రధానమైన దేశము వ్యవసాయము సకల పరిశ్రమలకును మూలము ఆ పరిశ్రమలు వాణిజ్యమునకు సాధనములు అఖిల వాణిజ్యములు సిరికి ఆటపట్టులు సిరులు భోగోపలబ్ధికి జీవగఱ్ఱ వంటివి కావున సాంఘికోత్కృష్టసౌభాగ్యమునకు కృషీవలులే ప్రధాన కారణము ఇంత కష్టపడినను కృషీవలునకు ప్రతికాలమందును కట్టను, కుడువను కరువే ఫలిత మనుభవించువారు మాత్రము ఇతరులు

'ఫలముల్మెక్కెడివారు తత్ఫల రసాస్వాద క్రియాలోలురై
పలుమారమ్మధురత్వ మున్నుతుల సంభావింతురే గాని త
త్ఫల హేతుక్రమ వృక్షముం దలప రెవ్వారైన నట్లే రమా
కలితుల్ భోగములన్ భుజించుచు నినుం గన్నెత్తియుం జూతురే" 84

అటువంటి కృతఘ్నులను దృష్టియందుంచుకొనక కృషీవలుడు రాత్రనక, పగలనక కష్టించి తనువు అస్థిపంజరముగా మారినను వర్షములు వచ్చినను, క్షామములు వచ్చినను, స్వశ్రమార్జితమైన పట్టెడన్నము దినును గాని ఇతరులను యాచింపడు ఒకవేళ అట్టి కృతఘ్నులను దృష్టియందుంచుకొని తాను వ్యవసాయమును విసర్జించినచో దేశ పురోగతికి దెబ్బతగులును కాని కర్షకుడు అట్లు చేయ తలంపడు అందువలననే కృషీవలుడు దేశమునకు వెన్నెముక

**వ్యవసాయకూలీల వర్ణన** - దువ్వూరివారు ఒక్క కర్షకుని జీవితమును యధాతధముగా చిత్రించుటయేగాక కృషికి సహకారులగు వ్యవసాయ కూలీలను గూడ వర్ణించినారు అందులో ముఖ్యముగా చెప్పుకొనదగినది, చదువరుల మన్ననలందునది కన్నెమాలెత వర్ణనము

"వ్రాలిన కొప్పులోపలి పూలరేకులు
సడలి యొక్కొక్కటి జారుచుండ
బరువంపు రొమ్ముపై బయ్యెద చినుగుళ్ళు
గాలికి నట్టిట్టు గదలి యాడ
నెలుగెత్తి పాడెడి యేలలు విని బాట
సారు లెక్కసకెము సలుపుచుండ

దమ్ముమలపుంబూత దవిలిన వాతెఱ
పై బలుచాలు నవ్వకయె నవ్వ
జేతి కొడవలి ఝళిపుచు జిన్నెలాడి
కన్నె మాలెత పిడి చుట్టి మున్న మున్న
మునుపు తఱిగెడి, నింటికి బోవువేళ
నందె డోదె యాలేవె కర్షకకుమార " 85

అంతియేగాక వరికొట్టుడు అయిపోయిన తదుపరి కల్లములలో పరిగె ఏరుకొనుటకు పేదసాదలు వచ్చెదరు ఆకటిబాధచేత సగమైన యొడలు కలిగి చీకటి చూపులు కలిగి, మొలకు జానెడు పీలిక చుట్టుకొని జీవితమంతయు కష్టములతో గడుపు పేదసాదలను చీదరించుకొనకుమని రైతుసోదరులను దువ్వూరివారు హెచ్చరించుచున్నారు ఆకలిమంట లనునవి ఎవరికైనను సమానమెగదా

**కాపుటిల్లాలి ఓదార్పు** - ఈ కావ్యములో కవిగారి సానుభూతిని కాపువానికంటె కూడ వాని ఇల్లాలు పొందినది కాపుటిల్లాలు క్లిష్టమైన గృహకృత్యములలో ఎల్లప్పుడు మునిగియుండుటచే మంచి చీరెలు రవికలు, మేలైన అలంకారములు మున్నగువాని మాటయే తలంపదు కనీసము తలయైన దువ్వుకొనుటకు కూడ తీరిక యుండదు మూడువందల అరువది దినములలో ఆమెకు ఎనిలేని నిముషమన్నది కనుపింపదు ఎడలేని సంసార కష్టములకు ప్రవృత్తిని బలి పెట్టుట యనునది ఒక్క కాపుటిల్లాలునకే చెల్లినది

"త్యాగమునకైన నొకహద్దు దగును గాని
శలభమట్టుల నాత్మనాశనము మేలె ?
పొలతికి సతీత్వ సౌందర్యములు రెండు
ప్రార్థనీయ వరంబులై పరగుగాదె " 86 అని కవిగారు కాపుటిల్లాలిని

ఓదార్చుచున్నారు అంతియెగాక భర్త పొలమునకు ఉదయముననే లేచి వెళ్ళగా, కాపుటిల్లాలు నట్టనడి ఎండలో కాళ్ళు కాలి బొబ్బలెత్త చెమటలు మోమునుండి కారుచుండగా భర్తకు అన్నము దీసికొని పొలమునకు వెళ్ళును ఇట్లు కాపుటిల్లాలి కష్టములను సహజరీతిలో మన కళ్ళకు కట్టినట్లు చిత్రించిరి

**వడ్డీ - స్వరూపము** - రైతులు సహజముగా పంటకాలములో పొలముల పెట్టుబడుల నిమిత్తము దూస్వాములవద్ద వడ్డీకి డబ్బు అప్పు తీసికొందురు

ఆ తరువాత పంట రాగానే తీర్చుకొనుచుందురు దువ్వూరివారు కాపులు ఏఏ రకముల అప్పులు తీసికొందురో, అవి ఎట్లు అభివృద్ధి చెందునో చక్కగా వివరించిరి

తల తాకట్టుపెట్టి పన్ను కట్టుటకై ధనికులవద్ద తీసికొన్న పైకము, కూలికి, నాలికి, కూటికి చాలక తీసికొన్న ధాన్యపు టప్పు చిల్లరమల్లర చేబదులుగా దెచ్చి అక్కరలు గడిపికొనినట్టి యప్పు పండుగ పర్వములలో బజారులో సామాను తీసికొనిన యప్పు, వాయిదా దాటిపోవుటకు సిద్ధముగా నుండిన వడ్డీయప్పు భార్య సొమ్ములు కుదువబెట్టి తెచ్చిన యప్పు అనునవి అప్పులలోని రకములు

"పవలు నడచు ప్రొద్దు తొవవిందు రేవేళ

బవలురేయి నడచు బాడువడ్డి" 87 అని అప్పుచేసి తిను పప్పుకూడు కన్న కాను ఋణములేకుండ గంజి త్రాగుట మేలని కవిగారు కర్షకుని ఉద్బోధించుచున్నారు

**కర్తవ్యోపదేశము** - కృషీవలుడు రేయింబవళ్ళు కష్టించినను శ్రమకుతగిన ఫలితము లభించుట కష్టముగా నున్నది అట్టితరి తన వృత్తిపై విసుగు జనించి వ్యవసాయమును త్యజించినచో దేశ ఆర్థికవ్యవస్థ దెబ్బతినును అట్టితరి వారికి కర్తవ్యోపదేశము చేయవలయును

కృషీవలునకు మనుజసమాజములో ఒక ముఖ్యమైన వృత్తి నియతమైనది అట్టి ధార్మికవిధిని చిరకాలము గౌరవముతో కృషీవలుని పితామహులు లోకహితార్థము మనిచిరి కావున వారి మార్గమున నేకష్టములు వచ్చినను పయనించుట కృషీవలునకు ఉచితమని కవిగారు బోధించుచున్నారు

"శ్రమలు లేకయే ఫలములు దుముకబోవు

పిండికొలదియె రొట్టె, యోపిన విధాన

కష్టపడుము కృషీవలా ! గలుగు సుఖము

ఉత్తయాసల కన్న మేలుద్యమంబు 87 అని కవిగారు కృషీవలునకు కృషిపావనత్వమును దెలిపి కర్తవ్యము నుపదేశించుచున్నారు

**సాంఘిక జీవన చిత్రణము** - ఆనాటి కర్షకుల ఇండ్లలోని సాంఘిక పరిస్థితులు ఈ కావ్యములో ప్రతిఫలించుచున్నవి అత్త, ఆడుబిడ్డలబాధ ఆనాటి

కోడండ్రకు తప్పినదికాదు ఇంటిపను లన్నియు కోడలే చూడవలయును లేనిచో అత్తపోరు తప్పదు తెల్లవారుఝామునసే ఎంత కష్టమున్నను, లేవలేకపోయినను వారి పోరునకు వెరచి ఎంతయో ఓపికతో పనులు చేయవలయును అది ఆనాటి కాపుటిల్లాలి స్థితి

తూనీగలు ఆకసమందు ఝంకార రవములు సలుపుచు ఎగురుచుండుట, చల్లగాలికి కప్పలు బెకబెకా రావములు సలుపుట వాన రాకకు చిహ్నములుగా ఆనాటివారు పరిగణించెడివారు ఈనాటికూడ కొన్ని గ్రామములలో ఈవిధముగా తలచుట గలదు

ఆనాడు వంటచెరకుగా పిడకలు, బొప్పర్లు, తాడిచుండ్లు బరికెలు మున్నగునవి వాడెడివారని తెలియుచున్నది

ఈ కావ్యరచనాసమయమునకు నవ్య పాశ్చాత్యసభ్యత, నాగరికత పల్లెలందు అస్పష్టరూపము దాల్చి గ్రామజీవనవిధానమునందు విముఖత్వమును కలుగజేయుచుండెను ఆ కారణముగా పంచాయతీసభాభవనములైన రచ్చకొట్టములు ఒక మూల కూలిపోయినవి వీధిబడులు జెప్పు విజ్ఞానధనులైన ఒజ్జలు దాస్యమును ఊతగొనిరి గ్రామీణపరిశ్రమలు అడుగంటిపోయినవి సత్యజీవనము విశ్వాసము భక్తి ఐకమత్యము అంతరించిపోయినవి బూటకములు కుయుక్తులు, మోసగతులు, కోర్టువ్యాజ్యములు ఫోర్జరీలు, కూటమైత్రి, స్వార్థపరత, మౌఢ్యము గర్వప్రవృత్తి మున్నగువానిని నేర్పు విద్యాలయములుగా నాటి గ్రామములు మారిపోయినవి ఇది ఆనాటి సాంఘికస్థితి

ఈవిధముగా నీ కావ్యమున నెన్నియో విశేషాంశములను దుప్పూరివారు పొందుపరచిరి

## (IV) విజ్ఞాన శాస్త్రాధారములు

విజ్ఞానశాస్త్రవిషయములను ఆధారముగ చేసికొని రచించెడి కావ్యములను విజ్ఞానశాస్త్రాధారములని చెప్పవచ్చును శాస్త్రవిషయము విడిగా చెప్పుటకన్న కథా రూపమున చెప్పినయెడల శ్రోతను ఆకట్టుకొనుటలోను అతనికి సదవగాహన కల్గించుటలోను సౌకర్యము మెండుగా నుండును నేటి సమాజమునకు విజ్ఞాన శాస్త్రమును గూర్చి తెలిసికొనవలసిన ఆవశ్యకత ఎంతయో గలదు సత్యాసత్యములను తెలిసికొనినయెడల మానవుడు కొన్ని మూఢవిశ్వాసము లనెడి బందిఖానా

నుండి బయటపడి స్వచ్ఛందజీవనము గడుపగలుగును శాస్త్రవిషయ జ్ఞానమనునది వ్యక్తికి, సంఘమునకు తద్వారా దేశపురోభివృద్ధికి ఎంతయో సహకరించును

శాస్త్ర విషయము యొక్క ప్రాధాన్యమును గ్రహించినవా రగుటచేతనే దువ్వూరివారు సమాజమునకు ఉపయోగపడవలెనన్న ఉద్దేశ్యముతో జలదాంగన, కవి-రవి అను శాస్త్రాధార కావ్యములను వ్రాసిరి జలదాంగనయందు మేఘములు ఏర్పడుట వానలు కురియుట మున్నగు శాస్త్రవిషయములు కవి-రవియందు భూమి, సూర్యచంద్రుల పుట్టుకలు మున్నగు విషయములు కథారూపముగ చెప్పబడినవి

## (a) జలదాంగన

### రచనా కాలాదులు -

దీని రచనాకాలము 1920 దీనికి కవిగారుంచిన మొదటిపేరు జలకణము' అని వ్రాతప్రతినిబట్టి తెలియుచున్నది తరువాత 'జలదాంగన'గా మార్చబడి యుండును

రెడ్డిగారు మేఘమును స్త్రీమూర్తిగా భావించి రచించిన కావ్యమిది వీరు పంచభూతములను మానవీకరించి మహాభౌతికసంబంధములను మానవ ప్రణయ వ్యవహారముగ రూపొందించి సృష్టిప్రకారమును వర్ణించిరి కేవలము శాస్త్రీయ విషయ నిరూపణముకొరకే ఈ కావ్యము రచింపకపోయినను, కావ్యములో శాస్త్రమును ఇమిడ్చి రచించిరి ఈ కావ్యమున కథావ్యాజమున లోకపు తీరుకూడ చర్చింపబడినది

దువ్వూరి వ్రాసిన 'కృషీవలుడు'లోని ఒక పద్యమే ఈ కావ్యముగా పరిణమించినదని రమణారెడ్డిగారు తెలిపియున్నారు ఆ పద్య మిది——

"కఱకుగ నెండగాయ నిక గాసము తప్పెననంగనేల ? భా
స్కర కిరణాళిలో గలదు సస్యసముద్ధరణైక శక్తి, త
త్కిరణము లబ్ధివారి పయికిం గొని యావిరి రూపునన్ నభో
ంతరమున మార్చు నీరదవితానముగాగ పునఃప్రవృష్టికిన్" 89

ఇందు ఒక్క పద్యములో జెప్పిన శాస్త్రవిషయము కథారూపముగ 'జలదాంగన' రూపు దాల్చినది.

కథాసంగ్రహము -

కవిగారు ఒకానొక సాయంకాలపు సమయమున వరిమడులలో చల్లగాలికి అల్లనల్లన విహరించుచు ప్రకృతిని గాంచి మనసులో అంతులేని ఆనందమును పొందుచుండిరి ఇంతలో చంద్రోదయి మయ్యెను ఒక మేఘము పవనోపహతి చేత మెలమెల్లగ నూగుచు సన్నని వస్త్రమువలె చంద్రుని గప్పుచు వీగిపొవుచు ఎన్నెన్నో మనోహరాకృతుల నెత్తుచు వింతగా కవిగారికి కనుపించినది వెంటనే కవి యగుటచేత అబ్దసారూప్యమును బొంది మేఘమును 'వాసమెద్ది ' ఎందులకు విహరింపబోవుచున్నావు?' తెలుపుమని కోరిరి అంత జలదాంగన అన పుట్టు పూర్వోత్తరముల నీ క్రిందివిధముగా వివరించెను

బ్రహ్మ సూర్యుడు చంద్రుడు తారకలు మున్నగు సమస్త విశ్వమును సృష్టింపకపూర్వమే జలదాంగన పూర్వ్యాపమైన సముద్రమును సృష్టించెను వనధి, సంతమసము మాయికు పుట్టిన బిడ్డలు మాయి అదృశ్యకాగా వాని తల్లిలేని తనమును బాపుటకై ఆకాశమున కాంతిగోళములు హెచ్చెను ఇంతలో జలము నకు సోదరీవియోగము సంభవించినది అంత పృధ్వియను బాల యొకతె దాసిగా నుండి జలమునకు కలిగిన దుఃఖమునుండి రడింపజేసినది కొన్నాళ్ళకు కాలు డను సుందరాకారు డొకడు వచ్చి వారిరువురను వివాహమాడెను పృధ్వికి, జల మునకు సవతిపోరు ప్రారంభమైనది జలవాసమందు కొంతభాగమును భూమి ఆక్రమించినది కొంతకాలమునకు పృధ్వికూడ సంతానవతియైనది జలసంతాన మునకు, పృథ్వీసంతానమునకు జ్ఞాతి కలహము ప్రారంభమైనది పైత్ర్యకమైన బుద్ధిసంపద గలిగిన భూమిబిడ్డలు పొగరుతో జలసంతానమును కబళింపసాగినారు నౌకలతో జలతలమును చీల్చి చించసాగినారు ఇంతలో వారిలో వారికే వంత ములు ప్రారంభమైనవి వారి రక్తము సముద్రపర్యంతము ప్రవహించి జలధికి, జలసంతానమునకు క్షీరపూరమైనది

ఒకనాడు జలధితో ఇష్టాగోష్ఠిలో నుండగా కాలుడు తాను నీ రేజ బంధుడ ననియు పచ్చల గుజ్జుంబుల తేరిపైన గగనసంచారము చేయుచుందుననియు పలికి తన నిజస్వరూపమును జూపెను జలధి మోహముచెంది తన భాగ్యము పండి నట్లుగా తలచినది వెయి చేతులతో సూర్యుడు కౌగిలించినాడు బాష్పమయయై కౌగిలియందే లీనముకాగా నధోంతరాళమునకు జేర్చినాడు దివ్యరూపమేగాక

ఉజ్జ్వల శంపాభరణములు సమకూరినవి వాతార్భకులతో కలసి మలనెత్తంబుల తీవ టోవరులలోన జేరి క్రీడింపసాగినది

కొంతకాలమునకు కాంతుడైన సూర్యుని మోసము తెలియవచ్చెను సూర్యుడు సరోజినియను సతిని ఛాయ యను సతిని వివాహామాడెనని జలదాంగనకు తెలిసినది జలదముగా మారిన జలధికి కోపమువచ్చి ఆత్మహత్యాప్రయత్నముతో హిమగిరిప్రాంతములకు వెళ్ళి అచటగల వింతలను జూచినది తదుపరి విమల జలములలో గ్రుంకిడు కోరికతో మునుగగా ప్రాణముపోయిన శరీరము కట్టెవారినట్లుగా మంచురాయిగా మారిపోయినది ఇంతలో లేనవ్వుతో సూర్యుడు వచ్చి తప్పు క్షమింపుమని అడిగి దగ్గర నిలిచియుండెను అతని ముఖమును జూడనైన ఇష్టపడక నిర్ఝర గర్భములో కలసిపోయినది తన కష్టపాటునుగాంచి సవతియైన పృథ్వి ఉపశమనవాక్యములతో దుఃఖమును బాపి తన ఇంట కొన్నినాళ్ళు ఉంచుకొనినది తదుపరి పైరు చేలలో మలయూటకాల్వలలో, కొలకులలో విహరించినది పిమ్మట కూలంకషముగపారు నదులతోగలసి తిరిగి స్వస్థానము అయిన సముద్రమును చేరుకొనినది

ఇట్లు కొన్నిదినములు గడువగా నొక్కనాడు సూర్యుడు మనోహరాకృతిలో రాగా జలదాంగన తన పూర్వపుగాధ నంతయు మరచిపోయి పరవశురాలయ్యెను సూర్యుడు కౌగిలించికొనినాడు నిరోధించు ప్రయత్నము చేయులోపుననే బాష్పరూపముతో నభోంతరాళమునకు దీసికొనిపోయినాడు మరల శ్యామలకోమలాంబుదముగా మారినది

ఇట్లు తన కథను తెలిపి జలదాంగన చల్లని గాలి వీవగా ముసుగు పయ్యెద సవరించుకొనుచు ముందుకు సాగిపోయినది

ఇది మబ్బు ఆత్మకథ

## ఇతరుల ప్రభావము -

మనుచరిత్రలో ప్రవరుడు హిమాలయపర్వతములను జూచు వేడ్కతో నరిగి భగీరథుడు తపస్సుచేసినచోటు, మన్మథుడు శివుని నేత్రాగ్నిచే భస్మమైనట్టి జాలి కలిగించు చోటు మున్నగు వింతల జూచి సంతసించెను ఆ సందర్భములోని—

"వలరాచ రాచవాడలికాషు కనువెచ్చ
గరగిన యల కనికరపు జోటు" 90 అన్న పద్యపాదమునందలి భావమును పోలినదే ఈ కావ్యములో నొక పద్యము గలదు

జలదాంగన భర్త మీద కోపముతో హిమాలయములవద్దకు వెళ్ళి లచ్చట వింతలను జూచెను వానిని కవికి వర్ణించి చెప్పు సమయమున-

"అక్కడనుండి దేవతల యక్కఱ దీర్పగ మన్మథుండు దా
నెక్కటి పూవు విల్లుగొని యందుకళాధరు నొంప వచ్చినం
గక్కసమెత్తి నెన్నుదిటి కంటిసెగం గరగించినట్టి యా
ప్రక్కకుబోయి చూడ నట బట్టదు పచ్చని పూరిమేనియున్" 91

అను పద్యము గలదు తుల్యమగు సన్నివేశమగుటచెతను, పెద్దనగారియందు రెడ్డిగారికి గల గౌరవాభిమానములచెతను అదే వర్ణనకు తమ రచనయందు చోటిచ్చియుండిరని తలంపవచ్చును

## కావ్యగత శాస్త్ర విషయములు -

**నదులు-స్వరూపము :-** వర్షరూపమున వచ్చు జలము కొండలమీద పడి వాగులుగా మారి కొంతదూరము ప్రయాణముచేయును ఇట్టివి కొన్ని కలసి ఏకమగుటచే నదులు ఏర్పడుచున్నవి ఇవి ఉన్నతస్థలములనుండి క్రమముగా ప్రవహించి అనేక ఉపనదులతో చేరి ఒకటిగా మారి సముద్రము వరకు పోయి అక్కడ పాయలుగా చీలి చివరకు సముద్రములో గలియుచున్నవి ఇది శాస్త్ర విషయము దీనినే దువ్వూరి కథారూపమున సుందరముగా చిత్రించిరి

"అచ్చట బచ్చటా మొలకలట్టుల నింపగు పైరుచేలయం
దిచ్చకు వచ్చినట్లు చరియించి యనంతర మూటకాల్వలం
జొచ్చి కొలంకులం గలువబోటులు పుష్పొడి కాన్కలీయగన్
హెచ్చిన సంతసంబున గ్రహించి నిజాలయిమేగు కోరికన్" 92

"బలిసి కూలంకషంబుగ బాఱునదుల
గలసి స్వస్థాన మేగితి గాంక్షదీఱ" 93

ఇందు వాగులు నదులలో గలియుననియు, నదులు సముద్రములలో గలియుననియు శాస్త్రసత్యమును వారు కథారూపమున తెలిపిరి ఇందు స్వస్థాన మనగా జలదాంగన మొదటిరూపమైన సముద్రమని యర్థము

**మేఘములు ఏర్పడు విధము** - పగలు సూర్యుని వేడిమికి సముద్రములు, నదులు తటాకములు మొదలగువానియందలి నీరు ఆవిరియై గాలిలో కలసి, ఈ వేడిగాలి పరిణామాభివృద్ధి చెంది తేలికపడి పైకి పోవునపుడు పైకి పోవును సముద్రమట్టమునుండి పైకి పోవుకొలది చలి యెక్కువగుచుండును ఆ కారణముగా నిట్లు పైకి పోయిన ఆవిరి చల్లబడి సూక్ష్మమైన జలబిందువులుగా మారును నీటియావిరి మనకు కనుపించదు కావున మేఘములయందు మనకు కనిపించునది నీటిబిందువులే గాని ఆవిరి మాత్రము కాదు ఇది మేఘములు ఏర్పడుటను గూర్చిన శాస్త్రవిషయము

దీనినే దువ్వూరివారు జలదాంగన మొదటిరూపము సముద్రమనియు, సూర్యుడు వేయి కరములతో కౌగిలించుకొనగా ఆవిరిగా మారి ఆకాశముపైకి పోయి జలదాంగనగా మారినదనియు కథారూపమున వివరించిరి

## (b) కవి - రవి

**రచనా కాలాదులు** -

దువ్వూరివారు తమ 46వ యేట భౌగోళిక రసాయనిక, వైజ్ఞానిక, జీవ శాస్త్రములకు సంబంధించిన విషయములను గ్రహించి వ్రాసిన కావ్యమిది కవిగారు దీనికి మొదట 'విశ్వరూపము' అని పేరిడినట్లు వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున నున్న వారి రచనల వ్రాతప్రతులనుబట్టి తెలియుచున్నది తరువాత కవి-రవి అని నామకరణము చేయబడినది దీని రచన 5-11-1941, 12-11-'41ల మధ్య గావింపబడినట్లు తెలియుచున్నది 13-11-1941 నుండి పలితకేశము రచన ప్రారంభమగుటచేతను, 5-11-1941 న అని విశ్వరూపము వ్రాతప్రతియందు లిఖింపబడి యుండుటచేతను పై విషయములు నిర్ధారింపవచ్చును

1936వ సంవత్సరము నుండి 1940వ సంవత్సరము వరకు చలనచిత్ర సాహిత్యరచన, దర్శకత్వాదులలో మునిగిపోయి ఆ కాలములో నెట్టికావ్యమును రచింపలేదు అది ఒక విచిత్రలోకము తదుపరి రామిరెడ్డిగారికి మరల కవిత్వము తనలో అంకురించునా? అన్న దిగులు పట్టుకొనినది శ్రేయోభిలాషులు కూడ కవికోకిలకు మరల వసంతమొకటి వచ్చు అవకాశము లెదని తలంచుచుండెడివారు

అట్టి స్థితిలో రామిరెడ్డిగారు ఒకనాడు నిద్రమంచముమీదినుండి కిటికి కమ్మల సందునుండి చూడగా "తూర్పుకొండను నవమోహనాంబుద ఎటంబులపై లిఖించికొన్న నూతన జల వర్ణచిత్రముల దర్శనశాల నమర్చి" 94 రమ్యాపి కార్భటిమిషతో సూర్యుడు రసజ్ఞులను పిలుచుచున్నాడు ఆదృశ్యము చూచినవెంటనే రామిరెడ్డిగారిలో మరల కవిత్వమునకు బీజారోపము జరిగినది వెంటనే కవి-రవి' రచన ప్రారంభమై అతితక్కువ కాలములోనే సమాప్తిచేయబడినది

## కథాసంగ్రహము -

సూర్యోదయసమయమున కవి కిటికి కమ్మలనుండి సూర్యునిగాంచి నిందించును సూర్యుడు తాను లేనిచో భువన మంధీకృత మగుననియు, చేతనప్రపంచమునకు చేటు మూడుననియు చంద్రాది గ్రహములు సరణి దప్పుననియు తన గొప్పదనమును వివరించును తదుపరి కవి ప్రార్థనపై సూర్యుడు తన జనన ప్రకారమును, భూమియొక్క పుట్టుకను జీవుల పుట్టుకను, వాని క్రమపరిణామమును గూర్చి బోధించును

అర్ధనారీశ్వరరూపిణియైన ఆదిశక్తి అగ్నిగోళము లనెడు అండములను పెట్టెను అందొక్కొక్కటి పగిలి సూర్యబింబములుపుట్టి ఆకసమునకు ఎగసినవి సోదరు లందరిలో అల్పతనుడు మన ప్రస్తుత సూర్యుడు అతడు బాల్యములోనే కళంకిత దేహుడగుటవలన సోదరులచే ఆకాశములోనికి విసరివేయబడగా చండ సమీరము తాకిడికి మింటికి ఎగసిపోయినాడు ఆ గాలి తాకిడివలన ఆకాశము క్రిందు మీదైనట్లు పెనుచీకట్లు, ఉల్కాపాతములు, నక్షత్రధూళియు వ్యాపించినవి సూర్యుని రాపిడికి నక్షత్రములు పగిలి ధూళిగా మారి వెంట పరతెంచినవి

ఈవిధముగా సూర్యుడు తారామండలమున చిక్కుకొని కొంతకాలము కుమ్మరిసారెవలె తిరిగి తిరిగి పరిసర ధూళి మేఘములను తనదేహమున ఇమిడించుకొని అన్నలవలె బలాధికుడైనాడు ఇంతలో తనకన్న ఎన్నియో రెట్లు ఘనతరమైన తార సమీపించగా సూర్యునిదేహము గతుకునబడ్డ బండివలె కదలిపోయినది శరీరమున కణితలు పుట్టినవి అవి ముదిరి పెద్దవై పరిభ్రమణవేగమునకు విడివడి సూర్యుని ఆశ్రయించియే తిరుగసాగినవి అట్లు విడివడి తిరుగుచున్న కణితలలో భూమి ఒకటి

ఆ భూమికి మరొక కణిత పుట్టి అదియును కాలక్రమమున ముదిరి విడి పోయినది ఆ కణితయే చంద్రబింబము అను పేరుతో భూమిచుట్టు తిరుగుచున్నది

ఇరువదిలక్షల అంతరీపవిశ్వములు గ్రాలు బ్రహ్మాండ విపులకుక్షిలో ఎందరో మండలాధిపులైన సూర్యులు గలరు అందు ఒకదీవి మనకు గనిపించు సూర్యుని సామ్రాజ్యము ఇందు అనేకులు సూర్యులు ఏకాకులై సంచరించుచుం దురు మరికొందరిని చుట్టి అందందు గ్రహములు తిరుగుచుండును ఉష్ణ మను కూలమై యుండుటవలన ప్రస్తుతము ధాత్రియందు మాత్రమే ప్రాణిసృష్టి జరుగు చున్నది మనకు దగ్గరగానున్న సూర్యునికాంతి భూమిని జేరుటకు అయిదేండ్లు పట్టును దూరమున నున్న సూర్యులనుండి వచ్చు కాంతి పదునాలుగుకోట్ల సంవ త్సరములకు భూమికి ప్రాకును

ధరణికన్న సూర్యుడు పదిలక్షల రెట్లు ఎక్కువ సూర్యునికంటె పది లక్షల తరముల హెచ్చుగల తారకలు ఆకాశమున నెన్నియో గలవు కావున ఈ సృష్టికి అంతులేదు

భూమి సూర్యునిదేహమున జన్మించి ఇన్నూరుకోట్ల సంవత్సరము లయి నది తండ్రియైన సూర్యునియొక్క అత్యుష్ణతత్త్వము తనయందుకూడ నెలకొని యుండెను భూమి సూర్యునిచుట్టు తిరుగుచుండుటచే ఆ వేడిమికి భూమి క్రమ ముగా గట్టిపడి ముడుచుకొనిపోవుచు, చల్లబడుచు నుండినది

క్రమముగా వాతావరణము ననుసరించి జీవసృష్టి ప్రారంభమైనది సము ద్రమున బురద, సున్నము సమ్మేళనముపొంది పగడ తీగెలు, గుల్లజీవములు జన్మించినవి తరువాత కొంతకాలమునకు వెన్నెముక చట్టముగలిగిన చేప పుట్టి నది ఆ చేపలు పడియల నీరు ఇంకిపోవుటచే బయటకు తలెత్తి గాలి పీల్చు చుండుటవలన క్రమముగా ఊపిరితిత్తు లేర్పడినవి కొన్నిటికి అవసరార్థము రెక్కలు పుట్టినవి అవి కాళ్ళుగా మారి నానాటికి జలచరత్వము సమసిపోయి భూచరత్వము సమకూడినది క్రమముగ సురమృగము జన్మించినది పాలిచ్చి పెంచు పసరములు జన్మించినవి విపినములలో తిరుగు మర్కటములు పరిస్థితు లను బట్టి వేవేలు తెగలుగా పరిణామము నొందినవి వానిలో వాలహీనములైన నాలుగు జాతులు క్రమక్రమముగ జనన మొందినవి అందు ఒకజాతి వానరము పోలికలు మానవునితో సరిపోలును ఆ నవీన వానరసంఘమందలి ఒకతెగ ప్రస్తు తము ఉనికిలోనున్న మానవజాతి వానరములనుండి ఆదిమానవుడు జన్మించుటకు

కోటివత్సరములు పట్టినది వాని నాగరికత ముప్పదివేల సంవత్సరములనాడు ప్రారంభమైనది ఆది చేతనాణువు జన్మమైనదాది ఇప్పటికి నూటపది కోట్ల యేడులు దాటినది ఏకమూలమే అనేక రూపములుగా పరిణమించి చివరకు మానవజాతి ఆవిర్భవించినది

**ఇతర ప్రభావములు** - ప్రతి కవిపైన తన అభిమానకవుల, పాత్రల స్థలముల ప్రభావములు ఒకవిధముగానో, వేరొకవిధముగానో గోచరించుచునే యుండును అట్లే దువ్వూరివారి రచనలలోగూడ ఇతర రచయితలజాడలు కొన్ని గోచరించుచున్నవి

రాయప్రోలు సుబ్బారావుగారు తమ 'తృణకంకణము'లో పవిత్రప్రేమ యొక్క స్వరూప స్వభావములను వివరించిరి నాయికానాయకులు సఖ్యభావముతో విడిపోయినతరువాత చివరగా-

"కడిగిన మృగమద పాత్రిక
విడువని పరిమళము ఎగిది విధినియమములన్
విడబడియును వారల పెం
పుడు మైత్రీప్రేమ బంధములు తెగవవురా" 95 అను పద్యముతో

కావ్యమును ముగించినారు

దీనిని పోలిన పద్యమొకటి దువ్వూరివారి కవి-రవిలో కూడ కానుపించుచున్నది సూర్యునినుండి భూమి ఇన్నూరుకోట్ల సంవత్సరములనాడు విడిపోయినను సూర్యునిచే ఆకర్షింపబడి అతని చుట్టు పరిభ్రమించుచున్నది ఆ సందర్భమున కవి-

'విధివశంబున దనువులు వేరువడియు
బ్రేమసూత్రాలు దెగవు మా హృదయములను" 96 అని సూర్యునిచే పలికించినారు ఈ రెండుపాదములును రాయప్రోలువారి పై పద్యమునందలి చివరి పాదములను భావవిషయములో పోలియున్నట్లు కనుపించుచున్నవి

శ్రీకృష్ణుడు అర్జునునకు ఉపదేశించిన భగవద్గీతలో జ్ఞానకర్మసన్యాసయోగ మను పేరుగల అధ్యాయములో-

"యధా యధాహి ధర్మస్య గ్లానిర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య తదాత్మానం సృజామ్యహమ్" 97

"పరిత్రాణాయ సాధూనాం వినాశాయచ దుష్కృతాం
ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యుగేయుగే" 98

పై శ్లోకములందలి భావము కవి-రవిలోని ఒక పద్యములో కాననగును

"ధర్మ మడుగంటి దుర్నీతి దౌష్ట్య మొకట
గలసి లోకంబు పాపపంకిలము గాగ
ధర్మసంస్థాపనార్థంబు దైవశక్తి
మానవాకృతి గైకొనుమాటవినవె" 99 అని కవిగారు రవిని ప్రశ్నించును

మనుచరిత్రయందలి వరూధిని యక్షుల పాత్రల ప్రాధాన్యము ఆంధ్ర పాఠకలోక మెరిగినదే ఈ వరూధిని, యక్షులె దుర్భూరివారి దృష్టినికూడ ఆకర్షించిరని చెప్పుటకు అవకాశముగల ఒక పద్యము గాన్పించుచున్నది

"కరుణాపాత్రుడ వీవు భాస్కరుడ యొక్కండుం ద్వదీయార్ద్రిక
ర్బుర వర్ణాంకిత చిత్రశిల్పముల సొంపున్ నిల్చి వీక్షింప డం
బర మార్గంబున గ్రుంకు మెట్టపయికిన్ మార్పించునీశాల, న
గ్గిరి నేయక్షుడొ, యే వరూధినియొ కాంక్షించుం గళాస్పష్టులన్" 100 అని

ప్రభాతసూర్యుని వర్ణించినారు దీనివలన యక్షుడు వరూధిని పాత్రలు కవిగారి హృదయమున నెంతటి ముద్రవేయగలిగినదియు ఊహింప వీలగుచున్నది

కవికోకిలకు పుణ్యక్షేత్రములలోఒకటైన తిరుపతితో ఎక్కువ పరిచయము గలదని చెప్పుట కవకాశమిచ్చు ఒకపద్యము గలదు

'తిరుపతికొండనెక్కి పురిదిక్కున జూచిన గ్రిందిగుళ్ళు గో
పురములు బొమ్మరిండ్లటు లపూర్వ నవాకృతి దోచు" 101

మనము తిరుపతి కొండపైనుండి క్రిందనున్న తిరుపతిని జూచినచో వారు వర్ణించిన విధముగా గోచరించును

కవి సూర్యుని నిష్ఠురముగా మాట్లాడు సందర్భమున-

"మనసున కజీర్తి హెచ్చిన దినమునందు
వెర్రికలల చిత్రంబులు వేయుదౌర
నీకును రవీంద్రసత్కవి నేర్పినాడొ" 102 అని యున్నారు మనమిచ్చట

రవీంద్రసత్కవికి వెర్రికలల చిత్రంబుల వేయు సూర్యునికి పోలిక ఏమిఉన్నదని ఆలోచించి జూచినచో సంజీవదేవ్‌గారి వాక్యములు గుర్తుకు వచ్చును

"అవి (రవీంద్రుని చిత్రములు) ఏ అర్థాన్నీ, ఏ భావాన్నీ ప్రదర్శించక కేవల లయమయ రూపాలే వాటి లయమయరేఖలూ రంగులూ కంటికి దృశ్యానందాన్ని ప్రసాదిస్తవి అంతేగాని అవి ఏ రూపానికో, భావానికో అనుకృతులు కానీ ప్రకృతికి ప్రతికృతులు కానీ కావు అవి వాద్యసంగీతంలాంటివి" 103

రవీంద్రసత్కవి పదప్రయోగములో అంతటి స్వారస్య మున్నది

## కావ్యగతశాస్త్ర విషయములు -

**జీవశాస్త్రవిషయము** - 'థేలిజ్' అను గ్రీకు శాస్త్రవేత్త జీవరాశి మొట్టమొదట నీటిలోనుండి ఉద్భవించినదని చెప్పియున్నారు దీనినే దువ్వూరివారు సముద్రపు అంచులయందు క్షారపుష్పము పూచినదనియు, అది మంచునీటికి కరగి జిగురు నురుగు గల పొర యొక్కటి సృష్టియయ్యెననియు అందు అణుప్రమాణములైన సూక్ష్మజీవు లెన్నెన్నో ప్రభవించినవనియు పేర్కొనిరి

మానవుని పరిణామక్రమమునుగూర్చి 'అరిస్టాటిల్' అను గ్రీకు తత్త్వవేత్త సృష్టినంతటిని నాలుగువిధములుగా విభజించి నిరింద్రియపదార్థములనుండి వృక్షజాతులు, వానినుండి వృక్షజంతువులు, ఆ తరువాత జంతుజాతు లేర్పడినవని భావించినాడు జంతువులలో కూడ నిచ్చెనమెట్లెక్కినట్లుగా ఒకదానివెనుక ఒకటిగా పురుగులు చేపలు సరీసృపములు, పక్షులు మృగములు, ఆ తరువాత మానవుడు క్రమముగా పరిణామము చెందినాడని భావించినారు ఈ విషయమునే గ్రహించి దువ్వూరివారు-

'నీటి పురువులు చేపలు నిఖిల జలచ
రంబులును చెట్టుచేమలు ప్రబల ఖేచ
రములు మృగములు సృష్టియై ప్రాతవడిన
పిదప మనుజుండు పొడసూపె బృధ్వియందు" 104 అని సృష్టి రహస్యమును దెలిపియున్నారు

'బ్యుఫాన్' అను ఫ్రెంచి శాస్త్రజ్ఞుడు పరిసర ప్రభావములవలన జీవ జాతులలో మార్పులు ప్రత్యక్షముగా సంభవించి ఆ నూతన లక్షణములు క్రమముగా జాతిలో స్థిరపడునని ఆ విధముగా నూతన జాతు లేర్పడునని సిద్ధాంతీకరించియున్నారు ఈ సిద్ధాంతమునే దువ్వూరివారు-

"పరిసరంబుల భేదంబుబట్టి వాని (సూక్ష్మజీవులు)
యందు ప్రత్యేకతలు కొన్ని వ్యక్తమయ్యె 105 అని చెప్పియున్నారు

ప్రతిప్రాణి తన మనుగడకొరకు ఆరాటపడుచుండును ఈ జీవన సంఘర్షణలో జీవనప్రమాణమున బలముగల జీవులు దుర్బలమగు జీవులను చంపి తినుట సహజము

"జీవన స్పర్ధ నామాన్య చేష్ట యౌట
బలముగల యవి దుర్బలములను మెసవు ' 106

ఇది డార్విన్ అను జీవశాస్త్రవేత్త నిర్వచించిన యోగ్యాతి జీవనము (Survival of the fittest) అను సూత్రము ననుసరించి వ్రాయబడినట్లు దొచుచున్నది

**భౌగోళిక విషయము** - క్రీ శ 1749వ సంవత్సరములో 'కామ్‌డిబఫా' అను శాస్త్రవేత్త సూర్యునికి బాహ్యనభోమార్గములో ఉన్న ఒకానొక తోకచుక్కతో అభిఘాతము సంభవించిన కారణముగా వీనినుండి ముక్కలైన కొంత పదార్థము నభోమార్గములో తిరుగుచు సూర్యుని గురుత్వాకర్షణపరిధిలోనికి వచ్చినపుడు సౌరకుటుంబముగా మారినదని భూమి ఉద్భవసిద్ధాంతమును వెల్లడించిరి

దీనినే దువ్వూరివారు ఘనతరమగు తార సూర్యునివద్దకు రాగా అతని దేహమందు కొన్ని కణితలు పుట్టినవనియు అవి సూర్యభ్రమణవేగమునకు తట్టుకొనలేక విడివడిపోయినవనియు అట్లు విడివడినవానిలో ఒకటి భూమి యనియు భూమి ఉద్భవమునుగూర్చి కథారూపములో చెప్పియున్నారు

భూమి వయస్సును గూర్చి విష్ణుపురాణములో రెండువేల మిలియన్‌ల సంవత్సరములని చెప్పబడినది మరియు శాస్త్రజ్ఞులు సౌరకుటుంబము పాలపుంతలోని నక్షత్రపుంజమునుండి దూరముగా పోవుటనుబట్టి భూమి వయస్సు 2000 - 3000 మిలియన్‌ల సంవత్సరములని నిర్ణయించిరి ఇవి యన్నియు పరిశీలించిన దువ్వూరివారు ' ధరణి ఇన్నూరుకోట్ల సంవత్సరములపుడు" 107 ఉద్భవించినదని సిద్ధాంతము చేసిరి

**ఖగోళ విషయము** - ఈ విశ్వమున ఇరువది లక్షల ఇనులు గలరు కాని ప్రస్తుతము మనకు దోచునది సూర్యుడు ఒక్కడే మరి తక్కిన ఇను లెవరు • అనినయెడల మిగిలిన భాస్కరులు ఊహింపతరముగానంత దూరమున నుండుటచే చుక్కలవలె గానుపింతురనియు ఖగోళవిషయమును దెల్పియున్నారు

"ఈ ప్రపంచమునకు నేన ఇనుడనౌదు
తక్క భాస్కరు లూహింప దరముగాని
దూరమున నుంట జుక్కలై దోచుచుండ్రు" 108

చంద్రుడు భూమినుండి పుట్టినట్లు ప్రారంభదశలో భూమిలో ఒక భాగముగా నున్నట్లు వివరించు సిద్ధాంతముల నాధారముగా జేసికొని శాస్త్రజ్ఞులు భూమి వయస్సును నిర్ధారించిరి దీని నాధారముగా రెడ్డిగారు-

"దానికి (పృధ్వికి) నొక పెద్దకణిత పుట్టె
అదియు కాలక్రమంబున ముదిరి వీడి
సోమ బింబంబుగా నా భువి చుట్టు దిరుగు" 109 అని చంద్రబింబోత్పత్తిని వివరించిరి

భౌతికశాస్త్రము - సూర్యునికాంతి భూమిని చేరుటకు అయిదుసంవత్సరముల కాలము పట్టును అనగా కాంతి ఒక సెకనుకు 1 86,000 మైళ్ళ దూరము ప్రసరించునన్నమాట ధరణికన్న సూర్యుడు కొన్ని లక్షల రెట్లు హెచ్చు సూర్యుని కన్న కొన్ని నక్షత్రములు కొన్నిలక్షల రెట్లు హెచ్చు

రసాయనశాస్త్ర విషయము - కొన్ని పదార్థములు కొన్ని ద్రావకములతో గలసినపుడు రసాయనికప్రక్రియ జరుగును నీరు భూమిపై ప్రవహించి భూమిలో రసాయనపదార్థములు తయారైనవని తెలుపుచు దువ్వూరివారు-

"వాననీటను బల్లాలు పల్లెల్ల
నిండి వారిధులయ్యె ఆ నీటియందు
అవని గల యుప్పు ధాతులోహములు గలిసి
యొక అపూర్వ రసాయనయోగ మొదవె" 110 అని తెలిపియున్నారు

ఈవిధముగా తమ శాస్త్రపాండిత్యము నంతయు ఇంచుమించుగ ఈ కావ్యమున ప్రవేశపెట్టిరి వారు దీనిలో-

'సర్వంబు జరిగిన కథయె దప్ప
అవగింజంత యత్యుక్తియైనలేదు" 111 అని తామే చెప్పియున్నారు

శ్రీ కె వి రమణారెడ్డిగారు 'కవి-రవి'ని గురించి వ్రాయుచు 'వచనంలో సాదాగా చెప్పవలసినదానిని రామిరెడ్డి పద్యములో నిబంధించి కావ్యవస్తువుకు అన్యాయం చేశాడు" 112 అని వ్రాసియున్నారు

కాని దువ్వూరివారు తమ రచనను ఆద్యంతము సులభశైలిలో సర్వ సుబోధకముగా నుండునట్లు వ్రాసియున్నారు పైగా శాస్త్రవిషయము పద్యకావ్యములో వ్యక్తీకరింపబడుటచేత రసానందమును కూడ గలిగించి పాఠకులను ఆకర్షింపజాలియున్నది కావున రెడ్డిగారు కావ్యవస్తువునకు అన్యాయముచెసిరనుట అంత సమంజసము కాదేమొ '

## (v) ఇతర రచనలు

పైన జెప్పిన సాంఘికములు నీతిబొధాత్మకములు, కృష్యాది గ్రామజీవనాధారములు విజ్ఞానశాస్త్రాధారము లను వర్గములలోనికి జేరని కావ్యరచనలు ఇందు పరిశీలింపబడును వినిలో కొన్ని అసంపూర్ణరచనలు కొన్ని సంపూర్ణ రచనలు గలవు

### అసంపూర్ణ రచనలు -

దువ్వూరి తమ కవితాభ్యాసకాలమైన 1916-1917 లో అనేక పుస్తకములను చదువుటయేగాక రచనలుచేయుట కూడ జరిగినది ఈ సమయములోనే రసికజనానందము, స్వప్నాశ్లేషము, అహల్యానురాగము, శ్రీకృష్ణనిరాయబారము లను ప్రబంధములను రచించిరి ఋతుసంహారము పుష్పబాణవిలాసములను ఆంధ్రీకరించిరి వీనిని గురించి వారే "ఆ కావ్యములు వ్రాతనెరవడి కుదురుటకు వ్రాయబడు కాపీ పుస్తకములవలె నున్నవనియు ప్రకటనార్హములు కావనియు భావించి మూటకట్టి మూలపెట్టితిని" 113 అని చెప్పుకొని యున్నారు

1927 లో వచ్చిన తుఫానుగాలికి పుస్తకముల బీరువా తడిసిపోయినది వ్రాతప్రతుల దస్తరము కూడ నానిపోయినది అక్షరములు సరిగా కనుపించుటలేదు ఇట్లు భగ్నావశిష్టములైన కావ్యములను ఖండకావ్యముల సంపుటము చివరలో ప్రథమకవిత్వ మను పేరుతో చేర్చినారు స్వప్నాశ్లేషముమాత్రము పనికిరాని విధముగా చివికిపోవుటచే నామమాత్రావశిష్టమైనది దొరికినంతలో వీనినిగూర్చి వరుసగా పరిశీలింతును

## (a) రసికజనానందము

ఐదువందలఏబది పద్యములతో, నాలుగాశ్వాసములలో ఈతడు తొలుత రచించిన సంపూర్ణకృతికి నేడు ఉపలబ్ధములగు అంశములు అరువది పద్యములు, అరడజను గద్యలు మాత్రమే దీనినిగూర్చి దువ్వూరివారు శ్రీ తిరుపతివేంకట

కవుల శ్రవణానందమును చదివినవెనుక అటువంటి కధనే కల్పించి కావ్యము వ్రాయవలయునని దీనిని (రసికజనానందము) వ్రాసితిని " 114 అని చెప్పుకొని యున్నారు ఇందు కృష్ణుడు శివుడు బ్రహ్మల ప్రార్ధనము ఎరుసగా చెయ బడినది

## కధాసంగ్రహము -

ఒక పురమున తాతలనాటి ఆస్తి ఐదువందల ఎకరములు గలిగినవాడును, ధాన్యపుగాదెలు, పాడియావులు గలిగినవాడునైన ఒక పెద్దకాపు ఉండెడివాడు అతనికి పుత్రు డుదయించి క్రమముగ పెద్దవాడై యౌవన ప్రారంభసమయిమున కామాయత్త చిత్తు డయ్యెను ఆతని గృహమునకు కొలది దూరములో రోవెలదుల వాడ గలదు అందు కనకాంగి యను కన్య సౌందర్యరాశియై యొప్పచుండెను

ఒక వసంతకాలమున సాయంసమయమున కాపుకోడెగాడు ఉద్యానవన మున గూర్చుండి వారకాంతాయత్త చిత్తముతో వారివారి చేష్టలను నుతించెను గృహిణులను పేడతట్టలుగా సంభావించి మన్మధవివేకశూన్యులుగా తలంచెను

ఒకనా డాతడు రాలయుంగరములు పెట్టుకొని వెలవెలందుల వాడకు జని అచ్చట గల పల్లవపాణులను జూచి వారి యందమునకు సమ్మోహితు డయ్యెను వేశ్యమాత కుమార్తెతో ధనమును తీసికొని దాచియుంచినచొ ఆయన ఎప్పుడు అడిగిన అప్పు డీయవచ్చునని పల్కి ఆతనినుండి రొక్కమును తీసికొని ఇనుప పెట్టెలో పెట్టెను

ఒకసంవత్సరకాలముపాటు వెలవెలది కాపుకోడెగాడును సంతోషములలో కాలము గడపిరి ఒక్కనాడు వేశ్యమాత ధనాపేక్షతో ని దాపున యా ఆనయు జేరి ఒక అబ్బమైనది నేను దాచిన ధనమంతయు నీనాటికి అడుగుపట్టినది నీ విటకు వచ్చినదిమొదలు ఏవిటులు ఎంత విత్తమిచ్చెదమన్నను నా వాకిలి త్రొక్క నిచ్చుటలేదు కోకలు చినిగిపోయినవి రవికలను చాకలి పారవేసినది ఘన సార మృగిమదములులేక నెలతయు విలేపనము రొమ్మున పూసికొనుటలేదు నా కష్టములన్నియు మీకు చెప్పుకొంటిని మన కన్యకు తెలియునీయకుడు కార్య పద్ధతి చూడుడు' అని కోడెకానితో పల్కినది

అంత తల్లి ఒకరోజు రామకృష్ణారెడ్డిని బిలచి వెలతొయ్యలుల నెయ్య మును దెచ్చుకొని కులమును నిట గలుపుచున్నావనియు, నివు పెండ్లి చేసికొనవల

చిన యెడల కాపుకులమున అందమైనవా రున్నారుగదా' అని మందలించినది లభించిన పద్యగద్యములలో గల కథ ఇంతవరకే

## శ్రవణానందము - రసిక జనానందము -

శ్రవణానందమును తిరుపతివేంకటకవులు శృంగారప్రబంధముగా జెప్పు కొని యున్నారు రసిక జనానందము అను గ్రంధనామమే అది శృంగార ప్రాధా న్యము గలదన్న విషయము చెప్పకయే చెప్పుచున్నది

శ్రవణానందములో ఒక వెలతొయ్యలి బాలామణి మధుసూదనుడును, రసిక జనానందములో ఒక వెలయాలు రామకృష్ణారెడ్డియు నాయికానాయకులు

శ్రవణానందములో వెలయాలు మధుసూదనుని పొందుకొరకై తపించి పడరానిపాట్లు బడి చివరకు అతని పొందును సాధించినది ఇందులో కథానాయ కుడు వెలయాలిపొందుకై పరితపించిపోయి ఆమెయొక్క పొందును పొందినాడు

శ్రవణానందము వేశ్యాజనగర్హణము మూలమున నితిబోధ చేయ ప్రయ త్నించగా రసికజనానందమునకూడ చివరకు అట్టి ప్రయత్నము జరిగినట్లు చెప్పుటకు సంపూర్ణగ్రంధము లభ్యముకాకపోవుటచే సాధ్యపడకున్నది

## కావ్యగత విశేషాంశములు -

**కవితాలక్షణములు** - కవిత్వమును తిలపిష్టపుశైలిలో వ్రాయుటకన్న వ్రాయ కుండుట ఉత్తమము కవిత్వరచనాసమయమున భావరసప్రసంగములు మరువ రాదు మార్దవము పోవునట్లు కంటకమైన పల్కులను ఆదరింపరాదు శైలి సొంపును చూడగా నది ఇక్షురసమినెడునట్లుండవలయును బాలురుసైతము పద్య గతార్థమును తెలిసికొనుటకై వేరొక్కరిని యాచింప నవసరములేకుండునట్లుగా సులభశైలిలో వ్రాయవలయును

"రసికులు మెచ్చుకోవలె, విరాజితకుండలగండపాళి సొం
పెసగవలెన్, మరందరస మూటలు గట్టవలెన్ మిటారి మే
ల్పసిమి వలంద గుబ్బలను బయ్యెద జాఱిన బొల్చు క్రొంబసల్
పొసగవలెం గడింది, యటు పొల్పెసగన్ రచియింతుపే కృతిన్" 115

ఇవి కవిత్వవిషయములో రెడ్డిగారికి నచ్చిన అభిప్రాయములుగా వచ్చును

**వేశ్యాల వర్ణనము** - పురమందలి వేశ్యలను వర్ణించుట యనునది ప్రబంధ కవులందరును చేసిన ఎనియే రెడ్డిగారుకూడ ఇందు వేశ్యల వర్ణనము గావించిరి

"నీవి సడల్పకుండ, రమణీయకుచంబుల పైటదీయకే
ద్రావగనీక యోష్ఠరసపానము, మోసపుటక్కు లెల్పుచున్
జీవ మొకింతలేని విటశేఖరులన్ గిలిగింతలార్చి యే
భావజు కేళి దన్పకయె పంపుదు రర్థమునాచిరోచెలుల్ " 116

ఇందు వేశ్యలు డబ్బుగుంజుకొనుటకై ఆడు నాటకమంతయు దెలుపబడినది

**కులకాంతలయందలి లోపములు** - తొలిదశలో కథానాయకుడైన రామి కృష్ణారెడ్డి వేశ్యలయందు లగ్నచిత్తుడైనవాడు గాన అతనికి కులకాంతలయందు లోపములు గానుపించినవి

కులాంగనలు ఎల్లవేళలయందు తలలను దువ్వుకొని పండిగ పూవులు పెట్టుకొని పట్టుటంబరములను గట్టుకొని భర్తల భావములను హరియింప ప్రయత్నము చేయరట కులసతులు రోతెరవల వలె నాణెమైనవారు కారట

కులస్త్రీలకు మన్మధవివేకము శూన్యమట రసోక్తులను పలుకరట చేతలు మారుచేతలు వారియందు కనబడవట గాన మనునది అసలె కనబడదట సొగసులు చేసికొని, తరచుగా తలలు దువ్వుకొని పాటలుపాడి మగల మనస్సులను ఆకర్షించినచో సతీత్వధర్మములు విగళితమగునని వారు తలచెదరట అట్టి మగువలు పేడతట్టలవలె మారినచో పతివ్రత లౌదురెమొ॰ అని కథానాయకుడు ఊసడించుకొనుటయేగాక-

"ప్రాజ్ఞులాడిన 'శయనేషురంభ' యనెడు
సూక్తి కులసతి యెఱుగని సుద్ది యాయె
అట్టి నైపుణి వెలయాలి నాశ్రయించె" 117 నని వెలయాలియొక్క

గొప్పదనమును కులకాంతలయందలి లోపములను ఎత్తిచూపినాడు

సంఘసంస్కరణము పేరుతో వేదికలెక్కి ఉపన్యాసములు దంచి అవి తమకు గావు ఇతరు లాచరించుటకు మాత్రమే అని తలచి దొడ్డివాకిళుల నుండి భోగము ఇండ్లలో దూరు తహసీల్దారు కలక్టరు అగ్రహారికుడు, ప్లీడరు వంటి దులో నవ్వులపాలు గావింపబడినారు వేదికలెక్కి చెప్పిన నీతులన్నియు నేతిబీరకాయలవంటివని చేతలలో కానుపించవని ఆక్షేపించినారు

## (b) ఋతుసంహారము

కాళిదాసు రచించిన ఋతుసంహారమును దువ్వూరి పూర్తిగా నాంధ్రీకరించినారట కాని మనకు మిగిలినవి మాత్రము ఇరువది పద్యములే

కాళిదాసు ప్రథమ సర్గయందు గ్రీష్మర్తు వర్ణనము ద్వితీయ సర్గయందు ప్రావృడ్వర్ణనము తృతీయ సర్గయందు శరద్వర్ణనము చతుర్థ సర్గయందు హేమంతవర్ణనము, పంచమ సర్గయందు శిశిర వర్ణనము షష్ఠ సర్గయందు వసంత వర్ణనము గావించి తమ ఋతుసంహారమును ఆరు సర్గలలో రచించిరి

రామిరెడ్డిగారి అనువాదవిధానమునకు ఒక్క ఉదాహరణము చూపుదును కాళిదాసు వసంతర్తు వర్ణన సందర్భమున-

"పుంస్కోకిల శ్చూత రసాసవేన
మత్తః ప్రియాం చుమ్బతి రాగ హృష్టః
కూజన్ ద్విరేఫో ఽప్యయ మంబుజస్థః
ప్రియం ప్రియాయాః ప్రకరోతి చాటు" 118 అని వర్ణించినారు దీనినే దువ్వూరివారు-

సరస రసాల సాల నవసార కిసాల రసానవంబునం
బరభృతరాజ మెంతయును మత్తిలి రాగ రసాంతరంగయై
నిరతము నాడుకోయిలను నిక్కుచు ముద్దిడు, దేటి పద్మమం
దిరమున నర్మకృత్యముఁ దేల్చు ప్రియన్ మధువాని పాడుచున్" 119

అని అనువదించినారు

ఈ రెండింటి భావముమాత్రము ఒక్కటియే కాని వ్యక్తీకరణములో రెడ్డిగారు తెలుగుదనమును జూపి శైలిసౌందర్యమును ఇనుమడింపజేసిరి

## (c) అహల్యానురాగము

నూటపది పద్యముల కాకరమైన ఈ కావ్యము ఎక్కడ పోయినదో తెలియదట దీనిని రచించిన క్రొత్తలో దువ్వూరివారు పిశుపాటి శేషాచలశాస్త్రిలవారికి కొన్ని పద్యములను వినిపించిరట అందు రెండు పద్యములను వారు మెచ్చుకొనిరట ఆ రెండు పద్యములె ప్రస్తుతము లభించిన అహల్యానురాగములో మిగిలియున్నట్టివి

మొదటి పద్యమున యౌవనారంభమునందలి అహల్యయొక్క కొన్ని శృంగారచేష్టలు వర్ణింపబడినవి రెండవ పద్యమున-

"అలరుల్ చల్లని తావులం జిలుక, స్విన్నాంగశ్రమన్ వాయువుల్
దొలగింపన్ సెలయేళ్ళు, కోయిలలు పంతాలాడి పాడంగ, వె

న్నెల పర్వన్ విలసత్సమాధి పదవీనిష్ణాతు నాగౌతమున్
జెలి కౌగింటను బట్టె జా్రపతిమ బుంజీభూతకామార్తయై' 120 అని
అహల్య కామార్తయై గౌతముని కౌగిలించుకొనుట మనోజ్ఞముగా వర్ణింపబడినది

## (d) శ్రీకృష్ణుని రాయబారము

ఈ కావ్యము 215 పద్యములు గలిగిన అసంపూర్ణ రచనగా రెడ్డిగారే చెప్పు కొని యున్నారు కాని భగ్నావశిష్టమైనదానిలో మనకు లభించునవి 78 పద్యములు, 11 గద్యలు మాత్రమే పైగా శ్రీకృష్ణుని రాయబారము అను పేరునకు తగినట్లుగా లభించిన పద్యములలో కృష్ణరాయబార ప్రసక్తియే లేదు అక్కడక్కడ చివికిపోగా మిగిలిన పద్యముల సంకలన మగుటచే కథలో ఒక క్రమము గానుపించుటలేదు

ఇందు విష్ణువు, శివుడు బ్రహ్మలను వరుసగా నుతించిన అనంతరము సత్కవి స్తుతి గావింపబడినది

"భారత కావ్యరాజమున భావ రసోదధి తిక్కయజ్వశో
భారమణీయ కల్పనల వాకొనె గృష్ణుని రాయబారమున్
నే రచియింతు నేడు దగునేర్పున నద్దియె కాలపద్ధతుల్
మాఱుటజేసి నూత్నగతులన్ సమకాలికులెంతొ మెచ్చగన్' 121 అని

సమకాలికులు మెచ్చునట్లుగా కృష్ణరాయబారమును నూత్న పద్ధతులలో రచియింతు నని చెప్పుకొనియున్నారు

పిమ్మట "అని యిష్టదైవ ప్రార్థనంబును, సత్కవి ప్రశంసయు, విష్ణు లీలా బహుళత్వంబును గణించి పరితల కభ్యుదయపరంపరగా నా యొనర్పం బూనిన శ్రీకృష్ణరాయబారంబను ప్రబంధమునకు కథాక్రమం బెట్టిదనిన" 122 అను వచనముతో కథాప్రారంభము గావింపబడినది ప్రబంధ సంప్రదాయ ముద్ర ఇందు గోచరించును

కథాసంగ్రహము - కురురాజు భీష్ముడు, ద్రోణుడు, అశ్వత్థామ, సంజయుడు కృపుడు మున్నగువారితో సభ దీర్చియుండుట సందర్భవశమున కర్ణుడు బ్రాహ్మణుల నిందించుట, అశ్వత్థామ కోపపూరితుడగుట, ధృతరాష్ట్రుడు సంజయుని పిలువ నంపుట, పిదప పాండవులయొద్దకు సంజయుడు రాయబారిగా వెడలుట, ధర్మరాజు ధృతరాష్ట్రుదుల క్షేమసమాచారము లడుగుట, తుల్యబలులైన

ఇరుతెగలవారు నెమ్మిమై నుండుట శ్రేయమనియు సంజయుడు ఎల్కుట కర్ణ దుర్యోధనుల శౌర్యోత్కర్షను సహింపనోపక ఈసడించి భీముడు ఎకసక్కెముగ మాట్లాడుట మున్నగునవి లభించినంతవరకు గల కొన్ని విషయములు

**కావ్యగత విశేషాంశములు** - సభ్యుల అభిప్రాయముల తెలిసికొనుటకై ఎట్టులో కోపమడచుకొనియున్న దుర్యోధనుడు వారివారి అభిప్రాయములను వినిన తదుపరి వీరావేశముతో వారివారి నుద్దేశించి అవహేళనపూర్వకముగ మాట్లాడినాడు

"పర దోర్వీర్యము వందుల్లైపుడు గై వారంబులం జల్పుకొం
చు రణంబౌతజి నీతిశాస్త్రముల హెచ్చుల్ మాకు బోధించి ని
ర్భర శౌర్యాత్మునకేని పందతనముం బట్టించు పాండిత్య బం
ధురు పాటులు మాకు నాయఎడ నెందున్ లోటు వాటిల్లునే' 123

ఇట్లు దుర్యోధనుడు పల్కిన కర్ణకఠోరములైన పల్కులు విని భీష్ముడు కోపావేశ పూరితుడై -

"అబలయౌ ద్రౌపది యార్తయై కుయ్యిడ
నోలగంబున జీర లొలిచినట్లు
కపటపు ద్యూతంబు గల్పించి పాండుపు
త్రుల పాలి రాజ్యంబు గెల్చినట్లు
లక్కయింటను మేనలసి నిద్రవోయెడు
కుంతిపుత్రుల గాల్పగోరినటులు
విషసంయుతాన్నంబు పెట్టి భీమన్నను
జంపు యత్నంబులు సలిపినట్లు
అంతతేలికయె రణమందు నిల్చి
పార్థబాణాసనోన్ముక్త పరకఠోర
కంఠలుంఠన లీలాప్రకార ఘోర
శరపరంపర కోర్వంగ గురుకులేశ" 124 అని కౌరవుల చర్యలను నిరసించి, అర్జునుని శౌర్యప్రతాపములను బొగడినాడు

ఇందలి వీరి రచనను పరిచయము చేయుటకై పై రెండు ఉదాహరణముల జూపియుంటిని

## సంపూర్ణ రచనలు

### (e) పు ష్ప బా ణ వి లా స ము

ఇది సంస్కృతములో కాళిదాసు విరచితముగా పేర్కొనబడుచున్న 'పుష్పబాణవిలాసమ్' 125అను కావ్యమునకు ఆంధ్రీకరణము సంస్కృతమున నిది శృంగార ప్రధానమైనది దాని ఆంధ్రీకరణమే గనుక ఇదియును శృంగార ప్రధానమే

సంస్కృతమున మొత్తముమీద ఇరువది ఆరు శ్లోకములు గలిగిన ఈ కావ్యము ప్రసాద గుణభూయిష్టమై వసంతతిలక, శార్దూలవిక్రీడితాది వృత్త ములలో నిబద్ధింపబడినది ఈ కావ్యమున శబ్దాలంకార అపేక్షచేత స్వభావోక్తి వ్యాజస్తుతి మున్నగు కొలది అర్థాలంకారములకు మాత్రమే ప్రాధాన్య మున్నది ఏ పద్యమున కాపద్యమే ఒక ప్రత్యేక శృంగారసన్నివేశమును వర్ణించుచుండును విరహవేదన, ప్రణయిదౌత్యము ప్రియాసమాగమము, ప్రియాభిసరణము రతి మున్నగు భిన్నావస్థలు వర్ణింపబడినవి దుప్పూరివారి అనువాదములో ఇరువది నాలుగు పద్యములు మాత్రమే గలవు ఈ అనువాదము సమగ్రిముగా నున్నది

వీరేగాక దీనిని తెలుగులో అనువదించినవారిలో వింజమూరి శివరామారావు కవికిశోర శంకరప్రసాదుగారలు కలరు మరియొక అనువాదము కొలకుల నారా యణరావు భట్టారం మల్లికార్జునం గారలు కలసి చేసినది మరి యింకను అను వాదము లుండినను ఉండవచ్చును 126

**కావ్యగతాంశములు** - దుప్పూరివారు అనువదించనివి రెండు శ్లోకములు గలవు

"సత్యం తద్యదవోచథా మమ మహాన్ రాగస్త్వదియాదితి
త్వం ప్రాప్తోఽసి విభాత ఏవ సదనం మాం ద్రష్టు కామోయతః
రాగం కిం చ బిభర్షి నాథ' హృదయె కాశ్మీర పత్రోదితం
నేత్రే జాగరజం లలాటఫలకే లాక్షారసాపాదితమ్ 127

"ఏతస్మిన్ సహసా వసంతసమయే ప్రాణేశ' దేశాంతరం
గంతుం త్వం యతసే తథాపి న భయం తాపాత్త్వదోఽధునా
యస్మాత్తై కైరవ సారసౌరభముషా సాకం సరోవాయునా
చాంద్రీ దిక్షు విజృమ్భతే రజనిషు స్వచ్ఛా మయూఖచ్ఛటా" 128

మిగిలిన శ్లోకములన్నియు భావములలో మార్పుగాని, పెంపు కుదింపుగాని చేయక ఇంచుమించు యథాతథముగ అనువదించిరి కొన్ని పద్యములను పరిశీలింతము

'దృష్టం బిమ్బధియాధరాగ్రమరుణం పర్యాకులో ధావనా
ద్ధమ్మిల్ల స్తిలకం శ్రమామ్బుగలితం ఛిన్నా తనుః కణ్టకైః
ఆః కర్ణజ్వరకారి కఙ్కణ ఝణత్కారం కరౌ ధూన్వతీ
కిం భ్రామ్యస్యటవీశుకాయ కుసుమాన్వేషా ననాందా గ్రహీత్" 129

దీనినే దువ్వూరివారు-

"కీరము బింబమంచు గొఱికెన్ బెదవిం బరుగెత్త వీడె నీ
భారపు గొప్పు, మోము శ్రమవారికణంబులదోగె, గంటకాం
కూరము మేన గాటులిడె గోమలి, కంకణ మార్భటింపగన్
బొఱెదవేల చిల్కకయి భ్రాంతి ననందయు బూలుగోసెడిన్ 130

శ్లోకములో చెమటచేత తిలకము నష్టమైపోయినట్లు చెప్పబడినది దువ్వూరివారు తిలకముమాటయెత్తకయే మోము శ్రమవారికణములతో దోగాడినట్లు చెప్పినారు

'సాస్రే మా కురు లోచనే విగలతి న్యస్తం శలాకాఞ్జనం
తీవ్రం నిఃశ్వసితం నివర్తయి నవాస్తాభ్యన్తి కంఠస్రజః
తల్పే మాలుర కోమలాఙ్గి తను తాం హంతాఙ్గరాగోఽఖ్నతే
నాతీతో దయితోదయాన సమయే మాస్మాన్యథా మాన్యథాః" 131

దీనిని రెడ్డిగారు-

"కన్నుల నీరు పెట్టకుము కజ్జలరేఖ కరంగిపోయెడుం
గ్రొన్నన కంఠమాల రుచి గుందగ నూర్చెదవేల కోమలీ
మిన్నక పొర్లకే పడుకమీద సుగంధపుబూత చిట్లు, నీ
వెన్నకు వేఱురీతి గ్రమియింపదు కాంతుడు వచ్చు వేళయున్" 132

ఇందు శలాకమను విశేషణము విడిచిపెట్టబడినది

"కాంతుడు మ్రొక్క నించుకయు గాంచ దతండును, గిన్కబోయినం
జింత నిరంతముం బొగులు జెచ్చెర నెచ్చెలులంత వల్లభుం
జెంతకు బల్మిదే మఱల జెల్వయి మౌనము బూను, గ్రమ్మఱన్
వంత నతండుబోవ జెలిప్రాణము కంఠము నాశ్రయించెడిన్" 183

మూలములో "ప్రియతమే నిర్గంలు కామే ఏనః" 134 ప్రియతముడు తిరిగివెళ్ళుటకై ఇచ్ఛగించుచుండగా నాయిక కంఠగలప్రాణ యగుచున్నదని చెప్పబడినది కాని దువ్వూరివారు తిరిగి అతడు ఐగా చెలిప్రాణము కంఠము నాశ్రయించినదని చెప్పియున్నారు

మొత్తముమీద ఈ అనువాదము మనోజ్ఞముగా సాగినది

## (f) పానశాల

### రచనా కాలాదులు -

5-10-1926న ఖయ్యాముయబాయతను పారసీమూలమునుండి తెనుగుచేయుటకు మనసుపడి ఐదారు పద్యములను వ్రాసిరి 10-10-1926 తేదీ రాత్రి హృదయము కలకపారి నరకసదృశమయి నీచములగు భావములకు ఆటపట్టైయుండి నిద్రపట్టుట లేదట ఆ సమయమున రుబాయిలు నాంధ్రీకరించిన బాగుగా నుండునను ఉద్దేశ్యముతో ప్రొద్దుపొడుపువరకు రుబాయిలను లర్జుమాచేసిరట తదుపరి రెండు దినములలో వారు గుర్తుపెట్టుకొనిన రుబాయీ లన్నియు ఆంధ్రీకరింపబడినవి 14-11-1927 24-11-1927ల మధ్య మిగిలిన రుబాయిలు కూడ అర్జుమా చేయబడినవి అప్పటి ప్రతిమొత్తము నూటపది పద్యములతో నున్నది ఇప్పుడు నాకు లభించిన ముద్రణప్రతిలో నూట ఇరువదియైదు పద్యములున్నవి తక్కిన పదునేను పద్యముల నెప్పుడువ్రాసిరో వారు చెప్పియుండలేదు 16-7-1934 లో పానశాలకు ఉపోద్ఘాతమును వ్రాసిరి పానశాల పద్యములు 1928వ సంవత్సరపు జనవరి, ఫిబ్రవరి మార్చి భారతి పత్రికలలో వరుసగా ముద్రింపబడినవి 17-7-1934న ఖయ్యాముప్రశంస' ను వ్రాసిరి అది 1935 మార్చి భారతి పత్రికలో ముద్రింపబడినది అదే సంవత్సరములో గ్రంథరూపమునకూడ ముద్రింపబడినది

దీని రచనకు ఒక విధముగా ప్రేరణ కలిగించినవారు సన్నిధానము సూర్యనారాయణశాస్త్రిగారు వారు ' ఎబ్బారావు (రాయప్రోలు) తర్జుమా చేసిన 'ఉమరుఖయ్యాము' చక్కగా అర్థమగుటలేదనియు ఆ భావములను adopt చెసి తెలుగుజాతీయములలోనికి మార్చిన బాగుగ నుండుననియు" 135 దువ్వూరివారితో చెప్పిరి శిశుపాటి వేణుగోపాలుగారు రుబాయతు పారసీప్రతిని హైదరాబాదునుండి పంపిరి అందులోను ప్రియావియోగదుఃఖముకొనున్న దువ్వూరివారిని కాళిదాసుని

మేఘసందేశము ఖయ్యాము రుబాయతు బాగుగా నాకర్షించినవి రుబాయతు తెనుగుసేతకు ఉపక్రమించినారు

## అనువాద విధానము -

ఉమరుఖయ్యాము రుబాయీలలో రచించిన కావ్యమును దువ్వూరివారు వృత్తములలో తెనిగించిరి తేటగీతులను అక్కడక్కడ వాడిరి రుబాయికి నాలుగుపాదము లుండును ఒకటి రెండు నాలుగు పాదములకు అంత్యనియమ ముండును తత్త్వము నీతులు సంక్షేపించి చెప్పుటకు రుబాయీలు అనుకూల ముగా నుండును ఇది మన తేటగీతికి సరిపోవును గీతివలె నిదియు దేశ్య చ్ఛందమే

దువ్వూరివారికి లభించిన రుబాయతులో 692 రుబాయిలు గలవు అందు ఒకే భావము వివిధరూపములుగా పది లేక ఇరువది రుబాయిలలో చెప్పబడి యున్నది అవి యన్నియును ఖయ్యాము వ్రాసినవి కావు ఖయ్యాము ననుసరించి వ్రాసినవారి పద్యములుకూడ చేర్చబడినవి అందువలన దువ్వూరివారు ఒకేవిధ మైన భావము గలిగిన రుబాయిలను కొన్నిటిని ఎన్నుకొని, వానిలో మనోహర మైన ఒకటి లేక రెండిటిని మాత్రము గ్రహించి అనువదించిరి మరికొన్ని రుబా యిలలో ఒక పాదము మాత్రము క్రొత్తభావములను వెల్లడింపగా మిగిలిన మూడు పాదములు చర్విత చర్వణముగ నుండును అట్టిచోటుల రెండు, మూడు రుబాయిలను కలిపి ఒకేపద్యముగ వ్రాసిరి

సాధారణముగ పారసీకకావ్యములలో పునరుక్తులు చాల ఎక్కువగా నుం డును ఈ దోషము సెమిటిక్ భాషాకుటుంబమునకు చెందిన కావ్యములకు సహ జము 136 ఖయ్యాము రుబాయిలందుకూడ ఈ లక్షణములు అధికముగా కనిపిం చును మరి మన తెలుగుకావ్యములలో పునరుక్తిని దోషముగ పరిగణింతురు కావున దువ్వూరివారు పునరుక్తులను తొలగించుకొని మన భాషాసంప్రదాయాను సారముగ రచన గావింపవలసి వచ్చినది దువ్వూరివారే తమ ఆంధ్రీకరణ విధాన మును గూర్చి-

"నా ఆంధ్రీకరణము మూలమునకు టీకవలె నుండదు తిక్కన, శ్రీనా థుడు మున్నగు అనువక్తలు వహించిన స్వాతంత్ర్యమును నేనును వహించితిని అట్లనుటవలన నా తర్జుమా మూలమునకంటె భిన్నముగ నున్నదనని చెప్పుటకు

పారసీక జాతీయములలో ప్రకటింపబడిన భావమును అట్లే తెలుగులో స్ఫురించుటకు ఆవశ్యకములైన మార్పులను రసపోషణమునకు పలయు కూర్పులను గావించితిని" 137 అని చెప్పుకొనియున్నారు. ఈవిధముగ అమృతమువలె తీయనైన తెనుగులో ఖయ్యాము భావములు ఏర్చి చెర్చి కూర్చి, చక్కని కావ్యములు రచించి, తెనుగుదేశములో ఖయ్యాము కీర్తిని శాశ్వతమగునట్లు చేసిన ఘనత దువ్వూరివారికి దక్కినది

## తెలుగులో రుబాయతులు - పానశాల స్థానము -

ఉమరుఖయ్యాము కావ్యమును పారసీభాషనుండి మొట్టమొదటగా ఆంగ్ల భాషలోనికి అనువదించినవాడు ఎడ్వర్డ్ పిట్జ్ గెరాల్డు అతడు దీనిని 1856వ సంవత్సరములో ప్రకటించినాడు ఉమరుఖయ్యాము ప్రతిభ ఫిట్జ్ గెరాల్డు అనువాదము వలననే అన్ని దేశములలో వ్యాపించినది తెలుగులోనికి రుబాయీలను అనువదించినవారిలో కొందరు ఫిట్జ్ గెరాల్డు ఆంగ్లానువాదమును ఆధారముగా గొనియు మరికొందరు మూలమును ఆధారముగా గొనియు రచనలు గావించిరి తెలుగులోని అనువాదములను ఈ క్రింద జూపుదును

| | కవి | గ్రంథనామము |
|---|---|---|
| 1 | రాయప్రోలు సుబ్బారావు | మధుకలశము |
| 2 | రామచంద్ర అప్పారావు | అమర కావ్యము |
| 3 | రంగయ్యప్పారావు | ఉమర్ ఖయ్యాం-రుబాయిలులు |
| 4 | మడిపడగ బలరామాచార్య | ఉమరుఖయ్యాం-అమరగీతాలు |
| 5 | గుడిపాటి వెంకటచలం | ఉమరుఖయ్యాం-రుబాయీలు |
| 6 | దువ్వూరి రామిరెడ్డి | పానశాల |
| 7 | ఉమర్ ఆలీషాకవి | ఉమర్ ఖయ్యాం |
| 8 | మాధవపెద్ది బుచ్చి సుందరరామశాస్త్రి | ఉమర్ ఖయ్యామ్ |
| 9 | ఆదిభట్ల నారాయణదాసు | రుబాయత్ ఆఫ్ ఉమర్ఖయ్యామ్ |
| 10 | స్ఫూర్తిశ్రీ | మధుపాత్రిక |
| 11 | చిలుకూరి నారాయణరావు | ఉమర్ఖయ్యామ్ |
| 12 | అద్దేపల్లి రామమోహనరావు | మధుజ్వాల |

దేవులపల్లి వేంకట కృష్ణశాస్త్రి పల్లవ హనుమయ్య పి శ్రీదేవి బూర్గుల రామకృష్ణారావు అకిలి శ్రీరామశర్మ కాటూరి గోపాలరావు స్వామి శివశంకర శాస్త్రి కనకమేడల వేంకటేశ్వరరావు నారపురెడ్డి రామిరెడ్డి దొంతిరెడ్డి, లత మల్లవరపు విశ్వేశ్వరరావు మున్నగువారు కూడ ఉమరుఖయ్యాము రుబాయిలను ఆంధ్రీకరించినట్లు తెలియుచున్నది 138

ఇతర భాషలలోనికి అనువదించినవారిలో ఫ్రెంచిలో జె బి కోలె ఉర్దూలో వాఖిప్ మురాదాబాదీ హిందీలో ప్రముఖ కవి బచ్చన్ రఘువంశలాల్ గుప్తలు వంగభాషలో కాంతిచంద్రఘోష్ పరిచితులు ఈవిధముగా ఉమరు ఖయ్యాం రుబాయిలు అనేక భాషలలోనికి అనువదింపబడినవి ఇంకను అనువదింపబడుచునే ఉన్నవి

మూలము నాధారముగా జేసికొని గ్రంధరూపమున అనువదించినవారిలో ప్రముఖులు ఇద్దరనియే చెప్పవచ్చును ఒకరు దువ్వూరి రామిరెడ్డిగారు రెండవ వారు ఉమర్ ఆలిషాకవిగారు

రాయప్రోలు సుబ్బారావుగారు మొదలగువారు ఆంగ్లానువాదము ననుసరించి వ్రాయుటచేత అవి ప్రతిధ్వనులకు ప్రతిధ్వనులె అట్టి పరిస్థితిలో ఖయ్యాము హృదయము సంపూర్ణముగా నావిష్కరించుట అంతగా సాధ్యముకాకపోవచ్చును మూలము ననుసరించినచో కవి హృదయము అవగతము చేసికొనుటకు ఎక్కువ అవకాశములు గలవు

ఉమర్ ఆలిషాకవి అనువాదము మక్కికి మక్కిగా గావింపబడినది మరి దువ్వూరివారి పానశాల రుబాయతుకు నకలు కాదు ఖయ్యాం రచన తేనెతెట్టె వంటిది యైనయెడల రామిరెడ్డిగారి రచన తెట్టెనుపిండి నింపిన తేనెగిన్నెవంటి దని చెప్పవచ్చును ఖయ్యాము పట్టుబట్టి ఒకేసారి రుబాయిలను వ్రాయక అప్పుడొకటి, అప్పుడొకటి వ్రాయుటచేత పునరుక్తులు ఎక్కువగా నున్నవి దువ్వూరి వారు పునరుక్తులను తొలగించిరి అంతియెగాక నాలుగైదు రుబాయిలలో విపులముగ, వదులుగనున్న భావమును ఒక్క పద్యములో కుదించి శోభను గూర్చిరి ఖయ్యాము రచనలోలెని సొగసుదనమును జతచేర్చి దేశీయ మనిపించునంత స్వతంత్రముగ అనువదించిరి అందుచేతనే యావదాంధ్రలోకము దువ్వూరి వారిని అభినందించినది

ఆంధ్రదేశమునందు వెలసిన రుబాయలు అనువాదములలో పానశాల తల మానికము వంటిదని చెప్పవచ్చును దువ్వూరి రచనలలో పానశాలకు వచ్చినంతటి కీర్తి కృషీవలుడు తప్ప తక్కిన యే కావ్యములకును రాలేదు

పానశాలలోని ఇతరాంశములను ఎరుంగుటకు మనము మూలగ్రంథ కర్తను మూలగ్రంథమును పరామర్శింపవలసి యుండును కారణ మేమనగా దువ్వూరి మూలగ్రంథమునందలి ప్రధానభావములను అందముగా కమ్మగా అందించుటకు ప్రయత్నించినవారే కాని తన సిద్ధాంతములనుగాని తననాటి పరి స్థితులను గాని అందు ప్రవేశపెట్టు ప్రయత్నము చేసినవారు కారు

## ఉమరుఖయ్యాము - వేమన -

కొన్నివిషయములలో దప్ప ఖయ్యాముతో సరిపోల్పదగినవాడు మన తెలుగుకవులలో వేమనయే ఖయ్యాము భోగి వేమన యోగి ఖయ్యాముది రక్తి మార్గము, వేమనది విరక్తిమార్గము ఖయ్యాము శాస్త్రోపాసకుడు వేమన ఆత్మ సాధకుడు వేమన్నను ఆంధ్రపండితులు కవిగా లెక్కచేయనట్లే పారశీక పండి తులు ఉమరుఖయ్యామును లెక్కచేయలేదు వీరిరువ్రురును సాంఘిక దురాచారము లను, కపటగురువుల మతవ్యాపారములను భక్తుల వేషధారణమును మొగ మోటము లేక ఖండించినారు

వేమన విరాగి యగుటవలన ప్రకృతి సౌందర్యమును వర్ణించలేదు ఖయ్యాము భోగలాలసుడు రసహృదయుడు గనుక ప్రకృతిని సుందరముగా అద్భుతముగా వర్ణించెను నిరాడంబరత్వ మనునది ఖయ్యాము కవిత్వమునకు గల ఒక విశిష్టగుణము వేమనయందు మనకు గోచరించని హాస్యప్రియత్వము ఖయ్యాము రచనయందు గానుపించును వేమన పద్యసంపుటమువలె రుబాయలు కూడ కలగూరగంప ఇందు కథ యుండదు విషయైక్యముండదు ప్రతి పద్య మును దేనికదే స్వతంత్రముగ నుండును శిష్యులు ప్రశిష్యులు అభిమానులు రచించిన పద్యములు కొన్ని కాలానుసారముగా వేమన ఖయ్యాముల రచనల యందు చోటుచేసికొనినవి

## ఉమరుఖయ్యాము-మత సాంఘిక రాజకీయ పరిస్థితులు -

ప్రతి కవిమీదను తననాటి సాంఘిక, రాజకీయ మత పరిస్థితుల ప్రభా వము పడక తప్పదు ఖయ్యాము రచనలోకూడ అవి కొంతవరకు ప్రతిఫలించుట చేత వానినిగూర్చి తెలిసికొనినగాని అందలి అంతరార్థము మనకు అంతుబట్టదు

సాధారణముగ మతనిర్బంధములు ఆచారముల కట్టుబాటులు మున్నగు సంఘపు గోడలమధ్య చిక్కి బాహ్యప్రపంచముతో సంబంధము పెట్టుకొనక మానవజీవితము యంత్రప్రాయముగా నడచుచున్నపుడు తిరుగుబాటులు సంభవించును పారసీకదేశమునకూడ నిట్టి తిరుగుబాటు ఒదవ శతాబ్దియందు బొడచూపినది భౌతికశాస్త్రవిజ్ఞానము ప్రజలలో వ్యాపించుటవలన మూఢభక్తి అర్థములేని మతాచారములపై విశ్వాసము సన్నగిల్లిపోయినది ఈ పరిస్థితులు సహజముగా హేతువాదియైన ఖయ్యాము మనస్తత్వమునకు సరిపోయినవి తత్కారణముగ సమాజమునందలి మూఢభక్తిని మతవిశ్వాసములను తృణీకరించుచు తమ రచనలో కొన్ని భావములను వ్యక్తీకరించియున్నారు

ఖయ్యాము మధ్యవయస్సు నిజాముల్ముల్కు ప్రసాదించిన జాగీరుల వలనను మలిక్షా ఆదరాభిమానములవలనను సుఖముగ గడచినది రాజాస్థానమునందు, పండిత గోష్ఠులందు సరససల్లాపములాడుచు ఇష్టమున్నయెడల శిష్యులకు ఒక్కొక్క రుబాయిని ఆశువుగ చెప్పుచు, సాకీ అందిచ్చు ద్రాక్షాసవ మానుచు పచ్చిబయళ్ళ వెన్నెలగోష్ఠుల విహరించుచు ఖయ్యాము ఆనందమయము ప్రశాంతమునైన జీవితము గడుపుచుండెను సంజరుషాహి అర్ధాసన మిచ్చి గౌరవించెను ఈ విధముగా ఖయ్యాముజీవితము దాదాపు ఏబది సంవత్సరముల వయస్సు వరకు పేరు ప్రతిష్ఠలతోను భోగభాగ్యములతోను కొనసాగెను ఆ సమయముననే 'నేడు సుఖపడు మనసార, రేపుసంగతి మనకేల' అను విధముగా వర్తమాన మొక్కటియే అనుభావ్యమని, ప్రాయముండగనే జీవితము ననుభవించుమని ఉద్బోధించియున్నారు

ఖయ్యాము అపర వయస్సంతయు ఇంచుమించు దుఃఖభాజనమనియే చెప్పవచ్చును నిజాముల్ముల్కు మలిక్షాలు పరమపదించిరి రాజ్యమున అంతఃకలహములు బయలుదేరినవి ఇస్మాయీలియాల దౌర్జన్యము రోజురోజుకు హెచ్చుచుండెను సెల్జూకు రాజ్యమున గూఢముగా నున్న మూఢభక్తి అజ్ఞానము మతపాషండత్వము మరల బొడచూపినవి ఖురాను ధర్మములు తప్పనిసరిగా అనుసరింపవలసిన పరిస్థితి ఏర్పడినది ఖయ్యామువంటి స్వతంత్రభావులు, హేతువాదులు ప్రాణాపాయస్థితియందుండిరి ఇవి ఉమరుఖయ్యాము అపరవయస్సునందలి మత సాంఘిక, రాజకీయ పరిస్థితులు, వీని ప్రభావము అతని రచనలయందు గోచరించుచుండును

## కావ్యగత విశేషాంశములు -

ఒక్క ఈశ్వరుని విషయములో దప్ప ఖయ్యామమతమునకు చార్వాక మతమునకు 139 ఎటువంటి భేదములు లేవు అందునను ముఖ్యముగా చార్వాకుల అభిప్రాయములతో ఏకీభవించు భావములుగల పద్యములెన్నియో పానశాలయందు గలవు

**ఈశ్వర వాదము** - చార్వాకమతము ప్రకారము సృష్టి స్వభావసిద్ధముగా నుత్పన్నమగుచున్నది సృష్టికర్త ఎవరును లెరు పృథ్వి, జలము అగ్ని, వాయు వులను నాలుగు భౌతికతత్త్వముల పరస్పర సంయోగముచే సమస్త జగత్పదా ర్థము ఉత్పన్నమగుచున్నది అందువలన ఎవరినైనను సృష్టకర్తగా తలంచవల సిన ఆవశ్యకత లెదు అనగా చార్వాకులు నిరీశ్వరవాదులు కాని మన ఉమర్ మాత్రము ఈశ్వరవాది ఈ విషయమొక్కదానిలోనే ఖయ్యాము, చార్వాకులకు భేదము గలదు

ఈశ్వరుడే సృష్టికర్త కుమ్మరి కుండలను చేయునట్లు ఈశ్వరుడు లోక మును సృష్టించెను కుండ పగిలిపోయినతరువాత మట్టిలో కలసిపోవునట్లు ప్రాణము పోయినతదుపరి శరీరము భూమిలో జీర్ణించును మేలును కీడును వాని యొక్క చేతలే దేవుడే శరీరమును, మనస్సును సృష్టించెను మన మొనర్చు ప్రతి పనికిని మనస్సే ప్రోత్సాహకారి కావున పాపకార్యము లొనర్చినను దేవుడు మనల నెట్లు శిక్షింపగలడు? అట్టి మనస్సు నతడేల సృజియింపవలయును? కుండ చొట్టబోయిన ఆ తప్పు కుమ్మరిది గాదా? కావున పాపము చేసితినని దుఃఖము నొందవలసిన అవసరములేదు దేవుడు తాను చేసిన తప్పును తానే సరిదిద్దుకొని జనులను మన్నింపవలసియుండును

'మనుజుని వారుణిం బ్రణయమాధురి సుందరిజేసి భూమినం
దనమున కంపినాడవు, మనంబగు ప్రేరకమెల్ల కర్మకున్
వెనుక నదేల మా తలను వేసెద వీయపదూఱు? నీవె శా
సన మపరాధియున్ మఱి విచారణకర్తయు చిత్రమీశ్వరా!' 140

అని ఈశ్వరుని శాసనకర్తగా, అపరాధిగా విచారణకర్తగా భావించినాడు ఎవ్వ రును తప్పు చేయనియెడల భూమిలో జీవిక నాగుటయే కష్టము కాని తదుపరి

వీడు పాపియని అక్రమముగ శిక్ష విధించుట న్యాయముకాదు సృష్టించిన భగ వంతుడు సృష్టింపబడినవాడు ఇద్దరును అపరాధులే కావున వారిరువురిలోను ఎట్టి భేదము లేదు అని పల్కె-

'మునునే నస్థితి నిద్రనుండ నిలకుం బోదోలి దుఃఖంబులం
దను సౌఖ్యంబుల నందజేసి మరలం దర్జింతువౌర' పా
పిని శిక్షింతువటంచు నీ చతురతన్ వేనోళ్ళ గీర్తింతురీ
వినయార్హుల్ మరి శిక్ష కర్హుడవు నీవెకావె లోకేశ్వరా" 141

అని భూమిలో తనుసౌఖ్యముల నందజేసినది ఈశ్వరుడే గావున దాని కతడే శిక్షార్హుడని భావించినాడు

ఉమరుఖయ్యాము ఈశ్వరు డున్నాడనియు, అతడే సమస్తసృష్టికి మూల కారణు డనియు సుఖదుఃఖము అనునవి ఈశ్వరకృతములె అనియు నమ్మినాడు

**ఆత్మనిషేధము** - చార్వాక దర్శనములో ఆత్మ అనునది లేదని వచింపబడి నది ఆత్మ అనునది శరీరాదులకంటె భిన్నమైనదిగా తలంచబడలేదు ఏ విధ ముగా శరీరము వికారమును, పరిణామమును పొందునో అదే విధముగా ఆత్మ కూడ వికారమును, పరిణామమును పొందును జడపదార్థములయొక్క వికారము వలన చైతన్యము ఉత్పన్నమగును

ఖయ్యాము మతము విచిత్రమైనది ఆత్మ ఈశ్వరాంశము గావున ఈశ్వర వాదు లందరును ఆత్మ యున్నదని నమ్మెదురు నిరీశ్వరవాదులు ఆత్మ శరీరము వలెనే నశించునని చెప్పుదురు కాని ఖయ్యాము ఈశ్వరుని ఉనికిని అంగీకరించుచు ఆత్మమాత్రము లేదని చెప్పియున్నాడు అనగా మరణానంతరము పునర్జన్మ అనునది లెదనునది వీరి సిద్ధాంతము అందుచేతనే భౌతికపునరావృత్తిని గూర్చి ఇట్లు వచించియున్నారు

"పొలముల నేత్రపర్వముగ బూచిన రాగవతీసుమంబు శో
భల విలసిల్లె బూర్వనరపాలుర రక్తకణాలనుండి యె
చెలియ నిగారపుం తళుకుచెక్కుల నేలిన పుట్టుమచ్చపై
వెలసెనొ నీలకాంత కనువిందొనరించును బాలరెమ్మలన్' 142

ప్రాణముపోయినవెనుక మట్టిలో కలసిపోయిన శరీరము తదుపరి నానావిధ భాండ భాండికల రూపమును దాల్చును అంతియెగాక ఆ మృత్కణములమీద లేత పచ్చి కలు చిగురించును

**స్వర్గఖండనము :-** చార్వాకమతానుసారము స్వర్గము అనునది కేవలము కల్పితము ఎవడైనను బుద్ధిమంతుడైన వ్యక్తి మరణమునకు అదుపరి స్వర్గ సుఖము లభించునని చెప్పనియెడల ఈ జీవనసుఖమును వదలలేడు చార్వాకుని మతములో రేపు లభించు మయూరముకన్న నేడు లభించిన కపోతము మూల్య వంతమైనది వీరికి భవిష్యత్తుమీద నమ్మకములేదు అందువలన ఈ లోకములోనే ఇచ్ఛానుసారముగా భోగముల ననుభవించి వర్తమానమును సార్థకము చేసికొనుట వీరి ముఖ్యకర్తవ్యము ఐహికసుఖములనువిడిచిపెట్టి పరలోకసుఖమును వాంఛిం చుట వీరి కిచ్ఛగించదు

ఖయ్యాముదికూడ నిదే అభిప్రాయము అతనిదృష్టిలో స్వర్గనరకములు లేవు ఎవ్వడో భగ్నమనోరథుడు ఇహమును హేయముగా నెంచి భావవినోదముగ నందనవనమును దివిని రంభాభోగమును ఊహించుకొనినట్లు అనిపించును ఒక వేళ పెద్దల నుడియైన నాకమున్నదని ఒప్పుకొనినను అందరును ఆ స్థలమునకే వెళ్ళువారని నమ్మకమేమి? చచ్చిన ఎవరి కెవరగుదురో? కావున వృథాఎలుకులను మాని భూతలమునే స్వర్గముగా నొనర్చుకొనుట మంచిది

"మాటికి మాటికిం దెలివిమాలి తలంతువు స్వర్గమంచు, న
చ్చోట నిలింపకామినులు జొక్కపుటాసవమున్ గులాబి పూ
దోటలు నుండునన్న భ్రమతో మన కేటికో యివ్వి యియ్యెడన్
నీటల జేతి వెన్నవిడి నేతికి బొదుదు మూఢమానవుల్' 143

భువియందలి సుఖములను వదలి స్వర్గసుఖముల నాశించుట చేతనున్న వెన్నను విడిచి నేతిని ఆశించుటవంటిదని చెప్పినారు

**ఉమర్ ఖయ్యాము సూఫీయా? -** ఖయ్యాము కాలమునాటికి సూఫీమతము బాగుగా వ్యాప్తిలో నున్నది సూఫీమత పరిభాషలో ద్రాక్షాసవము బ్రహ్మానంద మునకు సంకేతము ఉమర్ వాడిన మధువు, పానపాత్ర, ప్రియురాలు అను పద ములకు వేదాంతపరమైన గూఢార్థము ఉండి యుండవలయునని కొందరు తలం చిరి జీవాత్మ పరమాత్మల పరస్పరసంబంధమును గూర్చిన 'సూఫీ' ల సిద్ధాంత మునే ఉమరు తన కావ్యములో చేర్చినాడని మరికొందరి నమ్మకము మరికొందరు అతని గీతములు పాంచభౌతికశరీరధారిణియగు లతాతన్విని గూర్చిన పలవరింత లనియు అభిప్రాయపడిరి

" తత్త్వజ్ఞానియు, సూఫీయునగు హకీం ఉమర్ ఖయ్యామ్ అతి కాంక్షతో వలచిన భోగము కేవల భక్తి పారవశ్యజనితానందాతిరేకమనియు, త్రావిన మధువు భగవత్పాదారవింద ధ్యానామృతమనియు, కామించిన పరాశక్తి సచ్చిదానందస్వరూపమగు పరబ్రహ్మమే యనియు ' 144 మరి కొందరు నిరూపించెదరు

ఖయ్యాము కాలమునాటికి సూఫీసమాజములో వేషధారులు బయలుదేరిరి వారి పావనత్వము వైరాగ్యము వేషధారిత్వముగ మారినవి అది సూఫీ లనగా ఉమరునకు గిట్టని స్థితి సూఫీలు ఖయ్యాము నిరసనకు గురియైన డెబ్బదిరెండు శాఖలలోనివారే కాని కొందరు అంతరార్థముతో సంబంధములెకుండ, పైకి కనుపించుచున్న అర్థమునే గ్రహించి ఉమర్‌ను సూఫీగా భావించిరి కాని-

ఖయ్యాము సూఫీలను ఎగతాళిచేయుటకో యనునట్లు వారి మతపరిభాషనే గ్రహించి సాంప్రదాయిక సంకేతములను లౌకికార్థమున ప్రయోగించెను దీనిని తెలిసికొనక కొందరు ఖయ్యాము రూమివలె సూఫీయని పొరబడిరి' 145 అన్న దువ్వూరివారి అభిప్రాయము ఈ విషయమున గమనింపదగినది

మనము పానశాలను చదువుచు కొంతదూరము పోయినయెడల ఉమర్ ఉపయోగించిన ద్రాక్షాసవము సాంకేతికముగాదని తోచును మొత్తముమీద ఉమర్ సూఫీగాదని నిర్ధారించుటకు ఎట్టి అనుమానము పడనవసరము లేదు

మతాచారనిరసనము - ఖయ్యాము అందరి మహమ్మదీయులవలె మసీదుకు పోయి నమాజు చేసి ఎరుగడు ఒకనాడు స్నేహితుడు నమాజుచేయుటకు రండని పల్కగా-

"మునుపు మసీదువాకిటను ముచ్చెలు దొంగిలిపోతి బ్రాతపై
చినిగెను నేడునున్ మరల జెప్పులకోసము వచ్చినాడ నె
మ్మనము సెడంగ నియ్యెడ నమాజొనరింపగ రాను నీవు చ
చ్చినయెడ వీడిపోయెదవు చెప్పులువోలె నమాజుసైతమున్ ' 146

అని నమాజు చేయవచ్చువారిని దెప్పిపొడిచినాడు ఖయ్యాము వారుణిని త్రాగుచుండగా మతాచారపరులైన ప్రతిపక్షులు మతాచారవిరోధి పానకలశంబని పలికిరట దానికి ఖయ్యాము మతాపకృద్రుధిరపానము చేసెదననియు ధర్మశత్రు సంహారము శాస్త్రసమ్మతమనియు చెప్పియున్నాడు దీనివలన మతాచారపరులను ఎంతగా నిరసించినాడో తెలియుచున్నది

**కృత్రిమ వేషధారిత్వము** - సూఫీలు లౌకిక భోగభాగ్యములు త్యజించి దారిద్ర్యము ననుభవించుచు, ఎల్లప్పుడు దైవధ్యానమునందె కాలము గడుపుచు ఆత్మ పరమాత్మల ఐక్యముకొరకు ప్రయత్నించు చుందురు సాధారణముగ ఏ మతమైనను కొంతకాలము గడచినవెనుక అందు అనేకములైన కపటవ్యాపార ములు బయలుదేరుచుండును ఆధ్యాత్మికసమస్య ఆర్థికసమస్యగా పరిణమించుట సహజము అట్లే ఖయ్యాము నాటి సూఫీమతమునందు కృత్రిమవేషధారులు బయలుదేరిరి వారిని వారి కృత్యములను ఖయ్యాము నిరసించెను

"త్రావము జాహిదీలమని దంబము గొట్టెదవేల? యంతక
న్నావిపరీతకృత్యము లొనర్తువు నిత్యము మాయవేషముల్
భావములోని కల్మషము బాపునే? మానవసంఘ రక్తముం
ద్రావెద వీవు, ద్రాక్షఫలరక్తము మాకు రుచించు నెప్పుడున్' 147

అని మాయావేషధారులను మానవసంఘరక్తమును ద్రావువారిగా చిత్రించిరి చిరి గిన బొంతలను తొడిగికొని సిద్ధులమని పల్కుచు లోకములో తిరిగి మోసముచేయు దుర్జనులకంటె కామిని ప్రణయగోష్ఠుల నానవసేవ ఎంతయో ఉత్తమ మైనది ఇట్లు వేషముకన్న మనస్సు ముఖ్యమని చెప్పిరి

**ప్రకృతితత్త్వ కథనము** - ఆకాశము ఒక చిత్రదీపము రవి దీపపుశెమ్మె లోకము తెరపటము నీడబొమ్మలు మనుజులు సమస్తమునకును కాలచక్రము నిర్ణేత గతి యనాది కాలమర్మమును నీవును నేనును కానలేము

"అంతములేని యీ భువనమంత పురాతన పాంథశాల వి
శ్రాంతిగృహంబు, నందు నిరుసంజలు రంగుల వాకిళుల్, ధరా
క్రాంతులు పాదుషాలు బహరామ్ జమిషీడులు పెనవేలుగా
గొంత సుఖించి పోయిరెటకో పెరవారికి జోటొసంగుచున్' 148

జీవితము సుఖదుఃఖ మిశ్రమము కావున పీలైనంతవరకు సంతోషము ననుభ వించుటయే మంచిది మరణ మనివార్యముగాన దానినిగురించి బాధపడవలసిన అవసరము లేదు విషము, అమృతముగల మసిబుడ్లలో విధి తనకలమును ముంచి జనుల నుదుట లిఖించును అది మిక్కిలి పేదవాని కన్నీటికాల్వకు కరుగదు పరమభక్తుని అనుతాపవహ్నికి చెడదు కావున ఏది ప్రాప్తమైన దానిని గౌర వించుట ఉత్తమము

"ఇల చదరంగమందు జనులెల్లరు పావు, లహస్సులున్ నిశల్
దెలుపును నల్పుగళ్ళు, కదలించును రాజును బంటు దక్కపా
వుల విధియాటకాడు పలుపోకల ద్రిప్పును గళ్ళమార్పు, న
వ్వల నొకటొక్కటిం జిదిపివైచు నగాధ సమాధిపేటికన్' 149

అని జీవితమంతయును చదరంగము ఆటవంటిదని ప్రకృతితత్త్వమును విప్పి చెప్పిరి

ఖయ్యాము భోగలాలసత్వము - ఖయ్యాము ఉద్దేశ్యము ప్రకారము సృష్టి కాలబద్ధము గతము కన్నులగట్టదు భవిష్యదర్థము సంశయాంధసంవృతము కావున వర్తమానకాల మొక్కటియె అనుభోగ్యము

"పరమొ గిరమ్మొ దానితలపై నొకదోసెడు మన్నుచల్లి సుం
దరి మెఱుగుం కపోలములు దాచినముద్దులు దొంగిలించి సం
బరముగ శీధువానుము నమాజులు పూజలు జేయనేల? యె
వ్వరయిన వచ్చినారె మృతివాటికకేగిన పూర్వయాత్రికుల్" 150

దీనినిబట్టి తిను త్రాగు, అనుభవించు అనునది ఖయ్యాము అభిప్రాయముగా తలంపవచ్చును

ఆసవపూర్ణమౌ కలశ, మామిషఖండము, వెన్న రొట్టె ది
వ్యాసమయాఎ యౌవనగుణాలయ వీణియ మీటుచున్ దినా
యాసముదీర్చ నిర్జనవనాంతరసీమల నబ్బెనేని వ
హ్వా సులతాను భోగవిభవంబుల గోరెడి మూఢు డుండునే" 151

దీనివలన ఉమరుఖయ్యాము భోగలాలసత్వము దెలియుచున్నది

దువ్వూరివారే స్వయముగా తమ అనువాదమునుగూర్చి 'ఖయ్యాము ప్రశంస'లో-

"తెలుగుందోటల బచ్చబీళ్ళ ననురక్తిం బానశాలాప్రతి
ష్ఠలు గావించి త్వదీయ కావ్యరసభాండంబుల్ గులాబీలు బు
ల్బులిపిట్టల్ మధుపానపాత్రికలు సొంపుల్గుల్కు సాకీయు భూ
తల నాకం బొనరింపనిల్పి రసికాంధ్రప్రీతి గావించితిన్" 152

అని చెప్పుకొనుటనుబట్టి పానశాలవైశిష్ట్యము ఎట్టిదో తెలియుచున్నది

## (g) పలితకేశము

### రచనా కాలాదులు -

ఇది 13-11-1941 20-11-1941ల మధ్యకాలమున రచింపబడినది "కవి-రవి రచించిన పదిరోజులవ్యవధిలోనే మరొక కావ్యము రాసేందుకు ప్రేరేపించిన అంశాలలో లౌకిక పారలౌకికవిషయాలపై తనకు రామిరెడ్డికి గల జిజ్ఞాస ముఖ్యమైనట్టిది ఈ కావ్యమే పలితకేశము" 153 అని రమణారెడ్డిగారు పలితకేశమును గూర్చి తమ అభిప్రాయమును వెలిబుచ్చిరి

రెడ్డిగారు దీనిని తమ నలుబదిఏడవయేట తమ జీవితవాఙ్మూల మనిపించునట్లుగా రచించిరి ఈ కృతిని భగ్నహృత్పాత్రసంధించి ప్రణయమధువు అంచులు పొరలునట్లుగా నింపిన తమ ద్వితీయ కళత్రము అన్నపూర్ణకు అర్పణము గావించిరి

జనన మరణములు స్వర్గ నరకములు, న్యాయాన్యాయములు మున్నగు విషయములు ఇందు చర్చింపబడినవి పలితకేశము నెపముతో రామిరెడ్డిచేసిన జీవనవ్యాఖ్యానములు సర్వజనానీకమును దృష్టిలో నుంచుకొని గావింపబడినట్టివి

### కథాసంగ్రహము -

శ్రీమతి ఆజ్ఞపై కవిగారు గడ్డము చేసికొనుట ప్రారంభించిరి వారికి మీసములందు ఒక నెరసినవెంట్రుక కనబడినది దానిని చూడగనే ద్వేషము పెరిగి కత్తిరించిరి కాని అది లోపల చిక్కి వ్రేలాడుచు 'తమోరుద్ధచక్షులైన వారికి వెలుగుజూప నవ్యాజకరుణ కాగడా పట్టుచుందును అని కవిగారితో పలికినది అల్పతరమైన నన్ను పరిమార్చలేని మీ ఘనత బుద్ధివైభవములు నాకంటె తక్కువలే గదా' అని అవహేళనము చేసినది

'కాలచక్రభ్రమణము భూపాలుని యాజ్ఞకుగాని, పరమభక్తుని మ్రొక్కుకుగాని, దీనుని కన్నీటికిగాని ఒకనిమిషమైనను ఆగదు కావున మృత్యువు సమీపించక మునుపే విస్మృతజీవితార్థములను నెరవేర్చుట మంచిది ధనము గడించి సతతము సుఖింపవచ్చును కాని మానవుడు మరణించినపుడు తనతో పరలోకమునకు వచ్చునది గడించిన జ్ఞానమేగాని ధనధాన్యాదులు గావు' అని పలితకేశము కవిగారికి హితబోధ చేసినది

'మరణము భౌతికమైన మార్పు దానిగురించి బాధపడ నవసరము లేదు పరము ఒకవేళ ఉన్నను దానికొరకు ఇహసుఖముల బలి చేయనేల? ఇహపరము లలో గ్రహింపగలుగు సమస్త సుఖదుఃఖములను అనుభవించి మరల నా మాతృ భూమియైన ఈ దేశములో జన్మింప గోరుకొందును ఇప్పుడే ముక్తిని నే నిచ్ఛ గింపను కొన్నికోట్లమంది ప్రజలు శ్రమించుచుండ నే నొక్కండను ముక్తిని వాంఛించుట తగునా?' అని కవిగారు వెంట్రుకతో పలుకగా నది నవ్వి మరల నిట్లనెను

'యజ్ఞములుచేసి ఇంద్రుని తృప్తిపరచిన సోమయాజు లెల్లరును రంభాది దేవవేశ్యల పరిరంభ కాంక్షతో దివికి వచ్చుచుందురు బాహుపరాక్రమముగలిగిన శూరులు యుద్ధములలో మరణించి నిర్జరవిమానములలో దివిజేరి జారిణీపురమున అప్సర పూవుబోండ్లకొరకై వాడవాడలను బొంచియుందురు' అని పల్కి రంభ, తిలోత్తమ ఊర్వశి మేనక ఘృతాచి మున్నగు దేవవేశ్యల విలాసాదులను వర్ణించినది 'అట్టి దేవతాస్త్రీయొక్కతె ఓరచూపుల జూచినచో మనస్సు మోహా విలమై నీవు వారి పయటచెంగును పట్టిపోవె? అమరులకు అమృతపానము చేయుటచేత జరామరణ బాధలుండవు నాకలోకమున దుఃఖమన మందునకైనను దొరకదు' అని పల్కినది

అంత కవి పలితకేశముతో దుఃఖ ముండనిచో సౌఖ్య మెట్లుదెలియును? చీకటులు లేనిదే కాంతి ఎటు లూహ్యమగును? మేకల జంపి యజ్ఞము లొనర్చి నేయి త్రావక దుంటపాలు చేయుటెల్ల దండులంజల పడుకల పండుకొనుట కేనా? యుద్ధమున జచ్చి కత్తి, డాలు, డవాలుతో వచ్చిన యోధులు వేల్పుచెలు లిండ్ల ముట్టడివేయ వృద్ధసోమయాజుల కచ్చట అవకాశ మేమియుండును? పుడమి పయి సౌఖ్యములులేని కారణమున సురాలయము సృష్టింపబడినది దానిని నేటి ప్రపంచముతో బోల్చిచూచినచో ప్రాతవడిపోయినరీతిగా గనిపించును నీవు నోరూర వర్ణించిన వాసవపురియందలి సుఖము మద్రాసు బీచి ఇసుకపరుపుల ఎరుండ మనసులోగలుగు హాయికంటె కమనీయమగునా?' అని పల్కి మద్రాసు బీచిని వర్ణించిరి

అంత నది కవితో 'మీరు స్వర్గమును వాంఛింపరేని మిగినది నరక మొక్కటియే అదియే మీకు తగినచోటు' అని పల్కగా కవిగారు 'స్వర్గమందలి

నిష్క్రియాజీవితముకంటె నిరయమందలి సత్యమార్గప్రచారసంసక్తి మేలు నర కమున కేగి అచ్చటి మానవుల కొక్క రహస్యము జెప్పిన ఒక్క క్షణములో విప్లవము ఉద్భవించును యముడను భీకరాకృతి కల్పించబడినది భావమాత్మ కము గాలి ప్రతిమ పిట్టల నదల్చుటకై చేలలోనుంచు దిష్టిబొమ్మవంటిది' అని దానితో పల్కిరి

'స్వర్గనరకములు పాడుబడిన దానధర్మములు చేయు ఉత్సాహము ప్రజ లలో నశించును ప్రజలలో పాపభీతి లెనియెడల న్యాయ, సత్యములకు ఆశ్ర యము తొలగిపోవును' అని వెంట్రుకపల్క కవిగారు దానితో 'ప్రజలను భయ పెట్టి కపట తంత్రములచేత పనుల దోలెడు విధముగా నిర్బంధ ధర్మదాస్యమున ద్రోయుటకంటె సత్యమును దెలిపి స్వేచ్ఛతో ధర్మమొనరింపజేయుట మేల గాదె' అనవిని పలితకేశము ఈ పెడదారుల నిఅయిలకు దెలుపకుము నీకు పుణ్య ముండును' అని పల్కెను

ఇది పలితకేశము కవిగారల సంభాషణరూపముగ నడచినది

## పెద్దన ప్రభావము -

దువ్వూరివారికి అల్లసానిపెద్దన యెడ ముఖ్యముగా మనుచరిత్రయెడ మిక్కిలి గౌరవప్రపత్తు లున్నట్లు కనిపించుచున్నవి మనుచరిత్రలోని భావాను సరణములు, పదానుసరణములు ఈ కావ్యమునగూడ కనిపించుచున్నవి వరూధిని ప్రవరునితో-

"పవనపర్ణాంబు భక్షులై నవసి యనుప
కచ్చడాల్ గట్టుకొను మునిముచ్చులెల్ల
దామరస నేత్రలిండ్ల బంధాలుగారె" 154 అని పలికినది

పలితకేశములో స్వర్గలోకము, అందలి అప్సరసలను గూర్చి వర్ణించు సమయ మున పై పద్యమునందలి భావమును పోలిన పద్యమును రచించియుండిరి ఇంక కొన్నిచోట్ల పదానుసరణములు కూడ గలవు

'గోచి బిగియించి తపసులై కూచుచుండి
పవన పర్ణాంబు భక్షులై బ్రతుకు మునులె
యచ్చరల మోహవాగురులయందు జిక్కి
కలుచవారక నిర్ముక్తి గాంచినారె" 155

మరియొకచోటగూడ నిట్టి భావానుసరణము కనుపట్టుచున్నది వరూధిని ప్రవరునితో యజ్ఞములందు పావనులౌటవలన గలుగు ఫలితములను గూర్చి వచించుచు-

యిట్టి యెలప్రాయిము వైదిక కర్మనిష్ఠలం
బోవగ నింక భోగముల బొందుట యెన్నడుః యజ్ఞకోటులం
బావనులౌటకున్ ఫలము మా కవుగిళ్ళ సుఖించుటేగదా " 156 అని పల్కినది ఇదేవిధముగా కవిగారు స్వర్గలోకనివాసమును నిరసింపగా పలితకేశము వారితో యజ్ఞములు చేసి కర్మల నాచరించి-

సురపతిని దృప్తి పరచిన సోమయాజు
లెల్ల రంభాది భోగినీ పల్లవాధ
రాపరీరంభ కాంక్షులై రారె దివికి' 157 అని యజ్ఞఫలితమును గూర్చి పల్కినది పై రెండు పద్యములందలి భావము సమానము

## కావ్యగత విశేషాంశములు -

**జీవితపరమార్థ కథనము** - కాలము అమూల్యమైనది కావున మిగిలి పోయిన జీవితార్ధములను మృత్యువు సమీపించకమునుపే చేయుట ఉచితము

"ధన ధాన్యంబులు కూడబెట్టి కుడువన్ దానంబుసేయన్ మనం
బున రా కున్కి శ్రమంబె నీకు దుదకుం బ్రోగౌను, సిల్లెందరో
ధనికుల్ దాచిన పెన్నిధుల్ పరులచేతం జిక్కి భోగింపరేః
తిను, వెచ్చింపుము, దానమిమ్ము ప్రమిదన్ దీపాంకురంబుండగన్" 158

ధనముగలవా రెందరో పుట్టిరి, గిట్టిరి కాని వారి పేరుమాత్రము భువిపై లెదు కాన జనహితకార్యములకై ధనమునొసగిన కీర్తి చిరస్థాయిగా నిలచును అట్లు చేయనినాడు మానవుడు సంపాదించిన ధనమునకు విలువలేదు

"ఆర్జనంబున కెపుడు వ్యయంబె లెక్క
వ్యయమునకు మంచి వినియోగమౌట లెక్క
అది యిదియులేని యధమ నిరర్థకజీవి
పుట్టి చచ్చిన లాభంబు కట్టిరాదు" 159 మరణానంతరము తాను సంపాదించిన ధనధాన్యాదులు, పశువులు భార్యాబిడ్డలు తనవెంట నంటి రారు పర

లోకమునకు తాను సంపాదించిన జ్ఞానముమాత్రమే ఆత్మనంటి వచ్చును కావున ఈ విషయమును గమనించి మెలగుట ఉత్తమము

**సామ్యవాద ధోరణి** - మనది బీద, ధనిక తారతమ్యములతో కూడిన సమాజము అట్టి సమాజము దేశాభ్యుదయమునకు దోహదకారి గాదు కావున సమ సమాజ నిర్మాణము అవసరము మనలోనున్న హెచ్చు తగ్గులను సరిచేసికొననిచో విప్లవము ఆవిర్భవించుట తప్పదు దీనినే దువ్వూరివారు-

'తేటనీరము పై దేలె దిగెను జిడ్డు
అడుగునకు నెల్లకాలంబునలుల నుండ
దించుమించుల సరిదిద్ద నెప్పుడైన
విశ్వ విప్లవశక్తి యావిర్భవించు' 160 అని హెచ్చరిక జేసి యున్నారు

**హేతువాద ధోరణి** - యముడను భీకరాకృతి కల్పింపబడిన విధముగనే స్వర్గ నరకములు కూడ కల్పింపబడినవి

'స్వర్గనరకంబు లొక్కట బాడుపడిన
దానధర్మములు సేయు నుత్సాహ ముడుగు
ప్రజలలో బాపభీతి యభావమైన
న్యాయ సత్యంబులకు నాశ్రయంబు తొలగు" 161

దీనినిబట్టి స్వర్గనరకములు అనునవి న్యాయము, సత్యములకు ఆశ్రయము తొలగకుండుట కొరకు సృష్టింపబడినవని తెలియుచున్నది

ఇట్లు లేని దానిని కల్పించి చెప్పుటకంటె ఉన్నదానిని తెల్పి ప్రజలను ధర్మమార్గమున నడిపించుట ఉత్తమమార్గమని కవిగారు అభిప్రాయిపడినారు

"ప్రజల భయపెట్టి కపట తంత్రములచేత
బసుల దోలెడు పగిది నిర్బంధ ధర్మ
దాస్యమున ద్రోయుకంటె సత్యంబు తెలిపి
స్వేచ్ఛతో ధర్మమొనరింప జేయమేలు" 162

**మద్రాసు బీచి వర్ణన** - భూమిమీద సౌఖ్యములు లేని కాలమున సృజింపబడిన సురాలయము నేటి కాలముతో సరిపోల్చినచో ప్రాతవడిపోయినట్లుగా కానుపించునట మద్రాసు బీచి ఇసుక పరపుల పరుండినపుడు కలుగు ఆనందము వాసవపురమందలి సుఖముకన్న గొప్పదట

"కురులను దువ్వి యల్లికల క్రొవ్వెదచుట్ట రచించి, పూవులం
దురిమి మొగంబునన్ వలచు ధూళులనద్ది హిమంబలంది, చం
దుర తిలకంబు దిద్దుకొని, తొంగలి రెప్పల యోరగాటుకం
జరిమి, కరాచి చీరల పసందొలయ్యంజరియింత్రు కోమలుల్" 163

ఇట్టి సుందరీమణుల పచారులతో మద్రాసు బీచి ఎంతయో సుందరముగా గన్పట్టు చుండును

"గాలికిం జెలరేగి లోలమై కెరటాలు
తుంపురు ముత్యాలు తొలకరింప
దెరచాపలెత్తిన తేపలు రాయంచ
లంతలై యలల ద్రుళ్ళింతలాడ
సంజ కెంజాయలు జంపుగా బింబించి
రుధిరాబ్ధి గగన సాయుప్యమంద
దెలుపారి తూర్పు మిన్నులు వడ్డ పట్టున
శీతాంశు బింబంబు జేపురింప

పగటి వరుసన మెలమెల్ల బిగివి సడల
జల్లవెన్నెల లెల్లెడ నల్లుకొనగ
నవ్యరసవాద పరివర్తనంబు గాంచి
బీచి మోహనదృశ్యమై గోచరించు" 164 ఇది మద్రాసు బీచియొక్క సమగ్రరూప వర్ణనము

ఇంతవరకు దువ్వూరివారి కావ్యములను గూర్చి పరిశీలించుట జరిగినది వారి ఖండకావ్యములను గూర్చి తదుపరి అధ్యాయములో పరిశీలింపబడును

# చతుర్థాధ్యాయము

# ఖండకావ్య రచనలు

ఖండ కావ్య నిర్వచనము - ఆంధ్రసాహిత్యము ఆంధ్రీకరణముతో ప్రారంభమైనదని చెప్పవచ్చును ప్రథమ దశలో నన్నయాదులు గ్రంథములను సంపూర్ణముగా ఆంధ్రీకరించిరి రెండవ దశలో అనగా శ్రీనాథ పెద్దనాదుల కాల మందు ఆయా గ్రంథములందలి కథలలో ఒక్కదానిని మాత్రమే తీసికొని వర్ణ నలతో పెంచి కావ్యములుగ వ్రాయు పద్ధతి ప్రచురము కాజొచ్చినది ఆధునిక కాలమున గ్రంథమందలి కథనంతను గాక ఒక సన్నివేశమును మాత్రమే గ్రహించి రసవంతముగ రచించు పద్ధతి ప్రారంభింపబడినది ఇట్లు పరిణతి గాంచిన పద్య గేయాత్మకమైన ఈ ప్రక్రియనే ఖండకావ్యమని మనము వ్యవ హరింపవచ్చును

మొట్టమొదటగా ఖండకావ్య ప్రక్రియను పేర్కొనినవాడు విశ్వనాథుడు 'ఖండకావ్యమ్ భవేత్కావ్యస్యైక దేశానుసారిచ' అని పేర్కొని మేఘదూతాది కావ్యములను లక్ష్యములుగా జూపెను ప్రాచీనులు ముక్తకములను గూడ ఖండ కావ్యము లనియే భావించిరి

"కావ్యములు రసప్రధానములు కాగా ఖండకావ్యములు భావప్రధానములు కావ్యమునందు ప్రతి పద్యమునందును భావ ముండవచ్చును కాని కావ్యము సమిష్టిమీద రసాభిముఖముగా నుండును ఖండకావ్యములందు భావములు రస వ్యంజకములు గావచ్చును కాని ఖండకావ్యములు ప్రధానముగా నొక భావము నాశ్రయించియుండును అందుచేత దీనిని భావకవిత్వ మనవచ్చును" [1] కావ్య ములకు ఖండకావ్యములకు గల భేదములను దెల్పి ఖండకావ్యము ప్రధానముగా భావము నాశ్రయించి యుండును గనుక భావకవిత్వమని విశ్వనాథ సత్యనారా యణగారు తెలిపియున్నారు

మహాకావ్యములను గంటలతరబడి చదువు ఓపిక, తీరిక కొరవడిన యాంత్రికయుగ మానవునకు అల్పకాలములో అనల్పానందమును కలిగించుటకు ఈ ఖండకావ్యము కడు సమర్థవంతమైనది ఇట్టి ఖండకావ్య ప్రక్రియను వెలుగు లోనికి తీసికొనివచ్చి దానికి ప్రచారమును, గౌరవమును గలిగించినవారు భావ

కవులు అందువలననే భావకవిత్వ లక్షణములలో ఖండకావ్య ప్రక్రియ ప్రధాన ముగా జెప్పబడినది ఒక్క మాటలో చెప్పవలెనన్న భావకవిత్వ నిర్వచనము, ఖండకావ్య నిర్వచనము సన్నిహితములుగా నుండును

ప్రకృతిలోని ఒక విషయమును జూచినపుడుగాని, ప్రసిద్ధమైన ఒక వ్యక్తిని దర్శించినపుడుగాని ప్రగాఢమైన ఒక అనుభూతి కలిగినపుడు కవి హృదయమున రేకెత్తు భావతరంగములుదాల్చు అక్షరరూపమే భావకవిత్వము '2

ఖండకావ్యములో కవి తన అనుభవమును సూక్ష్మముగా, సూటిగా తెలియ జేయును అందువలన కవి జీవితానుభవము, వ్యక్తిగతమైన ఆందోళన ప్రతి గీతములోను ప్రతిఫలించుచుండును అందుచేతనే ఈ గీతములను వినుచున్న యెడల కవి శ్రోతభుజముమీద చెయివేసి దగ్గరకు తీసికొని ఆత్మబంధువునకు తన అనుభవమును చెప్పుచున్నాడా' అనిపించును ఖండకావ్యరచన సున్నితమైన కళ ఖండకావ్య మనగా ఒక చిన్న రసఖండము ఒక అమృత గుళిక రసగుల్లా వంటిది " 3

రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మగారు "ఖండకావ్యములలో అతి ముఖ్యమైన విషయములు దప్ప దక్కినవి విస్తరింప వీలులేదు సంగ్రహము వీనికిని, విస్తర ణము వానికిని (కావ్యములు) స్వాభావిక లక్షణము " 4 అని ఖండకావ్య, కావ్య స్వాభావిక లక్షణములను దెల్పియున్నారు

ఖండకావ్యములలో గ్రహించిన విషయము ఏదో ఒక భావమునకు సంబం ధించినదియో, రసమునకు సంబంధించినదియో అయి యుండును ఇందలి ప్రతి పద్యమును ప్రత్యేకత గలిగి యుండును కావున ఖండకావ్యములు రసవంతము లుగా నుండుటకు ఎక్కువ అవకాశము గలదు

రామ్ బిహారి శుక్లా తన 'కావ్యప్రదీప్' లో "ఖండ కావ్య్ మే మానవ్ జీవన్ కే కిసీ ఏక్ అంశ్ కా వర్ణన్ హోతాహై। ఉస్‌కీ సంపూర్ణ్ వ్యాపకతా కా నహీ" 5 అని ఖండకావ్యమును నిర్వచించెను

ఈ ఖండకావ్య ప్రక్రియ ప్రాచీనసాహిత్యములో కనుపించినను అది వెలుగులోనికి వచ్చి మిక్కిలి వ్యాప్తిని పొందుటకు మన కవులకు గలిగిన ఆంగ్ల సాహిత్య పరిచయమే ముఖ్యప్రేరణమని చెప్పవచ్చును

దువ్వూరివారు కావ్యములతోపాటు రచించిన అసంఖ్యాకములగు ఖండ కావ్యములను (i) దేశభక్తికవిత్వము, (ii) ప్రకృతి కవిత్వము (iii) ప్రణయ

కవిత్వము, (iv) భక్తి కవిత్వము, (v) స్మృతి కవిత్వము, (vi) ప్రశంసాత్మక కవితలు, (vii) ఇతరములు అను విభాగములుగా విభజించి పరిశీలింతును

## (1) దేశభక్తి కవిత్వము

దేశముయొక్క ఔన్నత్యమును గానముచేసి తన్మూలమున ప్రజలలో దేశభక్తిని ప్రబుద్ధము చేయు కవితలను దేశభక్తి కవిత లను వర్గముగా పరిగణింపవచ్చును ముఖ్యముగా ఆధునికాంధ్ర కవిత్వములో దేశభక్తి భారత జాతీయాభిమాన సంబంధి, ఆంధ్రాభిమానసంబంధి అను రెండు పాయలుగా ప్రవహించినది మన ఆంధ్రభాషలో వెలువడిన దేశభక్తి కవిత్వములో చాల భాగము ఆంధ్రాభిమాన సంబంధమైనదే భారత జాతీయతను ప్రబోధించిన కొందరిలో దువ్వూరివా రొక ప్రముఖవ్యక్తి

స్వాతంత్ర్య రథము - రాయప్రోలు సుబ్బారావుగారి తరువాత జాతీయ ప్రబోధ గీతములను పాడినవారిలో కవికోకిల ఒకరు అస్థిపంజరములనైనను ఆడించు శక్తి గలట్టిది జాతీయత' అని వీరు గుర్తించిరి

కథాసంగ్రహము - 'అంబుదంబుల నమృత పూరంబు లొలుక', 'ఇంద్ర చాపంపు తోరణ మింపు గులుక' స్వాతంత్ర్య రథము వినువీథిలో వెడలుచున్నది ఆ రథముయొక్క కాంతి జలధరమాలను చీల్చుకొని ఆకాశమును ప్రకాశవంతము చేసి, గాడాంధకార మలముకొనిన మూలలలోకూడ శోభలను వెదజల్లుచు, ఉదయ కాలమందలి సూర్యబింబమువలె నున్నది ఆ రథమందు దుర్వార పవిత్ర మూర్తియై ఆసీనయైన దేవి ప్రజా హృదయమాః అనునట్లు వెలుగొందుచుండెను ఆమె ఒకచేత రుధిరంపు పాత్రమును మరియొకచేత పీయూషపాత్రికను ధరించి యున్నది ఆ రథచక్రఘర్షణము క్రింద పూర్వసింహాసనములు, ప్రోజ్జ్వలంపు మణిమయ కిరీటములు, భోగమందిరములు చదిసిపోయి అవి యివి అనక రూపరి పోయినవి కాని ఈ రథమును లాగుటకు తురంగములు లేవు కరులు లేవు ప్రజలే ఆ తేరుమోకులను పట్టి లాగువారు స్యందనాసీనయైన దేవి 'శాంతి శాంతి' అని మంజులగానము చేసినది

**విశేషాంశములు :-**

"ఒకచేతన్ రుధిరంపు పాత్రమును వేఱొక్కంటఁ బీయూష పా
త్రికయుం గైకొని సభ్యతామిషమునన్ దేశంబులం దెల్ల నిం

తకు ధర్మంబులుగాగ నెన్నబడు నన్యాయంబు లీనాటితో
వికలంబై చనుగాక యంచు గరుణావేశమ్ము దీపింపగన్" 6

ఇందు కవిగారు సభ్యతామిషతో దేశముల నస్వతంత్రములుగా జేసి పాలితుల పీడించు పాలకుల అన్యాయము లీనాటితో వికలంబై చనునని నారు అనగా ఆంగ్లేయుల దౌర్జన్యము లిక సాగవని నిష్కర్షగా చెప్పినారు.

దేవి తన మహిమతో పచ్చి నెత్తురు అమృతపు పాత్రబోసి దివ్యదుగ్ధముగా మార్చినదట అనగా పారతంత్ర్యము నశించి మనకు స్వాతంత్ర్యము త్వరలో సిద్ధించునని ధ్వనింపజేసి యున్నారు

పూర్వ సింహాసనములు, ప్రోజ్జ్వలంపు
మణిమయ కిరీటములు, భోగమందిరములు
చక్ర సంఘర్షణంబునఁ జదిసిపోయి
యివి యవి యనంగరాక రూపణెడు నేడు' 7

ఇందు స్వాతంత్ర్య రధచక్ర సంఘర్షణములో ఆంగ్లేయుల రాజ్య పాలనము చదిసి రూపరిపోవుననియు, తద్వారా మనకు శాంతిసౌఖ్యములు లభించుననియు చెప్పియున్నారు

తేరు జాడలవెంబడి పారిన నెత్తురు బలముగలదగుటచేతనే అది పారిన బక్కనేలలో కూడ బంగారు పంటలు పండినవి చక్రనేములు తాకిన స్థలములన్నియును సస్యలక్ష్మికి కళ్యాణశాల లయినవట

స్యందనాసీనయగు దేవి శాంతి శాంతి' యనుచు మంజుల నాదము చేసినదట ఆ దేవిలో గాంధీమహాత్ముని మనము దర్శింపగలము

**నైవేద్యము** - దీని రచనాకాలము ఫిబ్రవరి 1921 ఇందు భారతమాత పాద పద్మములు సేవించుటకొరకు తరలిపోయిన ప్రజల గీతిని వినిపించినారు

భారతమాత సేవకు భాగ్యవంతులు స్వర్ణసుమముల నర్పింప, ఏమియులేని భిక్షుకులైనను కన్నీటి ముత్యాలు కానుకలుగా అర్పించుచున్నారు పూజ్యులు, అధములు, ధనికులు, పుట్టుబీదలు అనెడి తారతమ్యములేక భక్తిపరవశులై హారతుల నెత్తిరి ఆ ప్రజల గీతియే దిక్కులందు ప్రతిధ్వనించుచున్నది

"అమ్మరో నీదు మందిర ప్రాంగణమున
మండుచున్నది కర్పూర ఖండ గణము

త్యాగపరిశుద్ధమగు నాత్మ దలగిపోవు
కామమటు ధూమరేఖలు గడలుకొనగ ' 8 అని తెలిపినారు

కవిగారు మాత్రము ప్రొద్దు పొడుపున కన్నెపూలను భారతమాత పూజ కొరకు దెచ్చిరి అంతియేగాక బలివితర్థికమీద నిరతము వెలుగునటుల తమ హృదయపు సుగంధదీపమును అర్పించి సంతృప్తి నందినారు

భారతదేశము నలుమూలల స్వాతంత్ర్యేచ్ఛ వ్యాపించగా కులము, మతము ధనవంతులు పేదవారు అను తారతమ్యములు మరచిపోయి ప్రజలు స్వాతంత్ర్యము కొరకు తమ ప్రాణములనైన నైవేద్యముగా సమర్పించుటకు సిద్ధపడిన మహోదాత్తమగు సన్నివేశమునకు ఈ ఖండిక అద్దము పట్టినది

కర్ణధారి - 1921లో గాంధీజీ నాయకత్వములో శాంతియుత సమిష్టి శాసనోల్లంఘన కార్యక్రమము చేపట్టబడినది గోరఖ్‌పూర్ పురమునకు దగ్గరలోనున్న చౌరీ చౌరాలో 5-2-1922వ తేదీన కాంగ్రెసు ఉత్సవము జరిగినది ఆ ఉత్సవములో ప్రజాసమూహము ఒక పోలీస్ సబ్ఇన్స్పెక్టరును 21మంది పోలీసుజవానులను వెంటాడి పోలీసుస్టేషనులోనికి జొరబడి దానికి నిప్పంటించగా వారందరును మరణించిరి

అంతకు మున్నే బొంబాయిలో 17-11-1921న జరిగిన కొట్లాటలో 53 మంది మరణించిరి 400 మంది గాయపడిరి యువరాజు సందర్శనసమయమున 13-1-1922న మద్రాసులో కూడ ఇంతకంటె ఎక్కువ కొట్లాటలు జరిగినవి ఈ పై సంఘటనలను గమనించి 12-2-1922 వ తేదీన కాంగ్రెసుసంఘమువారు సమిష్టి శాసనోల్లంఘనమును తాత్కాలికముగ విరమించిరి ఇట్లు నిలిపివేయుటకు గల కారణము కొంతమందికి మాత్రమే తెలిసినది తెలిసినవారిలో దువ్వూరి వారు ఒకరు కారు విప్లవము ఛిన్నాభిన్నమైనది దీనితో కొందరికి శివమెత్తిపోయినది మరికొందరు దిగులుతో క్రుంగిపోయినారు ఈ దశలో రచించిన రామిరెడ్డిగారి 'కర్ణధారి', ప్రబోధశంఖము'ల వంటి గేయములలో యువకుల ధిక్కారభావము, నాయక నిరసనము స్పష్టముగా కనుపించును

పడవ బయలుదేరి నడిసముద్రమును చేరినది అవతలి తీరము కనుచూపు మేర దూరములో నున్నది ఈ సమయములో పూనికను వదలినయెడల ఆవలి తీరము చేరు ఆశ యుండదు కనుక ఓ కర్ణధారీ' కడిమి విడువకుమని ప్రబోధము చేయుచున్నారు

'పుడమి ప్రాకెడు చిన్న పురుగువోలెం
గష్టనిష్ఠుర విధి కాలిక్రిందం
బడి చింద చిందరై ప్రాణమేదం
బుట్టలేదోయి యే పురుషుడైనం
గ్రిందికి దింపకు కేతనంబున్
'సెర్చిలైటులు' వోలె జీకట్లలోన్
మెరిసెడిఁ జూడు క్రొమ్మెఱుగుఁ దీగల్
దారిఁ జూపెడు ధ్రువతారపైనన్
మిన్కుమిన్కన వెల్గు మేఘాలలోన్
జీవనదీపమై చెలగు నాసన్
మలపక పాథోధిమధ్యంబునం
గడిమి విడువకు కర్ణధారి'
పడవ నడుపుము భయము దీఱి" 9 అని ధైర్యమును చెప్పినారు

ఇందు స్వాతంత్ర్యోద్యమ మను పడవకు కర్ణధారి గాంధీజీ ఆయనను ఉద్దేశించి ఈ గేయము వ్రాసినట్లు గన్పించుచున్నది పడవ సముద్ర మధ్యములో నున్నదనగా ఉద్యమము సగమునకుపైగా విజయవంతమైనదనియు ఇంక కొలది కాలములో ఆవలితీరము జేరుటకు సిద్ధముగా నున్నదనియు, అట్టి పరిస్థితులలో పూనికను, ధైర్యమును తొలగక, భయముమాని ఉద్యమమును కొనసాగనిమ్ము అనియు తమ ఆవేదనను వ్యక్తము చేసినారు

**ప్రబోధ శంఖము** - ఇది 10-3-1923 వ తేదీన రచింపబడినది డీలుపడి వెనుకంజవేయు భారతకుమారుల జూచి, వారిలో చైతన్యము కలుగుటకై ఆలపించిన ప్రబోధగీత మిది

భారతీయుడనని సగర్వముగా తలయెత్తి చూడుము స్వప్నసింహము ఎంతకాలము నిన్ను జడిపించగలదు? ఆలోచించినచో చింత తొలగిపోవును

ఏలనోయీ గద్గద స్వనము, ఆక్రోశగానము
చాలు చాలిక విఫల యాచనము
వీరపూజోత్సవపు సమయమునఁ బూరింప లెమ్ము
ఘోర భీషణ విజయశంఖమును

ఏల తెలియక సంశయించెదవు' భారతకుమారా'

డీలుపడి వెనుకంజ వేసెదవు' 10 అని విజయశంఖమును పూరింపవలసి నదిగా సమస్త భారతజాతిని ప్రబోధించినారు

**మేలుకొలుపు** - మూఢనమ్మకములను పెట్టుకొని పురుష ప్రయత్నమును విరమించెడి పద్ధతిని ఇందు నిరసించినారు అతీంద్రియ స్వప్నములను గనుచు అవియెల్ల సత్యమని తలంచుటకు పులుగుల గానముతో వీడ్కోలు చెప్పించి నారు నిద్రయే జీవనంబని తలంచుటను కంటగించుకొనినారు అపయశఃపంకిల మైన యాత్మతో జీవించుటకన్న చచ్చుటయే కొంత మానరక్షణముగా తలంచి నారు

"కర్మ, విధిచేష్ట దైవ నిగ్రహమటన్న
పిచ్చివేదాంతములఁ బోయెఁ బెద్దప్రొద్దు
ఆత్మవిశ్వాస సూర్యోదయంబుకెలన
నిద్దురతమంబు కాఱొడ్డి నిలువఁగలదె" 11 అని కర్మ, విధిచేష్ట, దైవ నిగ్రహములన్న పిచ్చివేదాంతములను నిరసించినారు ఆత్మవిశ్వాసముయొక్క ప్రాధాన్యమును వివరించి ఆత్మవిశ్వాస సూర్యోదయముతో స్వాతంత్ర్యోద్యమ మును నడిపించవలసినదిగా భారతజాతికి మేల్కొలుపును పాడినారు

**మేలుకొలుపు** - దీని రచనాకాలము 30-10-1922 కవిగారు భారతదేశదాస్యా వస్థ త్వరలో తొలగిపోగలదని సూచించుచు రచించిన గేయ మిది

'కష్ట నిర్భర దాస్య మట్టుల
గాఢచీకటి సడలిపోయెను
భావి ప్రత్యూషమును జాటఁగ
వాడుగో శుక్రుడు రహించెను మేలుకో" 12 అని భావి స్వాతంత్ర్యాగ మమును గూర్చి వచించిరి మంగళధ్వనులటుల పక్షులు మంజుల కిలకిలారావ ములు సలిపినవి మాతృభూమి జయాంక చిహ్నముగా తూర్పున రవిమండల ముదయించినది అని పల్కి--

'మేలుకో భారత కుమారా
మేలుకోరా తరుణధీరా' మేలుకో" 13 అని భారతకుమారు లందరిని మేలుకొనవలసినదిగా ప్రబోధించిరి

**సేవ** - 16-2-1924వ తేదీన రచింపబడినది మనలను గన్న భారతమాత మందిరమున దివ్వెలుగా, పరమ పావనియైన తల్లి పూజల వాడు పువ్వులుగా, భారతదేవి విపంచిక రవళించు తంత్రులుగా, జన్మభూమి శౌర్య సౌరభములు వెద జల్లు గీతలుగా, కదనవీరుల చేతి ఖడ్గధారలలోని మెరుపులుగా మనముండవలెనని కవిగారు ఆశించినారు

**జాతీయత** - రచనాకాలము 17-2-1928 వీరు జాతీయత అస్థిపంజరములను సైతము ఆడించునట్టి శక్తిగలదని తలంచిరి

నిఖిల భారతజాతి గాంధీమహాత్ముని యాజ్ఞలో నడచుట, నెరలోభియైనను దాచియుంచిన నిధుల త్రవ్వి యిచ్చుట నెరజాణయైనను మోటు ఖద్దరు మేన మోయదొడగుట నిర్నిద్రకీర్తులు చెరసాలలో జిక్కి చీకువడుట మున్నగు కార్య ములు జాతీయతయొక్క ప్రభావము వలననే జరిగినవి కావున స్వాతంత్ర్య రథ మును నడుపుటకు జాతీయత ప్రధానమైనది

"పూర్వకీర్తి ప్రతాపంబు బొగడినావు
భావి భాగ్యోదయం బగపఱచినావు
వర్తమాన దాస్యంబును వదలజేయ
నే యుపాయంబు వెదకెదో యింకమీద" 14 అని వర్తమాన దేశ దాస్యా వస్థ నిర్మూలనమునకు నుపాయమును వెదుకవలసినదిగా జాతీయతను ప్రార్థించి నారు

**సింహప్రబోధము** - ఇది గాంధీజీ రంగప్రవేశము చేయక పూర్వము 1917 లో రచింపబడినది

చుమ్మల్ చుట్టగ బొట్టగట్టుకొని హుస్సుల్వారుచున్ మేకమాం
సమ్మం బట్టెడుదిందువో పలలమిచ్చంగాన భక్షింతువో
కమ్మల్ గిమ్మలు స్వప్నబంధములు వికన్ బోను లంఘింపు సిం
హమ్మా కాననరాజ్యమేల జనుమీ యత్యంతస్వేచ్ఛారతిన్" 15

సింహప్రబోధము పేరుతో భారతప్రజలను స్వాతంత్ర్యసముపార్జన కుద్యుక్తులు గావలసినదిగా ప్రబోధించుచున్నారు భారతప్రజలు సింహమ్ములవంటివారనియు వారు తలచుకొనినయెడల ఏ అడ్డంకులు నిలువవనియు పల్కి వారి శక్తిని, దీన స్థితిని గుర్తుచేసి ఉపేక్ష పనికిరాదని హెచ్చరించిరి

"భీష్మ దీక్షయు, చైతన్య ప్రేమరసము
బుద్ధుని యహింస ప్రహ్లాదు పూతభక్తి
యల హరిశ్చంద్రు సత్యవ్రతాఢ్యతయును
గలసి " 20 ఈ కార్యశూరుడు మూర్తీభవించినాడట

ఉప్పు సత్యాగ్రహము మొదట ఏవిధముగా ప్రజల అవహేళనకు గురి అయినదో, క్రమక్రమముగా అదియే దేశము నంతను ఏవిధముగా మహోద్వేగముతో ముంచెత్తినదో కవిగారు ఈ క్రింది పద్యములో జూపినారు

"హేళనపాత్రమై మొదట నింతగ నింతగ మోసులెత్తి, వే
వేలకు వేలునౌచు జన విశ్వసనీయముగా జెలంగి, యు
ద్వేల పయోధివీచికల తీరున రేగి సమస్త దేశమున్
మూలము ముట్టనూచెగద మున్ లవణోద్యమతత్త్వ మెట్టిదో ' 21

గాంధీజీ కార్యశూరత్వమునేగాక అతని గొప్పదనమును-

"చావు బ్రతుకులు రెంటికి
నావలి మార్గంబుఁ ద్రొక్కి నచలుడ వగుటన్
మావలెఁ దలపం గోరవు
దేవుడు గలడింక మీది దేశస్థితికిన్" 22

అని వర్ణించినారు ఈ పద్యములో సామాన్య ప్రజలకును మహాత్మునికిని ఉన్న వ్యత్యాసము తెలియుచున్నది మహాత్ముడు అచలుడు చావుబ్రతుకుల రెండింటికిని అతీతమైన మార్గమును ద్రొక్కినవాడు అతని కార్యక్రమములను సఫలీకృతము చేయుటకు, దేశస్థితిని కాపాడుటకు దేవుడు సహాయపడగలడని ఆశించినారు

**మాతృ మందిరము** - 5-10-1922 దీని రచనాకాలము మాతృ మందిర సందర్శన తత్పరులైన కొందరు యాత్రికులు బయలుదేరిరి అందలి ఐదవ యాత్రికుడు మిగిలినవారితో పలువన్నెల మణులను ఎరచిన విధముగా రాలిన పువ్వులచేత రాజిల్లుచున్న నేల సూర్యాతపమున స్రుక్కక మున్నె మాతృసాన్నిధ్యమును చేరుదమని పల్కెను అంత ఆకాశవాణి వారితో 'మీరు బాల్య చాపల్యము చేత నిజ మెరుగలేకున్నారు పరిచితి లేమిచేత ఈ సరణి యంతయు పుష్ప సంకీర్ణమనియు, చల్లనీడల బోవు సమతలమనియు భావించుచున్నారు ఇది

యాత్రికుల పరీక్షించు పదము ఎందరో యాత్రికులు యాత్ర కేగుచెంచెదరు కాని విజయ మొందెడివారు మాత్రము వేయింటి కొక రుందురు దుర్బలచిత్తులు దుష్టచేష్టితులు కార్యశూన్యులు, మోసగాండ్రు జడులు మందిర పుణ్యభూమి తిల కించలేరు ఈ మార్గము ధర్మజీవనుల పాదస్పర్శచేతను ఆత్మసమర్పకులౌ వీర వరుల అస్థులచేతను త్యాగవ్రతుల శోణిత ప్రవాహముచేతను పవిత్రమైనట్టిది' అని పల్కెను

ఇంతలో మార్గము ప్రక్కన బడియున్న పునుక వారిని జూచి నవ్వి ఇట్లు జెప్పసాగెను

"మాతృదేవీ బలిమంటపమందు
యజ్ఞపశువుగ నిల్చునంతటి భాగ్య
మెవరికి సిద్ధించు నిందజిలోన' 23 అట్టివాడు అడుగు ముందుకు పెట్ట వలసినదిగా కోరెను ఆ మాట విన్న కొందరు దిగాలుపడి తలకొక దారి పట్టు దురు మరికొందరు నోట తడిలెక వెనుకంజ వేయుదురు మరికొందరు దుర్బల హృదయులు వెనుకకుమరల ప్రయత్నించి గిరిసానువునుండి కూలబడుదురు కాని ఒక్క యువకుడు మాత్రము సజలనయనుండును, పులకిత శరీరుండును, పుష్పాంజలిబద్ధుడునై నిలుచుండి-

"విత్తు నశింపంగ వెలువడుఁ జెట్టు
వత్తి కాలకయున్న వఱలునే కాంతి
యభ్యుదయహేతువై యలరుఁ ద్యాగంబు
అట్టి త్యాగము నాకు నాదర్శకంబు 24

అని పునుకకు విన్నవించును

జయాపజయములు విధి మూలకములు ప్రయత్నము చేయుటయే మన కర్తవ్యము మాతృపాదముల కడ పడు భాగ్యమున్న గిరులైన నన్నడ్డగించలేవు మార్గమధ్యమున మరణించితినేని మీవలె ఎముకలు భూమిమీద వైచి నక్షత్రముల లోన నటియించెదను అని పల్కెను

అంత పునుక 'మాతృమందిర బలిమంటపవేది నాత్మ కర్పూరముగా నంటింపవోయి' అని హితవు పల్కెను ఆకాశవాణియు కాలి గుర్తులు అనంత కాలసికతముల పూర్వవీరులవలె ముద్రించి పొమ్మనియు పల్కినది

ఇందు దేశమాతృ చరణసన్నిధిని ఆత్మలను కర్పూరముగా వెలిగించనిదే స్వాతంత్ర్యఫలము లభించదను ప్రబోధ మున్నది

మరియు నాయకత్వలక్షణములు కూడ ఇందు చెప్పబడినవి మాతృదేవి బలిమంటపమందు యజ్ఞపశువుగా ఎవడు నిల్చునో-

"ఆ మహాపురుషుని యఱకాలిదుమ్ము
ప్రజల శిరంబెక్కి భవ్యంబు సేయు" 25

అని చెప్పినారు స్వప్రయోజనములకొరకు పాటుపడక ప్రజల క్షేమముకొరకై ఎవడు ఆత్మత్యాగము చేయుటకు సిద్దపడునో అట్టివాడు నాయకుడని సూచనము చేసియున్నారు

సంధ్య - ఇందలి సంధ్యాకాలమునకు సంబంధించిన వర్ణనమంతయు భారత దేశ పూర్వౌన్నత్యమును, ఆంగ్లేయుల పాలననాటి దౌర్భాగ్యమును తెలుపు చున్నది

సూర్యాస్తమయకాలమున మేఘములందు ఎర్రని కాంతులు వ్యాపించగా దిశాంతము లన్నియు చూచుటకు ఇరువాగులవారలు పోర, రక్తనిర్ఝరములతో అంగ ఖండములతో ప్రకాశించు రంగస్థలమువలె దోచుచున్నవి కౌరవ పాండవులు రాజ్యమునకై ఘోర రణముచేయగా అచట కూలిన సైనికులయొక్క భగ్న కాయములు పేరిన యుద్ధరంగమువలె పశ్చిమాద్రి సంధ్యాసమయమున ప్రకాశించు చున్నది

"క్షాత్రయుగంబునన్ భరతశౌర్యరమామణి వారికేళికిన్
శత్రుల శీర్షముల్ జలజషండముగాగ విభిన్న బాహువుల్
చిత్రి మృణాల వల్లులుగఁ జెల్వగు శోణితపూర్ణ సంగర
క్షేత్రసరోవరంబు విలసిల్లెనొ నా నపరాశ శోభలన్" 26

అని క్షాత్రయుగమునందలి భారతదేశ ఔన్నత్యమును వర్ణించిరి

ఇంతలో జపారుచిరకాంతులు తగ్గి కాంచనదీధితులు దిశల గ్రమ్మెను పూర్వపు భారతదేశము ఈవిధముగా సిరిసంపదలతో తులతూగుచుండెడిదా యను నట్లు అజాండ మంతయు హేమమయమై దోచెను ఆ సమయమున ఎరలకు నేగిన పక్షులు గూళ్ళకు ఆతురతతో వచ్చుటనుజూడగా భారతదేశ సంపదను దోచు కొనుటకై, ఇతర ధరణీజనులు మిక్కిలి సంతోషముతో పరుగిడి వచ్చిరో యను

నట్లు వింతగా పొడగట్టుచున్నది అంత క్రమముగ బంగారువన్నె దిశల మరుగ, నిబిడాంధకారము వ్యాపించెను అది మిక్కిలి సంపద, శౌర్యము అంతరింపగా సొంపు తరిగిన ఆర్యవసుంధరను దలపించును

ఇందు పక్షికులమును పర ధరణీజనులతో పోల్చి ఆంగ్లేయులను స్మరింప జేసిరి వారు వ్యాపారనిమిత్తమై వచ్చి రాజ్యాధికారమును హస్తగతము చేసికొని నారు వారి పాలనతో మనకు వెలుగుపోయి నిబిడాంధకారము వ్యాపించినది మనకు స్వేచ్ఛాస్వాతంత్ర్యములు లేవు

"ఎప్పుడు గాఢసంతమసమీ వసుధన్విడుఁ బ్రాచ్యదేశ మిం
కెప్పుడు శోణితార్ద్రరుచి నింపులు చిల్కును, బాలభాస్కరుం
డెప్పుడు పూర్వమట్టుల రహించుఁ బ్రతాప సముజ్జ్వలంబుగా
నెప్పుడుమానునో జలజశృంఖలరాయిడి బంభరాళికిన్ 27

ఆంగ్లేయుల పాలన మన కెప్పుడు తొలగిపోవునో యని స్వాతంత్ర్యేచ్ఛను వెలు వరించినారు భారతజను లందరును బంభరముల వంటివారు రేయి యందు పద్మములలో చిక్కుకొనిపోయినవి మరల సూర్యోదయమైనగాని బంభరములకు విముక్తి రాదు అనగా స్వాతంత్ర్యము సిద్ధించినగాని ఆంగ్లేయుల కబంధ హస్తముల నుండి విడివడ మన్నమాట

## ముసలి మాలెత -

కథాసంగ్రహము - మిక్కిలి బలహీనముగా నున్న ఒక ముదుసలి యవ్వ నట్టనడి యెండలో, మిట్టపల్లములలో కాలిడబోయి తొట్రిలపడుచు, గతిశ్రమతో ఒంటిగ వచ్చుచుండెను ఆకటిమంట తీరుటకై ఒక పూటయైన అన్నము లభింపక పోవుటచే అస్థిపంజరమైన దేహమునుకూడ మోయలేదనునట్లుగా ఆమె సోలుచుండెను మెల్లగా చెట్టునీడకు చేరినది అచ్చట నున్న మన కవిగారిని జూచి దాహ మగుచున్నదని సంజ్ఞద్వారా తెలియజేసినది వారు మంచినీరము తెచ్చి ఈయగా తనివితీర త్రాగి కృతజ్ఞతలు తెలిపినది

అంత కవిగారు ఆమెచరిత్రమును గూర్చి అడిగిరి పడమటిమిట్టదేశము లలో వానలు లేకపోవుటచె కరువుకాటకములు వచ్చినవి ప్రజలు తినుటకు ఒక్కపూటయైన తిండిలెక అనేక కష్టములను పొందుచుండిరి ప్రాణములు నిలువబెట్టుకొనుటకై డెల్టాబూములలో పైరులు కలవని తెలిసి అచ్చటి జనులు

వలసవచ్చిరి నా కూతురు, కొడుకును ఆకలిమంట యెట్టిదో యెఱుగనట్లుగ నన్ను సాకుచుండిరి కాని వారు క్రొత్త జ్వరముల వాతబడి మరణించిరి నేను మాత్రము క్రుంగుటేరు తెగియు కూలని ముసలిచెట్టువలె బ్రతికియున్నాను' అని కన్నీరు కారుచుండగా దైన్యముతో తన కథను వినిపించెను కొంతసేపు గడచిన తదుపరి అచ్చటినుండి వెడలిపోవు తలంపుతో అవ్వ కర్రకొరకు తడవుకొనుచుండెను

అంత కవిగారు 'కాయము బలహీనము కలుపుదుంపలు తీయను సత్తువైనను లేదు మరి నీ కడుపెట్లు నింపుకొనెదవు?' అని ప్రశ్నించిరి అంత నామె 'గొడ్డు కాటకమున బంధుగుల చేరి వారిని బాధపెట్టలేను కూలి చేసికొని ఆకైన, అంబలైన తినుటయె నాకు మేలుగా నుండును కన్నకన్నవారల ఇండ్ల గడపలు ద్రొక్కి బిచ్చమెత్తుట నాకు నిష్టములేదు కాలుచేతు లున్నంతకాలము ఇతరుల చేతి కూటికి ఆశింపను' అని పల్కెను

అవ్వ నైతికగుణాతిశయమునకు మెచ్చుకొని 'నీ నీతికి మిక్కిలి సంతోషము కలిగెను ఇకమీదట నీ వెచటికిని వెళ్ళక మా యింటనే కోరిన యట్టుల మజ్జిగన్నమును తినుము' అని కవిగారు పలుకగా అమె సంతసించి 'అయ్యా! నాకు కూలి చూపి కూడుపెట్టు తిరిపమెత్తి తిన్న ఆకలి తీరునా?' అని విన్నవించెను

**విశేషాంశములు** - 'ఇతరుల యాచించి పంచ భక్ష్య పరమాన్నములుతినుట కంటె స్వశ్రమార్జితమైన అంబలి త్రాగుటవలన కలిగిన ఆనందము అనన్యమైనది' అని ముసలిమాలెత ద్వారా మనకు తెలియజేసినారు

ఇందలి ముసలిమాలెత వర్ణనము గమనింపదగినది

"దారిద్ర్యదేవత తనరూపు గనుపింప
వగ్గువాలకమూని వచ్చె నొక్కొ!
భేతాళు నాజ్ఞ గావించు పిశాచంబు
పీనుగు నొడలితో వెడలె నొక్కొ!
స్వార్థపరస్వాంతుడౌ రాజుచేఁబడి
లావుదూలిన దేశలక్ష్మి యొక్కొ!
సకల వస్తుప్రదర్శనశాలలో నిడ్డ
ముదిమి యవధిఁ దెల్పు మూర్తియొక్కొ" 28

స్వార్థపరులైన ఆంగ్లేయులచేతబడి రూపు కోల్పోయిన భారతదేశ లక్ష్మి స్థితిని వర్ణించిరి భారతమాత ముసలిమాలెతవలె సొంపు తరిగి, దారిద్ర్యము ననుభవించుచున్నదని ధ్వనింపజేసిరి

## దుర్యోధనుడు -

**కథాసంగ్రహము** - ఓ రాజరాజ! రాజ్యలక్ష్మి నట్టనడియేటియందు నీ పుట్టిముంచెను ఎంతటి వీరులైనను నిన్ను జూచి భయపడునట్లుగా రాజ్య మేలితివి అట్టివాడవు పాండవులకు భయపడి ప్రాణభీతితో సరసిలో దాగికొనినావు యశంబుకన్నను నశ్వరమగు ప్రాణములు మధురసంబులా? భారతకీర్తి నెంచవే? హృదయము కోసియిమ్మనిన ప్రీతితో నిచ్చెడి కర్ణుడు నీకై రణములో మరణించినాడు గౌరవము పోగొట్టుకొని తుచ్ఛజీవనము చేయుట మంచిదికాదు నీ వంశయశమును గుర్తుంచుకొనుము ఎంతకాల ముండినను మనిషి చచ్చుట యన్నది తప్పదు కావున క్షత్రియుడు వ్యాధి బాధల చచ్చుటకన్న వీరమరణము చెందుట ఉత్తమము సమరకాంక్షులైన పాండవులు, మాధవుడు సరసితటమున నున్నారు ప్రాణములపై మోహమును వదలుము ప్రాణమిత్రుడైన కర్ణుడు, గాంగేయుడు, నీ కొడుకులు, నీ తమ్ములు నశించిపోయినారు నీకు దేహమందంత అభిమానమేల? గెలిచితివా రాజ్యము లభించును లేదా నిలింపపురి తోటలలో విహరింతువు శూరులకు రణము పండువు కావున విరోధుల మద మణచి సర్వభూవలయమునైనను, చావయినను పరిగ్రహింపుము ఇది యంతయు కవిగారు దుర్యోధనునిగూర్చి చెప్పిన విషయము

## విశేషాంశములు -

"ప్రవహింపదే నీదు రక్తనాళంబులఁ
బూర్వుల శోణిత పూర మిపుడు?
ప్రజ్వలింపదె నీదు భావకుండంబున
నవమానరోష హోమానలంబు?
తీతనే నేఁటితో దిక్కుల విలసిల్లు
భారత క్షత్రియవంశకీర్తి?
గొడ్డువోయెనే నేడు కురురాజ్ఞి గాంధారి
కదనవీరశతంబుఁ గన్నతల్లి?" 29 అని కవిగారు దుర్యోధనునిలో అభిమానమును మేల్కొలుపుచున్నారు

ఇది ఆంగ్లేయుల పాలనలో అణగి మణగియున్న భారతప్రజలకు ప్రబోధముగా మన మూహింపవచ్చును కొందరు కవులు కర్ణుని ప్రశంసించు నెపముతోనో, లేక దుర్యోధనునికి నివాళులెత్తెడు వ్యాజముతోనో ఆంధ్రులలో జాతీయ పౌరుషాగ్నిని రగిలించుటకు ప్రయత్నించిరి ఇట్లు భారతజాతీయతను వస్త్వాశ్రయరీతిలో గానముచెసినవారిలో కవికోకిల ఒకరు

**ద్రౌపదీ సందేశము** - కురురాజువద్దనుండి రాయబారిగా వచ్చిన సంజయునితో ద్రౌపది తన సందేశమును దెల్పుట ఇందలి వస్తువు పౌరాణిక సంబంధమైనది

**కథాసంగ్రహము** - ద్రౌపది సంజయునితో 'నీవు పూర్వ కష్టములకు మా యెడల సానుభూతిని చూపి తేనె పూసిన కత్తిని దింపదలచితివా? కపట మార్గముల పన్ని కనుల మూసి రాజ్యభాగమును కాజేసిన ధైర్యమువలన నేడు కూడ మాటలతో నిద్రపుచ్చి అరణ్యములకు వెడలించుటకు కుట్రలు పన్నుచున్నారా? గతించిన రోజులు కావివి మోసములకు లొంగి ధర్మరాజు తల యూచడు నన్ను సభలోనికీడ్చి పరాభవించినపుడు పతు లేవురు ధర్మబద్ధులై పగ దీర్చుకొనకుండుటను జూచి కురుభూపతి మమ్ము చులకనగా దలంచెనాయేమి? నా భర్తలు తమ శౌర్యము జూపుటకు తగినకాలము వచ్చువరకు అత్యంతాసక్తితో ఎదురు చూచుచున్నారు రాయబారము లెందుకు? ఈ రచ్చ లెందుకు? ఊర కిమ్మనిన కురురాజు రాజ్యము నిచ్చునా?

విరాటమహారాజుధేనువులను పరిముట్టువేళ కురునృపాలవరులు అర్జునుని పరాక్రమముయొక్క రుచిని చూచినారు ఆనాటి శౌర్యపరాక్రమములు రిత్తవడి పోలేదు రాజ్య మేనాటికైనను వీరభోజ్యము పరమ సుఖముల తులతూగు రాజు భిక్షకులకు పిలిచి రాజ్య మిచ్చునా? భీమ అర్జున, నకుల సహదేవులు విజృంభించి తమ పరాక్రమమును జూపినగాని కురురాజు రాజ్యమీడు ఉత్త మాటల ప్రయోజనమేమి? అవని యొసగుటో లేక అని నలుపుటయో నిర్ణయింపుడు నా మేన జీవమున్నంతవరకు సంధిప్రయత్నములు వదలిపెట్టుడు' అని తన బాధను తెల్పెను

**విశేషాంశములు** -

'బొల్లి మొగములపైఁ జెమటబొట్టులు గ్రమ్మ సురక్షతంబులన్
బెల్లగనెత్తు రోడికలు పేర్చగ మిమ్ము పృథాసుతుండు వి

దుల్లతికాభ బాణముల దూలి నదల్చి వధించుదాక మీ
యుల్లము రాజ్యభాగమునకొప్పునొ యెప్పుడొ సూతనందనా" 30

బొల్లి మొగములు అనుటలో తెల్లముచ్చులు అనగా ఆంగ్లేయులను గాంచగలము

ఇందు కౌరవులయందు ఆంగ్లేయులను వారి చర్యలయందు ఆంగ్లేయుల దౌర్జన్యములను దర్శింపవచ్చును పాండవులయందు భారతదేశప్రజలను, వారు పడిన పాటులందు భారతదేశప్రజల దుస్థితిని దర్శించుట అంత కష్టముగాదు

దువ్వూరివారు 'ద్రౌపదీ సందేశము' రూపములో జాతీయతను ప్రబోధించుటయే గాక స్వాతంత్ర్య సముపార్జనకు యుద్ధమే తగినదని తమ అభిప్రాయమును వెలిబుచ్చినారు సుఖమెరిగిన ఆంగ్లప్రభువులు ఈ రాజ్యమును విడిచి పెట్టరు కావున బలప్రయోగముద్వారా స్వాధినపరచుకొనుటయే పాండవులవంటి భారతీయులకు తగినపని యని అవశ్యకర్తవ్యమని సూచించినారు

## కొండవీడు -

కధాసంగ్రహము - సూర్యాస్తమయమైనది కొండవీటిదుర్గమునకు సమీపమున ఒక కేదారమును కృషీవలార్భకుడు దున్నుచుండెను చీకటిపడుటచే ఇంటికి వెళ్ళుటకై ఎద్దులనిల్పి మేడిమూనగా మొనకఱ్ఱు లోదవిలి పుర్రెయొక్కటి పైకి వచ్చెను దానిని జూచి బూతమని భయపడి తండ్రిని పిలచెను కృషికుడంతట పుర్రెను చేతితో నెత్తికొని అశ్రుధారలచే అభిషేకము గావించెను పిమ్మట కుమారునితో మాతృదేశపరాయణులైన రెడ్డివీరులు ఇచ్చోటనే యుద్ధము సలిపిరనియు శత్రువీరులు రెడ్డివీరుల గాంచి యుద్ధమున ధైర్యము పోగా, పులి గర్జించగా లేళ్ళు అరణ్యములోనికి పారిపోయెడివిధముగా పారిపోయెడివారనియు అట్టి కీర్తిని గాంచిన రాజులు ధరిత్రిగర్భమున శాంతిని పొందుచున్నారనియు, అట్టి శూరాగ్రగణ్యులలో ఒక పురుషుని శిరము ఈ పుర్రెయనియు వివరించి చెప్పును

తదుపరి బాలకుడు మనవార లెవరు? వారికి మనకు పూర్వముగల చుట్టరికమును దెల్పుమనగా వృద్ధుడు తలయూచి ఎద్దుల పోదోలుచు ఇంటిదారినడుమ కొండవీటి రెడ్డివీరుల చరిత్రమును వినిపించెను పూర్వవీరుల రక్తమే మనలో గూడ పొంగుచున్నది కాని కాలభరమున కండ లన్నియును శాంత కర్షకవృత్తి దాస్యమున తగిలికొనిపోయినవి పరవీరుల హృత్పుటములను జీల్చుటకు శక్తివంతములైన కత్తులు నేడు రూపాంతరమున సీరములందు కఱ్ఱులుగ మారి ధరణి

గర్భమును చీల్చుచున్నవి ఒక్కక్షణము ఆకాశమును ప్రకాశింపజేసిన ఉల్క వేరొక క్షణములో మరుగు విధముగా రెడ్ల ప్రతాపవహ్ని నల్దిక్కుల నిండి యాంధ్రభూమిలో తన తేజమును ఇమ్మడిచేసి, మోసపుటక్కులు ఎరుగకుండుట వలన కత్తులబావిలో రూపరిపోయినవి ఇట్లు తండ్రి జెప్పునంతలో వారిరువు రును ఇల్లు జేరిరి కొడుకు మనమున రాత్రియెల్లను కొండవిటి స్వప్నమే తప్ప మరియొక్క స్మరణ లేదు

**విశేషాంశములు** - ఇందు రెడ్డివీరులు నేడు కర్షకవృత్తి నవలంబించిరనియు, కండ లన్నియు కర్షకవృత్తి దాస్యమున తగిలి కరగిపోయినవనియు చెప్పబడినది

> "కత్తికి నడ్డులేక రిపుఖండనలీల నారితేరి భూ
> పోత్తములన్ యశంబు గని యుర్విని బాలనచేసినట్టి రె
> డ్లిత్తటి సీరచోదకవృత్తి గ్రహించిరి, పోటు కత్తులున్
> నెత్తుటఁ ద్రుప్పువట్టి చెడనే చెడె శూరత యంతరించుటన్" 31

అని కొండవీటి రెడ్డిరాజులనాటి రెడ్డికులౌన్నత్యము, ఇప్పటి రెడ్డివర్యుల దుస్థితి ఇందు వర్ణింపబడినది అనగా దేశగత వైభవమును వర్తమాన దుస్థితిని మరొక విధముగా స్ఫురింపజేసిరన్నమాట

దువ్వూరివారు ఆంధ్రదేశాభిమానముతో రచించిన ఖండిక యిది ఆనాటి కవులు కొండవీడు దేవరకొండ మున్నగు దుర్గముల ప్రాశస్త్యమును గూర్చి కావ్యఖండికలు వ్రాసి ఆంధ్రదేశౌన్నత్యమును దెల్పి తమ దేశాభిమానమును ప్రకటించుకొనినారు

## (11) ప్రకృతి కవిత్వము

నిత్యము మనకు దృగ్గోచరమగు స్థావర జంగమాత్మకమైన జగత్తంత యును ప్రకృతి యని స్థూలముగా నిర్వచింపవచ్చును మనము ఏ దృశ్యమాన జగత్తును ప్రకృతియని భావించుచున్నామో దానినే సాంఖ్యదర్శనము వికృతిగా చెప్పినది సాంఖ్యములోని తాత్త్వికదృష్టితో మనకిచ్చట ఏమాత్రమును నిమి త్తము లేదు కాగా ప్రకృతిశబ్దము మనకు కనిపించు జగత్తులోని చెట్లు, చేమలు, గుట్టలు, నదులు, తీగలు, డొంకలు, పూవులు పక్షులు, సముద్రము, ఆకాశము మున్నగువాని విషయములోనే రూఢమైపోయినది అట్టి ప్రకృతిని జూచి పరవ శించిపోయి ప్రకృతికవిత్వము వెలయించినవారిలో దువ్వూరి ఒకరు

**కవి మనోరథము** - దీనిని దువ్వూరివారు 'The Poets Ambition' అనుపేర ఆంగ్లీకరించిరి ఇందు కవిగారు సాంధ్యకిమ్మీరవర్ణవస్త్రములు దాల్చి, గిరితట విహార శృంగారకేళి సొలసి, రమణ( జరియించు జలదార్భకునిగా, ప్రత్యుషఃశ్లేషమున ఎచ్చు ప్రసవమందు తరుణసూర్యాంశు మాలికా తరళ కాంతి మిళితమై రాలు తుహినాంబుకణికగా శిలల ప్రవహించి శీకరంబులను జల్లి ప్రకృతి హృద్గతభావంబు బయలుపరచు గానమును చెయు మలయూట కాల్వగా, శారదేందుమయూఖసంస్పర్శనముల దైనికస్వప్నమాంద్యమ్ము( దలగ( ద్రోసి మొలకనవ్వుల మేల్కాంచును కలువగాగ యామినీవ్యోమమండల ప్రాంగణమున నుకవి యానందరాజ్యంబు( జొచ్చువేళ శోభ వెదజల్లు మిరిపంపు(జుక్కగా వెలుగొందవలె నని తమ కోరికను వెల్లడించినారు ఈశ్వరుడు తన కోరికను ఏల నెరవేర్చలేదో యని ప్రశ్నించినారు

వీరికిని దేవులపల్లి కృష్ణశాస్త్రిగారికిని భావములలో సామ్యము కనుపించు చున్నది కృష్ణశాస్త్రిగారు "ఆకులో ఆకుగా పూవులో పూవుగా, కొమ్మలో కొమ్మగా, నునులేత రెమ్మగా, గలగలని వీచు చిఱుగాలిలో గెరటముగా, జలజలని పారు సెలపాటలో( దేటగా, పగడాల చిగురాకు తెరచాటు తేటిగా, పరువంపు విరిచేడె చిన్నారి సిగ్గుగా తరువెక్కి యల నీలగిరినెక్కి మెల్లమెల్ల( జదలెక్కి జలదంపు నీలంపు సిగ్గుగా" 32 తాను ప్రకృతిలో తాదాత్మ్యమును పొందవలెనని కోరుకొనినారు

దువ్వూరి, దేవులపల్లి వారలు ప్రకృతియందలి సౌందర్యమునకు ముగ్ధులై తామే ప్రకృతిలోని సుందరవస్తువులుగా సృజింపబడిన నెంతయో ఆనందజనకముగా నుండెడి దని భావించినారు

**కవి** - Revelation' అనుపేర రెడ్డిగారు దీనిని ఆంగ్లీకరించిరి కవులకు కొన్నికొన్ని సన్నివేశములు చూచినపుడు కొన్నికొన్ని భావములు హృదయములో మెదలును వీరికి ప్రకృతియే సర్వప్రపంచసీమ అందుండి ప్రతిమనిషి నేర్చుకొనవలసిన కొన్నిధర్మములు గలవు

వేగుజామున వికసించు విరులలో, రేకువెడలించు సంజపూరెమ్మలలో ప్రకృతిసామ్రాజ్యపాలనాపద్ధతులు గలవు చటులకల్లోలరసనలసాగరము పవలు

రేయి ఆలపించు పాటలలో అనితరగ్రాహ్య ధర్మములైన విశ్వసృష్టి ప్రకారములు గలవు

"శ్యామలాకాశఫలకము నందుఁ దరళ
కాంతి వెదజల్లు తారకాక్షరము లొనర
విశ్వవైశాల్యబోధక విద్యనేర్తు
శర్వరీగర్భకాంతి యొజ్జగవిధింప" 33

అని ప్రకృతిని తన ఉపాధ్యాయినిగా దువ్వూరి తలంచినారు

గజురుతుంపరముత్యాలు కాన్కలిడుచుఁ దరలు సెలయేటిపాటలో దాగియున్న రాగతత్త్వమును ఆమనిరాత్రులందు కూయు కోయిలకడ నేర్చుకొనవలయును ప్రకృతి స్వీయచరిత రహస్యములు వ్రాయబడిన హృదయపుస్తక పుటములను ముదముతో రెడ్డిగారి యెదుట విప్పి ప్రభాతరాగరంజితమైన తూర్పు తీరమున కన్పించినది

శైశవస్మృతి - దీని రచనాకాలము 3-11-1922 ఆంగ్లకవి 'వర్డ్సువర్తు' వలెనే దువ్వూరి కూడ తమ శైశవస్మృతికి సంబంధించిన గీతములను ఆలపించినారు

వర్షాకాలము నందలి మబ్బులను చూడగనే కవిగారికి శైశవమునందలి తమ చేష్టలు గుర్తుకు వచ్చెడివి

"అల్లిబిల్లులు దిరుగ నాటలాడంగ
వాగులై వీధులఁ బ్రవహించు నీటఁ
గాళ్ళడ్డముగఁబెట్టి కట్టలుగట్టఁ
బ్రతి వానకాలంబు బాల్యంబుఁదాల్ప" 34

తమ మనస్సు ఉవ్విళ్ళూరుచుండునట

బాల్యము గడచినది యౌవన మంకురించినది ఇరువదారేండ్లు గడచినవి అందువలన అట్టి మధురమైన 'శైశవ మిప్పుడు అలరునే నాకు' అని బాధపడినారు కాని వానాకాలపు మబ్బులు మాత్రము పసినాటి చిన్నారిప్రాయమును విడువక నవ్యముగా ప్రకాశించుచున్న వనియును, అవి పూర్వజన్మమునందు అట్లుండుటకుగాను ఎట్టి జపతపముల నొనరించినవో గదా' యనియును తలంచినారు

ఆకాశమున చరించు వానాకాలపు మబ్బులను చూచినపుడు తాను తన వయస్సును మరచిపోయి ఆడదలతు ననియు, కాని పరుల యాడికలకు భయపడి ఇంటి యందె పట్టి బంధించిన విధముగా నున్నాననియు తమ ఆవేదనను వ్యక్తీకరించిరి

అంత మేఘములు పిన్ననాటివలె నీ హృదయము మాదు బిగికౌగిలింతల స్పర్శసుఖమును బడయుచున్నది గదా యనియు-

"కాలదౌర్జన్యంబు కాయమును దక్క-
నీ హృదయం బంటనే యంటలేదు" 35 అనియు ఓదార్చినవి

ఈ ఖండికలపై వర్డ్సువర్తు బ్లేకు రచించిన శైశవసంబంధిగీతముల ప్రభావమున్నట్లు సి నారాయణరెడ్డిగారు నుడివియున్నారు 36 శైశవమునందలి ఆనందాములు యౌవనజీవితము నందు లభించుట కష్టమనియు శైశవమును దాటుట యనగా జీవితసముద్రమధ్యమున చిక్కుకొనుట యనియు కవి వాపోయి నాడు

**వానాకాలపు వరిచేలు** - 1-11-1922 న రచింపబడినది ఇందు వానాకాలము నందలి వరిచేల సౌందర్యము చిత్రింపబడినది

వానజల్లులో తడిసిన వరిచేలు దుమ్ముకప్పు పోయి కాంతితో కళకళ లాడు చుండెను తడిపచ్చికల తావి గాలిలో విరిసెను పొగవన్నె మబ్బుమీద ఎగిరెడి కొంగలబారు-

"భౌతికరూపబంధంబు లెడపి
పుణ్యలోకముఁ జేరు ముక్తాత్మమాల
యన " 37 భావవీధిలో విచిత్రముగ దోచినవి ప్రకృతి దర్శనమువలన కవికి గలిగిన తాత్త్వికచింతనకు ఇది నిదర్శనము

వానచినుకులు చేయుగానము బాల్యకాలమందలి స్వప్నమును కనుల గట్టించును మరచిన చిన్నతనపు పొరపొచ్చెములులెని బుజ్జికోరికల ఇంద్రజాలము రీతిగా ఇగురొత్త జేసెను ఈవిధముగా వానాకాలమందలి వరిచేలు దువ్వూరికి దర్శనమిచ్చినవి ఇది 'Fields in Rain' అనుపేర రెడ్డిగారిచే ఆంగ్లీకరింపబడినది

**వానాకాలపు పల్లీ జీవితము** - రచనాకాలము అక్టోబరు 1924 ఇందు వానాకాలమందలి పల్లీయుల జీవితము వర్ణింపబడినది

వర్షాకాలములో వసుంధర పైరుపచ్చలతో కళకళలాడు చుండును ఆవులు తనివితీర బీళులలో పచ్చిక మేసి కండ పట్టియుండును సూర్యరశ్మి తీక్షతతగ్గి లేఁబైరుల సేవచేయ చూచుటకు కనులపండువుగా నుండును

'ప్రకృతిలీలావిలాస కావ్యంబునందు
రసవదధ్యాయమేమొ వర్షంపుఋతువు
కానిచోఁ దదధ్యేతలౌ కర్షకులకు
నెటులఁ బరనిర్వృతిం గూర్చ యింపెలర్చు" 38

లేఁబ్రాయపుటిల్లాలితో ప్రక్కలఁద్రొక్కి మూగు పసిసంతానముతో వర్షపు దినములు తిన్నగ గడపవచ్చునను ఉద్దేశ్యముతో కాపు ఎదురుచూచుచుండును పొలములందు పాటలు పాడుచు, కలుపుదీయు పల్లెటూరితొయ్యలుల నిసర్గరమ్యమైన దరహాస విలోకన చేష్టలలో నిష్కలుషమైన గ్రామీణజీవనపు కమ్మదనము గానుపించును ఎన్నియిక్కటు లున్నను కుడువ కట్టను ఒకవేళ కొదువయైనను ప్రకృతిసామీప్యజీవనభాగ్య మొక్కటియె ఉన్నకడగండ్లను మరపించి ఊరడించ గలదు

**పంటకారు సాయంకాలము** - 30-4-1927 దీని రచనాకాలము కవిగారు దినమెల్ల గృహకార్యనిర్వహణమునందు గడపి సాయంకాలసమయమున పండిన పైరుచేల నడుమకు మహానందముతో పోయి కూర్చుండిరి ఆ సమయమందలి-

'గూళులకువచ్చు పక్షుల కూజితములు
సంజకెంజాయ గారడి చక్కదనము
వరుల వినవచ్చు కీటకావ్యక్తగీతి" 39 మున్నగునవి కాపువానినిసైతము కవిగా నొనర్చునట ఆ పొలమనెడి దేవాలయమందు హృదయము ప్రశాంతమై యుండి చింతలను మరపించును చిలుకల దండులు దోరకంకులమీద వ్రాలి వానిని తమ నోటగరచుకొని గూళులకు గొనిపోవుచున్నవి

కావువానికిఁ గవికి సంగ్రామభూమి
యయ్యె హృదయంబు కొంతసేపైనవెనుక
కవియె మీదయ్యెఁ గ్రిందయ్యెఁ గర్షకుండు" 40

చివరకు తార లుదయింపగా ఇంటికి బోయిరి,

**మంచుకాలపుఁ బ్రొద్దు పొడుపు** - రచనాకాలము 17-2-1929 ఇందు మంచుకాలమందలి ప్రొద్దుపొడుపు ఎంతయో మనోజ్ఞముగా వర్ణింపబడినది

"వలికిం జెమ్మలువోయి కుత్తుకమెదల్పన్‌లేక లేయెండ రా
కలకున్ జెక్కలువిచ్చి యార్చు ఖగసంఘాతంబు ప్రాభాతమం
జులగీతల్ వినిపింపనోపవు, హిమాంశుండయ్యె సూర్యుండు, ప్రా
చి లవంబేనియుఁ జిత్రకారునకు సంసేవ్యంబుగా దిప్పుడున్" 41

సూర్యకిరణములకాంతి హెచ్చుకొలది హాలికులు వరిమళ్ళకు పోవుట, అచట వరి కోతలు కోయుట మున్నగునవి మంచుకాలమందలి కొన్ని కృషీవలకృత్యములు

**కుసుమాశ్రువులు -**

**కథాసంగ్రహము** - తండ్రి దేవుని పూజించుటకొరకు పుష్పములు కోసి కొని రావలసినదిగా ప్రాతఃకాలముననే తల్లి కమలను ఉద్యానవనమునకు బంపెను అది చలికాలమగుటచే లేతపచ్చికలమీద నున్న మంచుతుంపరలు అటు నిటు చెదరగ ఆమె అంఘ్రితలము చలికి మొద్దువారిన ట్లయినది

అచ్చట సూర్యకిరణములచే ప్రకాశించుచున్న హిమాంబుకణములు ముత్యపు సరములు తెగిపోవ వరుసగ క్రిందికి జారిపోయెడివిధముగా పూలరేకులనుండి జారుచున్నవి ఆ నిసర్గసుందరదృశ్యమును జూచి కమల మధురానుభూతి ననుభ వించుచుండ తల్లి త్వరగ రావలసినదిగా మరల పిలచెను కాని కుసుమముల కోయుటకై చేతులు ఆడుటలెదు గాలికి కదలినప్పుడు పువ్వులనుండి జారెడు మంచుబిందువులు ఆమెకు కాలువలుగట్టు నశ్రుబిందువులవలె నున్నట్లు కాను పించినవి

'కన్నులవిందుసేయు సుమకాండముఁ ద్రుంచి విచిత్రశోభలన్
జెన్నొలకించు నీ ప్రకృతిచిత్తము నెత్తురులొల్కఁజేయ నే
నెన్నడుఁ బూన, లేబొడుపుటెండలు సోకినఁ బల్కరించు పూఁ
బిన్నల హత్యచేయఁ దలపెట్టుట క్రూరము నన్నుఁబోటికిన్" 42

ప్రకృతిరామణీయకమును పాడుపెట్టి దైవపూజచేయుట అంత మంచిది కాద నియు ఆత్మకుసుమసమర్పణముజేసి వేదవేద్యుని పూజించుట ఉత్తమమనియు తలంచినది

**విశేషాంశములు** - భావకవి తన కవితకు ఉద్దీపకమైన ప్రకృతిని మనసార ప్రేమించును ప్రకృతిపురుషులకు వారిదృష్టిలో తేడా లేదు దేవుని పూజించుట వలన యెంత ఫలితముగలదో, ప్రకృతిని అనగా చెట్లు, తీగలు, పూవులు

మున్నగువానిని ప్రేమించుటవలనను అట్టిఫలితమే లభించుననునది భావకవి మతము భావకవి ప్రకృతిని మానవులకన్న అధికముగా ప్రేమించినాడు దువ్వూరికూడ భావకవి యగుట వలనను గ్రామీణజీవితమును అనుభవించినవా డగుటచేతను ప్రకృతిని ఎక్కువగా అభిమానించియున్నారు

కరుణశ్రీగారి 'పుష్పవిలాపము' దీని తరువాతిరచన యగుటచేతను కొన్ని భావములందు సామ్యముండుటచేతను, అది 'కుసుమాశ్రువుల' ప్రభావము కలది అనుకొనుటకు వీలున్నది

గటిక - వానకు మురిపాలగుబురుగా పెరిగి మెత్తదనముతో ప్రకాశించు గటి కనుజూచి దైవసృష్టిలో దానికిగల స్థానమును స్మరించినారు 'గటిక' వంటి సామాన్యపదార్థమునుఁజూచి-

"ఏను నీపైతినో యెవరికిం దెలియు
మున్నుగతించిన పుట్టువులందు
ఈవు నేనౌదువో యెవ రెఱుంగుదురు
రాబోవుజన్మల రాకపోకలకు
గుసగుసచెప్పెదు గునిసియాడెదవు
నీలోనవెలిగెడు నిర్మలజ్యోతి
వెలికొత్తఁ బోరాటపెట్టుచున్నదియె" 43

అని తామిరువురకుగల పూర్వజన్మసంబంధమును, రాబోవుజన్మలసంబంధమును స్మరించుట, దానిలో నిర్మలజ్యోతి వెలుగుచున్నదని తలంచుట కవి తాత్త్వక దృక్పథమునకు ఉదాహరణముగా చెప్పవచ్చును

అంతియేగాక గటికయొక్క అందచందములందు, సంతసమునందు పాల్గొన తనహృదయ ముప్పొంగుచున్నదనియు పల్కి--

"పంచవన్నెముసుంగు వలిపంబు క్రింద
నొకవేళ నిరువురమొకరమే యేమొ 44

అని ఇరువురిలోను ఏకత్వమును గాంచినారు

ఆమని నిషా - ఓయతీశ్వరా, జగత్తు మాయ యనియు, భోగభాగ్యములు చంచలమనియు నీవు బోధచేసినను ఈమధుమాసనిశీధిలో వినువారెవరును లేరు ద్రాక్షరసపూర్ణమైన పాత్రిక పెదవులతగులగా దానిని చేదని ఎవరు తలంచుదురు?

చాలిక నీ హితబోధలు ఆనందభాండమునందు హాలాహలమును కలుపబోకుము- అని పల్కి ఉన్మత్త కోకిలలు ఉద్యానవన వాటికయందు మధురముగా గానము చేయుచున్నవనియు లొద్దుగకొమ్మలలో పున్నమచందురుడు ఉయ్యేల లూగు చున్నాడనియు ఆమనిమత్తున చైతన్యలోకము ఆనందపరవశమై సొగియుచున్న దనియు ఆమని గొప్పదనమును తెల్పియున్నారు పిదప-

'సరిచేయు మోసఖి భగ్నవిపంచిక
సంధ్యలు పాటలఁ బుచ్చెదము
సౌఖ్యనదీరసపూరమునం ధంచ
జంటవిధంబున నీదుదము " 45

అని తమ కాంక్షను తెలియజేసియున్నారు

ప్రకృత్యుపాసకులైన కళాకారుల దృక్పధమునకును 'యద్దృశ్యమ్ తన్నశ్యమ్' అను వేదాంతుల ధోరణికిని గల అంతరము ఇట మనకు స్ఫురణమునకు రాగలదు

వసంతోదయము - వసంతోదయకాలమందలి చిహ్నము లిందు తెలుపబడినవి మావిచెట్లు ఎర్రనిచిగురులతోను, చెట్లుచేమలు పువ్వులు, ఆకులు, పిందెల తోను ప్రకాశించుచున్నవి కోకిలలు మావికొమ్మలెక్కి అయాచితముగా గానము చేయుచున్నవి గడ్డిక మొదలు తారకాగణమువరకు గల సృష్టియంతయును నవ నవోజ్జ్వల సుఖజీవనప్రభాత దివ్యసందేశమును దెలుపుచున్నవి

'ప్రభువసంతుడు నందనవనమునుండి
యాత్రసేయగ భూమిపై కరుగుదెంచె
నతడు విడిసిన తలము లల్లవిగొ, పచ్చ
నాకుల గుడారముల పట్నమనఁ జెలఁగు' 46

వసంతుడు విడిసిన తలములన్నియు ఆకులగుడారములతో ప్రకాశించుచున్న పట్నమువలె నున్నవని తలచినారు

మోహిని ప్రకృతి - రచనాకాలము 27-3-1 తియ్యనిరాగములెత్తి సెలయేరు గానముచేసినది అలలు మైమరచి తాండవమాడినవి కోకిలరవములు రజనీగాంభీర్యమునకు తోడ్పడినవి జలజల దేహము పులకించి వీణాతంత్రుల నుండి ప్రేళులు జారెను

"ఓరె నా జీవన శుష్కఝురంబుపాఱె కూలంకషపూర్ణముగఁ
జాఱెరా' పరలోకజీర్ణతటంబు పూరసంఘర్షణశీర్ణముగ
పగిలెఁ గమండలపాత్రిక చిగిరించె సంసారవల్లిక
తగదిక బైరాగిజీవిక జగమెల్ల నందనవాటిక" 47

అని జగమునంతను నందనవాటికగా భావించినారు

**ఆనంద సత్రము** - ఇది 30-3-1923 లో రచింపబడినది ఇందు విరహ విహ్వల కామిని, దరిద్రకుచేలుని, నిష్ఠురజీవనపధికుని, మానవద్వేషిని, హిమ కరరంజిత గగనచ్ఛాయలో ఆనందసత్రద్వారముల తెరచియుంచితి మని పల్కి ఆహ్వానించుచున్నారు అచ్చట-

"అతిధులార చెలియొకపాత్ర యాసవరస మానెదము
ఆ మత్తులోనఁ గరగిపోవు నైహికయాత్రాశ్రమము' 48

అని పల్కి జగమెల్ల ఆనందసత్రముగా మారవలెనని ఆశించిరి/

**కోయిల** - వసంతకాలములో కోయిల లేతమామిడిచిగురు మెసవి మధురమైన కంఠముతో గానముచేయును కోకిలపాటకు వసంతకాలమునకు సంబంధము గలదు

కోయిలకూజిత విహీనమైన గున్నమావి తంత్రుతెడలిన వల్లకీదండము వలె నున్నదట కోయిలలేకున్న గగనవనీనికుంజతలములును పాడుపడిన విధ ముగా తోచుచున్నవట అందువలన కోయిలను ఒక్కసారి ప్రణయగీతి పాడ రావలసినదిగా కవిగారు ఆహ్వానించుచున్నారు

"తేనెలూరెడి నీ పలుకుఁ దియ్యదనము
గోరి విరహులపోలికఁ గుందువారు
కవివతంసులు, వాసంతకాల లాంఛ
నంబవయి రావె కోయిలా, సంబరముగ' 49

వసంతకాలము కవికోకిలలకు గానముచేయుటకు తగిన ఋతువు అందుచేత కవులు విరహులవలె వసంతఋతువు రాకకొరకు ఎదురు చూచుదురు కాన వాసంత కాల లాంఛనముగ రావలసినదిగా కోయిలను దువ్వూరివారు పిల్చుచున్నారు

**రజని** .- రచనాకాలము 14-3-1923 నిర్మలఆకాశమున సజీవవికాసములతో చుక్కలు నిండినవి మర్మవిపంచికను రజనీమానిని మూర్ఛనలతో మీటెను ఆ ధ్వనికి-

"ప్రాంతకుటీర లతాద్రుమసౌధము లస్ఫుట తారాకాంతిన్
వింతగఁ గరఁగెడివోయన ఛాయాక్రాంతములై " 50 కనుపించినవి
లోకము సమస్తము నిశ్చలానందములో మునిగిపోయినది అట్టిస్థితిలో గోరీపైన
ప్రదీపికవలె కవిగారు ఒంటరిగా కూర్చొనియుండిరి

"అహహా! నామది విశ్వముతోడ లయానిర్వలమై నటియించున్
అహహా విశ్వము నాహృత్పాత్రికనాసవరసమున లయమొందున్" 51

ఇందు కవిగారి మనస్సు విశ్వముతోడ లయమును, విశ్వము కవిగారి
హృత్పాత్రికయందలి ఆసవరసమందు లయమును పొందినట్లు భావించినారు
అనగా తనకును విశ్వమునకును అభేదము నూహించుకొనినా రన్నమాట

**ఏల పాట** - పల్లెటూరిప్రజల ఏలపాటలు వినుటకు మిక్కిలి మధురముగా
నుండును దువ్వూరివారు పల్లెటూరిజీవితమును బాగుగా అనుభవించినవా రగుట
చేత ఏలపాటల ప్రభావము వారిపై బడినది దానితో ఈ ఏలపాటను వ్రాసి
యుండవచ్చును

"వస్తావంటే చక్కనిదానా వలపుచిందే చూపుదానా
మల్లెపువ్వుల కోనకుపోయి మల్లీవస్తాము
గండుకోయిల కూసేచోటు గుండుమల్లెలూ పూసేబాట
ముద్దుముచ్చటా దీర్చుకొంటూ మురిపేమాడేము" 52

ఈవిధముగా ఈ పాట యంతయు సాగిపోవును

ఇందు భావము భాష, గేయరూపము మున్నగునవి గ్రామీణహృదయము
నకు సన్నిహితములై సుకుమారముగ చిత్రింపబడినవి

## (111) ప్రణయ కవిత్వము

మన ప్రాచీనకవులు, లాక్షణికులు 'ప్రణయ' శబ్దమును స్త్రీ పురుషసంబంధ
మైన శృంగారములోనేగాక సాధారణస్నేహమను అర్థములోగూడ వాడియుండిరి
కాని భావకవిత్వములో ఈ ప్రణయ' శబ్దము కేవలము నాయికానాయకుల మధ్య
గల ప్రేమ అను అర్థములోనే ప్రయోగింపబడినది

ఆధ్యాత్మికజీవనమునకు ముఖ్యమైన ఈ ప్రేమయొక్క రహస్యమును
గమనించిన మన ఆధునికులు తాము దర్శించిన ప్రేమించిన, ఊహించిన స్త్రీలను

గూర్చి ప్రణయకవిత్వ మల్లిరి ప్రేమను అలౌకికమైనదిగా భావించి కన్నులతో గాక హృదయముతో చూచిరి వియోగశృంగారమునకు ప్రాధాన్యమిచ్చిరి

ప్రణయాహ్వానము - ఓ చెలియా! ఉద్యానవనము నందలి మందానిలపోత ములు మనల సమ్మానింప వచ్చినవి

"చంద్రికాముగ్ధశర్వరీఛాయలందు
జీవలోకంబు సుఖసుప్తి జెందుచుండ
గవిమనంబును, ప్రకృతియు గలయుచుండ
బోదమా కాంత! సెలయేటి పొదలదరికి" 53

అని కాంతతో సెలయేటిపొదలదరికి పోజూచినారు

ఓ చెలీ! పులుగులు గూళులనుండి చెదరిపోయి, రెక్కల నొత్తికొనుచు గొంతులను పరస్పరము బిగితో పెనవైచెడివేళ, ఎప్పుడును దెలుపని హృద్రహస్యముల తెలుప వీలగును కావున సెలయెటి సైకతము జేరుదమా? అని తన చెలిని ప్రశ్నించినారు

"జిలిబిలి కమ్మగానములు చేసెడి యా సెలయేటి యొడ్డునన్
బులకలవిస్తరిల్లి నునుబోడిమి జూపెడు నీదు బుగ్గలన్
దొలకెడి సిగ్గుడాలు గడదోపని ముద్దులగ్రుమ్మరించి య
వ్వల మధురోక్తులం గడగివైచెద గోమలి రమ్ము మెల్లగన్" 54

అని తనచెలిని సెలయేటిపొదలదరికి సెలయెటి సైకతమునకు ప్రేమతో ఆహ్వానించినారు

ప్రణయాంజలి - దువ్వూరివారును ఒక జవ్వనియు పరస్పరాకృష్టులై యుందురు ఆ ప్రేమ భగ్నముగాగ విచారించి రచించిన ఖండికయై యుండవచ్చును

'అల్లియు పూలు పూయని లతావళులట్టుల నాకు కోరికలు రేగియు సఫలము కాలేదు నేను చేసిన పాపములే మా యిద్దరిని వేరొనరింపగ దైవదూషణము చేయుట వ్యర్థము మోదఖేదములు పూర్వజన్మఫలితోద్ధితములు గదా!' అని తన్ను తాను సరిపెట్టుకొనినారు

భరింపరాని హృదయవేదనచే సంతోషలోకము అంధకారయుతముగా కళదప్పి గానుపింప యౌవనపుటుత్సాహము జీర్ణింప, స్వప్నయదార్థత్వము లౌకికమని తలంచి చింతించుచుందును

తలిదండ్రులు మన కోరికలు సమయుప్రయత్నము గావించియు కలల యందు గలుగు మనోహరప్రణయసఖ్యమును దొలగింపలేక పోయిరి ఓచెలియా! ఇద్దరి ప్రేమబంధనము విచ్ఛిన్నముకాకుండ నుండినయెడల కాంక్షలు దుస్సాధ్యము లయ్యెను కొంతవరకు సంతోషమునే గూర్చెడిది ఈ లోకమున మన యిరువురిప్రేమ ఫలింపకున్నను స్వర్గమునందు ఫలించును అచట ఆనందరసామృతమును గ్రోలుదము

"కనులంగాటుక చీకటుల్ నెఱయ గ్రీగంట న్విలోకించి
మనమున్ మానగరాని గాయముల నొంపన్ స్వప్నమల్లేల చ
క్కనిదానా! పొడగట్టెదీవు? ననునింకం జిమ్మచీకట్ల వీ
ణనువాయించి వియోగగీతి లయమొందం బాడనిమ్మొంటిగన్" 55

అని తన వియోగగీతి లయమొందునట్లుగా పాడుకొననియవలసినదిగా తన ప్రియురాలిని వేడుకొనుచున్నారు

"ఎవ్వతెయందు నామది లయించి తదన్యము చింతసేయదో
యెవ్వతెప్రేమపుష్పము సహింపగరాని వియోగగంధమున్
నివ్వటిలంగ జేసెడినో, నిద్దురలం దనుభావ్యయైన యా
జవ్వని మన్మనఃప్రణయసాక్షిగ మంగళ మొందుగావుతన్" 56

తాను వియోగబాధకు గురిచేయబడినను, నిద్దురలం దనుభావ్యయైన ఆ జవ్వని మాత్రము ప్రణయసాక్షిగ మంగళ మొందుగాక' అని ఆశీర్వదించినారు

**కవితాప్రణయిని** - కవితను ప్రణయినిగా భావించి కవిగారు తమ వలపును వెల్లడించినారు వారిరువురి సంభాషణమే ఈ ఖండిక

తనకు కవితయెడలగల ప్రేమను వెల్లడించి 'ఓ వలపులాడి' నీ సరసవీక్షా ప్రసాదమను భిక్షనుపెట్టి నన్ను నీవు వసియించు చోటునకు గొనిపొమ్ము' అని యువకుడు పల్కగా ఆ లతాంగి చిరునవ్వునవ్వి పైట సరిచేసికొనుచు, కాలి యందెలు మ్రోగునట్లుగా బొటనవేలు నేలవ్రాయుచు ఇట్లు పలికెను

ఓయి మోహనా' నీవెవ్వడవు' ప్రణయబంధముగోరి పలికెదవు స్వర్గమున జరియించు మముబోటుల సాంగత్యమును గోరివచ్చితివా' నా బహిరాకారమును గని ఆనందమును బొందినవారెందరో గలరు కాని ఎడలేని ప్రేమశృంఖలల జిక్కి నా మనమును చూరగొన్న ప్రియులు చాల అరుదు అవనిపై సంచ

రించువారు దివ్యనక్షత్రమండలిపై తిరుగగలరా' అందరాని ఫలములకు ఆన
యేల' పొమ్మ నను పోలినవారు భూమిని అనేకులు గలరు '

అంత యువకుడు తాను కవితకొరకు ఎట్లు దినములు గడపినది వివరిం
చును తదుపరి 'మీబోటివారికి నమ్మినవారిని మోసగించుట తగునా' ఇంతటి
క్రూరచిత్తమా' అనియు యువకుడు ప్రశ్నించును

"గ్రామవాసిని ఎఱుగను కైతవంబు
ప్రకృతితల్లి స్తన్యంబున ప్రబలినాడ
బొలముల విహరించుచు ప్రొద్దుపుచ్చుచుందు
నట్టి నాముద్దువలపును నరయలేవె ' 57

అని పల్కి ప్రార్థన కొప్పికోలుగా కవితాలతాంగి మృణాళసదృశమైన బాహువు
లెత్తి ప్రేయసుని తన కౌగిలిలో చేర్చుకొనెను

**విశేషములు** - ఇందు కవితావిర్భావముకొరకు కవిపడిన ఆవేదన వ్యక్త
మగుచున్నది ప్రత్యుషస్సుల నూత్నపత్రములు విచ్చి హిమబిందువులరాల్చు
సుమతతుల చూచినపుడు సంచెమబ్బుల గాంచినపుడు, పారిజాతపుష్పములు
పవనహతిమృదుతృణములు రాల్చెడునపుడు, సాలెగూళ్లలో ముత్తెపుసరమటుల
లేతగాలికి అల్లనల్లనజలించు మంచునీటిబొట్లను గాంచినపుడు కవిత్వము వ్రాయు
టకై ప్రయత్నించెడివారు కాని ఆ ప్రయత్నము సఫలమయ్యెడిది గాదు అట్టి
పరిస్థితిలో చాల బాధపడి కవిత్వమునే ప్రణయినిగా భావించి తన్ను వరింపుమని
వేడుకొనినారు చివరకు కవితాలలాంగి వారిని కౌగిలించుట అనగా కవిత్వము
తమ్మ వలచివచ్చుట జరిగినదన్నమాట ఇది కవిగారి ఆత్మవిషయము

"కలకంఠంబులు గూసినం గిసలయాగ్రంబుల్ పిసాళించినన్
వలపుంజిల్కెడి పూవు పూచినను నీనామంబె చింతింతుదున్ ' 58

ఇందు చెప్పబడిన మూడును వసంతకాల లక్షణములె వసంతకాలము కోయిలలు
గానముచేయుటకు తగిన ఋతువు అట్లే అవి కనుపించినపుడు కవికోకిలలుగూడ
పరవశించి గానముచేయుదురు అందుచేతనే వానిని జూచినపుడు కవితానామమునే
చింతించుచున్నానని కవిగారు అనియున్నారు.

**ప్రణయబలి** - రచనాకాలము 21-2-1929 గూడూరులో తన మిత్రుడు
పెల్లేటి వేంకటసుబ్బారెడ్డిగారి ఇంటిలోనున్న నవయౌవనిని తనకందని వస్తువని

గ్రహించలేక దువ్వూరివారు హృదయానురాగమును పెంచుకొనినారు వారిరువురి వివాహము నిశ్చితమైనది కాని పెండ్లికూతునకు ఈ సంబంధము ఇష్టములేనందున వివాహ మాగిపోయినది అసలువిషయము రెడ్డిగారికి తెలియదు

ఇన్నిరోజులు ఆ యువతికికూడ తనపై ప్రేమాభిమానములు గలవని తలంచినారు ఈ దురంతమునకు ఆ యువతితల్లి కారణమని భ్రమపడినారు సంబంధము చెడిపోయినందులకు కొందరు నవ్వుకొనినారు బంధువులు బాధపడినారు తనకు లజ్జకలిగినది ఆ యువతికి మరొకరితో వివాహము జరిగినది మగనాలిని గూర్చి ఇకను ఆలోచించుట తగదని నిర్ణయించుకొనినారు దుర్విధిపై యుద్ధమును ప్రకటించినారు తమకు అష్టకష్టములను తెచ్చిపెట్టిన బ్రహ్మగారి భార్యనే దొంగిలించుకొని పోయెదననినారు

తాను వలచినయువతి మరొకరిని వివాహమాడినను-

"చెలియా' నిత్యశుభోదయంబు సకలశ్రేయంబులున్, భోగముల్
విలసత్ప్రేమ సదాభివృద్ధియు గళావిద్యాభిలాషంబు ని
శ్చలమాంగల్యము పుత్రపౌత్రులును బ్రజ్ఞాతారతమ్యజ్ఞతల్
వెలయన్ జీవితయాత్ర మీకిక సుఖాన్వీతంబుగా సాగుతన్" 59

అని ఆశీర్వదించి ఆమెయొక్క క్షేమమునే కోరినారు

హతాశ - రచనాకాలము 3-11-1922 అర్ధరాత్రమువేళ తారకలు వికసించు తరుణమున మానవలోకము స్వప్నమోహనమున మునిగిపోయినపుడు ఒంటిగా వచ్చి తలుపు తట్టవలసినదిగా చెలికి కవిగారు జెప్పిరి సకియ అట్లే అనినది రెండుజాములు రెండేండ్లవలె గడచినవి కాని చెలియ రాలేదు ఇక పరస్పరేక్షణ ప్రాప్తి లెదని తలంచిరి

"ఇంక మాకు బరస్పరేక్షణప్రాప్తి
గలుగుట నిజమేని కన్నీటిబొట్ల
మాలను రచియించి మాయలమారి
చేడియ కర్పించి శిక్ష గావింతు 60 ననుకొనినారు

ఇంతలో సూర్యోదయమైనది పాలతి వచ్చుటయు, పోవుటయు జరిగినది వాకిటిముందు చెలియ అడుగుముద్రలు గలవు సకియ మేలిముసుగు సందడి విని గాలిచే కదలుచున్న ఆకులశబ్దమని తలంచిరి ప్రేయసిచేతి కరదీపికను గాంచి అమలతారాశోభ యని భ్రాంతి పడిరి చివరకు హతాశతో-

"అభిశప్త జీవనుండైన నేనేడ
సకియకంఠాశ్లేషసౌఖ్య మదియేడా" 61
అని తన్నుతాను అభిశప్త జీవనునిగా భావించుకొనిరి

**వీణాప్రియ** - రచనాకాలము 5-12-1922

'తంత్రులు తెగిన నా ధ్యానవిపంచి విశ్వమోహనగీతి వెలికూర్చు నీదు
వీణతంత్రులువేసి బిగియించి మర్మనిరవమూర్ఛన నెఱపించు శ్రుతికి
మేళగించి " 62 రహస్యకేళీగృహమునకు బంపవలసినదిగా ఒకనాయిక
తన ప్రాణపతికి దూతద్వారా వర్తమానము బంపినది

ఎన్నియో ఏండ్లును, పూండ్లును గడచిపోయినవి హృదయేశుడు తాను రాలేదుసరిగదా వీణనుగూడ పంపలేదు ఎట్టి వార్తయును వినిపింపలేదు అంత నామె తన గానగర్వము సోయగము, భూషణప్రీతి వచోరీతి, అభిమానము గౌరవము, కులీనత, సిగ్గుసెరములు విడిచి మేలిమునుగువలిపమును దీసిపైచి పృధివి యెల్లెడల దుమ్ముదుమారము గ్రమ్మినచీరతో తిరుగుచుండెను అంతనామె మనోహరుడు ప్రాణనాధుడు వనకుటీరమున వసియించి 'రమ్మ నా కోర్కెల రాణి' అని పిలచి తనసరసన కూర్చుండి దివ్యవీణను సారింపవలసినదిగా కోరి ముద్దాడినాడు

అనగా భోగములతో తులతూగునప్పుడు కనుపించక మాసినచీరకట్టుకొని బిచ్చగత్తె విధముగ లోకమంతయు ద్రిమ్మరునపుడు గనిపించి, కనికరించి, కౌగిలించుకొనినా డన్నమాట

**ఆగంతుకి** - రచనాకాలము 16-3-1923 ప్రియునికొరకు ఎదురుతెన్నులు జూచిచూచి కళ్ళు కాయలుకాయగా చివరకు ప్రణయకోపముతోనున్న నాయికచేష్టలు వర్ణింపబడినవి

పూలమాలలనుగట్టికూడ మెడయందు అలంకరింపక చిదిమివేయుచున్నది లలితహృదయావిల కఠోరవ్యసనభారమును చూపులతో వెలువరించుచున్నది అట్టి నాయికను గాంచి ప్రియుడు-

"చీకటులు బలమయ్యె జుక్కల రాకపోకల నేలతలచెదు,
నా కుటీరమునందు వెన్నెలసోకి తమమునశింప దీపముపెట్టవే
నా మదిముట్టవే ' 63 అని ప్రార్థించుచున్నాడు

**ఎంత మోసము** - దువ్వూరివారు దీనిని 'Deception' అనుపేర ఆంగ్లీక రించిరి

చీలుదారుల గూర్చుండి ఒక యువతి కరుణగలుగునట్లుగా కన్నుల నీరు నింపుకొనుచుండెను ఒక బాటసారి అదిచూచి 'చీకటులు వ్యాపించకపూర్వమే నిన్ను ఇల్లుజేర్చెదను ఏమార్గమున నీకేగ నిచ్చగలదు' చెప్పుమనెను అంత నామె 'గోపికామోహనుడు శ్రీకృష్ణుడు ఈ దారిన వచ్చునని సఖి చెప్పగా ప్రొద్దు పొడుపుననుండి ఈ పొన్నచెట్టుక్రింద ఎదురుచూచుచుంటిని ఆ రాజు శిరముపై రత్నఖచితకిరిటము వెలుగొందుచుండుననియు, పట్టుపీతాంబరములు వల్లెవాటు వైచికొని మత్తగజమునెక్కి వచ్చుననియు వింటిని' అని పల్కెను

అదివిన్న బాటసారి చిన్నికృష్ణుని సేవించుటకై పొన్నక్రింద వేచి యున్నావా? నీముందువెళ్ళిన వేణుధారిని చూడలేదా? విశ్వమోహనమైన గాన మును వినలేదా? నెమలిపింఛము క్రొమ్ముడిలో కాంతులు వెదజల్లుచుండును చిన్నికూకట్లు మెడపైన చిందులాడుచుండును క్రొత్తపూలమాల బొజ్జవరకును వ్రేలాడుచుండును ఆ మహాత్ముని ఛాయలు సోకినంతమాత్రముననే జీర్ణతరు లతలు చిగురులు వెట్టును ఆ మురళిమోహనారావ మున్నంతసేపు రెల్లుపుల్లలలో కూడ గీతి రేగును' అని పల్కెను

అంత నాయువతి భగ్నమైన ఇంద్రధనుస్సువలె ఇప్పుడు నాస్మృతి యందు ఆ వ్యక్తి మెదలుచున్నాడు వేణుగానమును దేనినో వినినట్లు దోచు చున్నది కాని దానిని తారకావీణ లొనరించు ధ్వనులుగ తలచితిని ఎంత మోసము జరిగిపోయినది' అని విచారించినది అదియె తెలియగరానటువంటి విచిత్రమని బాటసారి పలుకును

ఇందు ఆ యువతి తలచినవిధముగా రత్నఖచితకిరీటము, పట్టు పీతాంబర ములు వల్లెవాటు వైచికొని మత్తకరినెక్కిరాక నెమ్మిపింఛముతో, చిన్ని కూక ట్లతో, చిరుబొజ్జపై వ్రేలు పూలమాలతో ఆమె గుర్తించని విధముగావచ్చి అదే దారిన వెళ్ళిపోయినాడు ఆ యువతి 'ఎంతమోసముజరిగినద'ని తలచి వెడలి పోవును

**అభిసారిక** - రచనాకాలము 3-12-1922 మల్లెపూవుదండ అల్లు ఓసుకుమారి పరవశమైన భావమున మరచిపోయి పూలరెకుల నేల చిదుముచున్నావు? రాత్రి

యందు నీ మృదుహృదయము నెవ్వడు హరియించెను? ఈ పూవుపొదరింటి కేగెదనని పల్కి ప్రియుడు మోసగించెనా? లేక నీ యంతరంగమును పీడించు వేదన వెలియార్చుటకై నిర్జనశాంతమైన ఈ స్థలమునకు వచ్చితివా?

"నీ యందచందంబు నీ నీటుగోటు, నీ ముద్దుమురిపెంబు,
నీ విలాసంబు నెంతవ్యర్థంబాయె నింతలో నేడు' 64

అగాధభావఘర్షణము నీ చెమరించు మోముచిన్నెలయందు ప్రతిఫలించు చున్నది భగ్నాశతో నీవిట్లు పరితపింపగ ఎడతెరపిలేక కారిన కన్నీటివలన నీవు రచించు దండ తడిసిపోయినది తనపనిని తలచుకొని తానే తలవంచుకొనునట్లుగ ప్రొద్దుపొడుపున నీ పూలమాలను ప్రేమదూతియనునట్లు ప్రియునకుబంపి మంచి కాలపు రాకను మదిని తలంచుకొనుము

ఇందు అర్ధరాత్రివేళ ప్రణయదిపకాంతిలో సంకేతస్థలమైన నిర్జనస్థలమునకు వచ్చి అచట ప్రియుడు కనుపించకపోగా పరితపించిపోయిన నాయిక భావసంఘర్షణము ప్రత్యక్షమగుచున్నది

**అభిసారిక** - ఇది 15-3-1923న గేయరూపముగా రచింపబడినది ఈ నాయిక నిశీధిలో గాలియడుగులతో నాయకునికొరకు వచ్చిన మోహశీల కాలియందెలు ఘల్లుమనునని వానిని కేలగైకొని నడచుచు పక్షిసమూహము కీచుమనుచు గూళుల బలుక వెరపుతో దెసలుగాంచుచు తన అడుగుసడికే ఎవరోవచ్చిరని ఉలికిపడి మరలుచు, తెల్లనివెన్నెలలో తన దుకూలముల మైపూత సిగ్గులు తెలియరావని ఊహసలుపుచు తన విహారము బయటపడకుండుటకై ప్రయత్నించినది కాని తానునడచెడి బాటయెల్లెడల వ్యాపించు గంధపుతావులుమాత్రము గప్పిపుచ్చలేకపోయిన ముద్దరాలు ఈ అభిసారిక

**రాధాకృష్ణులు** - ఇది రాధాకృష్ణుల సంభాషణరూపముగ రచింపబడినది శ్రీకృష్ణుడు మిక్కిలి ఆలస్యముగా రాగ రాధ ఏమోయి కృష్ణ ఇంత ఆలస్యమైనది నీయందు లీనమై నినుజూచుటకొరకు ఆతురతపడు మనస్సు నాపలేక వాకిటనిలబడి నీరాకకొరకు ఎదురుచూచుచుంటిని చూచిచూచి కన్నులనీరు గ్రమ్మినది ఇంతకసియేల? చంపదలచినయెడల ఇంత చాటుదనమేల? నీ నవ్వు విన్నంత, నిను చూచినంత నా ప్రియుడు వచ్చెనని భావింతును కాని అవ్వల స్మృతిదప్ప నంతయు నింద్రజాలమట్లు ఎచటికో జారిపోయెదవు నిను నమ్మి

వలచినదానిని నీ పాదములవద్ద చిత్తసీరేజకళికనిడు తపస్విని కఠిన హృదయుడా జీవనఇంద్రచాపము ఖండించెదోయి' అని నిష్ఠురము లాడినది

అంత కృష్ణుడు ఓ ముద్దరాలా! నన్ను ఊరకయెల అనరానిమాట లనెదవు యమునగట్టుననుండి ఆవులమరలించి ఇప్పుడే వచ్చితిని కావిదుమ్ము క్రమ్ముకొనిన వస్త్రమైనను విడువలేదు చూడుము నిష్కారణపు అనుమానముతో నిందించుట తగదు నిజము తెలిసికొని నన్ను దండించు లావణ్యసరసిలో లాస్యమాడు నీమోముదమ్మి చూడని నిమిషము నాకు జగము శూన్యముగా గనుపించును మున్నటివలపులు, ముద్దుముచ్చటలు మరచి నిందించుట తగునా?' అని రాధకు సమాధానము జెప్పును

రాధకు కొన్నిసందేహములు గలిగి కృష్ణుని ప్రశ్నించును 'నీవలెవాటుపై పసుపుగుర్తు లతికినట్టుల ఏలనయ్యెనో చెప్పుమనగా మోదుగాకులు కోయుటకై ముదిమోకలెక్కగా పువ్వులరసమంటి అట్లాయెననియు తనువుపై గోటిగిచ్చులు పడ్డ గుర్తులేమియని యడుగగా కోరిందపొదలోనికి లేగదూడవెళ్ళగా దాని వెన్నంటిపోయెడు సమయమున ముళ్ళుగీచుకొని గీతలుపడినవనియు, చెక్కిళ్ళఅందము మారిపోయిన కారణమేమియని ప్రశ్నింపగా మావిగున్నలనీడ అలసి నిద్రించెడివేళ గరికఒరయిక కారణముగా ఒక్కింత యొత్తిగిలెనేమొ' అనియు శ్రీకృష్ణుడు రాధప్రశ్నలకు సమాధానములు జెప్పును

రాధ — "అందాల కెందమౌ యధరబింబమున
గాటుకమరకలు గనుపట్టనేల?

శ్రీకృష్ణుడు — నీకన్నులకు సాటినిలిచి వలపింప
ముదముతోడ గల్వల ముద్దిడుకొంటి
ఆ రంగు పెదవులకంటెనో యేమో
ఏనొక్క తప్పిదంబెఱుగనో సకియ" 65

ఈవిధముగా రాధప్రశ్నలన్నింటికి కృష్ణుడు అన్యకారణములను దెల్పును ఇందు రాధాకృష్ణుల ప్రణయలీల వర్ణింపబడినది

**రాధ యుత్కంఠ** - దీనిని రెడ్డిగారు **Radha Expectant'** అను పేర ఆంగ్లీకరించిరి

**కథాసంగ్రహము** - చల్లనిపన్నీటిలో స్నానమాడి, అగరుధూపముచే తల వెంట్రుకల నార్చికొని, కుదుటుగా బొట్టుపెట్టుకొని, కనుదమ్ములకు కాటుక పెట్టుకొని గోరింటపూలు కొప్పులో తురుముకొని, పొడి కప్పురములను పడకటింటిలో జల్లి, పాన్పుపై పువ్వులనుజల్లి కృష్ణునిరాకకై రాధ వేయికనులతో ఎదురుచూచు చుండెను

మనస్సు ఆలస్యమును సహింపలేక బాధపడుచుండెను ఆ దారి, ఈ దారి చూచి కన్నులునొచ్చెను కాని కృష్ణుడు రాలెదు

సంజకెంజాయలు శమించిపోయినవి పక్షులు గూళ్ళకు పరుగులిడుచున్నవి మందలకు ఆవులు మరలిపోవుచున్నవి వేణుగానములు వీనులసోకినవి కోయిల లేతమామిడి గుబురులోనుండి కూసినది సందెచీకటి పడినది చుక్కలు ఉదయించినవి కాని కృష్ణుడుమాత్రము రాలేదు

కర్పూరపుదివ్వె చివరివరకు వెలిగినది పాన్పుపైనున్న పువ్వులు వాడిపోయినవి మంచిగంధపుపూత శరీరముమీద చిట్లిపోయినది నిద్రమాంద్యము వలన కనులు మూతబడుచున్నవి నక్షత్రసమూహములన్నియు పడమటిదెస కేగినవి ఇంతలో సూర్యుడు వేయిదివ్వెలకాంతితో ప్రకాశించుచు వచ్చెను కంటికి నిద్రలేకపోవుటచే కనుగొన లెర్రబారినవి చిట్లినమైపూత రాలుచున్నది చెమట ముత్యములు చెక్కిళ్ళనుండి జారుచున్నవి ఘల్లుఘల్లుమని చేతిగాజులు మ్రోయుచుండగా మజ్జిగచిల్కుచు మధురగీతములతో కాంతుడొనర్చిన చెయిదములను తుమ్మెదపై బెట్టి నిందించుచుండగా రాధామనోహరుడు ఆమెవెనుకనిల్చి ముసిముసినవ్వులు నవ్వుచుండెను

రాధకు ప్రియునికొరకు ఎదురుచూచిచూచి కన్నులు కాయలు గాచినవి ప్రియుడు మాయావి తన్ను తనగృహమును అలంకరించుకొని ఎదురుచూచిన సమయమున రాలేదు మజ్జిగచేయుచుండగా అనగా అలంకారములన్నియు తీసివైచినతదుపరి అరుగుదెంచినాడు

"వేచియుండినయప్డు విభుడరుదేడు
వేసవివానలవిధముగా నతడు
కలవలెవచ్చును గనిపించిపోవు" 66

**అధ్యాయాంతము** - రచనాకాలము 7-9-1929 దువ్వూరివారికి 16-6-1979న అన్నపూర్ణమ్మతో ద్వితీయవివాహ మైనది ఆ సందర్భములో "నా జీవితకావ్య

ములో ఒక అధ్యాయము ముగిసి మఱియొకఅధ్యాయము ప్రారంభమైనది" 67
అని డైరీలలో వ్రాసికొనియున్నారు

"I made another garden, yea'
For my new love
I left the dead rose where it lay
And set the new above" 68

అని చనిపోయిన గులాబిని పడియున్నచోటనే యుంచి, మరొకగులాబిని దాని మీద ఉంచినట్లు చెప్పుకొనినారు దువ్వూరివారి జీవితములో మరల వసంతము ప్రవేశించినది

"చతురంబౌగద దైవకల్పనము లాశాభంగముల్ గూర్చి, దు
స్థితులందేలిచి, లోతుపాతుల బరీక్షింపన్ వెతల్గొల్పి పై
ధృతిహీనుండగు మానవుంగని దయార్ద్రీభూతుడై సంసృతి
క్రతుకర్తం బొనరించు దేవుడు సుఖప్రాబల్యమేపారగన్' 69

అని దైవసృష్టిని కొనియాడినారు గతము గతమే యనియు వర్తమాన మొక్కటియే అవశ్యభోగ్యమగు సంపదయనియు తలంచినారు

## (IV) భక్తి కవిత్వము

సమస్తసృష్టికిని ఆధారభూతమై, ప్రపంచమును నడుపుచున్న శక్తి ఒకటి గలదనియు ఆ శక్తియే పరమాత్మయనియు అందరును అంగీకరించిన విషయమే జీవాత్మను పరమాత్మలో ఐక్యముచేసికొనుటకు భక్తుడుచేయు ఆరాధనయే భక్తి ఈ భక్తికి పూజ్యపూజకభావము మూలభూతమైనది ఇది దాస్యభక్తి, సఖ్యభక్తి వాత్సల్యభక్తి, మధురభక్తి మున్నగు అనేకరూపములలో నుండవచ్చును భక్తుడు ఆత్మ పరమాత్మల తాదాత్మ్యమును సాధించుటకై ప్రత్యక్ష, పరోక్షపద్ధతులలో భగవంతుని ధ్యానించును

మన ఆధునికాంధ్రకవిత్వము నందలి భక్తికవిత్వమును 1 పారమార్థిక కవిత, 2 మర్మకవిత 3 తాత్త్వికకవిత 4 మధురభక్తికవిత, 5 మధిరా ప్రమోదకవిత మున్నగువిధములుగా విభజింపవచ్చును

దువ్వూరి రచించిన భక్తికవితలలో అధికభాగము మర్మకవితలలోనికి జేరును ఈ మర్మకవిత్వమునే ఆంగ్లమున 'Mystic Poetry' అని వ్యవహరింతురు

కవి - సన్న్యాసి - రచనాకాలము 9-6-1922 ఇది 'Kavi and Sanyasin' అను పేరుతో రెడ్డిగారిచే ఆంగ్లీకరింపబడినది

సూర్యాస్తమయసమయమున ఒక సన్న్యాసి సముద్రతరంగములు పాదములకు తగులునట్లుగా తీరమునకూర్చొని గుల్లపడవలను లేలించుచుండెను ఆ సమయమున ఒక దివ్యపురుషుడు వేణువును ప్రయోగించుచు ఆకాశమునుండి దిగివచ్చెను సన్న్యాసి దివ్యపురుషుని నీవెవ్వరని ప్రశ్నించెను ఆ పురుషుడు తాను స్వప్నపురవాసియైన శిల్పినని పల్కెను అంత సన్న్యాసి సముద్రమధ్యమున పడవ నడిపించి మంచిముత్యములు మణులు సంపాదింప కోర్కెగలదనియు, కాని సంక్షుబ్దవార్ధికల్లోలముల జిక్కి కడగానలేక పడవ తుత్తునియలై పగిలిపోవునని భయపడి, ఒడ్డునకునెట్టి శూన్యభావముతో గుల్లలను తీరవీచులందు తేలించుకొనుచు కపటసంతృప్తితో కాలము గడపుచున్నాననియు పల్కెను తదుపరి 'వేణువాదనమే నీ వృత్తియా ఏమి?' అని దివ్యపురుషుని ప్రశ్నించును అంత దివ్యపురుషుడు 'అంబరచరులైన బాటసారులకొరకు నక్షత్రములతో వంతెనలు కల్పింతుననియును ఉన్మత్తఎచుల ఉద్ఘోషలెల్ల నిశ్శబ్దయామినీవిపినీలగర్భమున శ్రావ్యమౌ అప్సరసల సంగీతమువలె మార్చుటకు వేణువు నూదుచుందున'నియు ఎల్కెను

అంత సన్న్యాసి దివ్యపురుషుని నివు ఒకచేత అమృతము, మరొకచేత విషమునానుమని అందించుచున్నావు' అని నిందించును

"అదియే జీవనరహస్యంబు సన్న్యాసి
చేదుతీపులు రెండు జేరియేయుండు
నొకటియుండినచోట నుండు రెండవది" 70

అనియు, పడవ ప్రీలునని భయపడెదవేని జలధిదున్నెడుకోర్కె తలపోయకుమనియు, అలల రాపిడులకు ఆగలేవెని ముత్యములపై ఆశ మానుకొనుమనియు, పన్నీరు పూవును పొందదలచి ముల్లుదాకునని భయఎడిన ఫలమేమి• అనియు దివ్యపురుషుడు సన్న్యాసికి ప్రబోధించును

సన్న్యాసి దివ్యపురుషుని పలుకులలోని అంతరార్థమును గ్రహించి-
"అట్లైన నోశిల్పి యల్లవిగో గనుము
భిగ్నమైపడియున్న పడవచెక్కలను

యాత్రకు యోగ్యమౌనటుల జోడించి
తెరచాపలంగట్టి తెడ్ల నందిమ్ము" 71

అని ప్రార్థించును ఇందు సముద్రము జీవితమునకును, అలలరాపిడులు జీవితములోని ఒడుదుడుకులకును, సన్న్యాసి జీవునకును దివ్యపురుషుడు పరమాత్మకును, ఆణిముత్యములు జ్ఞానసంపదకును, చేదు దుఃఖమునకును తీపి సుఖమునకును సంజ్ఞలు

జ్ఞానసంపాదనయం దిచ్ఛఉన్నయెడల జీవితమునందలి ఒడుదుడుకులకు భయపడరాదనియు, సుఖదుఃఖము లనునవి అన్యోన్యాశ్రయములనియు అంతరార్థము

**దీపనిర్వాణము** - రచనాకాలము 3-12-1922 నిబిడాంధకారములో ఒంటరిగా నొంటెపైనెక్కి తరించుమార్గము నరయుటకు కవిగారు బయలుదేరిరి రేయి పాంథులకు దారిజూపునక్షత్రములు కనబడుటలేదు హృదయదౌర్బల్యమును వదలించి నూతనోత్సాహమును కలిగించుటకై ఒక్కకోకిలయైనను అమృతతుల్యమైన ఆనందగీతిని పాడుటలెదు ఎలుమారులు తనచేతనున్న బంగారుదివ్వెను వెలిగించిరి కాని అది మరునిమిషమందె పయ్యరవీచి ఆరిపోయినది వెలిగించి, వెలిగించి విసిగి వేసారిపోయిరి

'పెనుదుపాను కరళ్ళగునిసి త్రుళ్ళింత
లాడు చుక్కాని లేనట్టి పోతంబు
తీరున, విధియాడ్చు తెఱగులనెల్ల
ధూళిద్రుబంగుచు నేడు ద్రొక్కుచున్నాడ" 72

నని తమ ఆవేదనను వ్యక్తముచేసిరి

ఇందు ఎడారి ఆశలేని జీవితమునకును, అంధకారము అజ్ఞానమునకును, బంగారుదివ్వె భగవత్పరమైన జ్ఞానమునకును, పయ్యెర మాయకును సంజ్ఞలుగా భావింపవచ్చును

**పిచ్చిబికారి** - రచనాకాలము 20-3-1923 పాములు వ్రేలాడుపగిది వానకురియుచున్నసమయమున కారుచీకటులు ఆకసము నాక్రమించిన సమయమున పిచ్చిబికారి యొకడు భిక్షార్థము రాగా మాయాకుమారి ఇంత నిశీథిలో వచ్చుటకు గల కారణమును ప్రశ్నించును అంత నాతడు నీచేతిభిక్షకొరకై సమస్తమును

విడిచి కాలవీధి నొంటరిగా వచ్చితిననియు, చిరునవ్వుతో భిక్షమును పెట్టుమనియు ప్రార్థించును

అంతనామె ఇంత నిశీధివేళ ఏమిభిక్షమోయి' ఉత్త చేతుల రాణిని ఇప్పుడు నీకు ఏమియ్యగలను' అనగా బికారి ఆమెతో-

"నీ జడకట్టులో నిద్దురవాడి
నలగిన చంపకదళములమాల
బిచ్చంబుపెట్టు మీ పిచ్చిబికారి
సంతృప్తినొందును' జాలించుయాత్ర" 73 అని పలుకును

ఇందు పిచ్చిబికారి జిజ్ఞాసువునకు సంజ్ఞ మాయాకుమారి సర్వవ్యాపకుడైన భగవంతునికి సంజ్ఞ పిచ్చిబికారి ఆమెజడలోని చంపకదళముల యాచించుట యనగా తనకు తరించు జ్ఞానమార్గమును ప్రసాదింపవలసినదిగా కోరుటయే. అనగా చంపకదళములమాల జ్ఞానమార్గమునకు సంజ్ఞ

**మృత్యువు** - మృత్యువునుగూర్చి ఈ ఖండిక వ్రాయుటలో కాల్పనికకవుల ప్రభావము ముఖ్యముగా రవీంద్రుని ప్రభావము దువ్వూరివారిపై ప్రసరించినది

సృష్ట్యాదియందు జీవితమును మృత్యువును కవలపిల్లలవలె జన్మించినవట మనుజుడు మృత్యువునకు అనేక భయసముత్పాదకములైన వర్ణముల చిత్రించి తనసృష్టినిగాంచి తానే భీతచేతస్కుడగుచున్నాడు పౌరాణికవిశ్వాసమనెడి వలలోచిక్కుకొని మానవుడు తప్పించుకొనుటకు దారికనబడక బాధపడుచున్నాడు

మృత్యువు మానవునితో దాగిలిమూతలాడి చేతికిచిక్కక జారిపోవుచున్నదట ఆమెమాట చెప్పగనే కంపిల్లు మనుజులగని చిఱునవ్వు నవ్వుచున్నదట

మృత్యువు దయ్యముముసుగును ధరించి తిఱుగుచుండునట ఆ దొంగవేసము లాగివైచినచో ముసుగుచీకటిలోనున్న అందము కానుపించునట

"కవితల్లజుండగు కాళిదాసైన
నీ మోహనాకృతి నీ దివ్యమూర్తి
నభినుతింపగలేక హతమనోరథుడు
కావలెనని చెప్పగా నన్నుబోటి
కర్షకకవి యెట్లు కడతెరగలడు" 74 అని పల్కి మృత్యువును అందములకు అందముగా భావించినారు.

మృత్యుదేవతకన్ను లిందీవరములనియు ఆమె లేతచెక్కుటద్దములలో పన్నీరుపూవులపస వెల్లివిరియుననియు, ఆమె రసార్ద్రమైనవాతెఱ పచ్చిద్రాక్షరస మున పలుమారులు నానవేయగా మెత్తగనైన పవడముచేత రచింపబడెననియు ఊహించినారు మృత్యుదేవత వారికి ఆనందదాయకమైన వాసంతకల్యగా దర్శన మిచ్చినది

ఆమెను పెండ్లికూతురా' అని సంబోధించినారు చంద్రశిలారమ్యశాలలో రహస్యలిల నన్యోన్యముగ ఆమెచేయి పట్టుకొని విడిపోని మమతానురాగము లతో విహరింప ఇష్టపడినారు ప్రతిరాత్రియందును గాఢనిద్రాసమయమున ఆమె 'సుఖకరనిశ్శబ్దచుంబనస్పర్శ'ను అలసటతీర అనుభవింప కోరికొనినారు

జీవనాంభోధి వీచీమార్గమందు
ప్రాణికోటుల బరపారంబుజేర్చు
నుడుపంబు నేర్పుతో నడుపంగ బ్రకృతి
నియమించెనిన్ను నోనిశ్చలకర్ణ
ధారిణీ' నవమూర్తి " 75 అని మృత్యువును సంసారసాగరమునుండి పరపారము జేర్చుటకు కర్ణధారిణిగా సంభావించినారు

ఇట్లు మృత్యువును పునర్జన్మకు వాహికగను, ప్రేయసిగను సంభావించి పునర్జన్మకు కేలునాచిన తాత్త్వికదృష్టి రామిరెడ్డిగారి ఈ ఖండికలో ప్రతిపాదింప బడినది

**బిడ్డ - బాటసారి** - ఇది Traveller and child' అనుపేర దువ్వూరివారిచే ఆంగ్లీకరింపబడినది బిడ్డ - బాటసారుల సంభాషణారూపముగ సాగినట్టిది

పసిడితీరు లొలకించు పండ్లగుత్తులను వీపుపైన ప్రేలాడగట్టుకొని అల సట సోలుచు అరుగుదెంచు బాటసారినిజూచి బిడ్డ 'ఓ తాతయ్యా' నీ పయనము రేపుమాపుల ముగియదా ఏమి?' అని ప్రశ్నించెను

అంత బాటసారి 'ఒకనాడు నేనుకూడ నీవలె పన్నీరుపూవువలె నవ్వుచు పుట్టితిని ఇప్పుడు భూమిమీద నా నెత్తావిని వెదజల్లి కారాకువిధమున నొంటరిగా యుగయుగములనాటి అందమైన పసిడిపండ్ల బరువులు మోచికొనుచు మా యింటికి వెళ్ళుచున్నాను గ్రహమునుండి గ్రహమునకు ప్రయాణముచేసి భవ పిపాస హరియించు పండ్లు, ఫలములు అలమటపడియైన ఆర్జించుకొందును ఎన

లేని సంపదలను గడించి విశ్వసామ్రాజ్యమును ఎప్పుడువిలుతునో అంతవరకు నేను అరికాళులు అరుగ తిరుగుచుండెదను' అని బిడ్డతో పల్కెను

పండ్లగుత్తులను వీపుపై వైచుకొని నీవలె నేను ఎప్పుడు చరియింతును? అని బిడ్డ ప్రశ్నింపగా 'నీవు ఆ మార్గముననే చరించుచున్నావు' అని బాటసారి బదులు పలుకును 'నీవలె నఖిలవిశ్వమును ఎప్పుడు విత్తముగడించి విలుతునో చెప్పు'మనగ విత్తమును గడించుచున్నావనియు, చివరకు ఒక్కనాడు నేను పోయినదారిన నీవును రాగల'వనియు బాటసారి బిడ్డకు సమాధానము దెల్పును

"భవపిపాసహరించు పండ్లు ఫలాలు
అలమటపడియైన నార్జించుకొందు" 76

పండ్లు ఫలములు అనునవి జ్ఞానమునకును, ప్రపంచమును విలుచుటయను నది జ్ఞానప్రాప్తిరూపమైన మోక్షమునకును సంకేతముగా భావింపవచ్చును ఇందు బిడ్డ-బాటసారులరూపముగ జీవితచక్రభ్రమణము నిరూపింపబడినది

**పూర్వజన్మస్మృతి** - శారదచంద్రికామధురశర్వరులందు కృష్ణుని వేణు రవమును విని, మనస్సును నిలుపుకొనలేక మోహమాధురిచే ప్రేరేపింపబడిన చిత్తముగలవారై అభిసరించిన గోపికలొందినట్టి మనోవ్యధలు కవిగారిని కలత పెట్టుచున్నవట

"తెలుగుంగైత యొయారిపోకడలలో దీపుల్ పిసాళింప ని
శ్చలభక్తిన్ రచియించె బోతన భవచ్చారిత్రముల్, తత్కథా
కలితానేకవిశేషముల్ మనసుఁజక్కన్ రేప నాపూర్వజ
న్మలచర్యల్ పొడకట్టుభావమున బింబంబద్ధమందుం బలెన్" 77

అని కృష్ణసంబంధివిశేషములు జ్ఞప్తికి వచ్చినపుడు తన పూర్వజన్మచర్యలు భావమున మెదలుచున్నట్లు పల్కి కృష్ణలీలలను స్మరియించినారు

పూతనవధ, చిలిపిచేతలుమాన్పుటకై యశోద త్రాటితో రోటికికట్టివేయగా మద్దులనందులకీడ్చి యుద్ఘాటనముచేయుట కాళీయఫణివధ, గోవర్ధనగిరిధారణము మున్నగువానినిగూర్చి విపులముగా చెప్పినారు

"చిరవిరహంబునం బనవు స్వీయవిధంబున బృంద నేడు, నీ
చరణసరోజసంగతులసౌఖ్యము బాసి కృశించె గ్రమ్మఱన్

మురళిని మర్మమూర్ఛనలు మ్రోయుచు రమ్మిక ప్రేమరాజ్యసం
భరణమనోహరాంగవిభవమ్ముల లోకము మోహపుచ్చుచున్" 78

అని లోకమోహనుని మరల రావలసిదిగా కోరినారు

హృదయాభిలాష - దీనిని 'Hearts Solace' అనుపేర రెడ్డిగారు ఆంగ్లీక రించిరి

ఓ గోపపాల' ఓ దివ్యవేణువినోది నా జీవనంపుపాత్రమున నీ గానరస మును నింపుమయ్య ఆ ఆనందమునందు ప్రత్యంగము కరగి గీతారసశ్రుతివలె కాలసాగరమున కలసిపోయెదను' అనియు-

"విశ్వకావ్యకవీశ వేదాంతవేద్య
విజ్ఞానమయమైన విస్ఫులింగమున
నంటింపు నాహృదయంపు గప్పురము
నిరతంబు నీపాదనీరేజపీఠి
నెత్తావిజల్లుచు నేను వెగ్గెదను 79 అనియును

'ఓ జగజ్జ్యోతి' నీ యుజ్జ్వలశోభను నా మనోనేత్రములకు కనుపింప నిమ్ము తత్కారణముగ కన్నులగారిన ఆనందబాష్పములను నీ పూజకు పూవులై ప్రకాశింపనిమ్ము' అనియును భక్తుడు భగవంతుని ప్రార్థించుచున్నాడు ఇది భక్తుడు భగవంతునిలో లీనమగుటకు పడెడి ఆవేదన

ఇందు భగవంతుడు ఆశ్రితభక్తజాలునిగా దివ్యవేణువినోదిగా, దీనశర ణ్యునిగా, విశ్వకావ్యకవీశునిగా, జగజ్జ్యోతిగా సంభావింపబడినాడు

## (v) స్మృతి కవిత్వము

ప్రాచీనగ్రీకుసాహిత్యమునుండి 'Elegy' అను ప్రక్రియ ఇతరభాషలలోనికి దిగుమతి చేసికొనబడినది గ్రీకుభాషలో "In ancient Greece, where it originated, the term elegy covered war songs, love poems, political verses, lamentations for the dead, infact a wide range of subjects, both grave and gay" 80 అను విధముగా విస్తృతార్థములో గలదు గ్రీకులు ఎలిజీని అందలివిషయమునుబట్టిగాక, రచించిన ఛందస్సునుబట్టి నిర్ణయించిరి ఆధునిక ఆంగ్లవిమర్శకులు దానికివిరుద్ధముగా విషయమును నుసరించి Elegyని నిర్ణయించిరి కాని ఛందస్సుననుసరించిమాత్రము గాదు మొక్తముమీద

"The theme of Elegy must be mournful or sadly reflective" 81 అనునది ఆంగ్ల విమర్శకుల అభిప్రాయము

ఈ ప్రక్రియనే మన ఆధునికులును గ్రహించి స్మృతికవిత్వమును వెల యించిరి ఆంగ్లసాహిత్యప్రభావము కారణముగనే మనవారును స్మృతికావ్యము లను రచించిరిగనుక వారి నిర్వచనము మనకును అన్వయించును

సోదరీస్మృతి - రామిరెడ్డిగారికి చిన్నారిచెల్లెలు రుక్మిణమ్మ యనిన ఎంతయో అభిమానము ఆమె అకాలమరణము చెందినది దుఃఖమనునది రామిరెడ్డిగారికి అనుభవములోనికి వచ్చినది ఆమెమీదనున్న ప్రేమాభిమానములవలన తమ మొదటికావ్యమైన నలజారమ్మ'ను ఆమెకే అంకితమిచ్చినారు ప్రకృతిలోని సమస్తవస్తువులను సోదరీచిహ్నాంకితములయినట్లు వారికి దోచినవి మేఘములు విడిపోయిన చంద్రరేఖను జూడగా పొత్తిగుడ్డలు తొలగింపగా కనుపించు సోదరి ముఖము గుర్తుకువచ్చెడిది సూర్యోదయమున మంచుబిందువులతోకూడిన పన్నీటి పువ్వును చూడగనే తల్లి కౌగిలిలోఒదిగిన చెల్లెలిముఖము స్మరణకువచ్చెడిది

"సంజెవేళల బలుచని జలదములను
బూతపూచెడి చెంగావిపూలసొరు
నవ్వునెడ నీదుచెక్కుల నాట్యమాడు
కాంతిమంజిమ మటు నాకు గానిపించు" 82

సంధ్యాకాలమేఘములయందలి 'చెంగావిపూలసొరు' నవ్వుసమయమున సోదరి చెక్కుల నాట్యమాడు కాంతిమంజిమమువలె కవిగారికి కనుపించినది భౌతిక సంబంధము లేకపోయినప్పటికిని నిరంతర ఆధ్యాత్మికప్రణయము వారిరువురిని తప్పించుకొనలేని బంధములతో కట్టివేసినది

ఈవిధముగా సర్వప్రకృతియందును చెల్లెలిచిహ్నములను దర్శించుటవల ననే కవిగారి కలమునుండి సోదరీస్మృతి' అను ఖండిక వెలువడినది

ప్రియావియోగము :- దుప్పూరివారి సతీమణి 9-7-1925 న గతించినది ఆ స్థితిలో తమ ఆవేదనను నేను నిజముగ దురదృష్టవంతుడను లేకున్న అట్టి సాధ్విని, అట్టి వినయవతిని, అట్టి నిర్మలప్రేమమయిని ఈ వయస్సులో పోగొట్టు కొని యుండను ఈ దుర్భరావస్థ చెప్పుట కలవిగానిది ఇట్టి యవస్థ ననుభవించు వారు మాత్రము ఊహింపదగినది" 83 అని చెప్పుకొనియున్నారు ఆ సందర్భ ములో ప్రియావియోగము'ను రచించిరి

"హృదయమును దొంగిలించిన రీతిగానె
స్మృతినిసైతము నీవు హరింపు మతివ
అంత సుఖదుఃఖములు భేదమరయరాక
భావశూన్యతలీనమై పట్టువిడుచు" 84

అని తమ వియోగబాధను వ్యక్తీకరించిరి

**స్మృతికణము** - భార్య గతించి ఇంచుమించు ఒక సంవత్సరకాలము గడచిన తరువాత మే 1926 లో ఈ 'స్మృతికణము'ను రచించిరి

కనులుమూసిన, తెరచిన ఆమెయే ఇంటిలో నడయాడుచున్నట్లు కనుపించుచున్నదట

"తెల్లవాఱిన బూదండ దీసిపైవ
దరుణివేణికనిలుచు నెత్తావిపోల్కి-
మర్త్యమౌ నీస్వరూపము మాటువడియు
సారవర్ణాంకితస్మృతి సమసిపోదు" 85

అని హృద్గతబాధను వ్యక్తముచేసినారు

**శిశువియోగము** - రచనాకాలము 24-9-1926 ఇరువది దినములు విషజ్వరము చేత పీడింపబడి దువ్వూరివారి ముద్దుబిడ్డ 'కుముదమ్మ' 20-8-1926న పరలోక గతురాలయ్యెను "పిందెబుట్టిన నశియించుపువ్వువలె తల్లియు మరణించెను ఆ పిందెకూడ రాలిపోయెను 86

తగిలినకాలికే మరియొక దెబ్బ తగిలినది భార్యగతించి సంవత్సరము మీద పదిరోజులు నిండకమునుపే 'కుముదమ్మ' కూడ తల్లిని అనుసరించినది ఈ స్థితిలో రచించిన ఖండిక ఇది

చిత్తతాపమును బాపుకొనుటకై చేలగట్టులకు వెళ్ళి కూర్చుండగా ప్రాణ సఖులవలె పైరులు మూకసహానుభూతితో తలలు వంచుచున్నవట

"అపరదిక్కాంతసైతము నస్తమించు
నరుణబింబంబుతో గన్నులవియజేయు
దనదు పూజారి 'యిక్కట్లు' దలచి కుంద
నెజ్ఞపుండాయెనో యేమొ హృదయమనగ " 87

ప్రకృతియంతయు తన మానసికస్థితి కనుగుణముగానున్నట్లే కన్పించుచున్నది ఈ వియోగబాధలో కృతికూడ సతివలె విడిచిపోయినచో జీవితమునకు నువ్వు నీళ్ళు వదలి పాదపరాగము రాల్చిపోయెదనని తమ ఆవేదనను వ్యక్తముచేసినారు

**మనోవిప్లవము** - రచనాకాలము 30-4-1927 'దేవ' పరశమే' యున్నావా' లేవా' చెపుమ' అనునంతవరకు రెడ్డిగారి హృదయావేదన ఎదిగినది

"తీవలునాటి పాదులకు దీయక నీరమువోసి యామినిం
బూవులుపూవనున్నతఱి మూలములం బెకలించివైచు నీ
భావ మదేమి' యాముడిని బండితులైన సడల్పలేరు కా
లావధిడగ్గఱించు, వృధయయ్యెను జీవిత ముత్తచర్యలన్" 88 అని తమ బాధను ప్రకటించుకొనినారు చివరకు కర్మఫలముగాని దైవాధికారముగాని ఏదైనకానిమ్ము వచ్చినకష్టములు పోకమానవు సుఖములు రాకమానవు కావున వానియెడల తాటస్థ్యము వహించియుందునని తన్నుతాను ఊరడించుకొనినాడు

**కవితాచితి** - రచనాకాలము 1-11-1927 నాలుక త్రుప్పుపట్టిపోయినది ఒక నాడైనను కావ్యాలాపము చేయవలెనన్నతలపు అంకురించుటలెదు

"రమణీయంబగు నాట్యరంగము నటీరాజ్యంబుగామాఱి యం
దము నానందముగూర్ప బందిరి హరార్దగ్గంబుగాజూచి ని
ష్క్రమణద్వారము గాంచలేక పొగలో గగ్గోలుగాబట్టు వి
చ్చిమనుష్యుల్ గతి భావముల్ దిరుగు చిత్తంబునన్ మొత్తమై" 89

అని తమ మానసికస్థితిని వ్యక్తము చేసినారు

కాంతావియోగము సంభవించి మూడువర్షములు గడచినవి ఆ పిడుగు తాకిడికి బీటలువారిన యెడదకు-

" పూర్వరూపమున నేరివికూరుచు మంత్రగత్తె యె
ప్పుడు పొడకట్టునో యమృతపూర్ణకళోజ్జ్వలపాత్రహస్తయై' 90

అని తిరిగి జీవితముమీద ఆశను పెంచుకొనిరి

ఈ ఖండిక రచించినరోజు డైరీలో 'ఎప్పుడు వ్రాయిచూచినను ఆక్రోశగానమే గాని తదితరమువ్రాయుటకు మనసు పోవుటలేదు" 91 అని చెప్పుకొని యున్నారు

**కవియలౌకికత** - రచనాకాలము 21-2-1928 భావరుచిరోజ్జ్వలదృశ్యముల సృజించిన కవిశ్వరుడు తచ్ఛాయలనుగాంచి లౌకికములగు సత్యములని భ్రమ పడి నమ్మి జీవితమును పాడొనరించుచున్నాడు

'కావ్యరచనలందు గవివి గావచ్చును
దివ్యలోకమందు దిరుగవచ్చు
గామ్యవస్తువులను గవిదృష్టి జూడకు
గట్టినేలదడవి కాలుమెట్టు' 92 అని కామ్యవస్తువులను కవిదృష్టి జూడకు మనియు గట్టినేల కాలుబెట్టి మనస్సు నిలద్రొక్కుకొనవలసినదిగా తన్నుతాను ఊరడించుకొనినాడు

**నిస్సహాయత** - రచనాకాలము 2-7-1928 చెలి తననువీడి పరలోకమున కేగినను, పల్లవకోమలమైన ఆ ప్రేమ చిక్కులనుదెచ్చినది ఇచ్చి పుచ్చుకొన గూడని ఈ దురవస్థను ఎన్నినాళ్ళుఓర్చుకొని దుఃఖమును దిగ్రమింగవలయును?

"కొలదికిమించుభారమగు గోనెను గాడిదమీదవైచి దొ
త్తిలబడి కాలుపూనుకొలదిన్ గొరడామెదిలించు నిర్దయున్
దలపునకిడ్చె దైవకృతి, తన్నును గార్దభమేని నోర్చుకో
నలవిదొలంగ, మానవున కాతుదిమార్గముగూడ లేదుగా" 93
అని తన నిస్సహాయతను ఇందు వెలిబుచ్చినారు

## (VI) ప్రశంసాత్మక కవితలు

**కవి** - కవియొక్క గొప్పదనము ఇందు వర్ణింపబడినది

"సత్యమ్మొ ధర్మమ్మొ శౌర్యమ్మొ వీరమ్మొ
మూర్తిభవించె నీమూలముననె
సాంఘికాచారసంచయము శాశ్వతముగ
మూర్తిభవించె నీమూలముగనె
దృగ్గోచరముగాని దివ్యభావములెల్ల
మూర్తిభవించె నీమూలముగనె
భూతకాలైకభూభుజుల చారిత్రముల్
మూర్తిభవించె నీమూలముననె' 94

అని కవియొక్క మహత్త్వమును వర్ణించి, సకలసజ్జనులచేత పొగడదగినవాడు సత్కవీంద్రుడని ప్రశంసించినారు

**కళాప్రపూర్ణుడు** - రచనాకాలము 11-12-1932 ఇందు వేదము వేంకట రాయశాస్త్రిగారి పాండిత్యప్రకర్ష స్తుతింపబడినది ఇది శాస్త్రిగారి వర్ధంతినాడు చదువబడినది

"శ్రీనాధకవివర్యు శేముషీవిభవంబు
కావ్యార్థకల్పనాగౌరవంబు,
కృష్ణరాయనృపేంద్రకృత విష్ణుచిత్తీయ
కేరళఘననారికేళ రుచులు,
ప్రకృతిసౌందర్యంబు ప్రతిపదంబున నించు
కాళిదాసకవీశు కావ్యరసము,
భవభూతి సాహిత్యభాండారపేటిక
దాగిన యాణిముత్యాలసరులు,
శ్రమకోరిచి, యేరిచి, సంతరించి
యాంధ్రవాఙ్మయ దర్శనహర్మ్యమందు
సంతపెట్టిన వ్యాఖ్యాతృచక్రవర్తి
పేరు స్వర్ణాక్షరంబుల వెలుగుటరుదె" 95

అని ఆంధ్రవాఙ్మయవ్యాఖ్యాతృచక్రవర్తిగా కళాప్రపూర్ణుని అభివర్ణించినారు

**వాల్మీకి** - ఇందు వాల్మీకికవితాప్రశంస గావింపబడినది దీనిని Valmeeki' అనుపేర ఆంగ్లములోనికికూడ అనువదించుటవలన రెడ్డిగారికి వాల్మీకిపైగల గౌరవాభిమానములు తెలియుచున్నవి

ఓ వాల్మీకికవిచక్రవర్తి! నీవు ఏతల్లి చనుబాలనుగ్రోలి ఇంతమహిమను గాంచితివో తెల్పుమని కవిగారు ప్రార్థించుచున్నారు

"మున్ను హిమాలయమోహనాటవుల
నీవుమీటిన కావ్యనిర్నిద్రవీణ
నేటికి వినబడు నఖిలదేశముల
భావకిరణంబులు బడుగుపేకలుగ
నీవల్లినట్టి రమణీయదృశ్యంబు

బంగారుస్వప్నంబు ప్రజల నెల్లప్పుడు

నానందరసవార్ధియందు దేలించు ' 96 నని పల్కి వాల్మీకి చేయిసోకిన నిముషముననే బంకమన్నైనను రూపుదాల్చి నిలుచునని ఆ మహాకవి గొప్పదన మును పొగడినారు ఆకాశమునగల సమస్తతారకలుగాని కడలిగర్భమునగల జీవ మణులుగాని వాల్మీకిసౌభాగ్యమునకు సరితూగలేవు

"కవితానభోరవి' కవిచంద్రులెల్ల
నీకాంతిపూరంబు నిండారద్రావి
తమకళ పెంపొంద దైవాఋచంద్రు" 97

వాల్మీకిమహాకవి వల్లకీనినదంబును పొందసాధ్యముగామి శారద తన వీణను ఏమూలవైచెనో తెలియలేదట వాల్మీకిసృష్టి కెదురుగా నిలచి బ్రహ్మ యైనను తలవంపవలయునట

వాల్మీకి అపూర్వమూర్తులను సృజించి హైందవసామాజిక ఆదర్శములను వెలయించెను అతని రమణీయభావనందనవనములో బారు నవ్యనిర్ఝరము రామా యణము హైందవసంఘము తరతరములనుండి ఆ అమృతపుటూటనాని నవజీవ నపు శక్తిని నవధర్మరక్తిని పొంది లౌకికయాత్ర గడపుచున్నది' అని పల్కి వాల్మీకిని జాతీయకవిగా సంభావించినారు

" చంద్రతారకాభరిత
నీలగగనముక్రింద నిలుచున్నయపుడు
మనుజునియల్పత మదిదోచునటుల
నీప్రతిభావాహినిముందు నిల్చి
నాకవి గర్వంబు, నాభావశక్తి

దుమ్ముదుమారమై తూలిపోయెడిని" 98 అని వాల్మీకిని చంద్రతారకా భరిత నీలగగనముతోను, తనను క్రిందనిలబడిన మనుజునితోను పోల్చుకొని వారిముందు తన అల్పత్వమును చెప్పుకొనినాడు

మర్మకవి - దీనిని దువ్వూరివారు 'A Mystic poet' అనుపేర ఆంగ్లీకరిం చిరి మర్మకవి ఎల్లప్పుడు తన అంతఃప్రపంచమనెడి గంభీరనిర్మలాకాశములో నెటువైపైనను ఎగిరిపోగలడు అతడు అరణ్యమున ఏ మూలనో, పూవుపొద రింట నే యాకుసందునో కనరాక వికసించి తావులు వెదజల్లు పుష్పమువలె ఒంట రిగా వసియించును

కాని అప్సరోవీణలయం దుద్భవించు రాగపుగటులు స్వర్గద్వారమునకు హృదయమును గొనిపోవురీతిగా మర్మకవికావ్యము రసార్ద్రపులకితాత్మలను జీవనయాదార్థ్యసీమలనుండి నందనవనగంధవహము వీతెంచు కల్పనాహిమవత్పర్వతపు చిట్టచివరిశృంగమునకు ఒక్కత్రుటిలో జేర్చును

మర్మకవి మహిమవలన వెన్నెలలో జనియించిన స్వప్నలోకములోని అప్సరసలు పటికపుపాత్రల పైయంచులు పొరలునట్లుగా ద్రాక్షాసవమును దెచ్చి, దగ్గరజేరి అందీయగా తనివిదీర త్రాగి, మత్తెక్కి అరగన్నుమోడ్చి, అన్ని కష్టములను మరచి సుఖింతుము 'అట్టి సుఖమునుండి మిన్నుపై బడినను మేల్కొలుపకుము ఆనందరసవార్ధియం దీదనిమ్ము' అని కవిగారు మర్మకవిని వేడుకొనుచున్నారు

"కవికులాభరణా నీ కావ్యమాధురికి

వినిమయంబుగ నీయ విశ్వంబునందు

నేమియుగన్పట్ట దీపైనయటుల" 99 అట్టి మర్మకవికి వినిమయముగ నిచ్చుటకు ఏమియు నీవిశ్వమునందు గనుపించదట కావున కవిగారు ప్రార్థనాంజలిపుటిని బాష్పమౌక్తికములను ఉపహారమిచ్చి ఒకవందనము అర్పించుకొనినారు ఇందు మర్మకవితలోని ప్రత్యేకత ప్రశంసింపబడినది

"You live alone
In a forest cottage
Beyond the ken of busy life
But your grand creations
Invite the worlds attention
Like a winter rainbow " 100

మర్మకవియొక్క అద్భుతమైనరచనలు ప్రపంచముయొక్కదృష్టిని చలికాలమునందలి ఇంద్రధనుస్సువలె ఆకర్షింపగలవు

**అజ్ఞాతకవి** - ఎంతటిమహాకవులైనను సమకాలికులైనవారి మన్ననలను అంతగా పొందలేకపోవుట యనునది ఒక్కనాటి విషయముగాదు 'ఏగతి రచియించిరేని సమకాలమువారలు మెచ్చరేగదా' అని చేమకూర వేంకటకవి తన సమకాలికులు చూపిన నిరాదరణమునకు హృదయావేదనను పొందినారు భవభూతిమహాకవిగూడ నిట్టి నిరాదరణమునకు పాత్రుడైనవాడే కీట్సు తాను రచిం

చిన 'యిసబెల్లా' యను కావ్యముపై ఈర్ష్యాపూరితముగా వెలువడిన విమర్శనము వలన భగ్నచిత్తుడై నేను మరణించినవెనుక గొప్పకవి నయ్యెదనుకాబోలు' అని లేఖలో వ్రాసికొనినారు అదేవిధముగా సమకాలికుల నిరాదరణమునకు పాత్రులైన దువ్వూరివారు తమ హృదయవేదనను ఈ ఖండికలో బహిర్గతము కావించుకొనుటయేగాక తన్నుతాను ఊరడించుకొనినట్లు భావింపవలసియున్నది

'కిసలయగుచ్ఛమధ్యముననుండి నేను దినకాంతిని గాంచలేకపోవుచున్నానే' అని మంచుబిందువు లను బాష్పములతో నేడ్చుచున్న పుష్పమువలె వేదన పడనక్కరలేదు సుగంధమును మోసుకొనిపోవు గాలివలె విమర్శకులు నీ కృతిని, రసమును గ్రహించి నీ కీర్తిని ప్రకాశింపజేయుదురు

రేయింబవళ్ళు నిసర్గమధురగానము చేసెడు ఓ నిర్ఝరమా' నిన్ను నెవ్వరును తలపబోరని యెంచవోకుము కొంచెము ఓర్పువహింపుము ఆ దారినపోవు బాటసారి నీకలరవ మాలకించి ఈ ధరలో నిన్ను ప్రకటించును

'ఓపికమా' వసంతము డాయుదనుక వేచియుండుము వేరప్రకటనము నీకేల?' అని తమ బాధను కిసలయగుచ్ఛమధ్యమునుండి వెలుగుగాంచలేని పుష్పముతోను నిసర్గమనోజ్ఞగానముచేయు సెలయెటితోను వసంతమురానప్పటి కోకిలస్థితితోను పోల్చుకొని ఎప్పటికైన అజ్ఞాతకవిగానున్న తాము వెలుగు జూచుట తథ్యమని తమ్ముతాము ఊరడించుకొనినారు

"ఓరిబాలక' నీ మురళిరవంబు
వ్యర్థమౌనని చిత్తతాపంబు వలదు
రాగపరిచితుం డెవ్వడో రమ్యగీతి
వినియెయుండు నానందంబు వెల్లివిరియ" 101

**అనార్కలి** - అక్బరుపాదుషా హర్మ్యమంటపము అనార్కలివలన దేవేంద్ర సభవలె ప్రకాశించుచుండెడిది ఆమె మోహనరూపము అంగవిన్యాసము యువరాజు జహంగీరుని ఆకర్షించినవి అది వారిరువురి ప్రణయమునకు దారితీసినది

విషయముతెలిసిన అక్బరుపాదుషా కనుబొమలు ముడివడినవి కన్ను లెఱ్ఱవారినవి సభలో జహంగీరు, నర్తకి, అక్బరుదప్ప మరెవ్వరును లేరు ఆ సమయమున కుపితుడైన అక్బరు కొడుకును జూచి అభిజాత్యంబేడ' ఆ తొత్తు

కూతుపైని మోహంబేడ॰' అని పల్కి సేవకులనుబిల్చి అనార్కలిని గొనిపోయి ఇప్పుడే గోరీలో పెట్టవలసినదిగా ఆజ్ఞాపించెను చివరకు-

"యువరాజు హృదయంబు యువతి దేహంబు
నొక్కగోరీయందె యునికి గైకొని" 102 నవి

కవిగారు అక్బరుషాహిని ఓ కరోరాత్మ!' అని సంబోధించి-

"ప్రణయంబునకు జావె ప్రతిఫలంబేని
అవనియెల్ల శ్మశానమట్లు మార్పడదె॰
నీతికి జిహ్వాంబు నిర్దయత్వంబె॰
మానవతత్త్వంబు మఱచిపోయితివో" 103

అని నిష్ఠురముగా ప్రశ్నించిరి ఆనాటి అనార్కలి ధన్యసమాధి వారిరువురి ప్రణయస్మృత్యంకముగా లాహోరునగరమున నేటికిని నిలిచియున్నది ఇందు వారిరువురి ఆకాశపుటంచులుదాటిన పవిత్రప్రేమ ప్రశంసింపబడినది

**రెడ్డికుల ప్రబోధము** - నియోగులు, విశ్వబ్రాహ్మణులు కమ్మవారు, వెలమవారు, రెడ్లు విడివిడిగా ఎవరిసభలు వారు చేసికొని వారివారి కులములను పైకితెచ్చుకొనుటకై ప్రయత్నముచేసెడి రోజులవి 1917 లో జరిగిన రెడ్డిజన మహాసభలో వర్ధమానకవి దువ్వూరి రామిరెడ్డిగారిని కట్టమంచి రామలింగారెడ్డిగారు అధ్యక్షులుగానుండి ఒక సువర్ణపతకమునిచ్చి సత్కరించిరి ఆదే కులాభిమానము రామిరెడ్డిగారిలోకూడ వ్రేళ్ళుదన్నుకొనిపోయినది తమ కులమునకు సంఘములో జరుగు నిరాదరణము బాధను కలిగించినది అట్టితరి ఈ ఖండికను రచించి యుండవచ్చును

ఇందు మొదటగా రెడ్డికులౌన్నత్యము వివరింపబడినది వేమనయోగి, షట్చక్రవర్తి, నాయకురాలు, అనవేమభూపుడు, అనపోతవేముడు, మల్లారెడ్డికవి, కాటయవేముడు మున్నగువారు రెడ్డికులములో జన్మించిరి అట్టి కులపుచరిత్ర శ్రేష్ఠమనుట కేమిలోపముగలదు ఈ కులములో 'రణభూమిలో జయనావ నడిపించినవారు, కవితల్లినవారు, కృతులను స్వీకరించినవారు' గలరు కొండవీటి కోటలోని ప్రతిస్థలము రెడ్డిచరిత్రమునకు ఆటపట్టుగా నిలచినది ఇంతటి పూర్వౌన్నత్యముగల రెడ్డికులము-

"ఇంకనెప్పుడు పూర్వశౌర్యాంకసరణి
రెడ్డికులవీరదోర్బలశ్రీసమాశ్ర

యంబుగాంచి వర్ధిలునో౯ అట్టి యదను
గల్గునో౯ మనకంత భాగ్యంబుగలదో౯" 104

అని సందేహమును వ్యక్తముచేసినారు అంతియేగాక రెడ్డికులాభ్యున్నతికి దీక్షబూని వాడవాడల ప్రబోధగీతము లాలపించవలసినదిగా రెడ్డియువకులను ఉద్బోధించినారు

'మార్తురరాజ్యరమామణుల్ చెఱబడి
గోడుగుడిచినచోటు కొండవీడు,
ఆంధ్రదేశమతల్లి యలికంబునం దాల్చు
మండనతిలకంబు కొండవీడు,
కవితారసాలోలకల్లోలినిం దోగు
పండితాఢ్యులనాడు కొండవీడు,
ఖండితారాతి రాణ్మండనమండితా
ఖండలచాపంబు కొండవీడు" 105

ఇందు రెడ్డివీరులనాటి కొండవీటివైభవము ఎంతయో మనోజ్ఞముగా వర్ణింపబడినది

రెడ్డికులప్రబోధము - దువ్వూరివారు దీనిని 1945వ సంవత్సరములో జరిగిన రెడ్డిజనసంఘసభలో చదివినారు

"తమకులాభ్యున్నతికయి యత్నంబుసలుప
అన్యకులముల ద్వేషించినట్లుగాదు
బలిసి సర్వాంగకంబులు పటువులైన
మహితమౌగాదె దేహసమిష్టిబలము" 106

అని తమ కులాభ్యున్నతికి పాటుపడవలసినదిగా రెడ్డికులస్థులను ప్రబోధించినారు ఇందు రెడ్డికులప్రశంసకూడ చేయబడినది

"కవులు గాణలు విద్వత్ప్రకాండయశులు
లలితసాహిత్యచక్రవర్తులను గన్న
రెడ్డికులకామధేనువు గొడ్డువోక
పెంచు నేటికి ప్రతిభానివేశమతుల ' 107

## (VII) ఇతరములు

సమర తృష్ణ - రచనాకాలము 25-10-1922 1922 నాటికి సామ్రాజ్యవాద నిజస్వరూపమునకు సంబంధించినజ్ఞానము భారతీయులలో అప్పుడప్పుడే మొదలగుచున్నది వెర్సైల్స్‌శాంతిసంధి యందలి కపటత్వము, స్వలాభకాంక్ష బయట పడినవి చివరకు నానాజాతిసమితినిగూర్చిన సదభిప్రాయములుగూడ ఒకటొకటిగా తొలగిపోసాగినవి అట్టిస్థితిలో రచించిన ఖండిక ఇది

సమరతృష్ణయందు నాలుగు ముఖ్యాంశములు గలవు క్రీస్తుమతధర్మము లను పెదవులతో ఉచ్చరించుటదప్ప ఆచరణలోజూపని అక్రైస్తుఘాతకుల'ను సంబోధించి, వారి దుశ్చర్యలను దుర్మదమును మొదటిభాగములో వర్ణించిరి ఏసుమహాత్ముని 'మానవరక్తసంభారవిక్రయము'ద్వారా మరియొకమాట - రాత్మ గారపంక్తిచిమినీలమీద సిలువవేయుచున్నారట ఇందు కర్మాగారపంక్తులచిమినీలను సంకేతమునువాడి పారిశ్రామికవిప్లవానంతరము పాశ్చాత్యదేశములలో వేళ్ళుదన్నుకొనిపోయిన పెట్టుబడిదారీ ఆర్థికవ్యవస్థను కార్మికుల శోషణను సూచించినారు

ఈ వ్యవస్థయొక్క స్వరూపమును క్రమబద్ధముగా వర్ణించుట యనునది రెండవఅంశము ఇందు నాగరికతదాతలమని లేనిపోని గొప్పదనమును ఆరోపించుకొని, కపటనాటకము ఆడుచున్నవారినిగూర్చి వ్రాసినారు నాగరికత ఫలితములు కొన్ని మంచివి ఉండవచ్చునేమోగాని నాగరికతమాత్రము-

"ఐశ్వర్యవంతుల యఱచేతిఫలము

కష్టజీవులపాలి కంఠపాశంబు 108

వాణిజ్యవిరోధములు యుద్ధములకు దారితీయును కావున ఈ నాగరికత మనినంత కాలము 'సంగరపశుశక్తి' మిగిలియే యుండును

కపటచక్రవర్తుల కూటమిగా మారిపోయిన నానాజాతిసమితినిగూర్చి నిందించుట యనునది మూడవ ముఖ్యవిషయము ఇందు-

"సమరపరాజితశత్రువర్గముల

కొల్లద్రవ్యము పంచుకొనుచేడ్క బెద్ద

భాగంబులకు బోరు పరమసౌహార్ద

చక్రవర్తులకేల శాంతిపీఠనము" 109 అని పల్కి ఖండాంతరముల

యందలి కపటనాటకములు ఎప్పటికైనను బయటపడి తమ నిజరూపమును జూపునని చెప్పినారు

సకలదేశములయందలి కవులకు విజ్ఞప్తి చేయుట అనునది నాల్గవభాగముగా విభజింపవచ్చును భావిసంగరముష్టిలో పట్టుపడనీయక జగతిని కాపాడుటకై సమస్తదేశములయందలి కవిమహాశయు లొక్కటి కావలయుననియు ఇదియే తమ స్వప్నము ఆశయనియు దువ్వూరివారు చెప్పియున్నారు

"జ్ఞానహోమాగ్ని మీ కరదీపికలను
వెలిగించి, జెండాలు వినువీధినెగుర
నఖిలమానవ హృదయధ్వంసికీట
కములకు దల్లియౌ కటికదురాశ
సమయింప సంగ్రామసన్నద్ధులగుడు ' 110 అని సమస్తదేశములందలి కవీశ్వరులను తమతమ కలములతో సిద్ధముకావలసినదిగా ఉద్బోధించినారు

జీవన ద్వేషి - రచనాకాలము 28-3-1923 ఒక చిన్నవాడు నడిరేయి వెలువడి వాగువంకల దారివంకకు వెళ్ళుచున్నాడు అది చూచిన యామిని అతని మదిని కలచుచున్న వేదనలను తెలుపవలసినదిగా కోరినది అంత జీవనద్వేషియైన ఆ యువకుడు-

"విసిగి వేసరి జీవబంధన
విసరమును దెగద్రెంపవచ్చితి గానవే
జేనెడుతలంబును జూపవే" 111 అని ప్రార్థించును

యామిని ఆ పిచ్చిప్రయత్నమును మానుమనియు సరసినీటిలో ప్రాణములు విడువ దలచితివేని-

"నా హృదయంబంతకన్న న
గాధ మందుమునిగి తాపము వాపరా' 112 అనియు, దానివలన విసుగు వేసటలు అడగుననియు ఒకవేళ నేలపై తనువుచాలించుట ఇష్టమైనయెడల-

"నాదు మెత్తనిరొమ్ము తలగడ
నాదరంబున మోమునానిచి తూగరా" 113 అనియు, తద్వారా ఊరటను పొందుమనియు, ఒకవేళ జీవనమును ఉరిత్రాట విడువతలచితివేని-

"జడనునలగియు గమ్మతావుల
గడలజిమ్మెడు పూలదండను నిత్తురా" 114 అని పల్కి, మరణాభిలాషను మానవలసినదిగా ఉద్బోధించినది ఇందు యామినిని రెడ్డిగారు మానవీకరించిరి

జీవితము సుఖదుఃఖసమ్మిశ్రితమనియు దుఃఖము కలిగినంతమాత్రమున సుఖములేదనునట్టి భావన పొరపాటనియు, జీవితమునెడ మనవైఖరిని సరిదిద్దు కొనుట మంచిదనియు దీని అంతరార్థము కావచ్చును

**పండిత ప్రతిజ్ఞ** - రచనాకాలము 29-12-1923 ఇది ఛాందసులను అపహ సించుటకు గాను రచించిన పద్యముల కూర్పు

పండిత తిమ్మయశాస్త్రిపుత్రుడు వనమున కేగి అచ్చట తూగుటుయ్యేల కూర్చుండి ఊగుచున్న కవితాకన్యను జూచి తన పాండిత్యప్రకర్షను ఆమెతో వివరించును చివరకు ఆమె అతనిని తిరస్కరించి మృదులహృదయుడైన రస జ్ఞుని కౌగిలిలో జేరును దానితో ఈర్ష్యాపరాభవములు చిత్తమును కాల్చుచుండగా కోపముతో తిమ్మయశాస్త్రిపుత్రుడు ప్రతినజేయుట ఇందలి కథావస్తువు

అనగా కవిత శుష్కపాండిత్యమునుగాక, కోమలహృదయమును ఆశ్రి యించి యుండునని ధ్వని కవితాకన్యకు ఛాందసుడు శత్రువన్నమాట ఛాందస మును, పాండిత్యమును అపహాస్యముపాలుజేసి తమ ఉక్రోషమును దువ్వూరి వారు వెడలగ్రక్కుకొనినారు

"శాకుంతలములోని శతసహస్రములుగ
వ్యాకృతిదోషముల్ బయలుపఱతు,
భవభూతి సాహిత్యభాండారమెల్లను
గానుకుగాకుండ గడిగివైతు,
బాణుని శ్రీహర్షు భారవి యూడింప
దొలిదెబ్బకైనను నిలువగలరె
తిక్కయజ్వకు దలతిక్క మాన్పెదనన్న
దెరపిగా నొకనాడు తీఱలేదు,
ఇంక దక్కినవార లదేమిలెక్క
ముక్కుబట్టిన ప్రాణంబు మొదలెపోవు
కాంత' నాకన్నసేర్పరుల్ గలరె చెపుమ'
నేను ననుగూర్చిపొగడుట నియతిగాదు 115

ఇవి పండిత తిమ్మయశాస్త్రిపుత్రుని పలుకులు ఈ పద్యము రెడ్డిగారు ఛాందసుల నెట్లు పరిహసించిరో తెలుపుటకు ఒక మచ్చుతునుక

**కవి సంశయావస్థ** - రచనాకాలము 16-10-1924 దువ్వూరివారికి వానా కాలము అందున కలుపుదీయుకాలము కవితాఋతువు ఇంతకుముందు వ్రాసిన గ్రంథము లన్నియు కలుపుదీయుకాలములోనే వ్రాసినారు అప్పుడప్పుడు మాస పత్రికలలో ప్రచురించిన కొన్ని ఖండకావ్యములుదప్ప ఈ సంవత్సరము వానా కాలమున గొప్పకావ్యమేదియును వ్రాయుటకు ప్రేరణము గలుగలేదు కలుపు దీయు కాలము సమాప్తముకానున్నది అట్టిస్థితిలో కవిత తన్ను పరిత్యజించిన దను అనుమానము ప్రబలమైనది ఆ మనోవేదనతోనే 'కవిసంశయావస్థ' అను ఈ ఖండికను రచించిరి

కవితా' ఓ కవితా' నీవు కనుపించి ఒక సంవత్సరకాల మైనది ఇటు కను పించి అంతలోనే మాయమైపోవుచున్నావు

> 'నీవు రాణివె యౌదువు, నేను బిచ్చ
> మెత్తు పిచ్చిబికారినె, యిద్దఱకును
> దారతమ్యంబు కొండంత తరుణి' యింత
> పోల్చలేనైతి నినునమ్మి మోసపోతి 116 అని కవితతో పల్కగా

కవిత ఓయీ పచ్చపొలముల కాప' హేయమైన అపరాధ కల్మషమును నాకు అంటగట్టుచున్నావా! చిత్రలేఖను ముద్దుచేయుచు నన్ను నీవు చిన్నచూపు చూడలేదా' ఇదియే నాకడపటివీడ్కోలు అని పలికినది అంత కవి ఆమెతో చిత్రలేఖ ఎవరోగాదు నీ తోబుట్టువు' అని పల్కి--

> "అతివ' బొరపాట్లప్రహసనం బాడినాము
> భరతవాక్యంబుగాబెట్టు వలపుముద్దు
> మిమ్ము నిరువురిగూడి సుఖమ్ముగాగ
> గడచు జీవితశేషమ్ము కలవిధాన '

అని ప్రణయకలహమునకు భరతవాక్యమును పాడినారు ఇందు కవిత మానవీక రింప బడినది

**కాలపుటౌఅపిడి** - రచనాకాలము 1-7-1928 ఇది రెడ్డిగారు భార్యా వియోగ ముతో కుందుచున్న సమయమున వ్రాయబడినది

మరణమనునది లేకున్న మానవులకు పరిపూర్ణజీవితసుఖము బోధపడదట స్వర్గమును దుఃఖహీననివాసమటుల మతిలేని శిల్పిఎవడో సృష్టిచేసినాడట అట్టి స్వర్గముకొరకు ఒకచిటికయైనను ఐహికజీవితమును వ్యర్థముచేయనని కవిగారు చెప్పుకొనినారు

కాంత గతించినకారణమున లోకమంతయు రూపరినష్టే కిన్పించినను గతజీవితమువిలువ అంతకంతకు హెచ్చుటవలన ఇంపుగనే దోచుచున్నదట

"ప్రాచిపువ్వులు విదలింప బడతికురుల
వాడుతావులు తారాడుపగిది నిదుర
లేవ జిన్నారి కల తున్కలౌవిధాన
నెలత· నీరూపుతలపు సున్నితమునొందె" 118

నని కాలపుటొరపిడిలోగలుగు మార్పును తెలియజేసినారు

రాజభిక్షుకుడు - పగలెల్లకష్టించి పొలములోపనిచేసి ప్రొద్దుక్రుంకెడివేళకు తిరిగివచ్చి నూకలను ఇగిరించుకొని, వేడిసంగటితిను సమయమందు తమను ధరణీవిభుడు ద్వారముకడనిల్చి ముసిముసి నవ్వులతో సందెకబళము వేడెను చకితయై ఆమె ఒక్కమాటయినను పలుకజాలక మోమువంచి నిలబడెను అంతలో రారాజు ఎచటికో వెడలెను

తన ఎదలో తలపులు చీకాకుపెట్ట, చేతిలోకబళము చేతిలోనే యుండగ, ఊరక కూర్చుండియున్నసమయమున ఎచ్చటినుండియో ఒక భిక్షుకుడువచ్చి సందెకబళమును జాలిపుట్టునట్లు వేడెను దయతో అన్నమును అతనిచేత నిడినది· బికారి ఆనవాలుగ ఉంగరమునొకటి యిచ్చెను దీపపువెల్గులో జూడగా నది రాజ ముద్రిక అంత-

" నేడు రాజు భిక్షార్థియై రాగతంబేమొ
మాబోటి నిరుపేద మాలకొంపలకు" 119 అని తలచినది

భ్రూరీ - ఎవరో తమ వీణాతంత్రులను సడలించిపెట్టిరనియు, గంగాతీర్థమును కలయంపి చల్లిరనియు, పూజామాలికనుతెగ్రదెంపివేసిరనియు గీతాపుస్తకపు షుటలెల్ల చింపివేసిరనియు అర్చవేదికనున్న దీపము వార్చిరనియు, హారతి పళ్ళెరమును బోరలద్రోసిరనియు తలంచిది పిదప-

'చోరు డెవ్వడో యతిథివేషమున జొచ్చెను నా పర్ణశాలను

నా మూలధనమెల్ల లూరిగొట్టి నన్ను బికారినిజేసెను" 120 అని వాపో యిరి ఒకభావనకు అతడు ఎంతయో విలువనిచ్చి తన హృదయములో పదిల పరచుకొనిన స్థితిలో దానిని అన్నివిధముల తారుమారుచేసెడి పరిస్థితి ఏర్పడి నపుడు అతడు తనకుగలిగిన మనస్సంక్షోభమును ఈ గీతిలో వ్యక్తముచేసినా డేమొ యనిపించుచున్నది

భవిష్యద్దర్శనము - ఒకనాడు సందెవేళయొక్క రామణీయకమును గాంచి ఇంట కాలునిలువక కవిగారు ఊరివెలుపలనున్న పొలమున విహరింపబోయిరి సంజకెంజాయ లంతరింపగా చీకటి వ్యాపించినది సగము జాగ్రదవస్థ, సగము స్వప్నావస్థగా భావించుచు గట్టుపైన గూర్చుండిరి ఇంతలో ఇంద్రజాలమువోలె ఒకవింత గన్పట్టెను

మావితోటలో పర్ణమంటపమునందు జనరంజకమైనసభ జరిగినది అచట-

"రారాజు క్రొంబచ్చ తాగద్దెడిగ్గి
యందటితోబాటె యవని గూర్చుండె
బనిపాటలేనట్టి బంటుసిపాయి
త్రుప్పుపట్టినకత్తి తొంటిపైరాయ
దన పూర్వజయముల దలపోయుచుండె
బురదచిట్టలుపడ్డ పుట్టములగాపు
వర్తించె నృపపరివారంబు గలసి
కూలినాలియొనర్చి కుడుచు నిరుపేద
యజమాని సరిబంతి నాసీనుడయ్యె' 121

ఈవిధముగా సకల మానవజాతి కులవర్ణభేదములుమాని ఏకోదరులవలె నన్యోన్య సహాయమును అర్థించుచుండిరి అంతలో ధర్మదేవత స్ఫటికపాత్రమున శాంత్యా సవమును దెచ్చి ఇచ్చి అందరిని సంతృప్తులజేసెను అభ్యుదయాంశువులు అన్ని మూలలను వ్యాపించినవి ఈ విశ్వమంతయు మానవకల్యాణమందిర మైనది

ఇంతలో కవిగారిపై లౌకికయాథార్థ్యము లను భావములు పక్షివిధముగా వ్రాలినవి ఆ ప్రాంతమందలి తాళవృక్షములు బొగ్గుకంబములవలె కన్పించినవి. కవిగా రొక్కరుమాత్రమే చిమ్మచీకటిలో చిక్కుకొని యుండిరి.

మానవకల్యాణమునకు కులము, మతము, ధనికులు, పేదలు అను భేదములు అడ్డుగోడలనియు, అవి ముందు తొలగిపోయినయెడల లోకము 'మానవకల్యాణమందిరము' కాగలదనియు వారి అభిప్రాయము

'సత్యమో భ్రాంతియో, స్వప్నంబొ గాని
యింద్రజాలమువోలె నెదుటగన్పట్టె
అది సత్యమైయున్న నాశ్చర్యకరము
అది కలయెయైన నానందమయము 122

కవిగారు తాను చూచినది సత్యమైనచో నాశ్చర్యకరమనియు కలయైనచో నానందమయమనియు చెప్పి మానవజాతి భవిష్యత్తులో ఎట్లుండదగునో తెలిపియున్నారు

**బాటసారి** - దువ్వూరివారు దీనిని 'The Traveller' అను పేర ఆంగ్లీకరించిరి

ఓ తరుణీలలామ! నిశ్శబ్దమైన రేయియందు నీరవవీణాతంత్రులను గదలించి, రమ్యమూర్ఛనలీను రాగములెత్తి తటాలున నిలుపుజేసితివేల? ఆనందమధిరపొంగారుపాత్రను పెదవులకందించి పెరికివైచితివి ఆ కణము చవిచూచిన అనుభూతివలన హృదయమునందు పిచ్చెత్తి ఎందెందొ తిరుగుచున్నది అర్ధరాత్ర మైనది గాఢాంధకారము దిక్కుల వ్యాపించినది చుక్కల సమూహములు కూడ మబ్బుచాటునదాగి మాయమైపోయినవి వాన జడివెట్టి కురిసినది అరణ్యమార్గమందు జిక్కి దిక్కుదోపక ఒంటివాడనై తిరుగుచున్న బాటసారిని

"ఆరుపబోకు గవాక్షంబునందు
గాంతిల్లు దివ్యసుగంధదీపంబు
దలుపుదీయుమ దీర్ఘదై నిక్రమము
స్వప్నగతస్పర్శనమసి సుఖింప
గాంత! యొక్కింత నే గన్నుమోడ్చెదను " 123 అని బాటసారి కాంతతో బలికెను

వీరు ఇంకను అతిథి బాష్పదౌత్యము, విమర్శకుడు, జలజము, సంక్రాంతి, బంభరశుకకీటకసంవాదము మున్నగు ఖండికలనుగూడ రచించియుండిరి

# పంచమాధ్యాయము

# ఇతర రచనలు

కావ్య (శ్రవ్య), ఖండకావ్యభిన్నములగు రచనలు ఈ వర్గము క్రిందజేర్చి పరిశీలింపబడును

## (1) నాటకములు

### (a) కర్షక విలాసము

**రచనాకాలాదులు** - ఇది దుష్వారివారి ప్రప్రథమ సాంఘికనాటకము 1917వ సంవత్సరములో రచింపబడినది 1917 లోనే అఖిలదేశీయ రెడ్డిజనమహాసభ జరిగినది ఆనాడు రెడ్డిమహాసభప్రతినిధుల వినోదార్థముగను స్వకులస్థులకు ప్రబోధాత్మకముగా నుండునట్లుగను ఈ నాటకము ప్రదర్శింపబడినది అప్పటికి దుష్వారివారు రసికజనానంద స్వప్నాశ్లేషాది కృతికర్తలు మాత్రమే సంఘము వారు తొందరచేయుటవలన దీనిని కేవలము పది దినములలోనే పూర్తి చేసినారు ఇందలి పాత్రలన్నియు ఇంచుమించుగా రెడ్డికులమువారే

ఆంగ్లేయులసాహచర్యమువలన మనలోగలిగిన పరివర్తనము పాతకాలపు పద్ధతులపై వైముఖ్యమును గలిగించినది ఆ పాత కొత్తలసంధికాలములో రచింపబడిన దీనాటకము సంఘసంస్కరణమునకు పూనుకొనినట్టిది ఇది కేవలము రెడ్డిజనులప్రబోధముకొరకై రచింపబడినను సార్వజనీనతను కలిగియున్నది దీనిపై ఆచార్య జి యన్ రెడ్డిగారు 'ఈ శతాబ్దపు తొలిదశాబ్దాల్లో ముఖ్యంగా ఆంగ్లేయులపరిపాలనలో ఒకవైపు పాశ్చాత్యవిద్యానాగరికత, మరొకవైపు భారతీయ జాతీయోద్యమము రాపిడిపడి ప్రబలమౌతున్నకాలంలో తెలుగుదేశపు గ్రామీణప్రాంతాల్లో స్థానికనాయకుల ఆలోచనల్ని, ప్రవర్తనాసరళిని, సామాన్యుల జీవితాన్ని ప్రతిబింబిస్తున్న నాటకమిది" 1 అని తమ అమూల్యాభిప్రాయమును వెలువరించిరి ఇందు నాంది, ప్రస్తావన, భరతవాక్యము మున్నగునవి వాడబడినవి

**కథాసంగ్రహము** - రామచంద్రారెడ్డి కథానాయకుడు, సహృదయుడు, సంఘసంస్కరణాభిలాషి "కొంచెము జ్ఞానముగలవారు చదువరులు భాగ్యవంతులు, చదువులేనిబీదలగు మూఢులను జూచినప్పుడు వారికి జదువుకొనుటకు తగిన సాధ

నము లేర్పరచి క్రొత్త విషయములను మనస్సున కెక్కజేసి, వారి సంతతులకు విద్యచెప్పించునట్లు బోధించి తగునంతవరకు సాయముజేసి ప్రోత్సాహమొనర్ప వలయు" 2 నన్న అభిప్రాయముగలవాడు పేదలకొరకై పరపతిసంఘమును స్థాపించినాడు శాఖాంతరవివాహములను ప్రోత్సహించుటద్వారా స్వకులైక్యతను సాధింపబూనినాడు చివరకు సంఘసంస్కరణమునకై సన్న్యాసమును స్వీక రించినాడు

వెంకారెడ్డి రామచంద్రారెడ్డికి భిన్నమైన మనస్తత్వముగలవాడు ఫోర్జరీలు చేసి, మోసగించి డబ్బుసంపాదింపవలెనని తలంచువాడు తనకడ్డమైనవారిని తప్పించివేయగల సమర్థుడుకూడ సీతడిద్వారా దొంగతనములుచేయించి ధనార్జన చేయువాడు పోలీసులకు చిక్కినసమయములో తాను తప్పుకొనుటకై వారికి లంచమిచ్చి, సీతడిమీద కేసునమోదుచేయించి తానే సాక్ష్యముచెప్పినవాడు- మాదిగరాగడిని రామచంద్రారెడ్డికి చేతబడిచేయుటకై పంపినవాడు ఇట్లు సంపా దించిన డబ్బులో కొంతభాగము వెంకారెడ్డికి చదువురాకపోవుటచేత గుమస్తా నర సయ్య తప్పులెక్కలువ్రాసి గుంజికొనినాడు

వెంకారెడ్డితమ్ముడు వెంకటరెడ్డి పట్టణములో చదువుకొనుచు వేసవి శెల వులకు సొంతగ్రామము వచ్చినాడు వేశ్య సీతారామమ్మపంపిన ప్రేమలేఖను చదువుకొని, నమ్మి, మోసపోయి చివరకు పరువుప్రతిష్ఠలు పోగొట్టుకొనుటయే గాక, శరీరమును సుఖరోగములకు నిలయము గావించుకొనినాడు

ఇది ఆనాటి సంఘమునందలి వ్యక్తుల మనస్తత్వమునకు ప్రతిబింబము

## నాటకగత విశేషాంశములు -

**ఛాందసభావ నిరసనము** - తాముదప్ప ఇతరులు పండితులుగారు అను భావ ముతో అహంకారప్రదర్శనముగావించు ఛాందసులను ఇందు నిరసించినారు లంబోదరశాస్త్రిని సృష్టించి ఆయనచేతనే ప్రౌఢకవి ప్రౌఢసరస్వతి, వాది మత్తేభకంఠీరవ, కుకవిఖండాలగండభేరుండ, కింకవీంద్రఘటాపంచానన, సమ రోద్దండకోలాహల శతావధాని, శతవిధాని పండితపద్మవనహేళి మహామహో పాధ్యాయ ఉభయకవిత్వతత్త్వపారంగత' - ఇత్యాది బిరుదులు గలవాడనని చెప్పించినారు మరియు ఆ బిరుదులు ఎట్లువచ్చినవోకూడ చెప్పించినారు 'కొన్ని సమయానుకూలముగా నే నేర్పరచుకొంటిని కొన్ని నా స్నేహితులచే నియ్యబడి

నవి మరికొన్ని మా గురువుగారు స్వర్గమున కేగునప్పుడు ఇంద్రసభలో క్రొత్త బిరుదులను బొందుటకై ప్రాతబిరుదులను నా పేరిట పరివర్తనము చేసినారు" 3 అని బిరుదులస్వరూపమును జెప్పించి ఎగతాళి జేసినారు

శాస్త్రిగారిశైలితో విష్ణుచిత్తీయము, వసుచరిత్ర మున్నగువాని శైలిని పోల్చినచో అది మంచినీళ్ళపాకములో బడినట్లుండునట చివరకు శాస్త్రిగారిచేత భారతము కేవలము పిప్పియని అనిపించినారు పద్యమంతయు ఒకేసమాసముతో నింపవలెననియు అదే పాండిత్యమనియుకూడ చెప్పించి అపహాస్యముజేసినారు

రామకృష్ణారెడ్డి అను యువకవిని తానువ్రాసిన కావ్యముతో శాస్త్రిగారి ఎదుట ప్రవేశపెట్టినారు దానితో శాస్త్రిగారు 'శూద్రులు కవిత్వము చెప్పుచుండగా మరణదండనవిధించు రాజులేకనే యీ కలియుగములో నిన్ని ఉత్పాతములు బయలుదేరినవి' అని బాధపడినారు ఆ యువకవి గ్రంథమును చూచుటకొప్పు కొనకపోవుటయేగాక కాపువాడికికవిత్వము, తురకవాడికికవిత్వము, కల్లుదాసరికి కవిత్వము అని ఆక్రోశించినారు చివరకు టీకలు, వ్యాఖ్యానము వ్రాయుటయే గాక వేదముల నుదాత్తానుదాత్తాదిస్వరములతో అచ్చువేసి శూద్రులకు విద్యవచ్చు నట్లు చేయుచున్నారని తమవారిపై విరుచుకుపడినారు ఈవిధముగా ఆనాటి సంఘమునందలి ఛాందసభావములను తూర్పారబట్టినారు ఇది దువ్వూరివారు తమ కవితావిర్భావసమయమున అనుభవించిన మానావమానములకు ప్రతిబింబముకూడ

**వైష్ణవమతదురభిమాననిరసనము** - రామచంద్రారెడ్డికి పాతకాలపు తర మునకు ప్రతినిధియైన అవ్వను సృష్టించినారు ఆమె 'తానుచేసిన పాపా లన్నిం టిని పోగొట్టి పరమపదమిప్పించుమనియు మెళ్ళోతీగ, తాళికపూసలు సమర్పించు కొందుననియు' తిరువేంకటాచార్యులతో జెప్పును ఆ సందర్భములో కథానాయకు డైన రామచంద్రారెడ్డిచేత "పరమపదమునకుబోవుటకై ఆచార్యులకు తీగ లంచ మిచ్చుచున్నావా? ఈ ఆచార్యుడు పరమపదము కంట్రాక్టుకు దీసికొన్నాడా ? ఆచార్యులు స్వర్గదర్శనముచేతనే పరవశులగుదురుగాని సర్వసృష్టికర్తయగు భువ నేశ్వరునకు ఈ తీగలంచము సంతృప్తి గలిగించునా? ' 4 అనిపించినారు

తిరుమంగయాళ్వారు బేల్దారులను పరమపదమున కెట్లుపంపిరో చెప్పుమని ఆచార్యులచే "అయ్యా' ప్రాకారమునిర్మించిన బేలుదారులకు కూలియియ్యలేక, ధనమిత్తునని వారిని మోసముగా పుట్టిపై నెక్కించి కావేరిలో ముంచినాడు

తర్వాత వారికి పరంపదము — " 5 అని చెప్పించి వైష్ణవస్వాముల కుహనా తత్త్వమును బయలుపరచినారు

అవ్వ తన పసుపుకుంకుమకిగ్రిందవచ్చిన పదునైదు ఎకరముల భూమిని రంగనాయకులపేర వ్రాయించుమని కోరగా రామచంద్రారెడ్డి అవ్వకు విషయమును వివరించి ఆ పొలములో కొంత గ్రంథాలయమునకును మరికొంత పాఠశాలకును వ్రాయించుటకు ఒప్పించినారు

మెళ్ళోతీగ, దండ ఇచ్చినయెడల భార్యకు మంగళూరుగాజులు చేయించవచ్చని తలచిన ఆచార్యులవారి ఆశ నిరాశయైనది చివరకు "అట్టి అమాయకులే మాకు శిష్యరాండ్రు వారిని వదలిన నిక జీవితముజరుగుట దుస్తరము" 6 అని ఆచార్యుల వారితో అనిపించినారు ఈవిధముగా వైష్ణవమతదురభిమానమును అవహేళనచేసినారు

## (b) సీ తా వ న వా స ము

### రచనా కాలాదులు -

తన తొలినాటకమైన కర్షకవిలాసము'లో సాంఘికేతివృత్తమును గ్రహించిన కవి 1921వ సంవత్సరములో పౌరాణికేతివృత్తమును గ్రహించి సీతావనవాసము' అను ఈ నాటకమును వ్రాసినారు 1917, 1921ల మధ్యకాలమున తాము సంపాదించుకొనిన సంస్కృతసాహిత్యపరిచయము 7 తో రామిరెడ్డిగారు ఈ రచనకు పూనుకొని యుండవచ్చును

"ప్రతీకావ్యాన్ని ఎక్కువగా శోకమయంచేస్తూ కరుణనుసమాశ్రయిస్తున్న కవిని భవభూతి ఉత్తరరామచరిత ఆకర్షించి వుంటుంది తత్ఫలితమే సీతావనవాసము" 8 అని రమణారెడ్డిగారి అభిప్రాయము

ఇందు ఎనిమిది అంకములు గలవు ఆదిలో నాంది, మధ్యలో విష్కంభములు, దీర్ఘస్వగతములు అత్యధికసంఖ్యలో పద్యములు గలవు పద్యములు అధికసంఖ్యలో నుండుటకుగల కారణమును వారే "నేనువ్రాసిన సీతావనవాసమను నాటకములో కొంచెమించుమించుగా నూరుపద్యములు గలవు కాని యీ నాటకములో (మీరాబాయి) షుమారు పది పదిహేనుపద్యములుమాత్రమే గలవు ఇందుకు కారణమును కనుగొంటిని కార్య ప్రచలనమున సంపూర్ణముగ మగ్నమైన నా మనస్సునకు ఒకనిమిషము ఆలస్యము ఒకయుగముగా తోచుచుండినది

అట్టిసందర్భముల పద్యమొక యనావశ్యకమగు అడ్డుబాటుగ నేను గ్రహించితిని సీతావనవాసమున నింతతీవ్రమైన కార్యగమనములేదు Lyric nature ఎక్కువ కావుననే అన్నిపద్యముల కాకరమైనది " 9 అని చెప్పుకొనియున్నారు

కథాసంగ్రహము -

దండకారణ్యములో లక్ష్మణుడు తన ముక్కుచెవులను గోయగా శూర్పణఖ రావణుని పురిగొల్పి సీతను చెరబట్టించినదనియు, తత్కారణముగా రాక్షసకులము నాశనమయ్యెననియు దైత్యాంగనలు శూర్పణఖను నిందించుచున్నారట అందుచేత రాముని మోసగించి అతనిచేతనే సీతను కాంతారములకు పంపించి, ఆ రాజు గోడు గోడని దుఃఖించునట్లుగాజేసి, ప్రతీకారముతీర్చుకొనెదననియు, నెడె అయోధ్యకు బోయి పూర్వాలోచితకల్పనాక్రమమున సమయముకొరకువేచి పగ దీర్చుకొనెద ననియు శూర్పణఖ తలంచుటతో నాటకము ప్రారంభమగును

సీతయు, ఊర్మిళయు వనములో విహరించుచుందురు దండకారణ్యప్రస్తావన సందర్భమున తన్ను రావణు డపహరించికొనిపోవుసమయమున అతని నెదిరించి పోరాడి అసువులుబాసిన జటాయువు స్మరణకురాగా సీత మూర్ఛిల్లును ఇంతలో రాముడు ప్రవేశించును సీత మూర్ఛనుండితేరుకొని రామునితో భాగీరథీ పరిసరాటవుల నివసించు తాపసకన్యకల స్నేహానుబంధము తన్నీడ్చుచున్న దనియు అందువలన ఆ వనప్రదేశములను మరొకమారు దర్శించివచ్చెదమనియు తన అభిప్రాయమును దెల్పును

మునులువచ్చి రామునితో తమ్ము లవణాసురుడను రాక్షసుడు పెట్టుబాధలను చెప్పుకొనగా వానిని పరిమార్చుటకై శత్రుఘ్నుని రాముడు పంపును తాపసులు రాముని ఆశీర్వదించి వెడలుదురు

భద్రుడను గూఢచారిరాగా రాముడు లోకవ్యవహార వినోదము గావింప వలసినదిగా కోరెను అంతభద్రుడు జానపదులు నీరుదెచ్చుకొనుబావికడ ఒక పల్లెత 'రావణు డెత్తుకొనిపోయిన సీతను రాముడు మరల పరిగ్రహించెననియు, కౌసల్యాదేవి ఇంటనుంచుకొనుటకు సందేహింపలేదనియు, తానే కౌసల్యయైన కోడలినిప్పుడే ఇల్లు వెడలించియుందుననియు' పల్కినయపవాదములు విని పించెను అంత రాముడు లక్ష్మణునిరావించి జరిగినవిషయమునుజెప్పి లోకులు అభినందింపని రాజ్యపాలనము నిరర్థకమనియు, అందుచేత సీతను ఋష్యా

శ్రమమున వదలిరావలయునెనియు ఆదేశించును ఇంతకుమున్నే సీత దండ కారణ్యనివాసినులగు తాపసకన్యలదర్శింప అభిలషించినదిగాన ఆ నెపముతో ఆమెను వదలిరావలసినదిగా ఆజ్ఞాపింప లక్ష్మణుడట్లే ఋష్యాశ్రమప్రాంతమున వదలివచ్చెను

వాల్మీకి శిష్యులవలన దెలిసికొని, వచ్చి ఆపన్నసత్త్వయైనసీతను తన కుటీరమునకు దీసికొనిపోవును

రాముడు సీతను నిర్దాక్షిణ్యముగా పరిత్యజించినందులకు దుఃఖించుచుండగా లక్ష్మణుడు తిరిగివచ్చును నాసీత నేమిచేసితి'వని రాముడుప్రశ్నింపగా నాతడును 'కరినాత్మజ మీయాజ్ఞను నిర్వర్తించి వచ్చితి'నని బదులుపల్క రాముడు దిగులుతో క్రుంగిపోవును

వాల్మీకాశ్రమమున సీత లవకుశులను ప్రసవించును వారుపెరిగి పెద్ద వారుకాగా వాల్మీకి యథావిధిగా ఉపనయనము గావించి క్షత్రియోచితవిద్యల యందు నిపుణులను చేసెను

తదుపరి యజ్ఞవత్తుడు ప్రవేశించి రామచంద్రుడు అశ్వమేధయాగమును ఒనరింపనున్నాడనియు, ఆ యజ్ఞసందర్శనార్థము వాల్మీకిని ఆహ్వానించుటకు తాను నియోగింపబడితిననియు లవునితో బల్కును లవుడు వాల్మీకితాతగారు మృత్యుంజయతీర్థమునకు శిష్యులతోకూడి వెళ్ళినారని అతనితో పల్కును

అడవిలో కుశలవులు సమిధలకట్టలతో ప్రవేశింతురు ఇంతలో యజ్ఞా శ్వము పారికంటబడును దానినిసమీపించి చూడగా ముఖపట్టముపై 'రాము డశ్వ మేధయాగముచేయుటకై హయమును వదలెననియు, వీరులెవరైన నున్నయెడల యజ్ఞాశ్వమును కట్టివేయుడు లేకున్న చేతులుమోడ్చుడు' అనియు లిఖింపబడి యుండుటనుచూచి యజ్ఞాశ్వమును కట్టివేయుదురు

లక్ష్మణుడు ఎంతచెప్పినను కుశుడు యజ్ఞాశ్వమును విడుచుటకొప్పు కొనడు వారిరువురియుద్ధములో కుశుడు మూర్ఛిల్లును ఈ వీరకిశోరమును శిబిర మునకు గొనిపోయి చికిత్సగావించి, రామునకు ఉపాయనముగా అయోధ్యకుబంప దలచి కుశుని భుజముపైకెత్తుకొనగా లవుడు ప్రవేశించి లక్ష్మణునితో యుద్ధము నకు సన్నద్ధుడగును

ఇంతలో వాల్మీకి ప్రవేశించి తన తపఃప్రభావముచే కుశునివేదనలను మాన్పెను వాల్మీకి, లక్ష్మణుల సంభాషణసందర్భమున కుశలవులు అతనిని

ఇంద్రజిత్సంహారకుడగు లక్ష్మణునిగా తెలిసికొనిరి వాల్మీకి లక్ష్మణుని అతిథిగా ఆహ్వానించును

యాగమంటపమున రామలక్ష్మణభరతశత్రుఘ్నులును, రాజులును, మునులును ప్రజలును కూర్చుండియుందురు ఇంతలో వాల్మీకి, కుశలవులు ప్రవేశింతురు వారినిజూచి రాముడు లక్ష్మణుడుచెప్పినబాలురు వీరే అయిఉందురని తలంచెను

ఇంతలో శూర్పణఖనీడ్చుకొని విభీషణుడు ప్రవేశించును ఈ శూర్పణఖయే నిరపరాధియగు జానకీదేవి బహిష్కారమునకు కారణమనియు ఈ రక్కసి చేసిన కుట్రలన్నియు తెలియవచ్చినవనియు విభీషణుడు రామునితో పల్కును శూర్పణఖ 'రాక్షసవినాశనప్రతీకార మొనరింపగోరి జానకీదేవినెట్లయినను అడవుల కష్టపెట్టనెంచి అయోధ్య జేరితిననియు, మారువేషమున జరించుచు జనసమ్మర్దములగు ప్రదేశముల ఏమేమొ అపవాదముల వ్యాపింపజేసితిననియు' జరిగిన విషయమును దెల్పును శూర్పణఖను 'నీ పాపాత్మ తరించునటుల ఎటనైనను తపస్సుచేసికొను' మని విభీషణుడు మందలించి పంపును

తదుపరి వాల్మీకి సీత యొకవేళ బ్రతికియుండిన పునర్గ్రహణయోగ్యయగునా? అని ప్రశ్నింపగా సభలోనిప్రజలు ఈ అశ్వమేధమున మహారాజునకు సీతయే సహధర్మచారిణిగావలయునని తమ అభిప్రాయములు దెల్పిరి అంత వాల్మీకి సీతను, కుశలవులను రాముని కప్పగించును ఋషులు 'జానకీసహితుడవై అశ్వమేధము నొనరింపుము దార, పుత్రవంతుడవై గార్హస్థ్యసుఖముల ననుభవింతువుగాక!' అని ఆశీర్వదించుదురు నాటకము సుఖాంతమగును

## ఉత్తరకాండము - సీతావనవాసము -

ఉత్తరకాండకథలో జననిందవలని సీతావివాసమునకు అనంతరము శత్రుఘ్నుడు లవణుని గర్వమడచుటకై పోవును ఇందు సీతను వాల్మీకి తపోవనప్రాంతములకు పంపుటకుముందే శత్రుఘ్నుడు లవణుని జయించుటకు పోవును వాల్మీకిఆశ్రమమున మజిలీచేసిన సమయముననే సీతకు కాన్పగుట రెండింటియందును సమానమే ఉత్తరకాండలో వాల్మీకి రామునివద్దకువచ్చి కుశలవులు అతనికొడుకులనిచెప్పి పతివ్రతయైన సీతను అంగీకరింపుమనగా ఆమె లోకమునకు తనశుద్ధిని ఋజువుచేసి తెలిపినయెడల అంగీకరింతుననియు

అతడు పల్కును అంత సీత ఒట్టుపెట్టి రాముడుకోరినప్రకారమే ఋజువుచూపి తాను రామునిగూడక భూమిలో అడంగిపోవును సీతావనవాసములో నట్లుగాక సీతారాముల పునఃసంయోగమును ఘటించినారు

## ఉత్తరరామచరితమ్ - సీతావనవాసము -

భవభూతి ఉత్తరరామచరితయందు సీతావిరహముతో కుందుచున్న రాముని మానసికవ్యథను సుందరముగా చిత్రించిరి కాని బాధితురాలైన సీతకు ప్రాధాన్యము లేదు సీతావనవాసములో సీతకు ప్రాధాన్యమిచ్చి సీతారాములవ్యథ సమానమే అని నిరూపించినారు నాటకముపేరులోనే ఇది సీతకు ప్రాధాన్యమిచ్చిన దన్న సంగతి తెలియుచున్నది

ఉత్తరరామచరితలో యజ్ఞాశ్వమును పట్టుకొనినసందర్భములో లవునకును వేనవేలసేనకును యుద్ధముజరుగును సీతావనవాసములో కుశుడు యుద్ధముచేసి నట్లుమాత్రమే చెప్పబడినది భవభూతి సీతారాముల పునఃసంయోగమును గావించెను దాని ననుసరించియే దువ్వూరివారు సీతారాములపునఃసంయోగమునుఘటించి నాటకమును సుఖాంతము గావించియుండవచ్చును ఈ రెండునాటకములందును జననిందవలని సీతావివాసమునకుముందే శత్రుఘ్నుడు లవణుని సంహరించుటకై వెడలును

**నూతన కల్పనలు** - ప్రతీకారము తీర్చుకొనదలచిన శూర్పణఖ మారువేషమున జనసమ్మర్దములగు ప్రదేశములలో సీతనుగురించి ఏవేవో అపవాదములు లేవదీసినదనియు, అది భద్రునిద్వారా విని రాముడు సీతను అరణ్యవాసమునకు పంపెననియు కల్పించబడినది సీతావనవాసమునకు కారణము శూర్పణఖ దానవకులమును నాశనముచేసిన రామునిపై ప్రతీకారము తీర్చుకొనదలచుటగా కల్పింపబడినది

రామరాజ్యముపై ప్రజలకును, మునీశ్వరులకును ద్వేషబుద్ధి జనించునటుల జేయుటకై లవణాసురుని ప్రేరేపించి తపోవనముల ధ్వంసము కావింపింపజేసినదియు శూర్పణఖయేనట పై రెండు సంఘటనలకును శూర్పణఖ ప్రతీకారవాంఛయే కారణముగా జెప్పబడినది

**నాంద్యాదుల ప్రయోగము** - ఈ నాటకములో నాంది రెండు విష్కంభములు, ముగింపులో భరతవాక్యము నుపయోగింపబడినవి

**నాంది** - దశవిధరూపకముల మొదటనుండు ఆశీర్నమస్క్రియాది రూపమైన మంగళాచరణము నాందియనబడును ఇది ఎనిమిది పంద్రెండు పదునెనిమిది లేక ఇరువదిరెండు పదములతోకూడి అర్ధముచేగాని, శబ్దముచేగాని కొంచెముగా కావ్యార్ధమును సూచించునదిగా నుండవలయును

> 'శ్రీవైదేహియు బుత్రకుల్ కుశలవుల్ సేవింప సౌమిత్రి భ
> క్త్యావేశమ్మున ఛత్రి మెత్త నిరుచాయల్ నిల్చి వీచోపులన్
> వైవంగ లవణారియున్, భరతుడున్ భద్రాసనాసీనుడై
> యావిశ్వంబును నేలురాము డిడు మీకిష్టాయురారోగ్యముల్ ' 10

ఈ నాందీపద్యములో పదునెనిమిదిపదములు గలవు వైదేహి, కుశలవులు, లక్ష్మణుడు భరతుడు, శత్రుఘ్నుడు సేవింపగా భద్రాసనాసీనుడైన రాముడు ఆయు రారోగ్యముల నిచ్చుగాక' అని అనుటలో అర్ధముచే సీతాపునస్సమాగమమును, 'లవణారియున్' అను శబ్దముచేత శత్రుఘ్నుడు లవణాసురుని సంహరించుట యను కావ్యార్ధములు సూచింపబడినవి

**విష్కంభములు** - జరిగినదియు, జరుగునదియునగు కథాంశములను తెలియ జేయునదియై సంక్షేపార్ధమై మధ్యమపాత్రలచే ప్రయుక్తమగునది విష్కంభము

తృతీయాంకమునందలి విష్కంభము భద్రుడు మందారికలచే ప్రయుక్తమైనది అగ్నికీలల పరిశుద్ధయైనసీతను లోకులు కళంకదూషితనుగ దూరిరను జరిగినకథ భద్రునిమాటలద్వారా చెప్పబడినది నిన్నటిరేయి నాలుగవజామున దేవిగారికి దుస్స్వప్నము వచ్చినదనియు శాంతిచేయించుటకుగాను పురోహితుని కొరకు మందారిక వెదకుచున్నట్లును మందారికమాటలద్వారా జరుగబోవునది సూచింపబడినది

చతుర్ధాంకమున మధురిక, మందారికలద్వారా మరియొక విష్కంభము ప్రయుక్తమైనది సీత మునికన్నెలజూచుటకై పోయినదని జరిగినకథను రాజు సీతనుగూర్చి ఏవేవో కలవరించుచున్నాడనియు, రాజకులమంతయు అల్లకల్లోలముగా నున్నదనియు పల్కి జరుగబొవు కథను సూచించినారు

**భరతవాక్యము** - కావ్యాంతమున శుభప్రశంసచేయుట భరతవాక్యముయొక్క ముఖ్యోద్దేశ్యము ఇందు నెలకు ముమ్మారులు వర్షములు గురియుగాక' అనియు స్వరాజ్య మెల్లప్రజలకును గలుగుగాత' అనియు కల్యాణసౌఖ్యములు స్వర్గమందు

వలె ఈ విశ్వంభరయందును వెలయుగాత' అనియు శుభాశంసనము చేయబడినది

ఈ నాటకమునందలి ఇతివృత్తము పురాణ ఇతిహాసములనుండి గ్రహింపబడుటయేగాక, నాటకరచనసహితము సంస్కృతనాటకసంప్రదాయానుసారముగనే కొనసాగుట గమనింపదగి యున్నది

## (C) కుంభరాణా

### రచనా కాలాదులు 11 -

20-10-1924, 29-10-1924ల మధ్యకాలములో దీని రచన గావింపబడినది 20-10-1924న మీరాబాయినాటకమును వ్రాయవలెననెడి తీవ్రమైన కోరికయు, అనివార్యమైన ప్రేరణయు దుష్యారివారికి గలిగినవట మీరాబాయి నాటకమనుటతోడనే కుంభరాణా, అక్బరు మీరాబాయి ముప్పురును వారికనులయెదుట కనుపించిరట మొదటిసీను వ్రాయగనే తక్కిన కథాభాగము లన్నియును సూదంటురాయిని చేరవచ్చు సూదులవలె ప్రధానమైన పై మూడుపాత్రలచుట్టును చేరజొచ్చినవట అప్పటి తమ భావోద్వేగమును దుష్యారివారే స్వయముగా-

'తొమ్మిదిదినములు తీవ్రమైన కుంభరాణాజీవితమును నేను స్వయముగ ననుభవించితిని కలలోకూడ నన్ను కుంభరాణా వదలినవాడుకాడు నిదుర మేల్కొన్నప్పుడు ఆతనిసంభాషణములు నా పెదవులపై నుండెడివి ఈ నాటకము వ్రాయుచుండినపుడు నాకుగలిగిన భావోద్రేకము, ఆందోళన మఱియే కావ్యము వ్రాసినపుడును కలుగలేదు అప్పుడు నాస్నేహితులెవరైనను నన్ను చూచియుండినయెడల నాకు పిచ్చిపట్టినదని తప్పక యూహింతురు అందువలన మిద్దెపయికూర్చుండి తలుపులన్నియు బిగించుకొని ఈ నాటకమును వ్రాసితిని

నా పిచ్చినిగుఱించి మా యింటివారికిగూడ కొంతతెలియును నేనయి నేను భోజనమునకు పోవువఱకు నన్ను వారు పిలువరు అ సమయమున సూక్ష్మమైన శబ్దము వినబడినను, నన్నెవ్వరైన పిలచినను పట్టనలవికానికోపము వచ్చును '12 అని చెప్పుకొనినారు

మీరాబాయిలో పది, పదునైదుపద్యములుమాత్రమే గలవు కార్యప్రచలనమున సంపూర్ణముగ లగ్నమైనవారిమనస్సునకు ఒకనిముషము ఆలస్యము ఒక యుగముగా దోచెడిదట అట్టిసందర్భములో పద్యమొక అనావశ్యకమగు అడ్డు

ఖాటుగ తలంచిరట అందుచేతనే సీతావనవాసమున దాదాపు నూరుపద్యములు వ్రాసిన కవి దీనిలో వానిసంఖ్యను మిక్కిలి తగ్గించినారు

మీరాబాయినాటకమునుగురించి తూములూరి శివరామయ్యగారు సుబోధిని పత్రికలో ఒక విమర్శనావ్యాసము వ్రాసి మీరాబాయి 'High class tragedy' అని ప్రశంసించిరి తరువాత మీరాబాయినాటకమునందలి లోపముల నెత్తిచూపుచు 'రసలుబ్ధుడు ఒకవ్యాసమును వ్రాసి scrutator' పత్రికకు పంపెను దానికి జవాబుగా దువ్వూరివారు కళాప్రియు'ని పేరిట ఒకవ్యాసమును వ్రాసి scrutator లోనే ప్రకటించిరి

'మీరాబాయి' అనుపేరు క్రమముగా 'కుంభరాణా'గా మార్చబడినది కుంభరాణాకు ప్రాధాన్యమిచ్చి రచించిన నాటకమగుటచే అట్లు రాణాపేర నాటక నామమును మార్చియుండవచ్చును

## కథాసంగ్రహము -

మీరాబాయిమహత్త్వము కారణముగా ఉదయపురమునందలి శ్రీకృష్ణాలయమునకు పేరుప్రఖ్యాతులు వచ్చినవి భక్తులు అధికసంఖ్యలో మీరాబాయిదర్శనార్థము వచ్చుచుందురు ఒకసారి హిందూయాత్రికులవేషము ధరించిన తాన్‌సేన్ ఇస్మాయిల్‌లు ఆ ఆలయమున ప్రవేశించి ఆమెగానమును విని, మీరాబ్రతికియున్నంతకాలము లోకమున మరియెవ్వరును గాయకసార్వభౌములు లేరనియు అక్బరుచక్రవర్తి ఈమెగానమును విన్నచో బిచ్చగాడగుననియు కృష్ణమందిరమే వాసగృహముగా మారుననియు తలంచిరి

తాన్‌సేన్, అక్బరుపాదుషా హిందూయాత్రికులవేషము ధరించి ఆమె దర్శనము గావించుకొని ధన్యులుగాదలచి బయలుదేరిరి

రాణా మీరాతో సామాన్యస్త్రీలవలె అందరికంటబడుచు శ్రీకృష్ణమందిరమునకు పోవుటతగదనియు అంతఃపురద్వారమును దాటవలద'నియు శాసించెను అంత మీరా "నాదుమతమునకు నన్నువదలుడు అన్యమతస్థులె పూజ్యమైన హిందూమతమును స్వీకరించి సంసారమును తరించుచుండ మీరేల నాస్తికులగుట" 13 అని ప్రశ్నించును అన్యమతస్థులెవరని రాణా ప్రశ్నింపగా ఆమె 'అక్బరు హిందూమతమును ఆదరించుచున్నాడనియు అతడు జనకునివంటి కర్మయోగి'యనియు సమాధానముజెప్పును శత్రుసంబంధమైన ఆ మాటలు రాణా

హృదయమును గాయపరచగా నాతడు మీరా, రాణాలలో నెవ్వరైననొకరు చావ వలయునని తలంచెను

అక్బరు తాన్‌సేన్‌లు హిందూయాత్రికులవేషములో ఉదయపురముజొచ్చి పాంధశాలలోని యాత్రికులద్వారా రాణా మీరాను అంతఃపురములోనుంచి ఆమె పిచ్చికి చికిత్సచేయించుచున్నారని తెలిసికొందురు తదుపరి తలారి మురళీదాసు వలన విషయముతెలిసికొని అక్బరు తాన్‌సేన్‌లు వైద్యులవేషములో బలవంత రావుద్వారా రాణాగారి అంతఃపురమున ప్రవేశించి మీరాను దర్శించుకొందురు తదుపరి తిరిగివెళ్ళునపుడు నమస్కారముగావించి హారమును ఆమె దోసిలిలో నుంచి వెడలిపోవుదురు మీరాచేతిలోనుండి హారము క్రిందికి జారిపడును దానిని పరిచారిక సుశీల దొంగిలించును ఇదియంతయును మీరా భక్తిపారవశ్యముచే గమనించదు

సుశీలమాటలను చాటునుండివిన్న వాసంతిక బలవంతరావుగారికి విష యము నెరిగింపగా నాతడును రాణాకు తెలిపెను సుశీలను పిలిపించి ఆ హార మును తీసికొనిచూచి 'ఇదియెక్కడిదోతెలుపుమ'నగా రాణిగారికి మందుఇచ్చుటకు వచ్చినవైద్యులు ఈ హారమును రాణిగారికిచ్చి పోయిరనియు రాణిగారు తనకు ఇచ్చినారనియు చెప్పును ఇదియంతయును విన్న రాణా ఎవరో దుర్మార్గులైన సంస్థానాధీశులు తమయంతఃపురమును అపవాదకళంకితము చేయుటకొరకై వైద్యవేషధారులై వచ్చియుందురని తలచెను మరియు ఈ కుట్రయంతయు ఆ కపటాత్ముడు అక్బరుదేననియు ఊహించెను తదుపరి బలవంతరావును ఉద్యోగమునుండి తీసివైచి విశ్వాసపాత్రుడైన కుమారసింహుని అంతఃపురాధి కారిగా నియమించెను

పిమ్మట దునీచంద్‌శేర్‌ద్వారా తమవద్దనున్న ఆ హారమును కాశ్మీరదేశ వర్తకుడు సంవత్సరముక్రిందట పదిలక్షలరూపాయలకు అక్బరుచక్రవర్తికి అమ్మినాడని తెలిసికొందురు అంత అక్బరే తమ యంతఃపురమును ప్రవే శించినాడనునది రాణాకు దృఢమైనది పైగా పూజకనునెపమున కోరినప్పుడెల్ల మీరా కృష్ణమందిరమునకు పోవుచుండెననియు యాత్రికులవేషము ధరించి అక్బరు అప్పుడప్పుడు ఆ మందిరమునకు వచ్చుచుండెగాబోలుననియు, ఆ కపట వతి యంతఃపురమున బంధింపబడుటయెరిగి వైద్యవేషధారులై వారు వచ్చియుందు

రనియు తలచెను అక్బరు, మీరాల నడుమ అక్రమసంబంధముగలదని గట్టిగా నమ్మెను

మీరాను శిక్షింపనిదే లోకము సంతృప్తిపడదనిదలచి మీరాకు మరణ దండన విధించెను శ్యామలరావు, సేనాధిపతి మున్నగువారు రాజాజ్ఞనిర్వర్తించు టకు నిరాకరించి పదవీవిరమణము చేయుదురు అంత కుంభరాణా తనకు విశ్వాస పాత్రుడగు కుమారసింహుని బిలచి విషయమునుజెప్పి మీరా స్వప్రాణహంతకి కావలసినదిగా రాజాజ్ఞను జారీచేసెను అంతియేగాక ఆమె ప్రాణపరిత్యాగము గావించుకొనువరకు అంగరక్షకునిగా నుండవలసినదిగా కూడ రాణా కుమార సింహుని కోరెను

యమునానదికి బోవుమార్గమున మీరాబాయియు, ఆమె ననుసరించి కొంత దూరమున కుమారసింహుడును నడచుచుందురు ఆ కటికచీకటిలో తాన్ సేన్, అక్బరులు ఆమెను మీరాబాయిగాగుర్తించి పాదాభివందనము గావించి మీ నిర్హే తుక మరణదండనమునకు కారకులమైన రాక్షసులమని మీరాతో విన్నవించు కొందురు అదివిన్న కుమారసింహుడు వారిలో ఒకరిని అక్బరుగాదలంచి పాదు షాకు తెల్పుటకై పరుగెత్తి వెడలిపోవును మీరా యమునానదిలో కలసిపోయినది

కుమారసింహునిద్వారా విషయమువిన్న కుంభరాణా ఉద్రిక్తుడై వానిని చంపవలసినదిగా కుమారసింహుని వెంటనే బంపెను ఆ దురాత్ముడు అక్బరు మీరాను ఢిల్లీకి తీసికొనిపోవుటకు వేచియున్నాడని తలచెను

ఆ గాఢాంధకారములో రాణాకూడ ఖడ్గహస్తుడై ప్రవేశించి అక్బరు కొరకు వెదకుచుండెను కుమారసింహుడు చీకటిలో పాదుషాను అక్బరుగా దలచి కత్తితోపొడిచెను రాణాయనిగ్రహించిన కుమారసింహుడు తానుకూడ కత్తితో పొడుచుకొని మరణించును

అక్బరు, తాన్ సేన్ లు ఎవరో వేదనాభరితాత్ముడు తమ్ము నిందించుచున్నా డని తలచి వచ్చి కుంభరాణానుజూచి అతనితో అక్బరుఅంతఃపురమును జొచ్చి నది నిజమనియు, తనజీవితమును పునీతముచేసికొనుటకై పరమభక్తురాలైన మీరాబాయిని సందర్శించుకొనెననియు పల్కును అంతియేగాక అక్బరు 'మీరా బాయి నా తల్లి యనియు, నేను ఆమె పుత్రుడననియు' పల్కును అంత కుంభ రాణా మనస్సులో మెదలుచున్న సందేహము తీరిపోయినది అక్బరును పరమాప్త

డుగా తలచెను మీరా యమునలోబడి మరణించినదని విని మీరాకొరకు పలవించి మరణించును కథ విషాదాంతమైనది

## మీరాబాయిని గురించి ప్రచారములోనున్న కథలు 14 :-

1 మర్తినిపాలించు రావు దుదూజీకి మనుమరాలుగా జన్మించి, మేవారు ప్రభువైన రాణాసంగ్రామసింహునిపుత్రుడగు భోజుని పెండ్లాడి, పదునేడవయేటనే వైధవ్యమునుపొందినదని ఒకకథ గలదు భర్తలేనిలోపమును శ్రీకృష్ణభక్తితో పూరింపదలచుకొని సజ్జనసాంగత్యముతో బ్రతుకుచున్నమీరా అంతఃపురమర్యాదల నతిక్రమించినదని మరిది విక్రమునికి కోపముగలిగినది తత్కారణముగా రసపుత్రవంశప్రతిష్ఠకు కళంకముగా భావించి రాణా మీరాకు విషమిచ్చి పంపగా ఆమె దానిని స్వీకరించి మృతిని జయించి, అచ్చట నుండనొల్లక ద్వారక చేరుకొనినదట మీరా నిష్క్రమించగా రాజ్యమున దుర్భిక్షము తాండవమాడినది విక్రముడు తప్పు తెలిసికొని మీరావద్దకువెళ్ళి తిరిగి రాజ్యమునకు రమ్మని కాళ్ళమీదబడి ప్రార్థించినాడు కాని ఆమె కృష్ణప్రతిమముందునిలబడి సెలవు వేడుకొనుచు, పాటలుపాడుచు ప్రాణము విడిచినదట

2 రావు రతనసింహునికి పుత్రికగా జన్మించి, బాల్యము నుండియు శ్రీకృష్ణుని వరునిగా నెంచుకొనినది కాని చితోరుప్రభువగు భోజరాజునకు పత్నియైనది కృష్ణప్రతిమముందు పరవశురాలై గానముచేయుటచూచి భర్త సహింపలేకపోయెడివాడు అతనికి అత్త ఆడుబిడ్డలు మీరాశీలముపై అనుమానమును గలిగించినారు కాని త్వరలోనే అతడు సత్యమును గ్రహించినాడు పూజామందిరములో పరపురుషులెవరును లేరని నిర్ణయించుకొని తన కిష్టములేకపోయినను మీరాకు వీలైనంతస్వేచ్ఛను కల్పించినాడు భార్య ఉన్మాదిని అని తెలిసికొని వేరుగా మందిరము కట్టించి సౌకర్యములు కల్పించినాడు అక్బరు తాన్‌సేన్‌లు మారువేషములలో మీరాదర్శనము గావించుకొనుట,అక్బరు కంఠహారమును విడచిపోవుట, మీరాప్రవాసము, మీరా బృందావనయాత్ర, మీరా తిరిగివచ్చుట మున్నగునవి ఇందుగలవు

కుంభరాణానాటకము ఈకథలఆధారముగనే రచింపబడియుండవచ్చును ఒకకథను నాటకఇతివృత్తముగా స్వీకరించినపుడు, దాని చారిత్రకాంశముతో రచయితకు విడరానిసంబంధములేదని దువ్వూరివారు ఒకనిర్ణయము చేసికొని

నారు నాటకములో చారిత్రకవ్యక్తులు పాత్రలైనంతమాత్రముచేత నాటకము చరిత్రకు ప్రతిబింబముగాను, రచయిత చరిత్రకారుడువంటివాడుగను నుండవలె ననెడి నియమము లేదనినారు అంతియేగాక నాటకమునకు చరిత్రకు ఉద్దేశ్యములలోను ప్రయోజనములలోను భిన్నత్వము కలదనినారు చరిత్రను ఉన్నది ఉన్నట్లుగాగాక ఏవిధముగా నుండిన బాగుగానుండునో ఆవిధముగా పునర్నించిన యెడల నాటకమగునని సూత్రీకరించికొనినారు అందుచేతనే కుంభరాణా నాటకమును తమఆదర్శముల కనుగుణముగా మలచినారు

## విషాదాంతనాటకలక్షణములు - కుంభరాణా -

'కుంభరాణా' విషాదాంతనాటముల కోవలోనికి చెందినది ' చాలా జాగ్రత్తతో బ్రాడ్లీ రాసిన షేక్స్పియరియన్ ట్రేజడీ' గ్రంథం చదివినట్లు రామిరెడ్డి తీసుకొన్న నోట్సునుబట్టి తెలుస్తుంది ఆమూలసూత్రాలను దృష్టిలో పెట్టుకొని కుంభరాణాశీలాన్ని విషాదానికి తోవతీసేవిధిబలాన్నీ ఆయన తీర్చిదిద్ది నాడనుకోవాలి' 15 అని రమణారెడ్డిగారు చెప్పియున్నారు దీనినిబట్టి 'కుంభరాణా'ను విషాదాంతనాటక నాయకునిగా జేయుటయే దువ్వూరి అభిప్రాయమని తలంపవచ్చును

" Shakespear's Tragedies are ultimately concerned with only one character the hero- whose fortunes are its real theme The other characters, though sufficiently interesting in themselves, serve only to provide the links in the story of his fate 16" ఇది షేక్స్పియరు విషాదాంతనాటకములలక్షణము అట్లే ఈనాటకమునందును కథానాయకుడైన కుంభరాణాయొక్క అదృష్టమే ప్రధానమైనది దానికి సహాయకారులుగా అనేకపాత్రలు గలవు అవియన్నియును అతని దురదృష్టమునకు ఆధారభూతమైనవియే

'Shakespeare's Tragic hero is a man of many noble qualities with one flaw that causes his ruin " 17 ఇదే విధముగా కుంభరాణా అసామాన్యవ్యక్తి అనేకసద్గుణములు కలవాడు కొన్నికారణములవలన రాణాకు మీరాబాయి దివ్యభక్తియందు లోపము కన్పించినది తత్ఫలితముగా ఆమెననుమానించినాడు అట్టి అనుమానమే పెనుభూతమై అక్బరువిషయమునకూడ

అతనిని భ్రమింపజేసినది ఇట్టి అనుమానములకు తావిచ్చు బలహీనతయే అతని పతనమునకు దారితీసినది

"The hero is not the only person whose life is forfeited" 18 అట్లే కుంభరాణానాటకములో కుంభరాణా యొక్కడేగాదు మరణించినది అతనివలన మీరాబాయి మరియు కుమారసింహుడుకూడ మరణింతురు

షేక్స్పియరునాటకములలో 'plot construction' మూడు విభాగముల క్రింద విభజింపబడియుండును 1 Exposition, 2 Conflict, 3 Crisis

"Exposition, as in Comedy, explains the situation with which the play opens including the parts assigned to the various characters The conflict develops the main theme - the clash of opposing aims and rival groups, and the steps towards some deadly outcome The crisis shows the hero in his last stages, struggling despearately to retrieve the situation but moving inevitably along the road to catastrophe" 19 ఇది షేక్స్పియరు విషాదాంతనాటకములలోని Exposition, Conflict, Crisis ల స్వరూప స్వభావములు

దువ్వూరివారుకూడ ఆయాపాత్రలు వారివారి స్వభావములను మొదట ప్రవేశపెట్టినారు తదుపరి మీరాబాయి రాణాలయొక్క అభిప్రాయములలో వైరుధ్యమును తీసికొనివచ్చి వారి ఘర్షణను చూపినారు అనగా షేక్స్పియరు పరిభాషలో 'the clash of opposing aims' పిమ్మట కుంభరాణా తన చివరి దశలో పరిస్థితిని చక్కదిద్దుటకై ప్రయత్నముచేయును కాని పయనించిన మార్గము విషాదమునకు దారితీసినది

ఈవిధముగా దువ్వూరివారు 'కుంభరాణా'ను విషాదాంతనాటకనాయకునిగా మలచుటకు షేక్స్పియరు మూలసూత్రముల ననుసరించిరని చెప్పవచ్చును

## నాటకగత విశేషాంశములు :-

**నాందీ ప్రయోగము** - ఇందు నాందియొక్కటియే ప్రయోగింపబడినది

"శ్రీరాధాసతి నేలినట్లు కరుణాచిత్తంబునన్ దుఃఖ దు
ర్వారాంగారపరీక్షదప్తయగు మీరాబాయి చేపట్టి లో
కారాధ్యుండుగనొప్పు మాధవుడు మమ్మజ్ఞానసంక్షుబ్ధసం
సారాంభోనిధి గర్భధారుడయి మోక్షద్వీపముం జేర్చుతన్" 20

ఇందు మీరాబాయి కృష్ణభక్తి పరవశురాలై తన శరీరమును శుష్కింపజేసికొను టయు కర్ణధారుడయి మోక్షద్వీపముంజేర్చుతన్' అను పదములలో యమునా నదిలోపడిన మీరాను శ్రీకృష్ణుడు మోక్షద్వీపమునకు చేర్చినాడనియు, అనగా మీరా తనువుచాలించుటయు అను కావ్యార్థములు సూచింపబడినవి

**కుంభరాణా - ఓథెల్లో** - కుంభరాణా' కును షేక్స్పియరు రచనలలోని 'ఒథెల్లో' కును పోలికలు గలవు భర్త అసూయాగ్రస్తుడగుట, అమాయికయగు భార్య భర్తవలననే నాశనముపొందుట ఆ అసూయకును ఈ నాశనమునకును బహుమానముగాలభించిన ఒకవస్తువు హేతువగుట అనునవి రెండింటియందును సమానము కాగా 'ఒథెల్లో'లో జేబురుమాలు, కుంభరాణా' లొ ముత్యాలహారము కారణములు

'ఒథెల్లో'లో 'కాసియోకు నేను చేతిగుడ్డను ఈయలేదు విచారింపుము' అని భార్యచెప్పినను ఒథెల్లో విచారించలేదు విచారించినచో అయాగో' కుట్ర బయట పడెడిది డెస్‌డెమోనా మరణించెడిదికాదు కాని కుంభరాణా'లో ముత్యాల హార మును గురించి కుంభుడు విచారించినకొలది అనుమానములు బలపడెను ప్రత్యక్ష సాక్ష్యము దొరికినదిగనుక రాణా దృఢముగనమ్మి నిష్పక్షపాతముగ శిక్ష విధింప దలచెను తత్కారణముగ మీరాబాయి మరణించినది

**కుంభరాణా - దుర్వారి** - పరలోకమున్నదన్న యాశతో ఇహలోకదుఃఖ మును సహించుటకొరకు, అవివేకులను భయపెట్టి ధర్మబద్ధులగునట్లుగా జేయు టకు పౌరాణికులు స్వర్గనరకములు కల్పించిరట రాణాకు మతాచార్యులన్నను గిట్టదు మతాచార్యులపలుకుబడి తగ్గినచో ప్రజలలో మూఢభక్తి నశించునట లౌకికజ్ఞానమును, జీవితమును ద్వేషించుప్రతిమతముగూడ మానవుని మనోవికాస మునకు అభ్యంతరకారి యగునట ఈ అభిప్రాయములన్నియును ఇంచుమించుగా రెడ్డిగారి అభిప్రాయములే అందుచేతనే నాటకకర్తే ఒక సైలెంటు కుంభుడట' హేతువాదంలో ఇద్దరికిద్దరే 21 అని రమణారెడ్డిగారు చెప్పియున్నారు

సంసారసంబంధమైన జీవితమునుగూర్చి రాణావెలుబుచ్చిన అభిప్రాయ ములుకూడా రెడ్డిగారివనియె చెప్పవచ్చును భర్తయెడల భార్యపాటింపవలసిన విధులను పాటించనపుడు భార్యయెడల భర్త చేయవలసిన విధులను ఉపేక్షించి నపుడు జీవితరధము చక్కగానడుపదు మనస్సంక్షోభముమాత్రము మిగులును

ఇందు మీరా దైవచింతనకులోనై భార్యాధర్మమునకు లోపమునాపాదించగా అది కుంభరాణా సహించలేకపోయినాడు కుంభరాణా అభిప్రాయములో-

" సతులు నిరంతరవ్రతోపవాస కృశాంగులేకారు కేవలము విధినియమ బద్ధసంబంధలే కారు పతులహృదయము లాకర్షించు సమ్మోహనమంత్రాధి దేవతలుగను, మృదుమధురస్వభావలుగ నుండవలయును పరస్పరహృదయైక్యము లేని వైవాహికబంధము నీరసము సంతాపకరము - హత్యాకరము " 22

కాగా ఈ నాటకములోని విషాదమునకు పతివిషయమున మీరాయొక్క కృష్ణభక్తి హేతుకమగు ఉపేక్షయు, తద్వారా కుంభరాణా అనుమానప్రేరితము లగు కార్యములును కారణభూతములుగ జెప్పవచ్చును

ఏదిఏమైనను రెడ్డిగారు తెలుగుపాఠకులకు ఒక ఉత్తమవిషాదినాటకమును ఉత్తమ విషాదనాటకనాయకుని ఒసంగి తెలుగునాటకసాహిత్యమున కెంతయో ఉపకారము గావించిరి

## (d) మాధవ విజయము

రచనాకాలాదులు -

12-2-1925న ఈ నాటకమును వ్రాయ ప్రారంభించిరి నాటకమందలి పాత్రల స్వరూపస్వభావాదులను నిర్ణయించుకొనిరి ముఖ్యకధకూడ మనమున స్ఫురించియున్నది వారే "మీరాబాయి వ్రాసిన యనంతరము ఇంత తొందరలో మరల నాటకమువ్రాయు నిచ్ఛగాని తలంపుగాని నాకులేదు సాధారణముగ నొక గ్రంధము వ్రాసినతరువాత మఱియొకగ్రంధము వ్రాయుటకు మధ్య ఆరునెల్లో లేక సంవత్సరమో సందు పోవుచుండెడిది కాని యీతూరి యెడము షుమారు మూడున్నరనెలలు మాత్రమే యుండును ఈ యనుభవము నాకు క్రొత్తగా నున్నది" 23 అని డైరీలలో వ్రాసికొనియున్నారు

మూడంకములు వ్రాసినతదుపరి నాటకము పూర్తిచేయలేనన్న సందేహము దువ్వూరివారికి గలిగినదట, మొత్తముమీద 20-2-1925 నాటికి నాటకమును పూర్తిచేసిరి 10-1-1926న మాధవవిజయమును మరల నొకసారి చదివి కొన్నిసవరణలు చేసిరట

ఈ నాటకవిషయములో శ్రీ పోణంగి శ్రీరామఅప్పారావు పౌరాణిక చారిత్రక సాంఘిక వాతావరణములను సమ్మిశ్రితముచేసి వ్రాసిననాటకము మాధవ

విజయము ఇందలి విజయవర్మ దుష్టబుద్ధివంటిపాత్ర హత్యలు, కుతంత్రములు మొదలగువానితోకూడిన యీ నాటకము అపరాధపరిశోధకనవలను జ్ఞప్తికి తెచ్చుచుండును కాని నిర్మాణశిల్పమున షేక్స్పియరురూపకములను తలపించుచుండును కుంభిరాణా విషాదరూపకనాయకుడుకాగా, ఇందలి మాధవవర్మ ఆహ్లాదరూపకనాయకుడు ' 24 అని తమ అభిప్రాయములను వెలిబుచ్చిరి ఈ అభిప్రాయములెంతయో సమంజసముగా నున్నవి

## కధాసంగ్రహము -

హోమనగరాధిపతి యయిన రఘుపతివర్మను చంపి తమ్ముడైన విజయవర్మ రాజ్యాధికారమును హస్తగతము చేసికొనినాడు ఆ దిగులుతో రఘుపతివర్మభార్య మరణించినది అన్నకొడుకు నరేంద్రుడు మూడేండ్లవయస్సువాడు అతడు రాజభక్తులయుక్తివలన తప్పించుకొని అదృష్టవశమున వసంతపురప్రభువైన శాంతవర్మవద్ద మాధవవర్మపేరుతో పెరిగినాడు శాంతవర్మకు రాజశేఖరవర్మ మనోరమ అను ఇరువురు సంతానముగలరు ఇది తెరవెనుక జరిగినకథ

స్త్రీలౌల్యముగల విజయవర్మ శాంతవర్మకుమార్తె మనోరమను పెండ్లాడి వసంతపురసామ్రాజ్యమును కాజేయవలెనని కుట్రపన్నినాడు విజయవర్మసేనాని సమరసేనుడు తనచేతిలోనున్న రఘుపతివర్మ హత్యారహస్యముల నుపయోగించుకొని ఉన్నతపదవులు పొందవలెనని తలంచును విజయవర్మ శాంతవర్మ ఆహ్వానముపై వసంతపురయాత్రచేసి మనోరమతో తన వివాహమును నిశ్చయము చేసికొనును కాని ఈ వివాహము మనోరమకు ఇష్టములేదు ఆమె ఇంతకుముందే మాధవవర్మను ప్రేమించి యున్నది విజయవర్మ మాధవవర్మను జూచి తన అన్నకొడుకని ఊహించినాడు తదుపరి అతని కుడితొడపై పుట్టుమచ్చ ఉన్నదన్న సంగతి తెలిసికొని తన అనుమానమును ధృవపరచుకొనినాడు రాజశేఖరుని, మాధవుని తమదారి కడ్డములేకుండ చేయదలచుకొనినాడు తన కుతంత్రముతో రాజశేఖరుని బంధించి పాతాళగృహమునకు చేర్చినాడు మాధవుడు రాజశేఖరుని హత్యచేసినాడన్న అనుమానము శాంతవర్మకు కలిగించి అతనిద్వారా మాధవునికి మరణదండన విధింపజేయును

విజయవర్మఅన్నకుమార్తె, మాధవునిచెల్లెలు అయిన మాలతి పాతాళగృహములోని రాజశేఖరునిచూచి తన పినతండ్రి దౌష్ట్యమునుదెల్పి అతనిని చెర

నుండి విడిపించును పిమ్మట వారియిద్దరును వసంతపురమునకువెళ్ళి వధ్యశిలపై నున్న మాధవుని రక్షించుదురు మాధవుడు కటికవానివద్దనున్న గండ్రగొడ్డలిని లాగుకొని ఆ ప్రాంతములోలేని విజయవర్మనుద్దేశించి 'ఓరిదురాత్ముడా' చచ్చితివి, చచ్చితివి' అని బయటకు పరుగుదీయును

తదుపరి వివాహమంటపములో పుష్పమాలాలంకృతులైన మనోరమా మాధవులు, మాలతీరాజశేఖరులు, రాజబంధువులు, పురోహితుడు మరియు ఇతర సభాసదులు కనుపించుదురు పురోహితుడు ఆ రెండుజంటలను పుత్రపౌత్రాభివృద్ధిగా ఆశీర్వదించును

వివాహమునకు ముందే విజయవర్మ మాధవవర్మచేతిలో హతుడై ఉండవలెను కాని నాటకకర్త విజయవర్మవధను ప్రస్తావించక నాటకమును సుఖాంతముగా జేసియున్నారు

## (e) కాంగ్రెస్ వాలా

### రచనాకాలాదులు -

దువ్వూరివారు దీనిని 4-1-1935న ఏకాంకరూపకముగ రచించిరి ఇందు రాజకీయవిషయములు ప్రస్తావింపబడినవి

నాటకమనునది మానవజీవితమునుండి ఉత్పన్నము గావలయుననియు, అది సమకాలీనసాంఘికజీవనమునకు సంబంధించి యుండవలెననియు, నాటకమున గనిపించుపాత్రల చర్యలు శీలము తలంపులు, సన్నివేశములు ప్రేక్షకులు తామిదివరలో అనుభవించినవో, ఇతరు లనుభవించగా చూచినవో అయి యుండవలెననియు సుఖదుఃఖములు మానవసహజములైనప్పుడే చూచువారికి సహానుభూతి కలుగుననియు భావించిరి

"రక్తపాతమువల్ల గలిగే దుఃఖమునకంటె గార్హస్థ్యజీవితమునం దొకప్పుడు తల్లిబిడ్డలకుగాని అన్నాదమ్ములకుగాని భార్యాభర్తలకుగాని కలుగు మనఃస్పర్ధలు, ఇబ్బందులు, భావసామరస్యము, ఐక్యములేకపోవుటవలనగలుగు అసహనము, అందువలనగలుగు సంసారభంగము మున్నగునవి ఎక్కుడు దుఃఖమును గలిగించును

నా నాటకరచన ఈ దినమునుండి యేదోయొక క్రొత్తదారి ద్రొక్కినటుల కనబడుచున్నది నేనికమీద నాటకములు రచియింతునేని, అవి యింతకుముందు నేను రచించిన నాటకములకన్న భిన్నములుగ నుండగలవు

నాటకపాత్రల సంభాషణము (అందు ముఖ్యముగ సాంఘికనాటకము లలో) సాధ్యమైనంతవరకు ఉచితమైన వాడుకభాషలో వ్రాసినయెడల బాగుగా నుండునని నాకు తోచుచున్నది " 25 అని 12-2-1926 డైరీలో తామే చెప్పుకొనియున్నారు

కేవలము సాంఘికనాటకమును ఏదియును వారు రచింపకపోయినను సాంఘిక, రాజకీయాత్మకమైన ఏకాంకిక కాంగ్రెస్‌వాలా' ను 1935 లో రచించిరి

## కథాసంగ్రహము -

లాల్‌గుడి వేంకటేశయ్యరు కాఫీహోటలులో రంగారావు అనుపేరుగల శాంతినికేతనవిద్యార్థి, కళ్యాణరెడ్డి అనుపేరుగల పుదుచ్చేరి అరవిందుని ఆశ్రమవాసి, వెంకటరెడ్డి అనుపేరుగల కాంగ్రెస్‌వాలాలు కలసికొందురు

గాంధీఉద్యమము ప్రబలమైనప్పటినుండియు మనదేశములో చాలా అల్లకల్లోలము బయలుదేరినదనియు, కవిత్వముపైన, ఆర్టుపైన ఉత్సాహము తగ్గినదనియు శాంతిలోనుండు సౌందర్యము పోయినదనియు ఇదంతయు గాంధీగారికి ఈస్తటిక్సు, ఆర్టుతెలియని లోపమనియు కోమలులైన స్త్రీలకు మొరటుఖద్దరు కట్టబెట్టి, వారిచేతికి జెండాలిచ్చి ఎర్రనిఎండలో వీధివీధి త్రిప్పి, లారీచార్జీలకు గురిచేయించినదానికంటె ఘోరము, పాపము అక్రమము, అన్యాయము ఫిక్షన్ (Fiction) లో కూడ నుండవనియు, గాంధీ ఆర్టును మర్డరుచేసినాడనియు, గాంధీజీ పవిత్రమైన ఆధ్యాత్మికవాతావరణములో రాక్షసమైన పాలిటిక్సును తెచ్చిపెట్టి దేశశాంతికి భంగముకలిగించినాడనియు అతనిని సెయింట్' అనుట అక్రమమనియు, అందరికనులకు కనబడి అందరితో మాట్లాడువాడు సెయింట్ కానేకాడనియు, గాంధీ ద్వేషముతో విదేశవస్త్రములను తగులబెట్టించినాడనియు, గాంధీవలననే భారతదేశమునకు స్వాతంత్ర్యము రాకుండపోయినదనియు, గాంధీ రౌండుటేబులుకాన్ఫరెన్సుకు తన సహజ ఆకారముతో పోయినందువలన " India is uncivilised, India is unfit for Dominion status" 26 అని ఆయనను చూచినవారందరు అరచినారనియు, ఇదేసమయముగానెంచి గాంధీఫోటోను న్యూసుపేపర్లలో గుప్పించి "ఇటువంటి అనాగరికులున్న దేశాన్నిరక్షించి ఉద్ధరించడానికి దేవుడు మనలను ధర్మకర్తలనుగా నియమించాడ"ని 27 కన్సర్‌వేటివ్

పక్షమువారు క్రిస్టియన్‌ఫిలాసఫి (Christian Philosophy) ని బోధించినా రనియు, గాంధీవలన మాతృభూమికి ఇంతఘోరమైన అన్యాయముజరుగగా దాని నంతయు దాచిపెట్టి నాయకులు అమాయికప్రజలను మోసముచేయుచున్నారనియు కల్యాణరెడ్డి, రంగారెడ్డిగారలు గాంధీజీయందలి లోపముల నెత్తిచూపుదురు

అరవిందుడు విషయగర్భితముగా కవిత్వము వ్రాయగలడనియు, చిత్తరంజనుని సాగరసంగీతమును ఇంగ్లీషులోనికి అనువదించిరనియు పూర్వము పరమ ఋషులున్న హిందూదేశమువంటి పవిత్రభూమిలో అరవిందమహర్షివంటి వారు అక్కడక్కడ గలరనియు గాంధీజీ ఆధ్యాత్మికవాతావరణములో పాలిటిక్సును ప్రవేశపెట్టినందుచేత అరవిందులు పుదుచ్చేరివదలి వచ్చుటలేదనియు ప్రపంచమునంతయును ఆధ్యాత్మికముగా పునరుద్ధరించుటకు ప్రయత్నించుచున్నాలనియు, సెయింట్ అనుపదము అరవిందునకే చెల్లుననియు, ఆయన మదర్‌కుదప్ప మరెవరికి కనబడరనియు ఆయన స్పెన్సరుకంపెనీచుట్టలను త్రాగుటకు పరదేశీవస్తువును ప్రయోజనకరముగా తగులబెట్టుటయే కారణమనియు, అరవిందులు తమ తపస్సు పరిపక్వముకాగానే బుద్ధునివలెనే బయలువెడలుదురనియు ఇప్పుడు ఆయనను హేళన చేసినవారందరును అప్పుడు పటాపంచలై పోవుదురనియు కల్యాణరెడ్డి తమ గురువర్యుల ఆధిక్యమును జెప్పుకొనును

అరవిందుడు మహర్షికాకపూర్వము రాజకీయముగా గొప్పప్రబోధము కలిగించినాడనియు, తరువాతకేసులో తప్పించుకొని తన్నునమ్మిన స్నేహితులను వదలిపోయి పుదుచ్చేరిలో మకాము పెట్టినాడనియు, ప్రజలందరు ఆయన తిరిగి వచ్చునని ఎదురుచూచినారనియు, కాని ఫలితము శూన్యమనియు, రాజకీయముగా ఏమియుచేయలేనని తలంచిన అరవిందుడు ఆ ఉద్దేశ్యమునకు ఒకముసుగువేసి ఆధ్యాత్మికముగా తాను ఆ ముసుగులో కూర్చొనినాడనియు పల్కి "ముసుగు అక్కడక్కడా చినిగిపోతున్నది కొంతకాలానికి యధార్థం బట్టబయలౌతుంది తుదకు మహర్షే బయటపడతాడో, లేకపోతే కపటవేషమే బయటపడుతుందో దేవుడికే యెఱుక" 28 అని అరవిందునిగూర్చి వేంకటరెడ్డి విమర్శించినాడు

రవీంద్రుడుకూడ అరవిందునివలెనే ఇన్‌టర్‌నేషనల్ ఔట్‌లుక్ గలవాడనియు, రాగూరు ఇంగ్లండునకు పోయినపుడు ఆయనను జూచినవారందరును ఓరియంటల్ క్రైస్ట్ (Oriental Christ)అని ఆరాధించినారట ఆయన 'Flowing silver beard', పట్టుఅంగి సర్వజనవశీకరణము చేసినవనియు అనేకులు

ఇంగ్లీషుకన్యలు రవీంద్రుడు ముసలివాడుకాకున్నయెడల పెండ్లిచేసుకొని యుం దుముగదా' అని చింతించినారనియు ఇటువంటి మహానుభావులు పుట్టినదేశము నకు స్వరాజ్యము నీయవలసినదిగా లేబరుపక్షమువారు పట్టుబట్టగా అప్పుడు మ్యాగ్నో ఆర్నాల్డుకు మెజారిటిలేక ఆ తీర్మానము ఓడిపోయినదనియు రంగారెడ్డి తమ గురువర్యులగూర్చి పొగడికొనినారు

ఈవిధముగా వారు సంభాషించుకొనునంతలో ఒకకాంగ్రెసువాలంటీరు పరుగుపరుగునవచ్చి వెంకటరెడ్డిగారితో రంగనాయకుల తిరునాళ్ళకు గ్రామాంత రమునుండి ఒకతల్లి చంటిపిల్లతో వచ్చినదనియు, తల్లికి కలరా తగిలినదనియు, పిల్ల పాలకేడ్చుచున్నదనియు జెప్పును అంత వెంకటరెడ్డి వారిసేవజేయుటకు బయలుదేరివెడలును "కాంగ్రెస్‌వాళ్ళను మెర్‌సిలెస్‌గా ఎక్స్‌పోజ్ చెయ్యాల"29 అను ఉద్దేశ్యముతో మిగిలినవారిరువురును కలరాతగిలిన స్త్రీవద్దకు పోవుదురు

గ్రామీణస్త్రీకి అనేకవిధములుగా పరిచర్యలుచేసి తనను తాను సమర్థించు కొనుటయేగాక జాతీయవాదుల చిత్తశుద్ధి, త్యాగదీక్ష, సేవానిరతులను వేంకట రెడ్డి నిరూపించినారు

పరిహసించుటకై వచ్చిన కల్యాణరెడ్డి రంగారెడ్డులు చివరకు మెచ్చుకొని 'Hail Congress! Hail!' అను మాటలతో కాంగ్రెసును పొగడుదురు

కాంగ్రెసువాదుల ఔన్నత్యమును జూపుటతో ఈ నాటిక ముగియును

**విశేషాంశములు** -

అరవిందఘోష్ రవీంద్రనాధఠాగూర్, మహాత్మాగాంధీలు విభిన్న మార్గానుయాయులు దేశపునరుద్ధరణకు ఎవరిమార్గము ఎంతవర కుపయుక్తమైన దన్నవిషయము ప్రదర్శించుటకు దువ్వూరివారు ప్రయత్నించిరి

ఇందు గాంధీజీశిష్యుడైన వేంకటరెడ్డి, కార్యశూరుడేగాని వాక్శూరుడుగాదు సేవాపరాయణుడేగాని కృత్రిమవేషధారిమాత్రముకాదు చెప్పినదానిని చేయుట, చేసినదానినే చెప్పుట అనునవి ఈతనిలోని సుగుణములు

'రవీంద్రునిశిష్యుడైన రంగారావు అరవిందుని ఆశ్రమవాసియైన కల్యాణ రెడ్డి తమ ఆచార్యులకు ప్రతియూపాలుగాని పాత్రలు వ్యంగ్యచిత్రాలవంటివి"30 అని రమణారెడ్డిగారు ఆ రెండుపాత్రలనుగూర్చి వ్యాఖ్యానించినారు ఈ నాటి కలో దువ్వూరివారు రంగారావుద్వారా రవీంద్రునితత్త్వము, కల్యాణరెడ్డిద్వారా

అరవిందునితత్త్వము ప్రస్ఫుటముగావించి, చివరకు గాంధీతత్త్వముయొక్క ఆధిక్యతను నిరూపించినారు

రెడ్డిగారు వెంకటరెడ్డిపాత్రద్వారా "ప్రస్తుతావస్థలో కవిత్వం, ఆర్టు, డ్రామా సర్వం దాస్యవిమోచనంకొఱకే వుపయోగపడవలెనని నా అభిప్రాయము ' 31 అనిపించినారు దేశదాస్యవిమోచనమునకు కళ ఉపయోగపడవలెనన్న అది ప్రబోధమునకు పూనుకొనవలెనని దువ్వూరివారి అభిప్రాయము

ఈ ఏకాంకికపై 'శాంతినికేతన, రమణాశ్రమవాసుల ఆంగ్లేయభావ వ్యామోహమును, 'కళ కళకోసమే' అనెడివారి సిద్ధాంతవివరణమును, వెంకటరెడ్డి దేశభక్తి-మానవత్వములను రామిరెడ్డిగారు చక్కగా నిరూపించియున్నారు' 32 అని పోణంగి శ్రీరామఅప్పారావుగారు వెలిబుచ్చిన అభిప్రాయము ఎంతయో సమంజసముగ నున్నది

## (11) సారస్వత వ్యాసములు

### (a) కవితాతత్త్వసంబంధులు

**కవి** - కవి సృష్టికర్త ఆతనికి పరిచయమైన నాయికలెల్లరు సౌందర్యవతులై హృదయసమ్మోహనమంత్రాధిదేవతలైన సీతలు, సావిత్రులు, దమయంతులు, చంద్రమతులు, ద్రౌపదులు శకుంతలలు వీరిచే గౌరవింపబడిననాయకులెల్లరును లోకోత్తరకార్యధురంధరులైన హిరణ్యాక్షులు, వామనమూర్తులు, పరశురాములు, శ్రీకృష్ణమూర్తులు, దేవదానవులు, భగీరథులు, విశ్వామిత్రులు

ఇక కవిసృష్టిలోని పురములలోని మేడలు ఆకాశమునంటి సూర్యచంద్రుల రాకపోకల నడ్డగించగలట్టివి తోటలలోని వృక్షములన్నియు ఫలవంతములు లతలన్నియు కుసుమములచే నిండినట్టివి షడృతుధర్మములు ఒకేకాలమున ఈ ఉద్యానవనమున గాన్పించుచుండును ప్రకృతియంతయు వారిదృష్టికి సచేతనమైనది మేఘములు హంసలు ప్రేయసీప్రియుల ప్రణయసందేశముల మోసుకొనిపోవుచుండును

కవిసృష్టి కాలబద్ధముకాదు ఈతనిసృష్టి భూమిని స్వర్గముగ జేయుటయే గాక, మానవజీవితమును ఆనందమయముకూడ చేయగలట్టిది

సీమాబద్ధము, అశాశ్వతము అసుందరము నయిన వాస్తవజగత్తుకంటె సీమారహితము శాశ్వతము, సంపూర్ణసౌందర్యశోభితమునయిన కవితాజగత్తు

వైభవమును విప్పిజెప్పి తద్వారా కవియొక్క మహత్త్వమునకు నివాళులర్పించినాడు

**కవిత్వావతరణము** - వాల్మీకి ఆదికవి యనియు, రామాయణ మాది కావ్యమనియు చెప్పబడుచున్నది క్రౌంచమిధునగాధ వాల్మీకి కవియైన విధమును మాత్రము తెలుపుచున్నది రసార్ద్రమైన వాల్మీకిహృదయము క్రౌంచద్వంద్వ వియోగోత్థితమైన శోకముతో నిండి శ్లోకరూపమున బహిర్గతమైనది అతనిలో సహజముగా నంతర్గతమైయున్న కవితాశక్తి బహిర్గతమగుటకు క్రౌంచపక్షి వియోగవేదన చక్కగా సహకరించినది

వేదములు రామాయణమునకన్నను పూర్వములు మరి వాల్మీకి ఆదికవి యగుటెట్లు? అను ప్రశ్న జనించును వేదములు అపౌరుషేయములని తలంచబడుటచేత ఆ ఛందములు మానవులనుకరింప సాధ్యముకాదని తలంచియుండవచ్చును వాల్మీకి తననాటికి ప్రచారములోనున్న రామకధను లౌకికఛందములలో కావ్యముగ రచించెను వాల్మీకి రామాయణమునకు ముందు కొన్ని చిన్న చిన్న కావ్యములు, గేయములు ఉన్నను అవి ఈబృహత్ప్రబంధము ధాటికి నిలువలేక పోయి ఉండవచ్చును అందుచేత వాల్మీకియే ఆదికవిగా శ్లాఘింపబడుచున్నాడు

ప్రథమదశయందు మానవులు తమ భావవినిమయమును సంజ్ఞలద్వారా చేసికొనెడివారు పిమ్మట కొంతకాలమునకు తమ హృదయమందలి భావమును ప్రకటించుటకు ప్రయత్నముగావించుటవలన భాషయు అభివృద్ధిచెందినది క్రమ పరిణామములో ఆదిమానవులు సంతోషాశ్చర్యములను వెలిబుచ్చుట నేర్చుకొనిరి పాటలు పాడుచుండిరి మానవనాగరికత అభివృద్ధిచెందుకొలది వారి యాట పాటలు క్రమబద్ధము గావింపబడినవి

సమస్త జాతులవారి ఆద్యకవిత్వమును పరిశీలించినయెడల సామాన్యముగ నవి గేయరూపముగ నుండును వేదములు ఒకవిధమైన గేయములే రామాయణముకూడ గేయకావ్యమే ఇప్పటికిని కొడగు' మున్నగు అనాగరికభాషల యందు కవిత్వము గేయరూపమున ప్రచారములో నున్నది

ప్రకృతిజిజ్ఞాస, శాస్త్రజ్ఞానము విమర్శనాశక్తి హెచ్చుకొలది కవులచే నూతనకావ్యములు రచింపబడును ఇట్లు రచింపబడినవాని గుణమునందును, కల్పనయందును వ్యత్యాసము గనుపించును కవు లేకాలమునందు జనియించినను

వారి కవిత్వములో సమకాలీనభావములును, నాగరికతలును ప్రతిఫలించుచుండు టయే పైవ్యత్యాసమునకు కారణము

నాగరికదేశములలో అగ్రగణ్యమగు అమెరికాయందలి కవిత్వములో మోటారుకారులశబ్దము ట్రాంబండ్లగడగడలు ప్రతిధ్వనించుచుండునట ఆకవిత లందు కోకిలాలాపములకు బదులు కర్ణకఠోరములైన రైలుబండికూతలు వినవచ్చు చున్నవట ఇట్టిస్థితి మనకవిత్వమునకు పట్టకుండుగాక.

ఇందు కవితావిర్భూతికి రసార్ద్రమైనహృదయము, నిండు అనుభూతి ప్రధానకారణములని చెప్పుచు, తద్వారా కవిత్వావతరణకు అవసరమైనపూర్వ రంగమును, అట్టిపూర్వరంగముతో అవతరించుటచే కవిత్వమునకు గలుగువిశిష్టత లను ఈవ్యాసమున చక్కగా సూచించియున్నారు

**కవిత్వతత్త్వము** - ఛందోబద్ధమైన పదసముదాయమే కవిత్వమనుట సమం జసముగాదు యథార్థకవిత్వమును ఛందము తప్పనిసరిగా అనుసరించును కాని ఛందమును కవిత్వము అనుసరింప వచ్చును లేదా అనుసరింపక పోవచ్చును సంస్కృతలాక్షణికులు గద్యములనుకూడ కావ్యములుగ పేర్కొనిరి అదియును గాక గద్యము రచించి మెప్పించుటయే కష్టమని వామను డుదాహరించిన 'గద్యం కవీనాం నికషం వదన్తి' అను లోకోక్తి వలన తెలియుచున్నది గద్యము రస వంతముగను, భావస్ఫోరకముగను ఉన్నను దానిని గద్యకావ్యమందుమేగాని కవిత్వమనము ఛందస్సు ననుసరించుటవలన కవిత్వమునగల శ్రుతిరంజకత్వము గద్యమున నుండదు

సద్యఃపరనిర్వృతి గలిగించుటయే శిల్పముయొక్క ప్రధానప్రయోజనము గనుక ఒకేసమయమున ఒకటికన్న నెక్కుడింద్రియములకుసుఖముగల్గించునదియే ఉత్తమశిల్పమని చెప్పవచ్చును, అట్లయినచో ఛందోబద్ధమైన కావ్యము వచనము కంటె అధికసుఖమును ఈయజాలియుండును అని చెప్పవచ్చును

సంస్కృతలాక్షణికులలో మమ్మటుడు 'తదదోషౌశబ్దార్థౌ సగుణౌ అనలం కృతీ పునఃక్వాపి' అని కావ్యనిర్వచనము చేసెను నిర్దోషత్వముచేత కావ్యత్వము సిద్ధించినయెడల ప్రాణరహితములైన కావ్యములు సమ్మాననార్హములై పేరుపొందిన ఉత్తమకావ్యములందు ఏదోఒక దోషమున్నందువలన ఆదరణపాత్రములు కాక పోవలసివచ్చును దీనిని ప్రమాణముగ గ్రహించినచో కావ్యప్రపంచము మిక్కిలి

సంకుచితమైపోవును భాషావిషయకమైన దోషములకన్న శిల్పకల్పనాదోషములే రసరామణీయకములకు భంగము కలుగజేయును

విశ్వనాధుడు పైనిర్వచనమును ఖండించి తాను 'వాక్యం రసాత్మకం కావ్యం' అని కావ్యమును నిర్వచించెను 'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః' అను భరతుని లక్షణము ప్రకారము రసము కేవలము మానవ చర్యలకు సంబంధించినట్టిదని తెలుచున్నది తిర్యగ్జంతువులయందు రసాభాసము మాత్రము గలదని విశ్వనాధు డంగీకరించెను కాగా మనము ఈ లక్షణమునే అంగీకరించినయెడల పాశ్చాత్యుల ప్రకృతి సూర్యాస్తమయములు ఉద్యానవనములు, చంద్రుడు మున్నగువాని వర్ణనలకు కావ్యత్వము సిద్ధించుటకు వీలులెదు

తదుపరి అర్వాచీనుడైన పండితరాయలు 'రమణీయార్థప్రతిపాదకశ్శబ్దః కావ్యం' అని రామణీయకమునకు ప్రాధాన్యమిచ్చి కవితానర్తకి రంగస్థలము విశాలము గావించెను కావ్యమున మనము చూడవలసినది చిత్తాకర్షకమగు రామణీయకము అట్టి రామణీయకము ఏ కావ్యమునందు పరిపూర్ణముగనుండునో అది ఉత్తమకావ్య మగును

పాశ్చాత్యలాక్షణికులు అనేకులు కావ్యమును నిర్వచించిరి కాని అమెరికా దేశపు ప్రఖ్యాతకవి 'అలెన్‌పో'గారు రామణీయకమును లయరూపమున సృజించుటయే కవిత్వము" 33 అని చెప్పిననిర్వచనము సమగ్రమైనదని చెప్పవచ్చును ఇతనిని అమెరికాదేశపు పండితరాయలని చెప్పవచ్చును ఈ లక్షణము ప్రాచ్య పాశ్చాత్యులకు ఆమోదకరమైనదిగా నుండవచ్చును

ఇందు కవిత్వముయొక్క స్వరూపమును రెండుసశక్తములైన దృక్కోణములనుండి (ప్రాచ్య, పాశ్చాత్య) చూచి చూపించియున్నారు

**కావ్యజీవితము** - నిర్జీవములగు కావ్యములు సహృదయానురంజనము చేయలేక చిట్టచివరకు నశించిపోవును ఉత్తమశిల్పలక్షణములకు లక్ష్యమై కావ్యముయొక్క ప్రధానప్రయోజనమగు సద్యఃపరనిర్వృతిని గలిగించు ప్రతికావ్యమును సజీవమని మనము చెప్పవచ్చును కావ్యములను ప్రాణవంతములుగా జేయుశక్తిని గూర్చి సంస్కృతలాక్షణికులు భిన్నాభిప్రాయముల వ్యక్తీకరించిరి వామనుడు రీతియు, కుంతకాచార్యుడు వక్రోక్తియు, క్షేమేంద్రుడు ఔచిత్యమును, ఆనందవర్ధన విద్యానాధులు ధ్వనియు, మమ్మట విశ్వనాధులు రసమును కావ్యజీవితములుగా నిర్ణయించిరి

రీతి రసపోషణమునకు అనుకూలమైన వర్ణసంఘటనము కావున కావ్యాంగములకు చెందినదగును కావున తానే కావ్యజీవితమగుటకు వీలులేదు వక్రోక్తి ఒక అలంకారము అలంకారములు అస్ఫుటముగానున్న కావ్యములకుకూడ కావ్యత్వము సిద్ధించుటచేతను, అలంకారములు కొన్నియెడల అవసరములు మరికొన్నియెడల ఔపచారికములును అగుటచేతను వానికి జీవత్వములేదు ఔచిత్యమనునది రసపోషకము సౌందర్యమున కొకఅంగముమాత్రమే యగుటవలన కావ్యజీవితము కాజాలదు ధ్వన్యాత్మకముగాని వాక్యముసహితము కావ్యమని నిరూపింపబడుటచేతను, వ్యంగ్యవైభవము ఉత్తమకావ్యలక్షణమనియు అనేకులు అంగీకరించుటచేతను ధ్వని కావ్యసౌందర్యాపాదకములగు ఉత్తమ గుణములలో నొకటిగ జెప్పవచ్చును రసము కేవలము మానవచర్యలకు సంబంధించినదేయైనచో అవ్యాప్తిదోషముగలిగి కావ్యాత్మ అగుటకు వీలులేదు

కావున కావ్యాత్మయనునది ఇతమిత్థముగా నిర్ణయించుటకు అలవిగానిది కావ్యమునకు కవిప్రతిభయే జీవితమని చెప్పవచ్చును కావ్యాత్మ ఇట్టిదని చెప్పలేకపోయినను ఆనందజనకశక్తివలన మనమూహింప సాధ్యమగును

ప్రతిభావంతులగు కవులరచనలను మనము పరిశీలించినచో అవి చిరంజీవములగుటకుగల కారణములు కొన్ని మనకు గాన్పింపక మానవు అవి 1 అంగాంగసంయోగత 2 అనురూపత, 3 వస్తువునందలి సార్వజనీనస్వభావము, 4 కవివ్యక్తిత్వము అనునవి

అంగాంగసంయోగత యనునది శిల్పశాస్త్రములో ప్రధానమైన సూత్రము దీనికి లోబడనికావ్యములు నిర్జీవములగుననుటలో ఎట్టిసందియము లేదు ఉత్తమ కావ్యనిర్మాణమునం దీనియమములు అత్యంతజాగరూకతతో పాటింపబడును

ఉత్తమకవులెల్లరును తమతమ ప్రకృతులకు అనుకూలించు రచనలను తమ శక్తిసామర్థ్యముల వినియోగించి రచియించినచో వారిపేరు చిరస్థాయిగా నిలచుట కవకాశము గలదు అందువలన అనురూపత' అనునది రెండవ ప్రధాన విషయము

కావ్యము చిరంజీవముగా నుండవలెనన్న అందలివస్తువు సార్వజనీనస్వభావమును గలిగి తదనుగుణమైన మనోవికారములను వెల్లడించుటకు సమర్థవంతమైనదిగా నుండవలయును

కవి తనకు ప్రీతిపాత్రమైనవస్తువును భావమును, మనోవస్థను గ్రహించి దానిని సార్వజనీనముచేయ ప్రయత్నించుటకన్న, సార్వజనీనవస్తుభావమనోవస్థలను తన వ్యక్తిత్వముచే ప్రకాశింపజేయుట మేలైనపద్ధతి

మహాకవుల కావ్యములందు ఈ నాలుగు అంశములుమాత్రము తప్పని సరిగా పాటింబపడును

**కవిత్వశిల్పము - అనుకరణము** - లలితకళలలోనిది గావున కవిత్వ శిల్పమును గూర్చి విచారింపవలయును శిల్పము నిదర్శకమనియు, ఆదర్శకమనియు రెండువిధములు నిదర్శకమనగా ప్రకృతిని యథాతధముగా ననుసరించునది ఆదర్శకమనగా ప్రకృతిననుసరించి దానినిమించి పోవునది మొదటిది ప్రకృతికి నకలుగావున నూత్నసృష్టి యుండదు రెండవది స్వతంత్రకల్పనము గావునను నూత్నసృష్టికి అవకాశముగలదగుటచేతను ఉత్తమమైనదిగా జెప్పవచ్చును

శిల్ప మనుకరణమా? సృష్టియా? అను అభిప్రాయభేదములు గలవు శిల్పము అనుకరణమని వక్కాణించినవారిలో అరిస్టాటిల్ ప్రధముడు పాశ్చాత్యులెల్లరును ఇంచుమించుగా ప్రకృతియొక్క అనుకరణమే శిల్పమని తలంచుచుండిరి అరిస్టాటిల్ ఉపయోగించిన 'అనుకరణము' అను పదమునకు నిర్మాణము, ప్రతిసృష్టియను అర్థములున్నట్లు అరిస్టాటిల్‌గ్రంధమును శ్రద్ధతో తర్జుమా చేసిన బుచ్చర్‌గారు చెప్పియున్నారు

మమ్మటుడు నియతికృత నియమరహితమనియు, అనన్య పరతంత్రమనియు, నిర్మితియనియు జెప్పుటవలన సంస్కృతలాక్షణికులకుగూడ శిల్పము స్వతంత్రసృష్టియను నిర్వచనము సమ్మతమైనట్లుగా భావింపవచ్చును అపూర్వవస్తునిర్మాణమునందు కావ్యశిల్పము వాస్తవసృష్టిని అధిగమించుచున్నది జంగమవల్లులు మున్నగువారు కవికల్పనములుమాత్రమేకాని వాస్తవజగత్తులో లేరు

**రసరామణీయకములు** - 'విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రసనిష్పత్తిః' అను భరతమునిసూత్రమునకు భిన్నభిన్నములగు వ్యాఖ్యానములు బయలుదేరినవి అందు ముఖ్యములగు కొన్నివాదముల సారాంశము లివి

1 విభావము, అనుభావము, వ్యభిచారి అని భావములు మూడువిధములు
2 విభావానుభావ వ్యభిచారిసంయోగమువలన నొకభావము పరిపూర్ణత్వము నొంది 'స్థాయి' అని వ్యవహరింపబడుచున్నది

3 ఆస్థాయీభావము చర్వితచర్వణమువలన రసత్వమును పొందుచున్నది
4 భావత్రియసంయోగమువలన రూపాంతరపరిణామము గలుగుచున్నది
5 భావ్యమాన భావత్రియములో నేదైననొకటి రసమగును

ప్రతివస్తువును చిత్తమునం దొకభావమును పుట్టింపజాలియుండును కావున భావము లనంతములు అట్లే రసములును అనంతములే అయినను ఇందు ప్రధానరసములు తొమ్మిది గలవు వీని సాంకర్యసాజాత్య భేదసంబంధము వలన రసము లనేకము లగుచున్నవి ఒక్కొక్క భావము తనకు అనురూపమైన రసమును పుట్టింపజాలియున్నను ప్రధానరసములు పుట్టుటకుమాత్రము విభావానుభావ వ్యభిచారిభావముల సంయోగము అవసరము ఈ మూడుభావములు చేరుటవలన ఒకస్థాయీభావమయి తీవ్రతను దాల్చును కావున స్ఫుటమైన రసము పుట్టింపవలయునన్న ప్రధానభావమునకు పరిపోషకములుగా అనుభావాదులు కూడ వలయును

స్థాయీభావమో లేక మరియేదైనభావమొ చర్వితమగునపుడు రసత్వమును పొందుచున్నది మన మనమునందు వాసనారూపముగ అంతర్గతమైయున్న సుఖక్లేశాదిభావములు కావ్యగతహేతుప్రేరితములై స్వస్వరూపములుదాల్చి అనుభవింపబడుచున్నవి

రసము మానవచర్యలకే సంబంధించి యుండుననియు, తిర్యగ్జంతువుల చేష్టలయందు రసస్పర్శగలదనియు, అచేతనవస్తువర్ణనములు రసాభాసము లనియు ఆలంకారికులు చెప్పియున్నారు కాని అచేతనవస్తువులుకూడ రమణీయభావములను ప్రేరేపింపగల శక్తిగలట్టివి కావున రస నీరసత్వము లనునవి కావ్యగతవస్తువుల చేతనాచేతనత్వమునకు సంబంధించియుండక కేవలము కవియొక్క అలౌకిక కల్పనాచమత్కృతిపై ఆధారపడియుండునని చెప్పవచ్చును రసమునకు చమత్కారమే ప్రాణమని విశ్వనాధుడు తెలిపియేయున్నాడు

పండితరాయలు రసమునందు రామణీయకమున్నదని చెప్పియున్నారు అట్లే రమణీయభావమునందు రసమున్నదనికూడ చెప్పవచ్చును

లోకమున శోకబీభత్సాదిభావములు కష్టములను గలిగించగా కావ్యమున అవియే ఆనందమును గలిగించుచున్నవి శోకబీభత్సాదిభావములు శిల్పనిపుణుడైన కవిహృదయమునుండి వెడలి సహజకర్కశత్వమును బోనాడి లోకోత్తర రమణీయములై సహృదయునకు సుఖానుభోగ్యము లగుచున్నవి

రామణీయకముయొక్క స్వభావమిట్టిదని చెప్పుట సాధ్యముకానిపని జగన్మిథ్యావాదులు సౌందర్యము మనోగతమనియు, జగత్సత్యవాదులు సౌందర్యము వస్తుగతమనియు తలంచియున్నారు భావస్ఫోరకశక్తి బుద్ధియందు కలదుగావున బుద్ధియు, వస్తువును రెండును ముఖ్యములే

రామణీయకమనునది యేకవస్తువుగాదు అది సమిష్టిభావము కావున ప్రతి మానవుని బుద్ధినిర్ణయమే సౌందర్యమునకు ప్రమాణముగా దలచుట ఉత్తమము సామాన్యవస్తువులలోకూడ అనంతసౌందర్యమును దర్శించిన ఎందరో మహానుభావులు గలరు

**శిల్పసీమలు** - లలితకళ లన్నియును ఒకే మూలసూత్రమునకు బద్ధములై, ఒకే అంత్యప్రయోజనము గలిగియున్నను వాహకభేదముల ననుసరించి వాని వాని యధికారసీమలు వేరువేరుగా నుండును

గానమున రాగము కవిత్వమున రామణీయకము, భాస్కర్యమునందు నిమ్నోన్నతస్థలములును, ఘనిష్ఠతయు చక్కగాప్రదర్శింపబడుట, చిత్రకళ మూలమున వివిధ వర్ణములతో సూక్ష్మాతిసూక్ష్మములైన వివరములను గూడ చిత్రించి, దృశ్యమును కన్నులకు గట్టినట్లుగాజేయుట మున్నగునవి ఆయా కళల యందు ప్రధానమైన విషయములు కవిత్వచిత్రలేఖనములు అవిభాజ్యముగ మిశ్రితమై యున్నవి

| చిత్రకారుడు | కవి |
| --- | --- |
| (1) స్థూలపరిమాణబద్ధములగు రంగుల నుపయోగించును | (1) కాలపరిమాణబద్ధములగు శబ్దముల నుపయోగించును |
| (2) రూపమునకు చర్యను వశవర్తిని చేయును | (2) చర్యకొరకు రూపమును వర్ణించును |
| (3) అనంతకాలమునుండి ఏదోఒక క్షణమును గ్రహించి దానికి శాశ్వతస్థితిని గల్పించును | (3) క్రమముగ ప్రతి క్షణమునందు జరుగు కార్యముల వర్ణించుచు పోవును |
| (4) ఆనందకార్యమును చిత్రింపక తత్కారణభూతమగు రూపమును ప్రత్యక్షముజేయును | (4) కారణమును వర్ణింపక కార్యమును వర్ణించును |

27

ఇది చరిత్రకారుడును కవియు రూపగతసౌందర్యమును స్ఫురింపజేయు పద్ధతులలోని భేదములు

సాధారణముగ కవి సమిష్టివర్ణనముచేయుట మంచిది కాని ఒకచర్యను వర్ణింపవలసివచ్చినయెడల కవి కేవలము సమిష్టివర్ణనముతో సంతుష్టిపడి యుండకూడదు

కార్యకారణములను రెండింటిని జెప్పుట యనునది కళాకౌశలమునకు లోపము నాపాదించును కావున కవి వదలిపెట్టిన వివరములను పాఠకుడు తన స్వంతభావములతో ఊహించుకొనవలెను అందువలననే పఠితలు సహృదయులుగా నుండవలెనని చెప్పుట

## కవిత్వ ప్రయోజనము -

'కావ్యం యశసేఽర్థకృతే వ్యవహారవిదే శివేతరక్షతయే
సద్యః పరనిర్వృతయే కాన్తాసమ్మిత తయోపదేశయుజే '

అనునది కావ్యప్రయోజనములను గురించిన మన యాలంకారికుల అభిప్రాయము ఇందు 'సద్యః పరనిర్వృతయే' అనునది ముఖ్యప్రయోజనము

'Each age has sung of beauty
He who perceives is from himself set free'

అని జర్మనుకవి గెతె కావ్యప్రయోజనమునుగూర్చి కొంచెమించుమించుగా మన యాలంకారికులవలెనే చెప్పియున్నారు

కవుల కావ్యములందు సమకాలీనసాంఘికపరిస్థితులు, తదభ్యుదయ పరిణామములు ప్రతిబింబించుచుండును కావున సారస్వతము సంఘముయొక్క నిచోచ్చగతులను తెలియజేయు 'భారమితి' యని మనము జెప్పవచ్చును

కాళిదాసుకాలమున చిత్రలేఖనము, నృత్యము, సంగీతము, నాటకము మున్నగు లలితకళలు అధికవ్యాప్తిలోనున్నట్లు వారికావ్యములవలన తెలియగలదు రామాయణ మహాభారతములు ఆయాకాలములనాటి హైందవసంఘమునకు ఆదర్శకప్రతికృతులని భావింపవచ్చును

కవిత్వసంపర్కమువలన సంకుచితభావములు తొలగిపోవును ప్రతి వస్తువునందును సౌందర్యమును గ్రహించి యానందింపగల యభిరుచి హెచ్చును కావున కావ్యమును మానవప్రకృతి నుద్ధరించుటకు ఒక మనోహరసాధనముగా మనము అభివర్ణింపవచ్చును

మరియు కావ్యములు సంఘముయొక్క సంయోగమును పోషించుటకు చక్కని సాధనములు అట్టి రచనలయందలి సార్వజనీనభావములు ప్రజల నందరిని సంప్రదాయబద్ధులను గావించి సంఘముయొక్క ఐక్యమును బలపరచగలిగి యుండును

**కావ్యము - నీతి** - మానవ శిక్షణమునకు తోడ్పడుసాధనములలో మతము, శాస్త్రము, ధర్మము, లలితకళలు ముఖ్యములైనవి ప్రాచ్య, పాశ్చాత్యశిక్షణ మార్గములందు పరస్పరవైరుద్ధ్యము గానుపించుచున్నది ప్రాచ్యులకు జీవితము పరమార్థమును సాధించుటకై ఏర్పడిన ఒకసాధనము పాశ్చాత్యులకు జీవితమే ఒక పరమార్థము ఇట్టి మార్గభేదములు ప్రాచ్య, పాశ్చాత్యదేశములందలి లలిత కళలయందు స్ఫుటముగా గోచరించును

కళలయందు రసరామణీయకములే ప్రధానములనియు, నీతికిని, ఆధ్యాత్మిక భావములకును ఎట్టి సంబంధము గలదు' అని కొందరు విమర్శకులు ప్రశ్నించుచున్నారు ఆస్కార్ వైల్డు అను ఒక ఆంగ్ల విమర్శకుడు కళలన్నియు నీతిబాహ్యములనియు, నీతి యనునది కొద్దిపాటి తెలివిగలవారికేగాని, ప్రతిభావంతులకు అవసరములేదనియు చెప్పియున్నారు కాని నీతికిని, కావ్యమునకును ఎటువంటిసంబంధములేదనుటకంటె ధర్మశాస్త్రములయందువలె కావ్యములందు పనిగట్టుకొని నీతిబోధచేయుట అనవసరమనుట ఉచితము

కావ్యమున రామణీయకము ముఖ్యము కాని నీతిబాహ్యమైన వస్తువు రమణీయమైనచో షేక్స్పియరు సృజించిన క్లియోపాట్రాకన్యవలె మానవలోకమునకు ఉపద్రవమును కలుగజేయునేగాని శకుంతలవలె అనుభోగ్యముమాత్రము కాదు

'శిల్పము శిల్పముకొరకే' అను మరియొక పూర్వపక్షముగలదు కవి భావోద్రేకమువలన తన కిష్టమైనరీతిని తన సంతోషముకొరకు గానముచేయును కాని ఇతరులకొరకు గాదు అనునది ఈ వాదము కాని కవి చేయుగానము మానవ సమాజము నుద్ధరించుటకై తగినదిగా నుండుటచేతనే మనచేత గౌరవింపబడుచున్నది

ఉత్తమ కవిసృష్టిలో సమకాలీనసంఘమునందలి సముచిత భావములు మూర్తీభవించియుండుటయేగాక భవిష్యద్వాణికూడ వినిపించుచుండును

జీవితప్రయోజనము ననుసరించి శిల్పప్రయోజనముగూడ నిర్ణయింప బడును ఉమరుఖయామునకు జీవితము భోగమాత్రప్రయోజనము కావున జీవితము ననుసరించి ఆతని రచనాశిల్పముగూడ విషయభోగముల ప్రతిబింబముగా నున్నది

మన విశ్వాసముల ప్రకారము ధర్మార్ధకామమోక్షము లను నాలుగు పురుషార్థములను మానవజీవితమున సాధింపవలయును సీత, దమయంతి మున్నగు పౌరాణిక సతీరత్నములు భారతదేశమునందు ఎందరో పతివ్రతాశిరోమణులను సృజించినారు ద్రౌపది, చంద్రమతి మున్నగువారి చరితలు కష్టము లనుభవించుచున్న ఎందరో సతీమణులకు ఊరటగలిగించినవి అట్టిపాత్రలు సృజించిన కవుల రచనలయందు నీతిలేదని చెప్పగలమా?

కీట్సు అను ఆంగ్లకవి 'Beauty is truth Truth is Beauty' అని చెప్పగా, మన పూర్వికులు సత్యసౌందర్యములకు శ్రేయమునుగూడ చేర్చి కావ్యము విశ్వశ్రేయమును గూర్చునదిగ నుండవలెనని వచించిరి

"సంఘసమిష్టికిని దదంశమైన వ్యక్తికిని, భిన్నభిన్న వ్యక్తులకునుగల ప్రవర్తన నామరస్యము, ఆనుగుణ్యము నీతియనబడును" 34 నీతి యనునది మానవులయందన్యోన్యప్రవర్తనానుగుణ్యమును పోషించును

సాధారణజీవితమునందు ఏవి నీతిబాహ్యములుగను, అసహ్యజనకములుగను నుండునో అవి కళలయందును ఇంపుగొలుపు కావున కావ్యమునకును నీతికిని సంబంధము తెగిపోవు అవకాశములేదు నీతిస్పర్శలేనిదే కావ్యసౌందర్యము పరిపూర్ణముగాదు అంతమాత్రమున నీతి సౌందర్యమునకు హేతువు అనరాదు పరిపూర్ణతకు అవసరమైన ఒక ఔచిత్యము అనుట సమంజసము

**అలంకారతత్త్వము** - కావ్యశోభాకరములైన గుణము లన్నింటికిని అలంకార నామము సార్థకమగునసెడి ఉద్దేశ్యముతో కావ్యలక్షణములను విధించు గ్రంథములను అలంకార గ్రంథములని వ్యవహరించిరి కాని కావ్యమును శరీరముతో పోల్చినపుడు సాదృశ్యపరిపూర్ణతకొరకు శరీరము, ఆత్మ, గుణములు, అలంకారములు మున్నగు విధములుగా పృథక్కరింపబడినవి

భరతమునికాలమున ఉపమ, రూపకము, దీపకము అను మూడు అర్థాలంకారములును, యమకమను శబ్దాలంకారమును గుర్తింపబడినవి రుద్రటుని కాల

మున వాస్తవ ఔపమ్య, అతిశయ, శ్లేషములను నాలుగలంకారములు గుర్తింప బడినవి తరువాత ఉపమాలంకార మనేకవికారములను పొందినది సూక్ష్మాతి సూక్ష్మ భేదగ్రహణములవలన అలంకారములసంఖ్య కాలక్రమమున పెచ్చు పెరిగిపోయినది అలంకారములవలన ఈ క్రింది ప్రయోజనములు గలవు

(1) అలంకారములను పరిమితపదజాలముతో అపరిమితభావమును ప్రకటించుటకు ఏర్పడినసాధనములుగా జెప్పవచ్చును

(2) కవి చెప్పదలచుకొనిన భావమును స్ఫుటముగ సూటిగ, ఆకర్షక ముగ పరితహృదయమునందు ప్రవేశపెట్టుటకు ఉపమాద్యలంకారములు తోడ్పడును

(3) కావ్యమున కవిలోకోత్తరభావచ్ఛాయలను ప్రకటింపవలయును కాని పదజాలము పరిమితమైనది ఈ భాషాలోపమును పూరించుటకై కవిపడిన వేదనఫలితముగనే అలంకారము లుద్భవించినవి

(4) తనభావమును వ్యక్తీకరించుటకు సామాన్యమైనమాటలు చాల నప్పుడు కవికి అలంకారమే శరణ్యము

(5) కంటికికనబడని ఉపమేయమును కనుపించు ఉపమానముతో పోల్చు దుమేని భావమున కాలంబము దొరికి బోధసులభమగును

అలంకారతత్త్వమును, వానిప్రయోజనములను గుర్తించినచో అలం కారము లావశ్యకములా? అనావశ్యకములా? అను చర్చకు దిగవలసిన అవసర ముండదు ప్రతిభావంతులైన కవుల రచనలయందు అవసరమగుచోటుల అలం కారములు అప్రయత్నపూర్వకముగనే దొరలును

అలంకారములు కుయుక్తులతో నిండిన మేధోవ్యాపారములు మాత్రము కావు భావప్రకటనావశ్యకతయే అలంకారముల ప్రభవమునకు ముఖ్యకారణము

## (b) నాటక సంబంధులు

**నాటకకళా సంస్కరణము** - నాటకము జనరంజకత్వమును పొందుటకు గల కారణములను, అందుకై కవులు నటులు చేయుచున్న వ్యాపారరహస్యము లను, మోసములను అనేక నాటకప్రదర్శనలు చూచుటద్వారా గ్రహించిన దువ్వూరివారు తమ అభిప్రాయములను ఈ వ్యాసముమూలమున ప్రకటించిరి

నాటకకవి :-

(1) నాటకశరీరమునందు అంగానుగుణ్యము చాల ప్రధానమైనది కేవలము లోభముచేత అనుచితమైనకల్పనలు చేయబూనుకొనుట గర్హింపదగినది

(2) నాటకములో కవి దాగియుండవలయునేగాని ముక్కువెడలబెట్టవలసిన ఆవశ్యకత లేదు

(3) దేశ, కాల, పాత్రవిరుద్ధమైనను పురాతనవస్తువునకు అధునాతన వాసన తగిలించుట పెక్కు నాటకకర్తలకు అభ్యాసమైయున్నది ఇది ఒక వ్యాపార రహస్యము

(4) ప్రేక్షకుల అభిరుచి ననుసరించి వ్రాయబడునాటకములు వారి అభిరుచులు మారనంతవరకే గౌరవింపబడును అభిరుచులు మారినయెడల అధఃపతనము పొందును

(5) పాత్రోచితభాషను ఉపయోగించుట ఆవశ్యకము

నటకులు .-

(1) తాము ధరింపబోవు పాత్రను కవి పోషించిన విధమును, ఆ పాత్రయొక్క గుణగణములను, మనస్తత్వమును, నాటకములో ఆ పాత్రకు గల స్థానమును ముందు గుర్తెరుగవలయును

(2) వారుమాట్లాడు ప్రతిమాటకు అర్థము బాగుగాతెలిసికొని యుండవలయును

(3) నటకు డెప్పుడును పారమందిచ్చువానిపై ఆధారపడియుండరాదు

(4) కార్యప్రచలనమును, అభినయమును అడ్డగించుపాటలను నటకులు అంగీకరించకూడదు

(5) నాటకమున సంగీతము అభినయమునకు కేవలము ఔపచారికముగనే ఉండవలయును కార్యగతికి ఎటువంటి అభ్యంతరము కలిగింపగూడదు

(6) కొందరునటకులు పద్యమును రెండుమారులు చదువుట, సీసపద్యమైనయెడల ప్రతిచరణమును రెండు రెండుసార్లు చదువుట చేయుచున్నారు అట్లు చేయరాదు

(7) తాము పోషించిన పాత్రయొక్క ఉదాత్తగుణముల ననుసరించి గాక పాత్రోచితాభినయ చాతుర్యమువలన పేరుప్రతిష్ఠలు వచ్చునని నటకు లెరుంగరు

(8) తాను ధరింపబోవుపాత్ర గుణపోషణమునకు, స్వభావమునకు తన మనస్తత్వము సరిపోవునా? లేదా? అను విచారము నటకున కుండవలయును

(9) నటకు లనేకులు పాత్రోచితవేషముల ధరించుటలేదు

(10) కవికల్పనములను నటకులు తమఇష్టమువచ్చినరీతిని కత్తిరించు అలవాటు ఎక్కువగా గలదు అట్లు జరిగినచో నాటకము స్వస్వరూపలోపమును పొందును

(11) ఒక్కొక్కప్పుడు నటకులు ప్రేక్షకులను నవ్వించి, చప్పటులు కొట్టించుటకై అవసరమైన అభినయమును గావించి కవి ఉద్దేశించిన రసమునకు విరుద్ధమైన రసమును జనింపజేయుచున్నారు

నాటకశాల - పౌరాణిక చారిత్రిక, సాంఘిక నాటకములకు ఒకేవిధమైన పరదాలను ఉపయోగించరాదు ఆయా వర్గములకు సంబంధించిన ప్రత్యేక ఉపకరణములను సంపాదించుకొనిన తరువాతనే నాటకములు ప్రదర్శింపవలయును నాట్యరంగమున యాథార్థ్యభ్రమను కల్పించుటకై ప్రయత్నము చేయవలయును

ప్రేక్షకమండలి — నటకుడు శ్రావ్యముగ పద్యమును పాడినచో కొందరు ప్రేక్షకులు 'Once more, once more' అని కేకలువేసి చప్పటులు చరచుదురు మెచ్చుకోతగిన అభినయమునకు Once more చెప్పిన ప్రేక్షకులు చాల అరుదు

ఇట్టి నాటకశిల్పము కవి నటక, ప్రేక్షకుల సహకారసాహాయ్యముల చేతనే సంస్కరింపబడవలయును

**నాటకము - చరిత్రము** - వేదము వేంకటరాయశాస్త్రిగారి 'ప్రతాపరుద్రీయము'లోని కథ చారిత్రికముకాదని ఒకవిమర్శనాత్మకగేయమునువ్రాసి త్రిపురనేని రామస్వామిచౌదరిగారు ప్రజామిత్ర' లో ప్రకటించిరి దానికి రామిరెడ్డిగారు సమాధానమీయదలచి ఈ వ్యాసమును రచించిరి

దృశ్య, శ్రవ్యకావ్యములకు రచనావిధానములోదప్ప అంత్యప్రయోజనమైన సద్యఃపరనిర్వృతి విషయములో ఎట్టిభేదమును లేదు

విక్టర్ హ్యూగో, ఇబ్సన్ మొదలు బెర్నార్డుషా వరకు గల పాశ్చాత్య నాటకరచయితలు నాటకమును మానవసంఘశ్రేయస్సుకొర కుపయోగించిరి అట్లే మనవారు కావ్యము విశ్వశ్రేయమును గూర్చునదిగా నుండవలెననుటలో ఈ సాంఘికప్రయోజనత్వము ధ్వనించుచునే యున్నది

మానవఅవస్థానుకృతియైన అభినయము ప్రధానముగా గలది నాట్యము నాటకరచయిత ప్రకృతిని యథాతథముగ అనుసరించడు ప్రకృతి అంతగా పాటించని పొదుపును కవి జాగరూకతతో పాటించును కావున నాటకము ప్రకృతియొక్క ఉత్తమపునర్నిర్మాణమని చెప్పవచ్చును

నాటకవస్తువు పౌరాణికమైనను, చారిత్రికమైనను, సాంఘికమైనను కవి ఆది మధ్యాంతములుగల నాటకమును సృజించునప్పుడు కథలో ఎన్నియో మార్పులు చేయవలసియుండును కవిచేతి కావ్యవస్తువు ప్రతిమాకారుని చేతి బంకమన్నువంటిది నాటకమునందు కథకంటెను మానవస్వభావచిత్రణమే ప్రధానము

చరిత్రయొక్కయు, నాటకముయొక్కయు ఉద్దేశ్యములు ప్రయోజనములు వేరువేరుగా నుండును చరిత్రకారుడు జరిగినచరిత్రను యథాతథముగ జెప్పును మంచిచెడుల ననుసరించి అతడు విషయము నేర్పరుపగూడదు కాని కవి ఎంత వరకు జరిగియుండవచ్చునో, ఎట్లు జరిగిన చిత్తాకర్షకముగ నుండునో దానిని ఊహించి కావ్యమును వ్రాయును కావున చారిత్రకవిషయము సహితము కవితా స్పర్శచేత రూపాంతరమును పొందును

నాటకము కొన్ని కవి సమయములకు, కళానియమములకు లోబడియున్నట్టిది కాన నాటకప్రపంచమును యథార్థప్రపంచదృష్టితో చూడరాదు

చరిత్రను నాటకకర్త ఎంతవరకు మార్చవచ్చును అను విషయములో 'Francois Heclin' గారి అభిప్రాయము గమనించెదము

"But my opinion is that we may do it, not only in the circumstances, but in the principal action itself, provided he makes a very good play of it For, as the dramatic poet does not much mind the time, because he is no chronologist, no more does he, nor the epic poet, much mind the true story because they are no historians" 35

**విషాదాంతనాటకము - మీరాబాయి** - 36 దువ్వూరివారిచే రచింపబడిన 'మీరాబాయి' అను వధాంతనాటకము నెల్లూరి వెంకటరాజాగారి కళాశాల పాత విద్యార్థిసంఘమువారిచే ది 7-5-1983న ప్రదర్శింపబడి, సహృదయులగు ప్రేక్షకుల ప్రశంసకు పాత్రమైనది అప్పటినుండి కొంతకాలమువరకు ఈ నాటకమునకు సంబంధించిన మంచిచెడ్డలనుగూర్చిన వివాదములు స్థానికపత్రికలందు

ప్రచురింపబడినవి ఆ సమయమున నెల్లూరునుండి వెలువడుచున్న Scrutator' అను పత్రికయందు రసలుబ్ధుడు' మిరాబాయి నాటకమునుగూర్చి ఒక విమర్శనా వ్యాసమును ప్రకటించెను అందు రసలుబ్ధుడు'చెప్పిన ఆక్షేపములకు దువ్వూరి వారు 'కళాప్రియుడు' అనుపేరుతో అదేపత్రికయందు ఒకవ్యాసమును ప్రచురించి సమాధానమిచ్చియుండిరి ఆ సమాధానమే ఈ వ్యాసము

## (c) నవ్య కవిత్వ సంబంధులు

**తెలుగుకవితలో క్రొత్త తెన్నులు** - ఇది దువ్వూరివారి అసంపూర్తి రచన

ప్రతిజాతి ఇతరదేశనాగరికతలలోని ఉత్తమధర్మములను తనలో జీర్ణింపజేసికొని తన సాంఘికశరీరమును అభివృద్ధి చేసికొనుచున్నది

1914లో ప్రారంభమైన ప్రపంచయుద్ధము ముగిసినతరువాత యూరపుదేశమునందు ఎన్నియో వాఙ్మయోద్యమములు పుట్టినవి పరిస్థితులు కొంచెము మారినవెంటనే నశించిపోయినవి Cubism, Dadaism, Futurism Impressionism మున్నగు చిత్రలేఖనపద్ధతులు Abnormal Psychology కి సంబంధించినవి ఈ విపరీత కళాచాపల్యము వారికే నచ్చలేదు అవి మన సాహిత్యములో ప్రవేశించినను మనకెట్లు సంతోషమును గూర్చును?

కాలక్రమమున ఆంధ్రుల సాంఘిక జీవనమునందును, సాహిత్యమునందును మార్పులు కలిగినవి వీరేశలింగముగారు ఆంగ్లరచనామర్యాదలను తెలుగులోనికి తీసికొనివచ్చిరి గురజాడ అప్పారావు, గిడుగు రామమూర్తిగారలు వ్యావహారికభాషోద్యమమునకు మూలపురుషులైరి పల్లెపదములకు, ద్విపదలకు గౌరవము గలిగినది ఖండకావ్యము లుద్భవించినవి కవితావస్తుగ్రహణమునందు మార్పు కలిగినది నవలలు ఉపకథలు జనించినవి

వాఙ్మయములో 'Democracy' ప్రవేశించినది అది తప్పుదారి పట్టినపుడు మరలించుసామర్థ్యముగల ప్రతినిధులు లేరు అందువలన Democracy విశృంఖలముగా ప్రవర్తించుచున్నది

తెలుగుకవితలో ఛందోబద్ధముగాని వచనపుతుంటలను వ్రాయుట అనునది ఒకపెద్దమార్పు మనదేశములో ఈ కవిత్వము ప్రతిధ్వని అమెరికా దేశమున 'Walt Whitman' వ్రాసిన 'Leaves of grass' అను ఛందోబద్ధముగాని

పద్యములకు అనుకరణము ఛందస్సులేని పద్యమువినినప్పుడు ఆనందదాయక హేతువులలో నొకటియైన శ్రుతిరంజకత్వము లోపించినట్లు కనుపించును

రాయప్రోలు సుబ్బారావుగారు నవ్యకవులనిమిత్తము రమ్యాలోకము' అను కావ్యనియమగ్రంధమును రచించిరి శ్రీశ్రీగారు కూడ ఒక 'Manifesto'ను ప్రకటించిరి అది ఫిడేలురాగాల డజన్' నకు Introduction అందు శ్రీశ్రీ గారు 'నవకవి అర్థముల నిరంకుశత్వమును భరించలేడనియు, వాక్యములో కర్త, కర్మ, క్రియల అనుబంధమునకు విడాకు లిచ్చుచున్నాడనియు, ఛందస్సుల చండశాసనమునకు కాలము వెళ్ళిపోయినదనియు, నవకవికి అనుకరణ మసహ్యమనియు' జెప్పియున్నారు వానినన్నింటిని దువ్వూరివారు అంగీకరింపక వారు చెప్పిన నియమములు వారియెడల ఎట్లుసరిపడకుండునో విమర్శించి, వివరించి యున్నారు

శ్రీశ్రీగారు నవకవులుసాధించిన మహాసిద్దియనిచెప్పిన 'ఫిడేలురాగాల డజను'ను గూర్చి దువ్వూరివారు "యౌవన ప్రాదుర్భావసమయమున కామోద్రిక్తుడయి 'కామార్తాహి ప్రకృతి కృపణాః చేతనాచేతనేషు' అను కాళిదాసుసూక్తికి ఉదాహరణప్రాయుడయి వలపుపన్నులతో నవసి మతిచెడిన యువకుని ఉన్మత్త ప్రలాపములుగా (Madravings) నాకు స్ఫురించినది" 37 అని వ్రాసియున్నారు

**అభినవాంధ్ర సాహిత్యము** - ఆంగ్లేయుల సంబంధమువలన పాశ్చాత్య నాగరికత మనకు పరిచయమైనది వారి వాఙ్మయము, ప్రకృతివిజ్ఞానము మనల నాకర్షించినవి ప్రబంధప్రక్రియపై మనవారికిగలిగిన అసంతృప్తి నూతన ప్రక్రియానిర్మాణమునకు దారితీసినది కందుకూరి వీరేశలింగముగారు Vicar of wakefield, Gulliver's Travels అను ఆంగ్లనవలలను నమూనాగా పెట్టుకొని తెలుగున నవలలురచించి నవలారచనకు మార్గదర్శకులైరి నాటకములు, ప్రహసనములు, వ్యాసములు, ఖండకావ్యములు, కవిజీవితములు మున్నగునవి వ్రాసి ఆంగ్లసాహిత్యములోని కొన్నిరచనావిధానములను మనకు పరిచయము గావించిరి

వాఙ్మయరచనలో వచ్చినమార్పులతోబాటు భాషావిషయమునందుకూడ కొంత సంచలనము గలిగినది వ్యావహారికభాషలో రచనచేయుట ఆవశ్యకమని గిడుగు గురజాడలు తలంచి వ్యావహారిక భాషోద్యమమును లేవదీసిరి

అప్పారావుగారి 'ముత్యాలసరము'లతో అభినవకవితోద్యమము ప్రారంభ మయినది కట్టమంచివారు రచించిన 'కవిత్వతత్త్వవిచారము' అను విమర్శన గ్రంథము ఈ నవీనోద్యమమునకు మార్గదర్శకమైనది నవయుగ కవితాప్రభాత రేఖలు రాయప్రోలువారిని నిద్రలేపి ప్రబోధించినవి వారు 'లలిత'ను పూర్వ ప్రబంధశైలిని తలపించువిధముగా వ్రాసినను భావకవితాపరిణామములు అందు గన్పట్టుచున్నవి ఆంగ్లేయసాహిత్యములోని పేరిన తేనెగడ్డలను అభినవాంధ్రి కావ్యములలోనికి దెచ్చుటకొరకై అభినవకవితామండలి స్థాపింపబడినది

సుబ్బారావుగారి మార్గమును వెంటనే అవలంబించినవారు అబ్బూరి రామ కృష్ణారావుగారు తదుపరి పింగళి - కాటూరులు, విశ్వనాధ సత్యనారాయణ, వేంకట పార్వతీశ్వరకవులు, శివశంకరశాస్త్రి, కృష్ణశాస్త్రి మున్నగువారు ఈ నవీన మార్గము నవలంబించిరి

అభినవకవితోద్యమఫలితముగా కొంతపునరుద్ధరణము, కొంత నూతన సృష్టి జరిగినది ద్విపదలు, పల్లెపదములు పునర్గ్రహణయోగ్యము లైనవి ఖండ కావ్యములు, గేయములు నవలలు, నాటకములు ఏకాంకనాటికలు ఉపకధలు, వ్యాసములు మున్నగునవి ఉద్భవించినవి

పోలవరపు రామబ్రహ్మముగారు 'ప్రజామిత్ర'లో ఆధునికకవిత్వమును విమర్శించిరి వడ్డాది సుబ్బారాయుడు రాయప్రోలు సుబ్బారావు, అబ్బూరి రామ కృష్ణారావుగారల కావ్యములుదప్ప ఇతరకవులు రచించిన కావ్యములన్నియు చెత్త లని వీ రభిప్రాయపడిరి దీనికి దువ్వూరివారు రామబ్రహ్మముగారు బూతుకధల విమర్శించిరనియు, వారికి బూతుకథలపై గలిగిన కోపము అభినవసాహిత్యము నంతటిపై ప్రసరించి వారి విమర్శనయొక్క విలువను తగ్గించినదనియు చెప్పిరి

'సుబోధిని'లో 'నవకవులు-బూతుకవనము' అని రామబ్రహ్మముగారు వ్యాసము రచించిరి దానికి సమాధానముగా దువ్వూరివారు నవకవులెవ్వరును బూతుకవనము వ్రాయలేదనియు వారికవిత్వములోని శృంగారము సభ్యముగను అభిరుచిగలదిగను ఉండుననియు దెల్పిరి

రామబ్రహ్మముగారిని అభినవసాహిత్యపరిచయము కలిగించుకొనవలసి నదిగా మనవిజేసియున్నారు

**మర్మకవిత్వము** - ఫ్రాంసుదేశమున కావ్యములందు దివ్యానుభూతికిబదులు మేధోవ్యాపారము అధికారస్థాపనముగావించిన తరుణములో దానికి ప్రతీకారముగ

ఒక ఉద్యమము బయలు వెడలినది ఈ ఉద్యమప్రచారకులు ఇంద్రియముల నంతర్ముఖములగావించి విశాలమైన సూక్ష్మప్రపంచమును జొచ్చి, అందలి అనిర్వచనీయమైన సత్యమును సౌందర్యమును గూర్చి గానము చేసిరి ఈతెగకు చెందిన కవులను పాశ్చాత్యులు మర్మకవులు (Mystic) అనియు సాంకేతిక కవులు (Symbolists) అనియు పిలువసాగిరి బాడిలేర్ అను ఫ్రెంచికవి మొదట ఈమార్గమును ఏర్పరచెను క్రమముగా మర్మకవిత్వము ఇంచుమించుగా యూరపుఖండమునందలి అన్ని దేశములయందును వ్యాపించినది

ఈ మర్మకావ్యములందు సామాన్యప్రజల కగమ్యగోచరములగు విషయములుండును సామాన్యముగ నీగీతములు ఆధ్యాత్మిక విషయసంబంధులుగా నుండును యూరపుదేశమందలి సామాన్యజనులు ఆధ్యాత్మికగంధశూన్యులు గావున వారి కీకవిత్వము మర్మముగ దోచినది

మర్మకవిత్వమునందు ఒకవిధమైన అస్పష్టత అనూహ్యమైన భావ నేంద్రజాలము కనపంచుచున్నది ఆకావ్యమునుండి నీవేమి గ్రహించితివని ఎవరైన ప్రశ్నించినయెడల ఒక అవ్యక్త మధురమైన ఆనందమును అనుభవించి తినని చెప్పుటమాత్రమే సాధ్యమగును కావున 'శిల్పము అనుభవించదగినదే గాని వివరింపవలసినదిగాదు' అనిన డా॥ అవనీంద్రనాధరాగూరుగారి వాక్యము ఇచ్చట స్మరణీయము

టాల్‌స్టాయ్ ప్రజాపక్షవాది కావున సామాన్యజనులకు అర్థముగాని శిల్పము వ్యర్థమనియు, నింద్యమనియు మర్మకవిత్వమును తమగ్రంథమున తీవ్రముగ ఖండించియున్నారు కేవలము శిల్పాభిరుచిగలవారికిమాత్రమే పనికివచ్చు కళ యొక కళగాదని ఆయన సిద్ధాంతీకరించెను దీనిని దువ్వూరివారు ఇది శిల్పతత్త్వ మునకు పరమవిరుద్ధమైన తీర్మానమని చెప్పుటయేగాక, సామాన్యప్రజల మన స్తత్వమును ప్రమాణముగా దీసికొని మర్మకావ్యములలోని విషయములు వారికి అగ్రాహ్యములు గనుక దోషములని తీర్మానించుట సాహసమనియు దెల్పి యున్నారు

మనదేశమునందు 'మర్మకవిత్వము' ప్రాచీనమైనది కావున దానిని మర్మ కవిత్వమనక ఆధ్యాత్మికకవిత్వమనుట సముచితము అట్టిరచనలు హైందవజన సామాన్యమునకు మర్మములుకావు దృశ్యమానమగు జగత్తుకన్నభిన్నమగు మరి యొకప్రకృతి గలదనియు నశించునది భౌతికశరీరమేగాని ఆత్మకాదనియు,

జన్మాంతరముగలదనియు సామాన్యజనులు మొదలు పండితులవరకును మనదేశమున విశ్వసించెదరు

మొట్టమొదట ఈ ఆధ్యాత్మికకవిత్వము వేదములయందు జనించి ఉపనిషత్తులయందు పరిపూర్ణత నొందినది వివిధమత సంప్రదాయములందును ఇట్టి కవిత్వ ముద్భవించి వ్యాప్తి గాంచినది వైష్ణవులకు భక్తి ప్రధానము ప్రేమ ఆలంబనము ఆత్మపరమాత్మల సంబంధమును రాధాకృష్ణుల ప్రెమలీలలుగ సంకేతించి వారు సంకీర్తనము చేసియున్నారు

తెలుగుదేశమున పోతులూరి వీరబ్రహ్మము, అతని శిష్యుడు సిద్దయ్య, వేమన్న మొదలగు తత్త్వజ్ఞానులకు సంబంధించిన ఆధ్యాత్మికకవిత్వము ప్రచారములోనున్నది వేమన పద్యములలోని భావములను గ్రహించి కొందరు కీర్తనలను రచించిరి

బెంగాలుదేశమున రవీంద్రనాధుడు సత్యేంద్రనాధదత్త మున్నగువారు ఆదునిక ఆధ్యాత్మిక కవిత్వసంప్రదాయమునకు చెందినవారు రవీంద్రుని ఆధ్యాత్మికకవిత్వము ప్రాచ్య, పాశ్చాత్య మనస్తత్వముల సమ్మేళనముగా నుండును

రవీంద్రుని కావ్యములు హిందూదేశమంతటను వ్యాప్తి చెందినతరువాత తెలుగు రొమాన్టిక్‌కవిత్వము ఆధ్యాత్మిక కవిత్వముగా పరిణమించసాగినది

## (d) ప్రాచీన నవ్య సాహిత్య సంబంధులు

**సాహిత్యములోరమ్యత** - కావ్యమునందు రామణీయక మనునది ఉండవలెనని ప్రాచ్యపాశ్చాత్య లాక్షణికులు, కవులు అంగీకరించియున్నారు "వస్తుగుణములు ఉచితమైనరీతిగానమ్మేళింపబడి కవిప్రతిభచేత సచేతనమై ఆకృతిబద్ధమైన భావముయొక్క సమిష్టిమోహనత్వమే సౌందర్యము' 38 అని రెడ్డిగారు రామణీయకమునకు నిర్వచనము చెప్పిరి

సహృదయహృదయములందు భావచిత్రములను ప్రతిఫలింపజేయు వర్ణనాశక్తి ఏకవికియుండునో అట్టి వానికవిత్వము సార్వకాలికము అమరము అగును

కవికులగురువైన కాళిదాసునందు ఇట్టిభావచిత్రరచనాకౌశలము పరమావధిని పొందినది అట్లే పెద్దనగారి మనుచరిత్రయందు ఎట్టి భావచిత్రములు గలవు

'చూచి ఝుళంఝుళత్కటకసూచితవేగ ఎదారవిందయై
లేచి, కుచంబులున్ లేనడు మల్లలనాడ నయ్యెడన్
బూచిన యొక్కపోక నునుబోదియ జేరి విలోకనప్రభా
వీచికలం దదీయ పదపీకలశాంబుధి వెల్లిగొల్పుచున్'

ఇందు వరూధినిని జీవచిత్రప్రతిమవలె మనకన్నులయెదుట నిలిపినారు ఆమె ప్రక్కనున్న పోకచెట్టుచాటునకు పోయి నిల్చున్నదట మరి ఏచింతచెట్టుచాటునకో పోయినచో ఆమె సౌందర్యము ప్రవరునకు గోచరింపదు ఈ చిత్రము పరితలహృదయమును హత్తుకొని వదలిపోదు

కవి కావ్యమునందు సౌందర్యముసాధించుటకు కారణభూతములైనవానిలో భావప్రకటనావిధానము ముఖ్యమైనది నిర్దుష్టమైన భావప్రకటనము సౌందర్యమును, దోషయుక్తమైన భావప్రకటనము అందవికారమును గలిగించును కావ్యమునందు సౌందర్యాపాదకములగు హేతువులను గ్రహించుటతోపాటు తద్భంగకరములగు హేతువులను వదలిపెట్టుటకూడ ప్రధానమైనదియే అనౌచిత్యము రసభంగహేతువు కావున దానిని ముఖ్యముగ పరిహరింపవలెను

ఇట్లు కవి సౌందర్యాపాదకములగు సామగ్రిని గ్రహించి తద్భంజకములగు అంశములను పరిహరించి, శబ్దార్థములకు సమప్రాధాన్యమునిచ్చి శ్రోత్రపేయముగా నుండునటులగావించి తనసృష్టిని రమణీయముగ చేయుచున్నాడు కావున సాహిత్యములో సౌందర్యమనునది పేరుకొనియుండును

**నేటికవిత - ప్రకృతిపూజ :-** ప్రకృతిని పూజించుటలోను ప్రకృతి సౌందర్యమును వర్ణించుటలోను పూర్వకవులును, నవ్యకవులును భిన్నభిన్నమార్గములను ద్రొక్కిరి ప్రబంధకవులు కృత్రిమాలంకారప్రియులుకాగా నవీనులు సహజ సౌందర్యప్రియులు

కవులు ఏకాలమునకు చెందినవారైనను ప్రకృతి సౌందర్య వర్ణనము మానవ స్వభావచిత్రణము ముఖ్యములైన విషయములు అందుచేతనేకాబోలు ఒక ఆంగ్లేయవిమర్శకుడు 'కవులకు ప్రకృతి ఆరాధ్యదేవత' అని చెప్పినాడు

పూర్వకవుల మతముప్రకారము కావ్యములలో మానవచర్యలకు సంబంధించి యుండినదై రసపోషణకు కావలసినంతమాత్రము ప్రకృతి వర్ణనము గ్రాహ్యమే అనాగరికజాతులు, పశుపక్ష్యాదులయందు రసాభాసముమాత్రముగల

దని వారి తలంపు దీనిని ప్రతిఘటించి జగన్నాధుడు రమణీయార్థమును ప్రతి పాదించు శబ్దమే కావ్యమని నిర్వచించి కవిత్వపరిధిని విశాలమొనర్చి ఎందరో మహానుభావుల రచనలకు గతికల్పించినాడు లేనియెడల కాళిదాసుని కుమార సంభవములోని మధుద్విరేఫః కుసుమైకపాత్రే పపౌప్రియాం స్వామనురక్త మానః' అను రమణీయశ్లోకము రసాభాసమునకు నిదర్శనమైయుండెడిది

ఆధునికకవులు నాయికానాయక నిరపేక్షితముగాకూడ ప్రకృతివర్ణనలను గావించిరి ప్రొద్దుపొడుపులు, సెలయేళ్ళు వనములు చంద్రోదయము మున్నగు రమణీయ బాహ్యప్రకృతియంతయు మానవచర్యలతో సంబంధములేకున్నను తమంతతామే మనోహరదృశ్యములుగనున్నవి వానిని ఆధునికులు ప్రత్యేకముగ వర్ణించిరి ఆంగ్లసాహిత్యములోని Lake Poetry, Nature Poetry మున్నగు నవి ఈతెగకు చెందినవే

పూర్వకవులును, ఆధునికులును ప్రకృతిని వర్ణించుటయందు రెండుపద్ధ తుల నవలంబించిరి 1 ప్రకృతిని మానవీకరించుట మానవుని కష్టసుఖములలో ప్రకృతిసహానుభూతిని చూపుచున్నట్లువర్ణించుట 2 ప్రకృతి సౌందర్యమును యథాతథముగ వర్ణించుట ఈరెండుపద్ధతులను ఆంగ్లకవులును, మనకవులును సమానముగ ననుసరించిరి

"రమణీయ వస్తువులు తమంతతామే వర్ణనాయోగ్యములయ్యును అవి మానవచర్యలకు భిత్తికయయి కావ్యవర్ణనములో మిళితమైనప్పుడు మరింత సుంద రముగ నుండును '39

ఈరహస్యమును కవులేగాక చిత్రకారులుకూడ గ్రహించిరి అందుచేతనే వారు కొండలు, పచ్చికబయళ్ళు మున్నగువానినిచిత్రించి సంతృప్తిపడక ఆదృశ్య మును ప్రాణవంతముచేయుటకై మేయుచున్నఆవునో, పూవులుకోసికొనుచున్న పిల్లనో చిత్రింతురు

ఆధునికకవులు కథావస్తువునకు, మానవస్వభావచిత్రణమునకు సంబం ధించిన కొన్నిమార్పులు చేసిరి సామాన్యమానవజీవితమునందును రసోదయమును కలిగించుఘట్టములు కలవని ఋజువుచేయుటకు తగినకావ్యములను రచించిరి

**సాహిత్యములో వైచిత్రి** - కవిప్రతిభ ప్రతిక్షణము నూతనమైన వైచిత్రు లతో జగములను సూత్రించుచుండునట ఈ వైచిత్రినే నేటి విమర్శకులు

'Romantic element' అను పదమునకు పర్యాయపదముగా భావించగా, పూర్వ లాక్షణికులు దీనినే లోకోత్తరచమత్కారము'గా తలంచిరి యథార్థకవిత్వమునకు వైచిత్ర్యము జీవమని చెప్పవచ్చును నవ్యతయే ఈవైచిత్ర్యమునకు మూల కారణము

కాళిదాసు, భవభూతి మున్నగు సంస్కృతకవులయందును నన్నయ మొదలు నేటివరకుగల తెలుగుకవులయందును ఈ'Romantic element' దేశ కాలపాత్రభేదముల ననుసరించి కొద్దిగనో గొప్పగనో కనిపించుచునేయున్నది ఆధునికకవులే Romantic కవులని చెప్పుటకు వీలులేదు ఆచారవ్యవహారభేద ములవలన ఈ Romantic element మారుచు వచ్చినది

18వశతాబ్ది ఆంగ్లవాఙ్మయచరిత్రలో నీరసమైనఘట్టమని ఆంగ్లవిమర్శకుల అభిప్రాయము ఆకాలపు Neo-classic పద్ధతికి వ్యతిరేకముగా Romantic కవితోద్యమము 18వ శతాబ్దిలో బయలుదేరినది ఆకాలపు రచయితలు ఛందో నిర్బంధములు, లక్షణనిర్బంధములు, వ్యాకరణపుకట్టుబాట్లు అడ్డుగోడలుగా తలం చిరి పూర్వరచనలపై అసంతృప్తి బయలుదేరినది కవులుబంధములనుండి విడి వడినారు ఈమార్పు ఆయారచనలలో గోచరించినది

ప్రకృతి పరిణామశీలము గలది దేశకాలపరిస్థితులు, కవులప్రత్యేక ప్రతిభావిశేషములు ఈనవీనత్వమునకు కారణములు ఒకేవిషయమును పలువురు కవులు చెప్పినయెడల తలకొకవిధముగా చెప్పుదురు ఉదాహరణకు స్త్రీవర్ణనను పరిశీలింతము

'కడుహెచ్చు కొప్పు, దానిం
గడవం జనుదోయి హెచ్చు, కటి యన్నిటికిన్
గడుహెచ్చు హెచ్చులన్నియు
నడుమే పసలేదుగాని నారీమణికిన్' ఇది చేమకూర వేంకటకవి వర్ణనము
'ఒత్తుకొనివచ్చు కటికుచోద్వృత్తి చూచి
తరుణి తనుమధ్య మెచటికో దలగిపోమె' నని చెప్పి అంతటితో ఊరు కొనక 'ఉద్ధతులమధ్య పేదల కుండదరమె' అని అర్థాంతరన్యాసమును ప్రయో గించినారు ఇది సంకుసాలకవి వర్ణనము

శ్రీనాథుడు 'అస్తి నాస్తి విచికిత్సాహేతు శాతోదరిన్' అని వేరొకవిధ ముగా నడుమును వర్ణించినారు ఈవర్ణనలన్నియును ఒకే విషయమును గురించి

వెలువడినను భిన్నత్వ నవ్యత్వ, చమత్కారములవలన రసవంతములై అను భోగ్యము లగుచున్నవి

చమత్కారరహితములగు కేవలశబ్దార్థములకు కావ్యత్వయోగ్యత లభింపదు రఘునాథరాయలు చేమకూరకవిని 'ప్రతిపద్యమునందు జమత్కృతికలుగం జెప్పనేర్తువు' అని పొగడినారట ఇదికేవలము పొగడ్డమాత్రమేకాదు ప్రతిపద రసోదయముగా కవిత్వముజెప్పిన తెలుగుకవులలో చేమకూర వేంకటకవి ముఖ్యుడు ఆయనమార్గము నిజముగా నెవరికిని లభించలేదని చెప్పవచ్చును మహాకవుల పోకడలు అనుకరణసాధ్యములు గావుగదా'

Romantic కవులకు ప్రకృతి అనుసరణముకంటె భావసృష్టి మిక్కిలి ఇష్టమైనది పూర్వరచనలపై అసంతృప్తి ప్రబలినపుడు నవ్యరచనకు మార్గము ఏర్పడును కావున ప్రబంధరచనావైఖరులమీద కలిగిన అసంతృప్తిఫలితమే ఈ నాటికవుల క్రొత్తపోకడలకు హేతువు

## (e) కవిసంబంధులు

**అల్లసానిపెద్దన - సమకాలీన భావప్రతినిధి** - సమకాలీనభావములు, సాంఘికపరిస్థితులు కావ్యమునందు ప్రతిఫలించుచుండును ఆంధ్రసాహిత్య చరిత్రయందు శ్రీకృష్ణదేవరాయలయుగము స్వర్ణయుగముగా కీర్తింపబడినది కృష్ణదేవరాయల పరిపాలనాకాలమున ఆంధ్రదేశమున హిందూమహమ్మదీయ నాగరికతలకు కొంతసంబంధమును, స్పర్ధయు గలిగినది ఆకారణముగ మొగలాయీల భోగప్రియత్వము విజయనగరప్రజలకు అలవడినవి విజయనగరములో వివిధసంప్రదాయములు ఆచారములు, నాగరికతలు కలసిపోయి నూతన నాగరికత రూపుదిద్దుకొనుచున్నది అట్టిపరిస్థితులలో సంఘమునందుస్వాతంత్ర్య ప్రీతియు పూర్వాచారవైముఖ్యమును హెచ్చినదనుట అతిశయోక్తికాజాలదు ఈ మార్పు ఆనాటి సారస్వతమునందును గోచరింపవలయును

అష్టదిగ్గజకవులలో నొకడైన పెద్దనకుచేసిన గౌరవమును శ్రీకృష్ణదేవ రాయలు మరి ఏకవికిని చేయలేదు పెద్దన రాయలకు ప్రియస్నేహితుడుకూడ

పెద్దన ఆంధ్రీకరణముగాక స్వతంత్రకథావస్తువునుగ్రహించి కావ్యము రచించి నూతనసంప్రదాయమును ఏర్పరచెను ఇతివృత్తమును మార్కండేయ

పురాణమునుండి గ్రహించెను తనమనమును ఆందోళనపరచుచున్న భావయుద్ధ మును, ద్వైధీభావమును ప్రతిఫలింపజేయుటకు అనువైనకథను ఎన్నుకొనినాడు మనకు ఇందు రెండు ఆదర్శములు కనబడును 1 హృదయములేని నైతిక కర్కశత్వము 2 భోగలాలసత్వము మొదటిదానియందు ఆచారపరాయణత్వ మును, రెండవదానియందు మానుషత్వమును గలవు ఈప్రకృతులను సృజించి శీలపోషణమునందు తారతమ్యమును జూపించి ఒకదానికొకటి భిత్తిగనొనర్చినాడు

ఆంధ్రదేశమునందు అనేకమతములు ప్రబలుటవలన వైదికమతము నందును, వర్ణాశ్రమధర్మములందును ప్రజలకు అశ్రద్ధ జనించినది మాధవసా యణుల వైదికమతోద్ధరణోద్యమము సన్నగిల్లిపోయినది మాటిమాటికి యుద్ధ ములు, దోపిడులు, సర్వజనసామాన్యకష్టములు కలుగుచున్న సమయములందు నీతులు, ఆచారములు, వర్ణాశ్రమధర్మములు నిర్వర్తింపబడుట కష్టము

ఒకజాతిగాని సంఘముగాని ఇతరజాతులపై దండయాత్రసలిపి విజ యముగాంచినప్పుడు ఆవిజయఫలము ననుభవించువారు భోగపరాయణు లయ్యె దరు వైరాగ్యము మందునకైనను లభించదు గృహస్థజీవితమే ఆదరణయోగ్య మగును మతము అర్థములేని ఆచారముగ మారియుండునేగాని దైనికజీవిత మందు దానిఆవశ్యకత అంతప్రధానముగ కనుపించదు కృష్ణదేవరాయల రాజ్య మునందొకసారి ఈపైపరిస్థితులు సమకూడినవి పెద్దనహృదయమును వంశ పారంపర్యముగవచ్చు ఆచారప్రీతి ఒకవంకకును, నూతనగతులు మరొకవంక కును ఆకర్షింపజొచ్చినవి ఈగుంజులాటయె మనకు వరూధినీప్రవరుల వ్యవహార ములో గానుపించును

పూర్వాచారప్రియులైన పండితాభిప్రాయమును గౌరవించుటకై పండితు లను సంతృప్తిపరచుటకై ప్రవరుని ఆచారబద్ధుడైన కర్కశహృదయునిగా చిత్రించినాడు అట్లు చేయకపోయియుండినయెడల మనుచరిత్ర' అధమకావ్య మను నిందను పొందియుండెడిది

వరూధిని భావోద్రేకము, పేశలమైన మనస్సు, సౌందర్యపిపాస మిక్కు టముగా గలిగియున్నట్టిది ప్రవరుని సౌందర్యమునుగాంచి ఆశ్చర్యపడి అతనిని వర్ణించి వర్ణించి అంతటితో సంతృప్తిపడక ప్రేమించినది ప్రవరుని తనవశము చేసికొనుటకు చేయవలసిన ప్రయత్నము లన్నియును చేసినది అన్నియు వ్యర్థములైనవి

ఈవిధముగా పెద్దన తనకాలమునాటి పరిస్థితులకు ప్రతిబింబములుగా ప్రవరుని ఆచారబద్ధునిగా, వరూధినిని భోగలాలసురాలిగా చిత్రించినారు

**తిక్కన :-** వైదికమతోద్ధరణమే భారతరచనకు ప్రధానకారణము రాజరాజు కోరికపై భారతరచన కుపక్రమించిన నన్నయ అరణ్యపర్వము పూర్తికాక మునుపే మరణించెను తదుపరి రెండువందల సంవత్సరములకు తిక్కన అవతరించి భారతమునందలి విరాటపర్వము మొదలు పదునేనింటిని తెనిగించెను కాని అరణ్యపర్వశేషమును పూరించలేదు

నన్నయ వైదికదృష్టితోను జగద్ధితబుద్ధితోను భారతరచన కుపక్రమించగా, తిక్కన శిల్పదృష్టితోను, ఆంధ్రావళిని మోదముంబొరయించు దృష్టితోను భారత రచనను కొనసాగించెను

తిక్కననాటికి మార్గ దేశికవితావాదములు పుట్టియుండినవి దీనికి మూల పురుషులు శివకవులు తిక్కనకు సంస్కృతబహుళమైన దీర్ఘసమాసములకంటె అలతియలతి తునియలుగావిరుగు తెలుగుశబ్దములపైననే మక్కువ ఎక్కువ అందుచేతనే 'జాత్యముగామి నొప్పయిన సంస్కృత మెయ్యెడ జొన్ప'నని నియమము చేసికొనినను ఆచరణలోమాత్రము కొంతనియమభంగము కలిగినది

తిక్కన 'నిర్వచనోత్తరరామాయణము' న 'నేనుభయకావ్యప్రౌఢి బాటించు శిల్పమునం బారగుడం గళావిదుడ'నని చెప్పికొనినారు వారు కవిత్వము శిల్పమని కళయని గ్రహించినారు

సంస్కృతభారతము అస్థిపంజరముకాగా, తిక్కన ఆంధ్రీకరించిన భారతము రక్తమాంసయుతమైన జీవన్మూర్తివంటిది కావున తిక్కనగావించినది సృష్టియని చెప్పవచ్చును

తిక్కన భారతరచనయం దవలంబించిన పద్ధతులనుగూర్చి తెలిసికొందము

(1) సంభాషణమూలకమైన నాటకపద్ధతిలో కథను నడపుట

(2) రసపోషణకై యథేచ్ఛగా మూలమునతిక్రమించుట, అమూలకములను చేర్చుట, మూలమును మట్టగించుట

(3) వస్తువుయొక్క ఐక్యతకు, కథాగమనమునకు ప్రతిబంధకములైన భగవద్గీతలవంటివానిని విడిచిపెట్టుట

(4) పాత్రలను సజీవములుగ స్ఫురింపజేయుటకు అంగవికారాద్యభినయములను కన్నులకుగట్టినట్లుగా వర్ణించుట

(5) పాత్రలవ్యక్తిత్వము, భిన్నత్వము పరిస్ఫుటమగునట్లుగా శీలమును పోషించుట

(6) ఔచిత్యమును పోషించుట

(7) ఉదయాస్తమయాదివర్ణనలను కథలో మేళవించునట్లు చేయుట

(8) భావరసానుగుణమైన శైలినివాడుట

వీని అన్నిటి సమిష్టిఫలితముగా ఆంధ్రీకరణము సంస్కృతమాతృకకంటె వేయింతలు కళావిశిష్టమయి తనరినది

## (f) ఇతరములు

**చిత్రలక్షణము** - చిత్రలక్షణ మను శీర్షికతో వంగసాహిత్యపరిషత్పత్రికయందు రవీంద్రనారాయణఘోషుగారొకవ్యాసమును ప్రకటించిరి అందలి ముఖ్యభాగములను రామానందచటోపాధ్యాయగారు 'ప్రభాసి' చైత్రమాససంచికయందు ప్రకటించిరి దానిని 'కళ'పత్రికకు పంపుటకొరకు దువ్వూరివారు తెనిగించిరి

బెర్తోల్డ్‌లౌఫర్ (Berthold Laufer) అను జర్మనుపండితుడు టిబెట్‌నందలి తాంజూర్‌గ్రంధమాలనుండి చిత్రలక్షణము' అనునొక శిల్పశాస్త్రమును జర్మను అనువాదముతో ప్రకటించెను అందలి విషయములే ఈ వ్యాసమున సంగ్రహముగా వ్రాయబడినవి

ఇందు ప్రథమాధ్యాయమున చిత్రవిద్యయొక్కయు, చిత్రలక్షణమను గ్రంథముయొక్కయు ఉత్పత్తి వివరింపబడినది ద్వితీయాధ్యాయములో చిత్రవిద్యయొక్క దైవసంబంధపుగాథ వ్రాయబడినది ఈ రెండధ్యాయముల చివర 'నగ్నజిత్‌కృతచిత్రలక్షణము' అని గ్రంధరచయితపేరు చెప్పబడినది మూడవ అధ్యాయమున ముప్పదియారువిధముల నయనభంగుల వర్ణనముగలదు ఇందే చిత్రశిల్పపద్ధతినిగూర్చికూడ చెప్పబడినది

**నాకవితానుభవములు** - కవికి కావ్యమునకు అవినాభావసంబంధముగలదు అందుచేత కవుల అనుభవములు వినుటకు లోకము ఉవ్విళ్ళూరు చుండును కవి మనస్తత్త్వము భావప్రపంచము అతనికావ్యములలో ప్రతిఫలించుచుండును

దువ్వూరివారికి ఒక కుగ్రామము నివాసము దాదాపు వారి జీవితమంతయు ఆగ్రామములోనే గడచిపోయినది ఆపరిసరముల ప్రభావమువలననో యేమోగాని రెడ్డిగారిజీవితములోను, కవిత్వములోను గ్రామీణత్వము పరిస్ఫుటముగా నంకితమైయుండును రెడ్డిగారిమిత్రులుకొందరు వారి కావ్యములు ఆత్మచారిత్రక స్ఫోరకములుగా నుండునని అందురట

వీరికికవిత్వము యాదృచ్ఛికముగా లభించినదట ప్రథమకవితాసందర్శనమునకు దారితీసిన పరిస్థితులను గూర్చి-

గూళులకువచ్చు పక్షుల కూజితములు
సంజకెంజాయ గారడీ చక్కదనము
విరులవినవచ్చు కీటకావ్యక్తగీతి

కాపు వానినిపై తమ కవినొనర్చ' అని వారేచెప్పుకొనిరి తరువాతకొంతకాలము చిత్రలేఖనములో మునిగిపోయి కవితను మరచినారు మరల కవితావిర్భూతికొరకు తపించిపోయి చివరకు సాధించినారు

ఈ సారస్వతవ్యాసములన్నింటిని పరిశీలించినచో దువ్వూరివారి వ్యాసరచన ఎట్లుండునో మనము వెంటనే ఊహింపగలము కవిత్వతత్త్వాదులు కడుజాగ్రత్తతో చదివినగాని పరితకు అర్థమగుట కష్టము కాని దువ్వూరివారు కఠినములుగాదోచు అట్టి విషయములనుగూడ మనకు అనుభవములోనున్న ఉదాహరణములు చూపుటద్వారా సులభముగా అర్థమగునట్లు గావించియున్నారు ప్రతివ్యాసము ఇంచుమించుగా ఉదాహరణలపూర్వకముగ వివరింపబడినది

రెడ్డిగారికి చిత్రలేఖనమునందుకూడ మంచి పాండిత్యముగలదు అందుచేత కవిత్వమున కొంతచిత్రలేఖనమును, చిత్రలేఖనమునకొంత కవిత్వమును అవిభాజ్యముగ మిశితమై ఉన్నవని గ్రహించి ఆయాసందర్భములందు చిత్రలేఖన, కవిత్వములకుగల కొన్నిపోలికలను, భేదములను వివరించియున్నారు అంతియేగాక చిత్రమునుగీయుట అనునది ఎట్లుగీచిన రమణీయతను పొందునోదెల్పినారు అట్లే మానవచర్యలకు భిత్తికగా ప్రకృతిని వర్ణించినచో కవిత్వము రమణీయముగానుండునని తెలిపినారు

ఈ వ్యాసములు వారికి వ్యాసవిషయ ప్రకటనము చేయుటయందుగల నేర్పును, చిత్రలేఖనమునందు వారికిగల అనుభవమును పట్టియిచ్చుచున్నవి 'కవి' మున్నగు వ్యాసములందు వారుప్రదర్శించిన భావుకత ప్రశంసనీయమైనది

# షష్ఠాధ్యాయము

# శైలి - అలంకారాదులు

ఇంతవరకు దువ్వూరివారి సాహిత్యసృష్టిని ఆయా ప్రత్యేకవర్గములుగా వింగడించి పరిశీలించుట జరిగినది అందు ప్రధానముగా వారిలేఖిని ఏఏప్రక్రియలయందు ఏతీరున ఎంతవరకు విహారము చేసినదియో స్పష్టము చేయబడినది ఈ అధ్యాయమున భిన్నప్రక్రియలయందలి వారిరచనలన్నింటను అభివ్యక్తములైన శైలి, అలంకారము ఇతివృత్తము వర్ణనలు అను ప్రధానసాహిత్యాంగముల విశిష్టత పరామర్శింపబడుచున్నది

## (1) శైలి

వృత్తి, రీతి శయ్య, పాకముల సమన్వయముచే శైలి ఏర్పడుచున్నది ఆంగ్లమున Style అనునది దీనికి సమానార్థకముగ నుపయోగించుచున్నారు Style నకు Composition అనునదికూడ సమానార్థకముగా వాడబడుచున్నది కాని Composition అనునది Style లో ఒక భాగముమాత్రమే పదములు, వాక్యములు, పేరాగ్రాఫులను ఒకక్రమములో అమర్చుటకు Composition అని పేరు కాని Style అనునది Hudson ప్రకారము Intellectual, Emotional, Aesthetic అను మూడుగుణముల సమన్వయము Intellectual అనునది Composition నకు పర్యాయపదముగా జెప్పవచ్చును ఇది కేవలము కవియొక్క ఆంతరభావములకు బాహిరరూపమని చెప్పవచ్చును రెండవది Emotional element

"The Emotional element brings these thoughts clearly before the reader, in it lie his force, his power of suggestion, his capacity to move the reader by his writing, to make him share his own state of mind at the time of writing" 1

ఈపద్ధతిలో శైలిఅనునది కేవలము విజ్ఞానశాస్త్రజనితమై క్రమముగా కళగామారినదని తెలియుచున్నది ఇది Composition కంటె అతీతమైన శక్తిని గలిగియున్నది

ఇక మూడవది Aesthetic element "The aesthetic element comprises the artistic graces of style which give a more imme-

diate pleasure than the first two, its musical quality, its picturesqueness its polish, its perfection of form and whatever else gives it beauty and charm ' 2

ఇది సాహిత్యశైలీస్వరూపము మాలాకారుడు తాను ఎన్నికచేసికొనిన పుష్పములు ఒకక్రమములో కూర్చి మాలలను ఎట్లు అందముగా రచించునో అట్లే కవియును తాను తగినస్థానములో తగినపదములనుగూర్చి పదముల కన్యోన్యమైత్రి కూర్పవలసియున్నది అట్లుచేసిన రచన కవియొక్క ఆలోచనలను పరితముందుంచ సమర్థవంతమై, రసవంతముకూడ నయి యుండినయెడల అట్టిరచన అత్యుత్తమమని చెప్పవచ్చును

ఒక్కొక్క రచయితశైలి ఒక్కొక్కవిధముగా నుండును అందుచేత మనము గొప్పరచయితలను కేవలము వారురచనచేయు పద్ధతులవలన వారెవరో పత్రికాదులద్వారా తెలియకపోయినను ఊహించి ఇది ఈకవిదై యుండవచ్చునని గుర్తింపగలుగుదుము ఇది శైలియొక్క మహత్త్వము

**కావ్యములందలి శైలి** - శైలి విషయమున తెలుగుభారతము పుట్టిననాటి నుండి పరిశీలించినచో రెండుమార్గములు కన్పట్టును ఒకటి ప్రౌఢసమాసగుంభితమై శయ్యాసౌభాగ్యమే పరమలక్ష్యముగా గలది రెండవది తేటతెనుంగుమాటల కూర్పుగలిగి భావగాంభీర్యము ప్రధానముగా గలిగినట్టిది ఆంధ్రకవులలో ప్రబంధకవులు శయ్యాసౌభాగ్యముకొరకు పాటుబడిరి దువ్వూరివారు ప్రథమ దశలో అనగా 1916_1917లలో రసికజనానందము, అహల్యానురాగము, కృష్ణనిరాయబారము అను ప్రబంధములను రచించిరి అందలిశైలి ప్రౌఢసమాసములు గలిగి శయ్యాసౌభాగ్యముతో నొప్పారుచున్నది

"పలుకున్ బోటి విపంచికా నవరస వ్యాబద్ధగీతంబులన్
వలపింపన్ నిలుపోపలేనితమి జేరంజీరి కర్ణోత్పలా
విలసద్గండము నొక్కినొక్కి యధరావిర్భూతసౌరభ్యసం
కులమాధ్వీరసమత్తుడౌ విధియు మాకుంగూర్చు దీర్ఘాయువుల్" 3

ఇది రసికజనానందములో బ్రహ్మను స్తుతించిన సందర్భములోనిది

శ్రీకృష్ణరాయబారములో కురురాజేంద్రుడు కొలువుదీరియున్నసమయమున కర్ణుడు భీకరసంగ్రామకళోక్తు లాడుచున్నసందర్భమున-

30

అని వనసౌభాగ్యమును లక్ష్మణుడు పొగడినాడు ఇందలిశైలి ప్రాబంధిక మనియే చెప్పవలయును

కుంభరాణా మాధవవిజయములందు వ్యావహారిక, గ్రాంధికశైలులు రెండును వాడబడినవి కొన్ని పాత్రల స్వరూపస్వభావములకు తగినట్లుగా పాత్రోచితభాషను వాడినారు ఉత్తమపాత్రల విషయమున గ్రాంధికభాషను వాడినారు

'కాంగెస్‌వాలా' ఏకాంకరూపకముమాత్రము కేవలము వ్యావహారికశైలిలో వ్రాయబడినది అన్నిపాత్రలును వ్యావహారికభాషలోనే సంభాషించుదురు ఇది నాటకములందలి రెడ్డిగారి శైలీపరిణతి

**సారస్వతవ్యాసములందలిశైలి** - ఇందలి వ్యాసములన్నియు సులభ గ్రాంథికములో వ్రాయబడియున్నవి శైలీసౌలభ్యముగలిగి చదువరుల మనస్సులను ఆకట్టుకొనశక్తిగలిగియుండుటయేగాక పఠితకు విసుగునుకలుగనీయక పట్టిచదివించురీతిలో నున్నవి సారస్వతవ్యాసములను రెడ్డిగారికంటెమిన్నగా ఎవరును వ్రాయలేరేమొ అనిపించును

## (11) అలంకారములు

మణికంకణాది భూషణములు శరీరమునకెట్లు అలంకారసాధనములో అట్లే ఉపమాద్యలంకారములు కావ్యశరీరమునకు భూషణములనునది శాస్త్రీయ సంప్రదాయానుసారముగ వచ్చుచున్న ఆచారము

ఈ అలంకారములన్నియు పరిమితపదజాలముతో అపరిమితభావచ్ఛాయలను ప్రకటించుటకు ఏర్పడిన సాధనములని చెప్పవచ్చును కొంతసేపు తర్కించి, విమర్శించి, వివరించినగాని అర్థముగానివిషయములను అలంకారముల సహాయమున తేలికగా జెప్పవచ్చును కవి చెప్పదలచుకొనినభావము స్ఫుటముగా సూటిగా, పఠితహృదయములో ప్రవేశపెట్టుటకు భాషలో బొదుపును సాధించుటకు అలంకారములు చక్కనిసాధనములు వీని విషయములో Newman గారు

"Figure is its necessary medium of Communication with man, for in the feebleness of ordinary words to express its ideas, and in the absence of terms of abstract perfection the adoption of metaphorical language is the only poor means allowed it for

imparting to others its intense feelings " 12 అని సామాన్యమైన మాటలలో కవి తనభావములను వ్యక్తము చేయుటకు మాటలుచాలనప్పుడు అలంకారములే శరణ్యములని తెల్పియున్నారు దీనినిబట్టి కావ్యమునకు, అలంకారములకుగల సంబంధమెట్టిదో మనకు దెలియుచున్నది

దువ్వూరివారు అధికభాగము అర్థాలంకారములనే ప్రయోగించిరి మిక్కిలి తక్కువసంఖ్యలో శబ్దాలంకారములు దొరలినవి అవియును ప్రథమదశలో ప్రబంధవాసనలు తన్ను పరివేష్టించియుండుటచే ప్రవేశింపగలిగినవి

తాను గ్రామీణవాతావరణములో పెరిగినవాడగుటచేత నిత్యముచూచుచున్న ప్రకృతినే అలంకారములయందును జొప్పించినారు వీరి అలంకారములు అర్థముకానిరీతిలో గజిబిజిగానుండక, సామాన్యునకుసైతము సులభముగా నర్థమగు రీతిలో నుండుటయేగాక, అవి సాధారణముగ జీవితములో మనము నిత్యము చూచుచున్న వస్తుసంబంధులగుట ఒకవిశేషము

రెడ్డిగారు అలంకారములపైమోజుతో అలంకారములను ప్రయోగించినవారుగాక, వానిని కేవలము పరితకు సులభముగా అర్థబోధకలుగుటయే ప్రధానాశయముగ రచించినవారు కొన్నికొన్నిచోట్ల ప్రకృతి మానవునికష్టసుఖములలో పాలుపంచుకొనినట్లు వర్ణించుటకొరకు అలంకారములచేపట్టిరి అవియును పొలములలో నిత్యము మనముగాంచు దృశ్యములే

మొత్తముమీద వారుప్రయోగించిన అలంకారములలో ఎక్కువభాగము గ్రామీణవాతావరణసంబంధులై యున్నవి మచ్చునకు కొన్నిఉదాహరణముల నిచ్చుచున్నాడను

**ఉపమాలంకారము** - వాల్మీకి, కాళిదాసాదిమహాకవులు ఉపమాలంకారమునే ఎక్కువగా వాడియుండిరి ఉపమా కాళిదాసస్య' అను లోకోక్తి పండితుల వ్యవహారములో నున్నదియే 'ఉపమైకాశైలూషీ సంప్రాప్తాచిత్రభూమికా భేదాన్' అని ఉపమాలంకారమే మిగిలినఅలంకారములన్నిటికి మూలమైనదిగా జెప్పియున్నారు

"చనిచని యొక్కచో వికచసారసషండమునందు సుప్తమై
గనుగవమోడ్చు హంసివలె గాంతిలు నోర్తుక, బుష్పపుంజమందు నిదురవోవు మాధవవధూమణి బొలినదాని దీవటిం
టను బడియున్నబోటిని దటాలునగాంచె నృపాలమౌళియున్' 13

ఇందుపయోగింపబడిన ఉపమలు సౌందర్యోపాదకములు

ఛేకాను ప్రాసము -

'కొండనెత్తమ్ముల గోరాడు మబ్బుల
గమనసౌందర్యంబు గాంచికాంచి
మేఘోదయంబున మినమిన పురివిచ్చి
యాడునెమ్మల యొప్పు లరసియరసి
యమృతధారలరీతి నచ్చమై ప్రవహించు
సెలయేళ్ళలో గ్రీడ సలిపిసలిపి
ప్రకృతిమంజులమైన పక్షులగానంబు
దమిదీఱ వీనుల ద్రావిత్రావి " 20

ఇందు కాంచికాంచి, అరసియరసి, సలిపిసలిపి త్రావిత్రావి అనుపదములు అవ్యవధానముగ పునరావృత్తిని పొందినవి

అంత్య ప్రాసము -

"పట్టుపొత్తులలోన బన్నుండు గతిమాలి
పులితోలుపై మేను మోపవలసె
సౌధోపవనకేళి జరియింపనోచక
గిరుల గాననముల దిరుగవలసె
గనకాంబరంబుల గైసేయు సిరిలేక
మోటుకంబళి మేన మోయవలసె
నంతఃపురీభోగ మనుభవించుటలేక
పర్ణశాలల గష్టపడగ వలసె" 21

ఇందలి నాలుగుపాదములచివర 'వలసె' అనునది అంత్యప్రాసగా వాడబడినది

ఈవిధముగా జూచినచో దువ్వూరివారిరచనలలో ఎన్నియో అలంకారములు గోచరించును వానినన్నింటిని ఎత్తిచూపుట ముఖ్యోద్దేశము కాదుగాన అలంకారములను వారెట్లు ఉపయోగించికొని రన్నది తెలియుటకుగాను కొన్ని ఉదాహరణముల నిచ్చితిని

## (111) ఇతివృత్తగ్రహణము

**కావ్యములందలి ఇతివృత్తము** - వీరి ప్రథమకావ్యములందలి ఇతివృత్తము ప్రబంధోచితమైనది ఆంధ్రవాఙ్మయమునందలి ప్రబంధములలో

కొన్ని పౌరాణికములు, కొన్ని చారిత్రకములు, కొన్ని సాంఘికములు, కొన్ని కల్పితములునై యున్నవి

రెడ్డిగారు తిరుపతి వేంకటకవులు రచించిన 'శ్రవణానందము' ననుసరించి కథనుకల్పించి రసికజనానందము' అను శృంగారప్రబంధమును వ్రాసిరి ఇందలి ఇతివృత్తము సాంఘికమగుటయేగాక నాయకుడుకూడ రెడ్డికులజుడైన రామకృష్ణారెడ్డియగుట విశేషము ఇందు సామాన్యుడైన రెడ్డియువకుని నాయకుని జేసి ప్రబంధలక్షణములైన ధీరోదాత్తాది నాయకాశ్రయములను వదలి కొంత నవ్యతను జూపినారు రసము విషయమునమాత్రము శృంగారమునకే పట్టము గట్టినారు

అహల్యానురాగము, శ్రీకృష్ణరాయబారములందు పౌరాణికఇతివృత్తమును గ్రహించి రచనసాగించిరి ఋతుసంహారము, పుష్పబాణవిలాసము లనునవి కాళిదాసురచించిన ఋతుసంహారమ్, పుష్పబాణవిలాసమ్ లకు అనువాదములు

తదుపరి రచనయైన 'నలజారమ్మ'యందు తమవంశవృత్తమైన నలజారమ్మ కథను గ్రహించి, కట్టమంచివారి ముసలమ్మ మరణము' ననుసరించి రచన గావించిరి ఈకావ్యమున గ్రహించిన ఇతివృత్తము సాంఘికమగుట, అందున స్త్రీపాత్రకు ప్రాధాన్యమిచ్చుట, కరుణరసస్ఫోరకముగా కష్టాంతము చేయుట యనునవి ఇతివృత్త నిర్వహణమునందలి కొన్ని నవ్యలక్షణములు ఇది దువ్వూరివారి రచనలలో ఇతివృత్తగ్రహణమునందు పూర్తి నవ్యతనుచూపిన ప్రప్రథమకావ్యము

వనకుమారి'లో గొర్రెలకాపరులుగా ప్రవాసజీవితము గడుపుచున్న వృద్ధ రాజు, అతనికుమార్తెలకథ చిత్రింపబడినది ఇతివృత్తము Pastoral Poetry కి సంబంధించినది ఇది ఇతివృత్తగ్రహణమునందు మరియొక నవ్యత ఈ 'వనకుమారి'ని దువ్వూరివారు మొదట విషాదాంతముగా రచించిరి కాని తదుపరి విజయనగరపరీక్షకుల మెప్పుకొరకు తమరచనను సుఖాంతముజేసిరి

పిమ్మటరచించిన 'కృషీవలుడు' కర్షకజీవితమునే ప్రధానముగాజేసికొని రచించినకావ్యము ఈవస్తునవ్యతనుదలచి లోకము తనను నిందించునని కవిగారే శంకించినారు కృషీవలునిజీవితమును ప్రధానముగా గ్రహించి వ్రాసిన కావ్యములలో నిదియే మొట్టమొదటిదని చెప్పవచ్చును

జలదాంగన'లో జలదము తన ఆత్మకథను కవిగారితో జెప్పినది 'కడపటివీడ్కోలు'లో అమలినశృంగారసిద్ధాంతము ప్రతిపాదింపబడినది 'యువక స్వప్నము'లో సాంఘికేతివృత్తముద్వారా స్వాతంత్ర్యేచ్ఛను పురి గొల్పినారు 'పలితకేశము'లో నెరసినవెంట్రుక ఆధారముగ జీవనవ్యాఖ్యానములు చేయబడినవి 'కవి-రవి'లో సూర్యునికిసంబంధించిన జ్ఞానము చెప్పబడినది

ప్రప్రథమమున ప్రబంధానుగుణమైన ఇతివృత్తమును గ్రహించి రచనలు గావించిన వీరు, తదుపరి సాంఘికేతివృత్తాదులను గ్రహించి నవ్యసాహిత్య మార్గానుయాయులై కొన్నికావ్యములను రచించిరి పానశాల, గులాబితోట, పండ్లతోట లనునవి క్రమముగా పారసీభాషలోని ఉమర్ఖయాము రుబాయత్, గులిస్తాన్, బోస్తాన్‌లకు భావానువాదములె

**ఖండకావ్యములందలి ఇతివృత్తము** - ఖండకావ్యములు భావప్రధానములు కవికి తానుచూచిన లేక అనుభవించిన విషయములవలన కలిగిన భావోద్రేకమే ఈ ఖండికలయందు గోచరించును దువ్వూరివారు తననాటి భారత జాతిదుస్థితిని చూచి విచారించినారు ఆంగ్లేయులపాలనను నిరసించి దేశ స్వాతంత్ర్యమును కాంక్షించినారు దేశవిమోచనము గావింపవలయునన్న ప్రజలను ఉత్తేజితులను చేయవలయును కావున తమకలమును దేశదాస్యనిర్మూలనముకొరకు ఉపయోగించినారు తత్కారణముగా వీరు అధికసంఖ్యలో ఖండికల ద్వారా దేశభక్తికవిత్వమును వెలువరించిరి

తాను పచ్చపొలముల కాపగుటచేత ప్రకృతి వారిని ఆకర్షించినది ప్రకృతిని మానవీకరించుటయేగాక, ప్రకృతి తమకష్టసుఖములలో పాలుపంచుకొనినట్లు చిత్రించినారు వీరికి ప్రకృతిలోని గరిక మొదలు దృశ్యమానమైన ప్రతి వస్తువును సుందరముగానే దోచినది ఆకారణముగా ప్రకృతికవిత్వమునకుకూడ ఇంచుమించుగా దేశభక్తికవిత్వమునకు ఇచ్చినస్థానమునే ఇచ్చినారు

దువ్వూరివారుకూడ నవ్యకవులఒరవడిలోనే ప్రణయకవిత్వమును రచించిరి వారివలెనే స్త్రీకిపూజ్యస్థానమును, వియోగశృంగారమునకు సంయోగశృంగారమునకన్న ప్రాధాన్యమును ఇచ్చియున్నారు

తదుపరి భావకవిత్వములో ఇతరశాఖలైన భక్తి, స్మృతి కవిత్వాదులను గూడ వారు చేపట్టి ఖండికలు రచించిరి

**నాటకములందలి ఇతివృత్తము** - ప్రథమదశలో రచించిన 'కర్షకవిలాసము'లోని ఇతివృత్తము సాంఘికమైనదియే అందలి కొన్నిపాత్రలు ఆనాటి సామాజికజీవితమునకు ప్రతిబింబములని చెప్పవచ్చును

1921లో రచించిన 'సీతావనవాసము' నాటకమున పౌరాణిక ఇతివృత్తమును గ్రహించినారు ఇందు నాంది రెండువిష్కంభములు, అంతమున భరతవాక్యము ప్రయోగింపబడినవి 1924లో రచించిన 'కుంభరాణా' అనునది మీరాబాయి చరిత్రకు సంబంధించినది ఇందు కుంభరాణా పాత్రకు ఉన్నతస్థానము గల్పించి షేక్స్పియరువిషాదాంతనాటకములలోని నాయకునిలక్షణములన్నియు సమకూడునట్లు చేసియున్నారు ఇందలి ఇతివృత్తము చారిత్రకము తదుపరి నాటకము 'మాధవవిజయము' పౌరాణిక, చారిత్రక, సాంఘిక విషయములను సమ్మిశ్రితముజేసి రచించినట్టిది 1935లో రచించిన కాంగ్రెస్‌వాలా' అను ఏకాంకికయందలిపాత్రల సంభాషణమంతయు ఉచితమైనవాడుకభాషలో వ్రాయబడినది ఇది సమకాలీనమైన రాజకీయేతివృత్తమును ప్రధానముగా గలిగిన సాంఘిక నాటిక

ఈవిధముగావారు నాటకరచనయందు వివిధములైన ఇతివృత్తములను గ్రహించిరి

## (IV) వర్ణనలు

పురాణకవులదృష్టిలో కథాకథనమునకే ప్రాధాన్యముకాని వర్ణనలకుగాదు ప్రబంధమునకు వర్ణనలు ప్రధానమైనవి అష్టాదశవర్ణనాత్మకమై మహాకావ్యముండవలయునన్నప్పుడు ప్రబంధము వర్ణనాప్రధానమనువిషయము తెలియుచున్నది వర్ణనలవిషయములో కొన్నినియమములు గలవు

(1) వర్ణనలు కథాగమనమునకు సహకారులై యుండవలయునేగాని దానినినిరోధించునవిగా నుండరాదు

(2) వర్ణనలయందు అక్లిష్టత యుండవలయును

(3) వర్ణనలుజేయునెడల ఏఅంగమునకాఅంగము వర్ణించుటకంటె ఆకారమంతయు స్మృతిపథమున మెదలునట్లు వర్ణించుటమేలు

దుప్పూరివారుకూడ వర్ణనలవిషయములో "రమణీయవస్తువులు తమంత తామే వర్ణనాయోగ్యము లయ్యును అవి మానవచర్యలకు భిత్తికయయి కావ్యవర్ణ

నములో మిళితమైనప్పుడు మరింతసుందరముగ నుండు" 22 నని తమ అభిప్రాయమును వెలిబుచ్చిరి తదనుగుణముగనే వర్ణనలను గావించియున్నారు పీరి వర్ణనలలో అత్యధికభాగము గ్రామీణప్రకృతికి సంబంధించి యుండుట ఒక ప్రత్యేకత

**కావ్యములందలి వర్ణనలు** - దువ్వూరివారు తమ కవితాభ్యాసకాలమున రచించిన కావ్యములలోని వర్ణనలు ప్రబంధధోరణిలోనే యున్నవి 'రసికజనానందము'లో -

"అంగజ సంగరక్లిశిత హల్లకపాణుల చెక్కుజెమ్మటల్
రంగుగజోపునేర్పున నిరంతరమున్ మృదుమందవాయువుల్
గాంగతరంగసంచలితకాంచన వారిజసౌరభార్ద్రితన్
బంగరుమేడ సోరణలబాట జరించు సుశీతలంబులై ' 23

అని సుశీతములై చరించు మందవాయువులను వర్ణించినతీరును గమనించినచో ప్రథమదశలో వర్ణనలవిషయమున పీరిదృక్పథము తెలియగలదు

తదుపరి రచనలైన నలజారమ్మ వనకుమారి వస్తునవ్యతను ప్రదర్శించిన కావ్యములు కాని పీనియందలి వర్ణనలుమాత్రము కొంతవరకు ప్రబంధ ధోరణిలోనే ఉన్నవి

'నలజారమ్మ'లో గూడూరునందలి సరస్సువర్ణనమును గమనించినచో అది ప్రాబంధికధోరణియని స్పష్టపడగలదు

"ప్రోలికి దక్షిణంపుదిశ బుష్కరపుష్కలమై, ప్రకంపనాం
దోళితవీచికానికరతుందిలమై, కలహంసచక్రమీ
నాలయమై, విశుద్ధసలిలాశయమై తనరుం దటాకము
త్తాల తటావృతంబునయి తగ్గకనిరు నిదాఘకాలమేన్" 24

అట్లే వనకుమారి' యందు -

"చటులానిలముపీచి పెటపెటదరుశాఖ
లొండొండు విటిగి వనోర్వి జాఱ
సీడజంబులుగట్టు నిడముల్ చిందఱ
వందఱై పోవంగ బక్షిశాబ
కములు గాయములొంది 'కాపుకా'వని కూయు
గరుణమై వృక్షకోటరములందు

జివురుటాకులు పేర్చి చిన్నికూనలజేర్చి
కాచుచుంటినిగదా గహనసీమ" 25

అని వనకుమారి చింతించుసమయములో నున్నవర్ణనలు ప్రబంధకవులు చేసినవే

1919 నుండి అనగా దాదాపు కృషీవలుడు' మొదలుకొని రచించిన కావ్యములందలి వర్ణనలన్నియు ఇంచుమించు నవ్యతానిర్భరములై యున్నవి అందలివర్ణనలు స్వాభావికములు విన్నదానికన్న కన్నదానికే ప్రాధాన్యత నిచ్చిరి

"అప్పుడప్పుడె విచ్చియలరు చేమంతుల
కమ్మనినెత్తావి గడలుకొనగ
రత్నకంబళమట్లు రాణించి బీఱల
బలువన్నెపూవులు బలిసివిరియ
వ్రాలబండిన రాజనాల కేదారంబు
పంటలక్ష్మికి నాటపట్టుగాగ
ప్రొద్దునిగ్గులుసోకి పొగమంచుమబ్బులు
బంగారువలిపంబు పగిదివ్రేల ' 26

ఈవర్ణన కృషీవలజీవితమునకు సంబంధించిన అంశములలోనిది ఇదిరెడ్డిగారు తాము నిత్యము గ్రామీణవాతావరణములో చూచుచున్నదృశ్యమే

"నిలువనీరునబండి రాణించుచున్న
పైరుపొలముల విహరించు పంటలక్ష్మి
యొరపుబయ్యెద బంగారుమెఱపు లనెడు
సంజనిగ్గుల వరిమళ్ళు చాయలొలికె " 27

ఇందు వరిమడులయొక్క సౌందర్యము వర్ణింపబడినది ,

**ఖండకావ్యములందలి వర్ణనలు** - ప్రథమదశలోవ్రాసిన కొన్ని ఖండికలలోని వర్ణనలు ప్రబంధధోరణిలో నడచినవే

"సరసకవీశ' నీయశము సర్వదిగంచల చంచలేక్షణా
వరకుచచందనాంకమయి పండితచిత్తచకోరచంద్రికో
త్కరమయి, కాలపత్రమున గట్టిగవ్రాసిన వర్ణపంక్తియై
ధరవెలుగొందుతన్ జనవితానము సన్నుతియింప నిత్యమున్" 28

ఇందలి పదప్రయోగములను గమనించినచో ఇది ప్రబంధధోరణియని స్పష్ట పడుచునే యున్నది

ఖండకావ్యములలోకూడ ఎక్కువభాగము నవ్యకవితాసంబంధులే తాము దర్శించిన విషయములను సుందరముగా వర్ణించిరి

"చిలుకలదండు కేంకృతులుసేయుచు మామిడియాకుతోరణం
బులు చదలెల్లగట్టినటుమూగి, చివుక్కునవ్రాలి, దోరకం
కుల దమనోటబెట్టుకొని గూళులకుం గొనిపోవుచుండె సం
చలనములేని నామనము సందడిచప్పటికులిక్కి మేల్కనెన్ ' 29

ఇందు చిలుకలు దోరకంకులను ముక్కున గరచుకొనిపోవుట సహజముగావర్ణింప బడినది ఆకాశమున ఎగురుచున్న చిలుకలదండులు పచ్చనిమామిడియాకు తోరణ ములు గట్టినట్లున్నవని ఊహించుట రైతుబిడ్డకే చెల్లినది

వారిప్రకృతిప్రీతికి మరియొక ఉదాహరణము చూపుదును

"సాలెగూళుల ముత్తెంపుసరము లటుల
లేతగాలికి నల్ల జలించు మంచు
నీటిబొట్లమాలను గట్టి నీదుమెడను
వైవ దలపోసి యెగతాళిపడితి చెలియ " 30

సాలెగూళులలో పడిన మంచుబిందువులు ముత్తెపుసరములవలె దోచుచున్నవట ఇది సహజముగా గనుపించు ప్రకృతిదృశ్యమే

ప్రథమదశలో కావ్య ఖండకావ్యరచనలలో కొంతవరకు ప్రాబంధికవర్ణ నల ననుసరించి వర్ణనలుగావించినను, రెండవదశలో ఆపద్ధతికి స్వస్తిచెప్పి తాముగాంచిన విషయములకే అధికప్రాధాన్యమిచ్చి వర్ణనలుగావించి నవ్యతను జూపిరి

# ఉపసంహారము

'కవికోకిల'గా ఆంధ్రసాహిత్యలోకమున ప్రసిద్ధులైన దువ్వూరి రామిరెడ్డిగారు విభిన్నవర్గములకుచెందిన కావ్యములను ఖండకావ్యములను రచించుటయేగాక ఇతరప్రక్రియలైన నాటకము, వ్యాసము, శతకము మున్నగువానిని కూడ చేపట్టి చక్కని రచనలు గావించి, ఆంధ్రసహృదయలోకమునకు తమ మధుర కవిత్వమును రుచిచూపించి మైమరపింపజేసినారు

ఆంధ్రదేశము వీరిని కర్షకకవిగా గుర్తించినది కృషీవలులజీవితమును కథావస్తువుగా దీసికొని ఆధునికయుగమున రచింపబడిన కావ్యములలో దువ్వూరి వారి 'కృషీవలుడు' మొట్టమొదటిది దీనిని దువ్వూరివారు ఆంగ్లభాషలోని 'Pastorals' అనబడు కావ్యరీతులననుసరించి వ్రాసియుండిరి ఆ Pastorals నే మనము కృష్యాదిగ్రామజీవనాధారములని చెప్పవచ్చును

పానశాల' కర్తగా దువ్వూరివారిస్థానము గణనీయమైనది ఎందరో రచయితలు ఉమరుఖయాము రుబాయీలను తెలుగులోనికి అనువదించిరి కాని దువ్వూరివారి 'పానశాల'కు వచ్చిన పేరుప్రఖ్యాతులు మరియేకావ్యమునకును రాలేదనిన అతిశయోక్తి కానేరదు వారు రచనలో అనుసరించినపద్ధతియే ఇంతటి కీర్తి వచ్చుటకుగల కారణము

దువ్వూరి శాస్త్రకావ్యనిర్మాత జలచర, భూచర,ఖచరములచే విలసితమైన జడమయమైనసృష్టి ఉత్పత్తినిగూర్చి అనేక మతభేదములు గలవు సృష్టిసంబంధమైన ఇట్టి విభిన్నవిచారములను స్పష్టముచేయుచు కథోపకథనరూపమున 'కవి-రవి' అను కావ్యమును రచించిరి తెలుగుకావ్యజగత్తులోని ఇటువంటి రచనలలో ఇదియే మొట్టమొదటిదని చెప్పవచ్చును

'జలదాంగన' అను శాస్త్రకావ్యము రామిరెడ్డిగారి ప్రతిభ కల్పనాచాతురులకు చక్కని ఉదాహరణము కవి కల్పనాలోకములో మేఘసుందరితో కలియును ఆమె తనకథను వినిపింప మొదలుపెట్టును ఇందు జలదములు ఏర్పడు శాస్త్రపద్ధతి కథారూపముగ చెప్పబడినది

కవికోకిల సమాజజీవితతత్త్వము నెరిగినవారు సమాజములోని అంధవిశ్వాసములను, ధార్మికఆచారవ్యవహారాదులను భగవంతునిపేరిట జరుగు అత్యాచారములను ఖండించుచు 'పలితకేశము' అను కావ్యమును రచించిరి

పాశ్చాత్యసభ్యతతో పరిచయముగలిగిన ఈయుగములో ప్రాతరీతిరివాజులను వదలిపెట్టవలసినదిగను ప్రబోధించినారు

రెడ్డిగారు నీతికావ్యనిర్మాత పారసీభాషలో ప్రముఖకవి సాదీరచించిన గులిస్తాన్ బోస్తాన్ అను ప్రసిద్ధనీతికావ్యములను తెలుగుభాషలోనికిదెచ్చి తెలుగుసాహిత్యలోకమున కెంతయో మేలుచేసిరి అందలినీతులలో కొన్ని సార్వకాలికములు, సార్వజనీనములునై యున్నవి

వీరు దేశాభిమాని గాంధీయుగములోని చైతన్యము ఈకవిలో జాతీయతను రగుల్కొల్పినది రెడ్డిగారు రచించిన ఖండికలలో ఎక్కువభాగము దేశభక్తిసంబంధులే 'మాతృశతకము'అను వారి దేశభక్తిపూరితమైన రచన ఆంగ్లేయ ప్రభుత్వముచే నిషేధింపబడి చాలకాలము వ్రాతప్రతులరూపములోనే ప్రచారములోనున్నదనిన వారిదేశభక్తి ఎంత విశిష్టమైనదో మన మూహింపవచ్చును

దువ్వూరివారు ప్రకృత్యారాధకులు గ్రామీణవాతావరణములో పెరిగినవారగుటచేత అపల్లెల ప్రకృతిశోభ వారి నాకర్షించినది ప్రకృతిలోని గరికమొదలు ప్రతివస్తువు వారికి ఆనందమయముగనే గనుపించినది ప్రకృతికవిత్వమును రచించిన వారిలో దువ్వూరికొక ప్రత్యేకస్థానము గలదు

శైలివిషయములో దువ్వూరివారు గ్రాంథిక, వ్యావహారికములలో ఏఒక్కదానిపైనను పక్షపాతము చూపినవారు కారు ఏఒక్కశైలిని తిరస్కరించలేదు వ్యావహారికభాషకుకూడ వాఙ్మయములో విశిష్టస్థానముగలదని గ్రహించినారు ఈవిషయమున నితడు సమన్వయవాది

ఈవిధముగా రెడ్డిగారు కర్షకకవిగా, పానశాలకర్తగా, శాస్త్రకావ్యనిర్మాతగా, సమాజజీవితమర్మము నెరిగినవారుగా, నీతికావ్యనిర్మాతగా, దేశభక్తునిగా, ప్రకృత్యారాధకునిగా ఇంకను పలురీతుల ఆధునిక ఆంధ్రవాఙ్మయమున వారికి లభించిన స్థానము స్థిరమైనది గణనీయమైనది.

అట్టి వీరిరచనలలోని కావ్య, ఖండకావ్యములను ప్రత్యేకపరిశీలనాంశములుగా గ్రహించి ఆయా కావ్య, ఖండకావ్యములందలి వారిదృక్పథములను బహిర్గతముగావింప ప్రయత్నించితిని సహృదయు లాదరించినయెడల నాయీ ప్రయత్నము సఫలమైనట్లే భావింతును

❖

# ఉపయుక్త గ్రంథసూచిక

## (A) రామిరెడ్డిగారి రచనలు


1 కడపటివీడ్కోలు నెల్లూరు కవికోకిల గ్రంథమాల 1966

2 కర్షకవిలాసము (నాటకము) మచిలీపట్నం త్రివేణీపబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్, 1981

3 కవికోకిల గ్రంథావళి-2 చెన్నపురి వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు 1935

4 కవికోకిల గ్రంథావళి-3 చెన్నపురి వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్ 1936

5 కవికోకిల గ్రంథావళి-4 నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1967

6 కవికోకిల గ్రంథావళి-5 నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1967

7 కవికోకిల గ్రంథావళి-6 పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1956

8 కృషీవలుడు పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1957

9 జలదాంగన నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1964

10 నలజారమ్మ పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1961

11 పలితకేశము పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1962

12 పానశాల పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1975

13 భగ్నహృదయము పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1967

14 యువకస్వప్నము నెల్లూరు కవికోకిల పబ్లికేషన్సు, 1952

15 వనకుమారి నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1963

**16 The Voice of the Reed Madras Ganesh and Co, 1924**


## (B) ఇతరములు

### (1) ఆంధ్ర గ్రంథములు


**1.** అప్పకవి, కాకునూరి అప్పకవీయము మద్రాసు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్సు, 1970

2 ఉమాకాన్త విద్యాశేఖరులు నేటికాలపుకవిత్వం చెన్నపురి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1928.

3 కులశేఖరరావు ఎం సంపా సాహితీమంజూష సారస్వతవ్యాససంపుటి హైదరాబాదు కళాస్రవంతి, 1973

4 కృష్ణమాచార్యులు, ఎన్ వి ఆర్ కావ్యాలోకము హైదరాబాదు తెలుగు అకాడమి 1973

5 కృష్ణశాస్త్రి దేవులపల్లి శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రికృతులు రాజమండ్రి రాతు చంద్రయ్య అండ్ సన్స్, 1958

6 చలం ఉమర్ ఖయ్యామ్ రుబాయీలు విశాఖపట్నము బుక్ సెంటర్, 1968

7 జగన్నాధరావు, V etc, ఇంటర్మీడియట్ జంతుశాస్త్రము తృతీయ భాగము హైదరాబాదు తెలుగు అకాడమి 1971

8 జానకిరామయ్య, ఆచంట కన్వీనర్ రవీంద్రశతవార్షికోత్సవ విశేషసంచిక హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్యఅకాడమి, 1961

9 తిరుపతి వేంకటేశ్వర కవులు శ్రవణానందము కడియం వేంకటేశ్వర పబ్లికేషన్సు, 1956

10 తెలుగువాణి హైదరాబాదు ప్రపంచతెలుగు మహాసభలు, 1975

11 తెలుగువైతాళికులు 11 హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1977

12 దుర్గాప్రసాద వెంకటరమణ మల్లికార్జునకవి, కొప్పరపు కర్షకుడు సికింద్రాబాదు కొప్పరపు కామేశ్వరీదేవి, సచ్చిదానందాశ్రమం 1963

13 నరసింహం, ఎమ్ భౌతికశాస్త్రము, చెన్నపురి, విజ్ఞానచంద్రికా గ్రంథమాల, 1911.

14 నవజాత శ్రీఅరవిందులు న్యూఢిల్లీ నేషనల్ బుక్ట్రస్టు, ఇండియా, 1973

15 నాగభూషణశర్మ, మొదలి తెలుగుసాహిత్యం గాంధీజీప్రభావం హైదరాబాదు గాంధీసాహిత్యప్రచురణాలయము, 1970

16 నారాయణరావు, వెల్చేరు- తెలుగులో కవితావిప్లవాల స్వరూపం విజయవాడ విశాలాంధ్ర ప్రచురణాలయం, 1978

17 నారాయణరెడ్డి, సి ఆధునికాంధ్రకవిత్వము సికింద్రాబాదు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్సు, 1977

18 పట్టాభిసీతారామయ్య, భోగరాజు కాంగ్రెసుచరిత్ర అలహాబాదు అఖిల భారత జాతీయ మహాసభాకార్యనిర్వాహకవర్గము, 1936

19 ప్రసాదరావు పెద్దిబోయిన రైతుగీతాలు

20 పాపయ్యశాస్త్రి, జంధ్యాల ఉదయశ్రీ గుంటూరు కరుణశ్రీ కావ్యమాల, 1970

21 పెద్దన అల్లసాని మనుచరిత్రము మద్రాసు వేంకట్రామ గ్రంథమాల, 1968

22 బలరామాచార్య, మడిపడగ ఉమరుఖయ్యాం అమరగీతాలు హైదరాబాదు చందానారాయణశ్రేష్ఠి, 1962

23 బుచ్చిబాబు షేక్స్పియరుసాహితీవిమర్శ విజయవాడ ఆదర్శగ్రంథ మండలి, 1966

24 బుచ్చిసుందరరామశాస్త్రి, మాధవపెద్ది ఉమర్ఖయాం రాజమండ్రి శ్రీసత్య నారాయణ బుక్‌డిపో, 1951

25 ముద్దుకృష్ణ సంక నవీనకావ్యమంజరి మద్రాసు ప్రతిమాబుక్స్, 1959

26 ముద్దుకృష్ణ సంక వైతాళికులు విజయవాడ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్ 1973

27 రమణారెడ్డి, కె వి కవికోకిల నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1965

28 రమణారెడ్డి, కె వి కవికోకిలడైరి-ఉత్తరాలు నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1961

29 రమాపతిరావు, అక్కిరాజు వీరేశలింగముపంతులు సమగ్రపరిశీలన విజయవాడ విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, 1972

30 రంగయ్యప్పారావు ఉమర్ఖయ్యామ్ రుబాయ్యాత్ విజయవాడ వంశీప్రచు రణలు, 1965

31 రాఘవశర్మ, గురజాడ సంపా జాతీయగీతాలు హైదరాబాదు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమి, 1973

32 రామకృష్ణారావు, బూర్గుల సారస్వతవ్యాసముక్తావళి హైదరాబాదు ఆంధ్ర సారస్వత పరిషత్తు

33 రామరాజభూషణుడు కావ్యాలంకారసంగ్రహము సికింద్రాబాదు యమ్ శేషాచలం అండ్ కంపెనీ, 1976

34 రామలింగారెడ్డి, కట్టమంచి కవిత్వతత్త్వవిచారము మద్రాసు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1933

35 రామలింగారెడ్డి, కట్టమంచి ముసలమ్మమరణము ఇత్యాదులు పటమట ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు, 1960

36 రామానుజరావు, దేవులపల్లి సారస్వతనవనీతము సికింద్రాబాదు మోసెస్ అండ్ కో

37 లలితకుమారి, డి ఆధునికాంధ్రకవితాతత్త్వము విశాఖపట్నము రచయిత్రి, 1980

38 లక్ష్మీకాంతం, పింగళి సాహిత్యశిల్పసమీక్ష హైదరాబాదు మాధవి బుక్ సెంటర్స్, 1976

39 లక్ష్మీకాంతశాస్త్రి, శిష్ట్లా తిరుపతి కవుల సాహిత్యసమీక్ష విజయవాడ నిర్మలాపబ్లికేషన్సు, 1963

40 లక్ష్మీసత్యనారాయణ దామరాజు, శాస్త్రి, A V R బి ఎస్‌సి భూవిజ్ఞాన శాస్త్రము ద్వితీయభాగము హైదరాబాదు తెలుగు అకాడమి, 1971

41 వీరభద్రరావు, కొత్తపల్లి తెలుగు సాహిత్యముపై ఇంగ్లీషు ప్రభావము సికింద్రాబాదు రచయిత, 1960

42 వేంకట్రామానాయుడు, నెల్లూరి ప్రకాశకులు స్వప్నప్రయాణము మద్రాసు ఆంధ్రపత్రిక ప్రెస్సు

43 వేంకటరామనరసింహం, కాకర్ల ఆంధ్రప్రబంధము అవతరణ వికాసములు వాల్తేరు ఆంధ్రాయూనివర్సిటీ ప్రెస్సు 1965

44 వేంకట రామనరసింహం, కాకర్ల సాహిత్యదర్శనము విశాఖపట్టణము కె హరనాథ్ అండ్ బ్రదర్సు, 1973

45 వేంకటసీతాపతి గిడుగు షేక్స్పియరురచనలు సవిమర్శక ప్రశంస విజయవాడ దేశిబుక్‌డిస్ట్రిబ్యూటర్సు, ద్వితీయముద్రణ

46 వేంకట సుబ్బయ్య, అప్పజోడు షట్పది కావలి శ్రీనివాస బుక్ హౌస్, 1964

47 వేంకటసూర్యనారాయణ, బయ్యా కౌస్తుభము హైదరాబాదు శ్రీవిద్యా ఆర్టు ప్రింటర్సు, 1978

48 వేంకటావధాని, దివాకర్ల సంపా విజ్ఞానసర్వస్వము సంపుటి 6 మద్రాసు తెలుగు భాషాసమితి, 1961

49 వేంకటావధాని, దివాకర్ల ఆంధ్ర వాఙ్మయ చరిత్రము హైదరాబాదు ఆంధ్రసారస్వతపరిషత్తు, 1974

50 వేంకటేశ్వరరావు, కాటూరి సంక కావ్యమాల న్యూఢిల్లీ సాహిత్య అకాడమి, 1976

51 వేంకయ్య కొండవీటి కర్షకా విప్పర్ల రచయిత, 1938

52 శమంతకమణి, పండా తెలుగు సాహిత్యములో రామకథ హైదరాబాదు ఆంధ్రసారస్వత పరిషత్తు, 1972

53 శాయిరెడ్డి, గంగుల కాపుబిడ్డ సికింద్రాబాదు సాహిత్యకళాపీఠము, 1950

54 శ్రీకాంతశర్మ, ఇంద్రగంటి సాహిత్యపరిచయం విజయవాడ నవోదయ పబ్లిషర్స్, 1978

55 శ్రీరామ అప్పారావు, పోణంగి తెలుగునాటక వికాసము హైదరాబాదు పరమేశ్వర పబ్లికేషన్సు, 1967

56 సత్యనారాయణ ఎం వి సంక నవకవిత వాల్తేరు ఆంధ్రవిశ్వకళా పరిషత్తు, 1980

57 సత్యనారాయణరావు యండమూరి ఉషఃకిరణాలు విజయవాడ ఉత్తమ సాహితి, 1960

58 సత్యనారాయణశాస్త్రి, మధునాపంతుల ఆంధ్రరచయితలు రాజమండ్రి అద్దేపల్లి అండ్ కో, 1973

59 సదాశివ, ఎస్ పారసీకవుల ప్రశస్తి హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1975

60 సాంబశివరావు, గోపరాజు ఆంగ్ల సాహిత్య చరిత్ర విజయవాడ నవజీవన్ బుక్ లింక్స్, 1968

61 సీతారామ భట్టాచార్యులు కురుగంటి, వేంకట హనుమంతరావు, పిల్లలమర్రి నవ్యాంధ్రసాహిత్యవీధులు హైదరాబాదు రచయితలు, 1949

62 సుబ్బారావు, రాయప్రోలు, అభినవకవిత—౨

63 సుబ్బారావు, రాయప్రోలు మధుకలశము గుంటూరు నవ్యసాహిత్య పరిషత్తు 1944

64 సుబ్రహ్మణ్యం, జి వి వీరరసము హైదరాబాదు రచయిత 1961

65 సుబ్రహ్మణ్యం జి వి సంపా సారస్వతవ్యాసములు తృతీయ సంపుటము హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1969

66 సూర్యనారాయణశాస్త్రి, మల్లాది ఆంధ్రదశరూపకము సికింద్రాబాదు శ్రీరామా బుక్ డిపో, 1970

67 స్ఫూర్తిశ్రీ తెలుగులో ఉమరుఖయ్యాము సాహితీవాల్లభ్యము ద్వితీయ భాగము తణుకు నరేంద్రసాహిత్యమండలి

68 స్ఫూర్తిశ్రీ మధుపాలిక కాకినాడ శ్రీపతిప్రెస్, 1963

69 స్ఫూర్తిశ్రీ స్ఫూర్తిశ్రీ వ్యాసావళి-2 గుంటూరు విపంచికాప్రచురణలు, 1965

70 సోమశేఖరశర్మ, మల్లంపల్లి etc సంపా విజ్ఞానసర్వస్వము నాల్గవసంపుటము మద్రాసు తెలుగు భాషాసమితి, 1961

71 హేమలతాదేవి, తెన్నేటి ఉమర్ ఖయాం విజయవాడ జయంతి పబ్లికేషన్సు 1976

## (11) సంస్కృత గ్రంథములు

1 కాళిదాసు పుష్పబాణవిలాసమ్ వారణాసి చౌఖమ్బా సంస్కృత సీరీస్ ఆఫీసు 1969

2 జగన్నాథ్ రసగంగాధర్ ప్రథమాననమ్ వారణాసి చౌఖమ్బా విద్యా భవన్, 1978

3 భవభూతి ఉత్తరరామచరిత నాటకమ్ హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1970

4 మమ్మట కావ్యప్రకాశ పూన భండార్కర్ ఓరియంటల్ రిసెర్చి ఇన్స్టిట్యూట్, 1965

5 రేవాప్రసాద్ ద్వివేది సంపా కాళిదాస గ్రంథావళి వారణాసి కాశీహిందూ విశ్వ విద్యాలయము, 1976

6 విశ్వనాథ్ సాహిత్యదర్పణ్ వారణాసి చౌఖమ్బా విద్యాభవన్, 1979

7 శ్రీమద్భగవద్గీత (With Sanskrit text and English translation ) గోరఖ్‌పూర్ గీతాప్రెస్ 1976

## (iii) హిందీ గ్రంధములు

1 నరేంద్ర సంపా భారతీయ సాహిత్యకోష్ న్యూఢిల్లీ నేషనల్ పబ్లిషింగ్ హౌస్, 1981
2 బద్రీనాధసింహ్ భారతీయదర్శన్ వారణాసి స్టూడెంట్స్ ఫ్రండ్స్ అండ్ కమ్పనీ, 1973
3 రాధాకృష్ణమూర్తి వేమూరి తెలుగు కే ఆధునికకవి మద్రాను యం శేషాచలం అండ్ కొ, 1963
4 రామ్‌బిహారి శుక్లా కావ్యప్రదీప్ అలహాబాద్ ఇంద్రచంద్రనారంగ్ హిందీభవన్, 1951
5 లక్ష్మీరంజనం, కె సంపా తెలుగుసాహిత్యకా ఇతిహాస్ హైదరాబాదు హిందీ ప్రచారసభ, 1967

## (iv) ఆంగ్ల గ్రంధములు

1. Alexpreminger Editor Princepton Encyclopaedia of Poetry and poetics New Jersy Princepton University Press, 1966
2. Arthur E Baker A Shakespeare Commentary New York Fedrick Ungar Publishing Co , 1957.
3 A S Hornby Oxford Advanced Learner's Dictionary of Current English Oxford University Press, 1974.
4 David Bergammi and the editors of life The Universe New York Time incorporated, 1962.
5 David Daiches A Critical History of English Literature Volume II London Secker and Warburg, 1975.
6 Edward Fitzgerald Rubaiyat of Omar Khayyam Tehran Eqbal and Co ,
7 Encyclopaedia of Americana New York. Americana Corporation, 1927
8 Francis Turner Palgrave Editor The golden Treasury New York Oxford University Press, 1964
9 Henry Hudson, William An Introduction to the study of Literature London George G Harrap and Co , Ltd , 1913.

10 Howard Parsons Shakespearian Emendations and Discoveries The Ethick Press Ltd , 1953.

11 Lakshmiranjanam, K Spotlights on Telugu

12 Prasad, Birjala A Background to the study of English Literature Calcutta Macmillan Company Limited, 1965.

13. Shakespeare The Tempest. Agra Lakshminarain Agarwal Educational Publishers

14 Sir Wolter. W Greg. Pastoral Poetry and pastoral drama London 1906.

15 W J Craig Editor Shakespeare Complete works Delhi Oxford University Press, 1977.

## (V) అముద్రిత సిద్ధాంత వ్యాసములు

1 ప్రభాకరరెడ్డి, టి దువ్వూరి రామిరెడ్డి కర్షక కవిత్వము 1979 లో యం ఫిల్ పట్టముకొరకు ఉస్మానియా విశ్వవిద్యాలయమునకు సమర్పింపబడిన సిద్ధాంతవ్యాసము

2. మురళీకృష్ణ, పి వి జాషువా ఖండకావ్యములు' ఒకపరిశీలన (పిరదౌసి, గబ్బిలము)

1978 లో మద్రాసు విశ్వవిద్యాలయమునకు యం ఫిల్ పట్టము కొరకు సమర్పింపబడిన సిద్ధాంత వ్యాసము

3 ముహమ్మద్ ముస్తాఫా, షేక్ డా॥ ఉమర్ ఆలీషాగారి ఉమర్ ఖయ్యామ్ రుబాయీల అనుశీలన

1980 లో నాగార్జున విశ్వవిద్యాలయమునకు యం ఫిల్ పట్టము నిమిత్తము సమర్పింపబడిన సిద్ధాంత వ్యాసము

4 వెంకటరెడ్డి, యం The life and works of Dr Cattamanchi Ramalinga Reddy

1979 వ సంవత్సరములో మద్రాసు విశ్వవిద్యాలయమునకు యం. ఫిల్ పట్టము నిమిత్తము సమర్పింపబడిన సిద్ధాంత వ్యాసము

## (VI) పత్రికలు

1 అఖిల భారత రచయితల ద్వితీయ మహాసభసంచిక 1963 2 ఆంధ్ర పత్రిక 3 జమీనురైతు 4 ప్రతిభ 5 భారతి 6 వాణి 7 స్వతంత్ర.

# అధస్సూచికలు

## సంకేతపదసూచిక

1 ఆ ఆం క — ఆధునికాంధ్ర కవిత్వము
2. క గ్రం — కవికోకిల గ్రంథావళి
3 క డైరీ-ఉత్తరాలు — కవికోకిల డైరీ-ఉత్తరాలు
4 పై ఉ — పైన ఉదహరించినది
5 సం క — సంకలన కర్త
6 సంపా — సంపాదకుడు/సంపాదకులు

## ప్రథమాధ్యాయము -

1 కట్టమంచి రామలింగారెడ్డి కవిత్వతత్త్వ విచారము (మద్రాసు వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్సు, 1933), పుట 68
2 కురుగంటి సీతారామ భట్టాచార్యులు, పిల్లలమఱ్ఱి వేంకట హనుమంతరావు, నవ్యాంధ్ర సాహిత్యవీధులు (హైదరాబాదు రచయితలు 1949), పుట 19
3 కవికోకిల గ్రంథావళి- 4 లో దువ్వూరివారు "అభినవాంధ్ర సాహిత్యము" అను పేరుతో రచించిన ఒకవ్యాసము గలదు
4 విశ్వనాథ సత్యనారాయణ, "నవ్యసాహిత్యపరిషత్తు సప్తమ సమావేశాధ్యక్షోపన్యాసము' భారతి, ఏప్రిలు, 1940
5 పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి, "నవ్యసాహిత్యపరిషత్తు చతుర్థసమావేశాధ్యక్షోపన్యాసము" ప్రతిభ, ధాతవసంతసంచిక
6 నవ్యాంధ్ర సాహిత్యవీధులు, పై ఉ, పుట 177
7 Ibid, పుట 307
8 W H Hudson, An introduction to the study of English Literature (London George G Harrap and Co, Ltd), పుట 96.
9 C R Reddy, "Viresalingam" Swatantra, April 17, 1948
10 మధురరాజ్యములో అంతకుమున్నే స్వతంత్ర గద్యగ్రంథములు వెలసినను వానినిగూర్చి చాలకాలమువరకు ఉత్తరాంధ్రమువారికి ఏమియు తెలియకయే

గడచిపోయినది కావున 19 వ శతాబ్దిలో ఉత్తరాంధ్రలో జరిగిన గద్య వికాసము స్వతంత్రమైనదేగాని దక్షిణాంధ్రగద్యముయొక్క వికసితరూపము అని మాత్రము చెప్పజాలము

11 D V Sreerama Chandra Murthy, "The Telugu Romantic Poet" అఖిలభారతరచయితల ద్వితీయమహాసభసంచిక, 1963

12 మధునాపంతుల సత్యనారాయణశాస్త్రి ఆంధ్ర రచయితలు (రాజమంద్రి అద్దేపల్లి అండ్ కొ 1973) పుట 490

## ద్వితీయాధ్యాయము -

1 దువ్వూరి రామిరెడ్డి, క గ్రం 4 (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1967), పుట 222

2 కె వి రమణారెడ్డి సం క, క డైరి-ఉత్తరాలు (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1961), పుట 102

3 దువ్వూరి రామిరెడ్డి, "నా తొలిరచన" వాణి, 22-5-1961

4 బడిలో చదువుకొనురోజులలోనే సీసమును పోలిన పద్యమును వారు రచించినట్లు వినికిడి

5 'కవితాప్రారంభమునకు పూర్వము నాకు తెలుగు వాఙ్మయముతో ఎలాంటి పరిచయము లేదు "

దువ్వూరి రామిరెడ్డి, "నా తొలిరచన" వాణి, 22-5-1961

6 ఛందస్సు పుస్తకములు కొనుటకొరకై మదరాసులోని వావిళ్ళవారి పుస్తక విక్రయకేంద్రమునకు వెళ్ళి ఛందస్సునకు సంబంధించిన పుస్తకము లేవైన నున్నయెడల చూపించవలసినదిగా కోరిరి వారు సులక్షణసారము, అప్పకవీయము లను లక్షణగ్రంథములను తెచ్చి ముందుంచగా 'ఇవి నాకెందుకు? ఛందస్సు పుస్తకములు కావలయునండి' అని అడిగిరి పుస్తక విక్రేతలు ఆమాటలు విని ఒకరిమొగమొకరు చూచుకొని నవ్వుకొనిరి రెడ్డిగారు తల వంచుకొని వారికి డబ్బుచెల్లించి పుస్తకములనుతీసికొని ఇంటి ముఖముపట్టిరి

7 "ఉపమగలిగిన శయ్యల నొప్పియున్న
నంఘ్రిభవుని కావ్యంబు గ్రాహ్యంబుగాదు

పాయసంబైన సంస్కార పక్వమైన
గాక జుష్టంబు హవ్యంబు గాని యట్లు"

కాకునూరి అప్పకవి, అప్పకవీయము (మద్రాసు వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1970), పుట 16

8 దర్భా సుబ్రహ్మణ్యశర్మగారి వ్యాసము, జమీన్‌రైతు, 26-9-1947
9 దువ్వూరి రామిరెడ్డి, కర్గం 2 (చెన్నపురి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1935), పుట 243
10 దర్భా సుబ్రహ్మణ్యశర్మగారి వ్యాసము పైఉ
11 దువ్వూరి రామిరెడ్డి, "నా తొలిరచన" వాణి, 22-5-1961
12 దువ్వూరివారి ద్వితీయ వివాహము 16-6-1929 న జరిగినది
13 కర్గం 2 పైఉ, పుట 239
14 కృషీవలుడు-ఉత్తరాలు, పైఉ పుట 1 15 Ibid, పుట 102
16 Ibid, పుట 37 17 Ibid, పుట 104 18 Ibid, పుట 102

తృతీయాధ్యాయము -

1 "తదదోషౌ శబ్దార్థౌ సగుణావనలంకృతీ పునఃక్వాపి"
2 'వాక్యం రసాత్మకం కావ్యమ్'
3 "రమణీయార్థః ప్రతిపాదకః శబ్దః కావ్యమ్"
4 రామ్‌బిహారీశుక్లా, కావ్యప్రదీప్ (అలహాబాద్ ఇంద్రచంద్రనారంగ్, హిందీభవన్ 1951) పుట 2
5 Poetry we will call musical thought - Carlyle
6 కట్టమంచి రామలింగారెడ్డి ముసలమ్మమరణముఇత్యాదులు (పటమట ఆంధ్రగ్రంథాలయ ట్రస్టు 1960), ఉపోద్ఘాతము, పుట 5
7 కె వి రమణారెడ్డి, "కవికోకిల కథాకావ్యవైఖరులు" భారతి జూలై 1961, పుట 73
8 కె వి రమణారెడ్డి కవికోకిల (నెల్లూరు కవికోకిల గ్రంథమాల 1965), పుట 69

9 మరుపూరి కోదండ రామిరెడ్డి, "దువ్వూరి రామిరెడ్డి" తెలుగు వైతాళికులు-2 (హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1977), పుట 54
10 జి వి సుబ్రహ్మణ్యం, వీరరసము (హైదరాబాదు రచయిత, 1961), పుట 388
11 ముసలమ్మ మరణము ఇత్యాదులు, పై ఉ పుట 31
12 దువ్వూరి రామిరెడ్డి, నలజారమ్మ (పెమ్మారెడ్డిపాలెం కవికోకిల గ్రంథ మాల 1961) పుట 7
13 ముసలమ్మ మరణము ఇత్యాదులు, పై ఉ, పుట 32
14 నలజారమ్మ, పై ఉ, పుట 9
15 దువ్వూరి రామిరెడ్డి క గ్రం 4 (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1967), పుట 213
16 ముసలమ్మ మరణము ఇత్యాదులు పై ఉ, పుట 49
17 నలజారమ్మ పై ఉ పుటలు 39 40
18 కవికోకిల, పై ఉ, పుట 75
19 నలజారమ్మ, పై ఉ, పుట 13
20 Ibid, పుట 8 21 Ibid, పుట 21 22 Ibid, పుట 10
23 Ibid, పుట 12 24 Ibid, పుట 13 25 Ibid, పుట 28
26 Ibid, పుట 34
27 దర్భా సుబ్రహ్మణ్యశర్మగారి తొలిపల్కు, క గ్రం 1 1934
కె వి రమణారెడ్డిగారిచే ఉదాహృతము, కవికోకిల, పై ఉ, పుట 76
28 కవికోకిల, పై ఉ పుట 198
29 దువ్వూరి రామిరెడ్డి, యువకస్వప్నము (నెల్లూరు కవికోకిల పబ్లికేషన్సు, 1952), పుట 37
30 Ibid, పుట 26 31 Ibid, పుట 27 32 Ibid, పుట 18
33 కవికోకిల, పై ఉ పుట 200
34 యువకస్వప్నము, పై ఉ, పుట 17

35 దర్భా సుబ్రహ్మణ్య శర్మగారి తొలిపలుకు, క గ్రం 1 1935
కె వి రమణారెడ్డిగారిచే ఉదాహృతము, కవికోకిల, పై ఉ, పుట 211
36 దువ్వూరి రామిరెడ్డి, కడపటివీడ్కోలు (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1966), పుట 40
37 రాయప్రోలు సుబ్బారావు, అభినవకవిత-2, పుట 277
38 కడపటి వీడ్కోలు పై ఉ, పుట 37 39 Ibid, పుట 3
40 Ibid, పుట 3 41 Ibid, పుట 29 42 Ibid, పుట 33
43 దర్భా సుబ్రహ్మణ్యశర్మగారి తొలిపలుకు, క గ్రం 1 1935, పై ఉ, పుట 211
44 కె వి రమణారెడ్డి, సం క, క డై రి-ఉత్తరాలు (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1961), పుట 22
45 దువ్వూరి రామిరెడ్డి క గ్రం 5 (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1967) పుట 17
46 Ibid, పుట 11 47 Ibid, పుట 11
48 దువ్వూరి రామిరెడ్డి, క గ్రం 6 (పెమ్మారెడ్డిపాలెం కవికోకిల గ్రంథమాల, 1956), పుట 14 49 Ibid, పుట 14
50 A S Hornby, Oxford Advanced Learner's Dictionary of Current English (Oxford University Press 1974), పుట 623
51 Alex Preminger, Editor, Princepton Encyclopaedia of Poetry and Poetics (New Jersy Princepton University Press, 1966), పుట 603
52 Encyclopaedia Americana (New York Americana Corporation, 1927), పుట 375
53 Princepton Encyclopaedia of Poetry and Poetics పై ఉ, పుట 603
54 శ్రీరామ మోహనరాయ్‌గారు Pastoral Poetry ని కృషిక కవిత్వ మనిరి ఆంధ్రపత్రిక కీలకసంవత్సరాది సంచిక, పుట 61

55 "Pastoral Poemsను 'గోపకావ్యము'లని ఆంగ్ర శేషగిరిరావుగారన్నారు" సి నారాయణరెడ్డి ఆ ఆం క (సికింద్రాబాదు ఆంధ్రప్రదేశ్ బుక్ డస్ట్రిబ్యూటర్స్ 1977), పుట 414

56 దువ్వూరిరామిరెడ్డి, కృషీవలుడు (పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథ మాల, 1957), ఉపోద్ఘాతము పుట v

57 కవికోకిల, పై ఉ, పుట 86

58 దువ్వూరి రామిరెడ్డి, వనకుమారి (నెల్లూరు కవికోకిల గ్రంధమాల, 1963), పుట 9

59 టెన్నిసన్, మిల్టన్ భావానుసరణములను 1925 భారతి ఆషాఢ సంచికలో గరికపాటి శ్రీరామమూర్తి గారు చూపియున్నారు దానిని జూచిన దువ్వూరి వారు తాము మిల్టన్ రచించిన ఏ కావ్యమును చదువలేదనియు, రామమూర్తి గారుదాహరించిన టెన్నిసన్ 'ఈనోని' కూడ చదువలేదనియు తమ డైరీలలో వ్రాసుకొని యున్నారు

"సాదృశ్యములు కనబడినంతనే అవి యిన్నియు అనుకరణము లని భావించు ఆచారము ఆధునికులలో విరివియగుచున్నది Psychology of the Poetic mind ను గురించి వీరికేమియును తెలియదు" అని రామమూర్తిగారి అభిప్రాయములను ఖండించియున్నారు

క డైరి-ఉత్తరాలు, పై ఉ, పుట 29

60 టెన్నిసన్ ఈనోని, దువ్వూరి రామిరెడ్డిగారిచే ఉదాహృతము,

క డైరి-ఉత్తరాలు, పై ఉ, పుట 28

61 వనకుమారి, పై ఉ, పుట 5

62 Francis Turner Palgrave, Editor, The golden Treasury (New York Oxford University Press, 1964), పుట 99

63 వనకుమారి, పై ఉ, పుట 9

64 W J Graig, Editor, Shakespeare Complete Works (Delhi Oxford University Press, 1977), పుట 222

65 Arthur E Baker, A Shakespeare Commentary (New York Fedrick Ungar Publishing Co, 1957), పుట 151

66 వనకుమారి, పై ఉ పుట 22

67 Ibid, పుట 59

68 ప్రకృతిలతపూచు పువ్వు, పూరేకుటోడ, వసంతవనేందిర మున్నగువిధము లుగా వాడబడినవి

69 వనకుమారి పై ఉ పుట 9

70 Ibid, పుట 10 71 Ibid, పుట 4 72 Ibid, పుట 22

73 Ibid, పుట 48 74 Ibid, పుట 60 75 Ibid, పుట 66

76 Ibid, పుట 85 77 Ibid, పుట 87

78. K Lakshmiranjanam, Spot lights on Telugu పుట 87

79 గంగుల శాయిరెడ్డి కాపుబిడ్డ (సికింద్రాబాదు సాహిత్య కళాపీఠము 1950), పుట 3

80 దువ్వూరి రామిరెడ్డి కృషీవలుడు (పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథ మాల 1957) పుట 18

81 Ibid, పుట 5 82 Ibid, పుట 7 83 Ibid, పుట 23

84 Ibid, పుట 20 85 Ibid, పుటలు 8, 9 86 Ibid, పుట 11

87 Ibid, పుట 30 88 Ibid, పుట 13 89 Ibid, పుట 24

90 అల్లసాని పెద్దన, మనుచరిత్రము (మద్రాసు వేంకట్రామ గ్రంథమాల 1968), పుట 112

91 దువ్వూరి రామిరెడ్డి, జలదాంగన (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1964), పుట 25

92 Ibid, పుట 27 93 Ibid, పుట 27

94 దువ్వూరి రామిరెడ్డి పలితకేశము (పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథ మాల, 1962) పుట 43

95 అభినవకవిత-2 పై ఉ, పుట 249 96 పలితకేశము పై ఉ పుట 67,

97 శ్రీమద్భగవద్గీత (గోరఖ్‌పూర్ గీతాప్రెస్, 1976) పుట 183

98 Ibid, పుట 184

99 పలితకేశము, పై ఉ పుట 50 100 Ibid, పుట 43

101 Ibid, పుట 46 102. Ibid, పుట 47

103 శ్రీ సంజీవ్‌దేవ్, "రవీంద్రుని చిత్రకళసాధన" రవీంద్ర శతవార్షికోత్సవ విశేషసంచిక (హైదరాబాదు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి, 1961), పుట 44

104 పలితకేశము పై ఉ. పుట 45

105 Ibid, పుట 74 106 Ibid, పుట 74. 107 Ibid, పుట 66

108 Ibid, పుట 61 109 Ibid, పుట 60 110 Ibid, పుట 70

111 Ibid, పుట 53

112 కవికోకిల, పై ఉ, పుట 331

113 దువ్వూరి రామిరెడ్డి, క గ్రం 2 (చెన్నపురి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1935) పుట 239

114 Ibid, పుట 256 115 Ibid, పుట 242 116 Ibid, పుట 244

117 Ibid, పుట 248

118 రేవా ప్రసాద్ ద్వివేది, సంపా, కాళిదాస గ్రంథావళి (వారణాసి కాశీ హిందూ విశ్వవిద్యాలయము, 1976), పుట 20

119 క గ్రం 2, పై ఉ, పుట 261

120 Ibid, పుట 267 121 Ibid, పుట 269 122 Ibid, పుట 270

123 Ibid, పుట 272 124 Ibid, పుటలు 274, 275

125 దీనిని కాళిదాసు రచించలేదు, అర్కభట్టు రచించినాడనియు వివాదము గలదు

126 కవికోకిల, పై ఉ, పుట 56

127 కాళిదాసు, పుష్పబాణవిలాసమ్ (వారణాసి చౌఖమ్బాసంస్కృతసీరీస్ ఆఫీసు, 1969), పుట 21

128 Ibid, పుట 23 129 Ibid, పుటలు 5, 6

130 క గ్రం 2, పై ఉ పుట 263

131 పుష్పబాణవిలాసమ్, పై ఉ, పుట 13

132. క గ్రం 2, పై ఉ, పుట 264 133 Ibid, పుట 266.

134 పుష్పబాణవిలాసమ్ పై ఉ, పుట 25

135 కర్పూరి-ఉత్తరాలు, పై ఉ, పుట 20

136 దువ్వూరిరామిరెడ్డి, పానశాల (వెమ్మారెడ్డిపాలెం కవికోకిల గ్రంథమాల, 1975), ఉపోద్ఘాతము, పుట XXX1

137 Ibid, ఉపోద్ఘాతము, పుట XXXX

138 'డా॥ ఉమర్ అలీషాగారి ఉమర్ఖయ్యాము రుబాయీల అనుశీలన' అను యం ఫిల్ పరిశోధనవ్యాసములో షేక్ ముహమ్మద్ ముస్తఫాగారు చెప్పియున్నారు

139 చార్వాకమతమునకు సంబంధించి ఇందుట్టంకింపబడిన అంశములకు 'భారతీయదర్శన్' అను హిందీ గ్రంధము ఆధారము

140 పానశాల, పై ఉ పుట 25

141 Ibid, పుట 24 142 Ibid, పుట 5 143 Ibid, పుట 19

144 బూర్గుల రామకృష్ణారావు సారస్వతవ్యాసముక్తావళి (హైదరాబాదు ఆంధ్రసారస్వత పరిషత్తు), పుట 28

145 పానశాల, పై ఉ, పుట (ఉపోద్ఘాతము) XXXIV

146 Ibid, పుట 23 147 Ibid, పుట 21 148 Ibid, పుట 14

149 Ibid, పుట 28 150 Ibid, పుట 19 151 Ibid, పుట 10

152 Ibid, ఖయ్యాముప్రశంస పుట 11

153 కవికోకిల, పై ఉ, పుట 334

154 మనుచరిత్రము పై ఉ, పుట 181

155 పలితకేశము, పై ఉ, పుట 27

156 మనుచరిత్రము, పై ఉ, పుట 160

157 పలితకేశము, పై ఉ పుట 22

158 Ibid పుట 13 159 Ibid, పుట 14 160 Ibid, పుట 15

161 Ibid, పుట 39 162 Ibid, పుట 39 163 Ibid, పుట 31

164 Ibid, పుటలు 34, 35

## చతుర్థాధ్యాయము -

1 విశ్వనాథసత్యనారాయణ, ఆంధ్రవారపత్రిక, సంచిక 5, జనవరి 1938
2 అప్పజోడు వేంకటసుబ్బయ్య, షట్పది (కావలి శ్రీనివాస బుక్ హౌస్, 1964), పుట 91
3 ముద్దుకృష్ణ, సం క, నవీనకావ్యమంజరి (మద్రాసు ప్రతిమాబుక్స్, 1959), పుట 10
4 రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ, 'మహాకావ్యరచన - ఖండకావ్యరచన" భారతి ఆగష్టు, 1934, పుట 320
5 రామ్ బిహారిశుక్లా కావ్యప్రదీప్ (అలహాబాద్ ఇంద్రచంద్రనారంగ్, హిందీభవన్ 1951) పుట 15
6 దువ్వూరి రామిరెడ్డి క గ్రం 2 (చెన్నపురి వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1935), పుట 34
7 Ibid, పుట 34 8 Ibid, పుట 80 9 Ibid, పుట 82
10 Ibid, పుట 128 11 Ibid, పుట 162 12 Ibid, పుట 112
13 Ibid, పుట 112 14 Ibid పుట 226 15 Ibid, పుట 289
16 Ibid, పుట 294 17 Ibid, పుట 302
18 రామిరెడ్డిగారు కాంగ్రెసుసత్యాగ్రహములో చేరకపోయినను కాంగ్రెసు సదాశయములను ఆమోదించినవారు గాంధీమహాత్ముని ఉద్యమమును తొలి దశలో కార్యకర్తలు భజనలతో తిరిగి ప్రచారము చేసెడివారు ఆ సమయ మున దువ్వూరివారు రాట్నపుప్రచారమునకు మెచ్చి, వారు పాడుకొనుట కనువుగా పాటలను వ్రాసి యిచ్చినారట ఆంధ్రదేశపు జనసంఖ్య ప్రకా రము ఆంధ్రలో ఒకలక్ష అరువదివేల రాట్నములను అమ్మవలెనని గాంధీజీ నిర్ణయము చేసినపుడు రాట్నపు ప్రచారము తారస్థాయిలోనున్న రోజులలో రెడ్డిగారు ఈ 'రాట్నపు పాటను' వ్రాసినారట
కవికోకిల పై ఉ, పుట 133
19 క గ్రం 2, పై ఉ, పుట 71
20 Ibid, పుట 230 21 Ibid, పుట 232 22 Ibid, పుట 233

23 Ibid, పుట 101 24 Ibid పుట 102 25 Ibid పుట 101
26 Ibid, పుట 18 27 Ibid, పుట 19 28 Ibid, పుట 62
29 Ibid, పుటలు 52, 53 30 Ibid, పుట 49 31 Ibid, పుట 41

32 దేవులపల్లి కృష్ణశాస్త్రి, శ్రీ దేవులపల్లి కృష్ణశాస్త్రి కృతులు (రాజమండ్రి రౌతు చంద్రయ్య అండ్ సన్స్, 1958) పుట 1

33 క గ్రం 2 పై ఉ, పుట 20

34 Ibid, పుట 116 35 Ibid, పుట 118

36 సి నారాయణరెడ్డి ఆ ఆం క (సికింద్రాబాదు ఆంధ్రప్రదేశ్ బుక్ డిస్ట్రిబ్యూటర్స్, 1977), పుట 407

37 క గ్రం 2 పై ఉ, పుట 113

38 Ibid, పుట 186 39 Ibid, పుట 223 40 Ibid, పుట 224
41 Ibid, పుట 228 42 Ibid, పుట 23 43 Ibid, పుట 121
44 Ibid, పుట 121 45 Ibid పుట 146 46 Ibid, పుట 163
47 Ibid, పుట 139 48 Ibid, పుట 144 49 Ibid, పుట 32
50 Ibid, పుట 129 51 Ibid, పుట 130 52 Ibid, పుట 72
53 Ibid, పుట 37 54 Ibid, పుట 37 55 Ibid, పుట 17
56 Ibid, పుట 15 57 Ibid, పుట 46 58 Ibid, పుట 42
59 Ibid, పుట 218 60 Ibid, పుట 114 61 Ibid పుట 115
62 Ibid, పుట 124 63 Ibid, పుటలు 133 64 Ibid, పుట 119
65 Ibid, పుట 89 66. Ibid, పుట 56

67 కె వి రమణారెడ్డి సం క, క డైరి-ఉత్తరాలు (నెల్లూరు కవికోకిల గ్రంథమాల 1961) పుట 80

68 క గ్రం 2, పై ఉ పుట 219

69 Ibid, పుట 220 70 Ibid, పుట 95 71 Ibid, పుట 96
72 Ibid పుట 123 73 Ibid, పుట 135 74 Ibid, పుట 156
75 Ibid, పుట 158 76 Ibid, పుట 160 77 Ibid, పుట 148
78 Ibid, పుట 152 79 Ibid, పుట 101

80 Birjala Prasad, A Back ground to the Study of English Literature (Calcutta Macmillan Company Limited, 1965), పుట 18
81 Ibid, పుట 18
82 క. గ్రం 2, పై ఉ, పుట 31
83 క. డైరి-ఉత్తరాలు, పై ఉ, పుట 25
84 క. గ్రం 2, పై ఉ, పుట 200
85 Ibid, పుట 202
86 క. డైరి-ఉత్తరాలు పై ఉ, పుట 54
87 క. గ్రం 2, పై ఉ, పుట 204
88 Ibid, పుట 210
89 Ibid, పుట 207
90 Ibid, పుట 209
91 క. డైరి-ఉత్తరాలు పై ఉ, పుట 66
92 క. గ్రం 2, పై ఉ పుట 212
93 Ibid, పుట 213
94 Ibid, పుట 291
95 Ibid, పుటలు 234, 235
96 Ibid పుటలు 90 91
97 Ibid, పుట 91
98 Ibid, పుట 92
99 Ibid, పుట 85
100 Duvvuri Rami Reddy, The Voice of the Reed (Madras : Ganesh & Co, 1924), పుట 30
101 క. గ్రం 2, పై ఉ, పుట 60
102 Ibid, పుట 183
103 Ibid పుట 183
104 Ibid, పుట 26
105 Ibid, పుట 25
106 దువ్వూరి రామిరెడ్డి భగ్నహృదయము (పెమ్మారెడ్డిపాలెం కవికోకిల గ్రంథమాల, 1967) పుట 47
107 Ibid, పుట 52
108 క. గ్రం 2, పై ఉ, పుట 109
109 Ibid, పుట 110
110 Ibid, పుట 111
111 Ibid, పుట 141
112 Ibid, పుటలు 141 142
113 Ibid, పుట 142.
114 Ibid, పుట 142
115 Ibid, పుట 171
116 Ibid, పుట 189
117 Ibid, పుట 191

118 భగ్నహృదయము, పై ఉ, పుట 56

119 క గ్రం 2, పై ఉ, పుట 154

120 Ibid, పుట 147   121 Ibid, పుటలు 106, 107

122 Ibid, పుట 106   123 Ibid, పుట 83

## పంచమాధ్యాయము -

1 దువ్వూరి రామిరెడ్డి, కర్షకవిలాసం (మచిలీపట్నం త్రివేణి పబ్లిషర్స్ ప్రైవేట్ లిమిటెడ్ 1981), పుట IV

2 Ibid, పుట 8   3 Ibid, పుట 15   4 Ibid, పుటలు 97, 98.

5 Ibid, పుట 99   6 Ibid, పుట 102

7 కె వి రమణారెడ్డి కవికోకిల (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1965), పుట 190

8 Ibid పుట 190

9 కె వి రమణారెడ్డి, సం క క డైరీ-ఉత్తరాలు (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1961), పుట 3

10 దువ్వూరి రామిరెడ్డి, క గ్రం 3 (చెన్నపురి, వావిళ్ళ రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్, 1936), పుట 3.

11 రచనాకాలాదుల రచనకు డైరీ-ఉత్తరాలు సహాయపడినవి

12 క డైరీ-ఉత్తరాలు, పై ఉ, పుటలు 2 3

13 క గ్రం. 3, పై ఉ, పుట 151

14 ఈ కథలు కె వి రమణారెడ్డిగారు 'కవికోకిల' అను తమ రచనలో నుదాహరించిరి

15 కవికోకిల, పై ఉ, పుటలు 229, 230.

16 Birjala Prasad, A Back ground to the Study of English Literature (Calcutta, Macmillan Company Limited, 1965), పుట 121

17 Ibid, పుట 122

18 Ibid, పుట 125  19 Ibid, పుట 126
20 క గ్రంథం 3, పై ఉ, పుట 129
21 కవికోకిల పై ఉ, పుట 236
22 క గ్రంథం 3, పై ఉ, పుట 143
23 క డైరి-ఉత్తరాలు, పై ఉ, పుట 10
24 పోణంగి శ్రీరామ అప్పారావు, తెలుగు నాటకవికాసము (హైదరాబాదు పరమేశ్వర పబ్లికేషన్సు 1967), పుట 357
25 క డైరి-ఉత్తరాలు, పై ఉ, పుటలు 40, 41
26 క గ్రంథం 3, పై ఉ, పుట 322
27 Ibid, పుట 323  28. Ibid, పుట 321  29 Ibid, పుట 327
30 కవికోకిల పై ఉ, పుట 287
31 క గ్రంథం 3, పై ఉ, పుట 324
32 తెలుగు నాటక వికాసము, పై ఉ పుట 357
33 Poetry is the rhythemic Creation of beauty Allenpoe
34 దువ్వూరి రామిరెడ్డి క గ్రంథం 4 (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1967) పుట 64
35 Ibid, పుట 144
36 కుంభరాణానాటక ప్రస్తావన సందర్భమున ఈవ్యాసమునకు సంబంధించిన ప్రధానాంశములు కొంతవరకుట్టంకింపబడినవి
37 క గ్రంథం 4 పై ఉ, పుట 177
38 Ibid, పుట 201  39 Ibid, పుట 213
40 నెల్లూరు వేంకట్రామానాయుడు, "నా జీవిత విశేషాలు" జమీన్‌రైతు 12-6-1959
41 కవికోకిల, పై ఉ, పుట 53
42 దువ్వూరి రామిరెడ్డి క గ్రంథం 2 (చెన్నపురి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ 1935) పుట 314
43 Ibid, పుట 319

షష్ఠాధ్యాయము -

1 Birjala Prasad, A Back ground to the study of English Literature (Calcutta Macmillan Company Limited, 1965), పుట 188

2 Ibid, పుట 188

3 దువ్వూరి రామిరెడ్డి క గ్రం 2 (చెన్నపురి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్, 1935), పుట 241

4 Ibid, పుట 270 5 Ibid, పుట 264

6 దువ్వూరి రామిరెడ్డి, నలజారమ్మ (పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1961), పుట 7

7 దువ్వూరి రామిరెడ్డి, కృషీవలుడు (పెమ్మారెడ్డిపాళెం కవికోకిల గ్రంథమాల, 1957) పుట 19

8 క గ్రం 2, పై ఉ పుట 292

9 Ibid, పుట 63

10 కె వి రమణారెడ్డి, కవికోకిల (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1965), పుట 61

11 దువ్వూరి రామిరెడ్డి, క గ్రం 3 (చెన్నపురి వావిళ్ళ రామస్వామి శాస్త్రులు అండ్ సన్స్ 1936) పుట 44

12 దువ్వూరి రామిరెడ్డి, క గ్రం 4 (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1967), పుట 152

13 దువ్వూరి రామిరెడ్డి, వనకుమారి (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1963), పుట 103

14 దువ్వూరి రామిరెడ్డి, యువకస్వప్నము (నెల్లూరు కవికోకిల పబ్లికేషన్సు, 1952) పుట 18

15 దువ్వూరి రామిరెడ్డి, కడపటివీడ్కోలు (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1966), పుట 28

16 క గ్రం 2 పై ఉ, పుట 204

17 కృషీవలుడు, పై ఉ, పుటలు 26, 27

18 Ibid, పుట 26

19 క గ్రం 2, పై ఉ, పుట 246

20 వనకుమారి, పై ఉ, పుట 8

21 Ibid, పుట 32

22 క గ్రం 4, పై ఉ, పుట 213

23 క గ్రం 2, పై ఉ, పుట 243

24 నలజారమ్మ, పై ఉ, పుట 9

25 వనకుమారి, పై ఉ, పుట 7

26 కృషీవలుడు, పై ఉ, పుట 6

27 దువ్వూరి రామిరెడ్డి, జలదాంగన (నెల్లూరు కవికోకిల గ్రంథమాల, 1964), పుట 3

28 క గ్రం 2, పై ఉ, పుట 290

29 Ibid, పుట 224

30 Ibid, పుట 45